శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౯. | విక్రమ చైత్ర వైశాఖములు. | సంచిక ౧.

Vol. 29
1-6



కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

విడిసంచిక. రు. ౦-౮-౦.

1940-41 ఏప్రిల్, మెయి.

# విషయసూచిక.



శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.


## కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౯. { విక్రమ చైత్రవైశాఖములు. } సంచిక ౧.


## స్వవిషయము.



ఈసంచికతోఁ బరిషత్పత్రిక కిరువదితొమ్మిదవ సంపుటము ప్రారంభమగుచున్నది. క్రిందటి సంపుటమున- చిత్రకవి పెద్దనార్యుని లక్షణసారసంగ్రహము ముగింపఁబడినది. సీతారామచరిత్రమునఁ గొంత భాగము మాత్రమే ముద్రింపఁగలిగితిమి. మిగిలిన ప్రబంధములవలెఁ గాక నిది మిక్కిలి పెద్దది యగుటచే సంతకుమించి ప్రకటింప వీలు కలుగలేదు. పరిషత్పుస్తకభాండాగారమునుపేరఁ బ్రకటింపఁబడుచున్న Descriptive Catalogue లో మూఁడవభాగమును మొదలుపెట్టి యుంటిమి. పూర్వపుభాగములవలెఁగాక నీభాగమునుండియు గ్రంథములను వేఱువేఱు శీర్షికలను విభజించి విపులముగ నందలి విషయములఁ బాఠకులకుఁ దెలుపఁదలఁచియున్నారము. లక్షణగ్రంథములలోఁ గొన్ని యీరీతి నిరువదియెనిమిదవసంపుటమున విమర్శింపఁబడినవి. ఈసంపుటము రెండవసంచికనుండియుఁ బ్రాచీనప్రబంధమగు ఉదయనోదయము ప్రారంభింపఁబడును. దానివ్రాఁతప్రతి యొకటియే మాకు శ్రీ మానవిల్లి రామకృష్ణకవి ఎం. ఏ. గారివలన లభించినది. వేఱొకప్రతి లభించి యుండలేదు. ఎచటనైన మఱియొక ప్రతియున్నచోఁ బాఠకులను దెలుపఁ గోరుచున్నాము.

ప్రథమమునుండియుఁ బరిషత్తు తనశక్తికొలఁది భాషాభిమానముతోఁ గ్రంథప్రకటనాదికార్యముల నడపుచున్నది. పరిషదుద్దేశములకును, ఆంధ్రభాషోద్ధరణమునకును బ్రతికూలముగనుండు వ్యావహారికభాషను, అందు రచింపఁబడు గ్రంథములను నిరసించుచునే యున్నది. ప్రాచీనాంధ్రభాషయు, నందు రచింపఁబడిన ప్రబంధాదులును దమకు రుచింపవని ఘోషించువారితోఁ బరిషత్తున కెట్టిసంబంధమును లేదు. ఉత్తమప్రాచీనప్రబంధములుగూడ నిట్టివారి యాగ్రహమునకు గుఱియగుచున్నవి ప్రాచీనమనిన వీరికి గిట్టుటలేదు. అట్టివారి నటుండనిండు భాషాభిమానులు చేయవలసినపనులు చాలఁ గలవు. ధనాభావముచేతను, విద్యాధికులకుఁ దమభాషయందుఁ దగినయభిమానము లేకపోవుటచేత నట్టికార్యముల నన్నిటిని నిర్వహించుటకుఁ బరిషత్తునకు వీలు కలుగుటలేదు.

పరిషత్కార్యాలయమున నముద్రితగ్రంథములయు ముద్రితగ్రంథములయుఁ బ్రతులు పెక్కులు గలవు. అముద్రితగ్రంథముల ప్రతులను వ్రాయించి ప్రకటించుట భాషాభిమానులకు ముఖ్యకర్తవ్యమై యున్నది. అదిగాక ముద్రితప్రబంధములు, మహాభారతాదులకుఁగల ప్రతులఁ బరిశోధించి, పాఠభేదములను బరిశోధించి యాగ్రంథములను దిరిగి ప్రకటింపవలసియున్నది. ఇట్టివి చేయుట కుదారులగు భాషాభిమానులు పూనుకొనవలసినదిగాని పరిషత్తువంటి సంస్థ యొక్కటియే ప్రత్యేకముగ నెఱవేర్చుట దుష్కరము. ప్రతిగ్రంథమును దిరిగిముద్రించుట కగువ్యయము విశేషముగ నుండును. తగిన ధనసహాయములేక యట్టిది నెఱవేర్చుట కష్టసాధ్యము. అయినను బరిషత్కార్యాలయమున వీలగునంతవఱకు వేర్వేఱు ప్రతులను బరిశోధించి యందుఁగల పాఠములను వ్రాయించుచున్నారము. కావ్యాలంకారచూడామణిలోని పాఠములను సేకరించి పత్త్రికయందే ప్రకటించుచున్నాము. కాశీఖండము, పారిజాతాపహరణము మొదలగు ముఖ్యప్రబంధముల వ్రాఁతప్రతులఁ బరిశోధించి పాఠభేద వ్రాయించుటకుఁ బ్రయత్నములు జరుగుచున్నవి. ప్రతిభాషాభిమానియుఁ దనకభిమానముగల గ్రంథము నొకదానినిదీసికొని వ్రాఁతప్రతులతో సంప్రదించి తనవిమర్శనఫలితములను వ్యాసపూర్వకముగఁగాని, గ్రంథపూర్వ

కముగఁగాని వెలువఱచుట ముఖ్యకర్తవ్యమని యెంచవలసియున్నది. దోషారోపణము తోడనే తాము కృతకృత్యులమైతిమని నేఁటివిమర్శకుల లోఁ గొందఱు తలంచుచున్నారు. అట్లుగాక ప్రతివిమర్శకుఁడును భాషాభిమానియుఁ దాను జేయవలసిన భాషాసేవయందు సహస్రాంశమైనను జేయఁగలిగినచో మనభాష కిట్టి పరిస్థితు లుండవనియే మానమ్మకము. నేఁటిగ్రంథముల నుపయుక్తమగు భాషనుగూర్చిగాని యందలి భావములనుగూర్చిగాని విశేషముగఁ దెలుపవలసినది లేదు. కాలమే యందలి మంచిచెడ్డలను నిర్ణయింపఁగలదు. నేఁటికవులు, నాటకనవలా రచయితలు నన్యభాషావ్యామోహమును వదలలేక తమగ్రంథములను కేవల మనుకరణములుగ రచించుచున్నారు. అట్టి యనుకరణములు భాషాభ్యుదయమున కుపకరింపకపోవుటయేగాక కవులు తమ స్వతంత్రతను, ప్రతిభాశక్తిని గోల్పోవుటకుఁ గారణములగుచున్నవి. అన్యభాషలఁ గల యుత్తమరచనముల నాంధ్రీకరించుటయుఁ గొన్నియెడల ననుకరించుటయు యుక్తమే; కాని దేశకాలపరిస్థితులను, సాంఘికాదివిషయములను గమనించి తగినరీతిని వలయుమార్పులను గావింపవలసియుండును.

మఱియొకవిషయము. శ్రీ పీఠికాపురాధీశ్వరులసహాయముచే వెలువడుచున్న శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు రెండవభాగము ప్రచురింపఁబడినది. మూఁడవభాగము ముద్రింపఁబడుచున్నది. ప్రథమమున నజాది పదములును, ద్వితీయమున 'కవర్గ' పదములును గలవు. నిఘంటువునుగూర్చి సహృదయు లెన్నివిధముల విమర్శించినను, వారి విమర్శనములకుఁ దగిన సమాధానముల నొసఁగుచు నందలి మంచిచెడ్డలను వందనశతంబులతో స్వీకరింతుము. నిఘంటుప్రకటనము కడుంగడు కష్టసాధ్యమని యందఱెఱింగినవిషయమే. మిగిలినదేశభాషలందును, పాశ్చాత్యభాషలయందును నట్టిరచన మెంతకాలముపట్టుచున్నదో మనకు విదితమే. ఈ నిఘంటువునఁ బ్రమాదవశమున నేమైన పదములు వదలఁబడినచో నవి యనుబంధమునఁ బ్రకటింపఁబడును. నిఘంటుప్రకాశకులకును, రచనావర్గమునకును భాషాభిమానమే ప్రధానమనియుఁ, దమదోషముల సవరించుటకెట్టియభ్యంతరము నుండదనియు విమర్శకులు గ్రహింతురుగాత.

# కళాప్రపూర్ణుల సన్మానము.

బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులు బి. ఏ. బి. ఎల్. గారికి-ఆంధ్రవిశ్వకళాపరిషత్తు "కళాప్రపూర్ణ" బిరుదమొసఁగి గౌరవించినందులకు నమలాపురవాసులెల్లరు తమయానందమును వెల్లడించుచు, శ్రీపంతులుగారు దేశమునకును, ఆంధ్రభాషామతల్లికిని జేసిన సేవను గొనియాఁడుచు, ఈనెల 18-4-1940 వ తేది గురువారమునాఁడు కవిశేఖరులగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవివర్యుల యాధిపత్యమున స్థానికోన్నతపాఠశాలాభవనమున సభఁగావించిరి. కోనసీమవాసులగు విద్యావృద్ధులు పెక్కండ్రు సభనలంకరించిరి. పురమందలి న్యాయవాదిప్రముఖులును, వర్తకశిరోమణులును, అధికారవరులును, అధ్యాపకబృందమును, విద్యార్థులును సమావేశమున కరుదెంచిరి.

తొలుత మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మ ఎమ్. ఏ. ఎల్. టి. గారు కవిశేఖరుల సభ కధ్యక్షులుగ నుపపాదించుచు, నధ్యక్షులయు, కళాప్రపూర్ణులయు సుగుణసంపత్తిని, భాషాసేవను విశదీకరించిరి.

తరువాత నధ్యక్షపదవి నలంకరించి శ్రీనృసింహకవిగారు శ్రీపంతులుగారిబాల్యము, విద్యాభ్యాసము, అధికారగౌరవము, భాషాసేవ, కార్యదీక్ష మున్నగు సుగుణముల నుద్దేశించి విపులముగ నుపన్యసించిరి. మఱియు శ్రీపంతులుగారు కలెక్టరు పదవియందుండియు తామ్రశిలాశాసనపరిశోధన మొనరించి దేశచరిత్రకు భాషాచరిత్రకుఁ జేసిన సేవ యపారమని నుడివిరి.

పిమ్మట, అమలాపురవాసుల పక్షమున సోమూరి అచ్యుతరామచంద్రమూర్తి బి ఏ. బి. ఎల్. గారు అభినందనపత్రికఁ జదివి శ్రీకళాప్రపూర్ణులకు సమర్పించిరి.

బ్రహ్మశ్రీ కవితాభూషణ, విద్వాన్, వెంపరాల సూర్యనారాయణశాస్త్రులుగారు శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు కార్యస్థానమునఁ జాలకాలము పండితులుగా నుండుటం జేసి, శ్రీపంతులుగారు నిఘంటు

నిర్మాణమందుఁ జూపిన ప్రతిభావిశేషమును, సకలభాషలయందుఁ గల సర్వతోముఖపాండిత్యమును, కార్యదీక్షయు, గ్రామ్యభాషానిరసనదక్షత్వమును, ఆంధ్రసాహిత్యపరిషత్సంస్థాపనమును వివరించుచు నేఁడాంధ్ర విశ్వవిద్యాలయము వారొసంగిన "కళాప్రపూర్ణ" బిరుదము నభినందించుచుఁ బద్యములఁ జదివిరి.

బ్రహ్మశ్రీ ఉభయభాషాప్రవీణ గరిమెళ్ల వేంకటలక్ష్మీనరసింహశాస్త్రిలుగారు, శ్రీపంతులుగారి సాహాయ్యముఁ బడసిన గ్రాంథికాంధ్రము, నిరాతంకముగ వర్ధిల్లుచుఁ దొంటికంటె రాజమర్యాదలఁ బడయుచుఁ దెలుఁగుదేశమున వన్నెకెక్కఁగలదనియు, శ్రీపంతులుగారు స్థాపించిన సాహిత్యపరిషత్పత్త్రిక యితోఽభివృద్ధిఁ బడసి వర్ధిల్లఁగలదనియు నుడివిరి.

మహారాజశ్రీ గార్లంక వీరవేంకటసత్యనారాయణ బి. ఏ. ఎల్. టి. గారు మాటాడుచు విద్యార్థులను సంబోధించి కళాప్రపూర్ణులను, కవిశేఖరులను నాదర్శముగఁ గయికొని వారివలె భాషాసేవయు, దేశాభిమానమును, త్యాగాసక్తియు, కార్యదీక్షయుఁ బూని యభివృద్ధిఁ బొందుఁడని యుత్తేజకముగ నుపన్యసించిరి.

శ్రీరామయ్యపంతులుగారు, అమలాపురపౌరులు తమకుఁ జేసిన సన్మానమునకుఁ దమమానసమునఁ గలయానందమును వెల్లడించుచుఁ దమభాషాసేవ కంతకు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరుల నిరంతరభాషాభిమానము తోడి యపారమగు త్యాగమే కారణముగాని యన్యమేదియుఁ గాదని నొక్కివక్కాణించిరి మఱియు యథాశక్తిగ నింతదనుక ఆంధ్రసాహితికి సేవమొనర్చితిననియు,నిఁక దానిపురోభివృద్ధి దేశాభిమానులు, భాషాభిమానులు నగు ప్రజలపయి నాధారపడియున్నదనియు నుడివిరి.

ఆవలఁ బౌరుల యభిమతము నెఱవేర్చుచు కవిశేఖరులు తెలుఁగునఁగల "శ్లేష, హాస్యము," అనువిషయముఁగూర్చి కొంతవఱకు ముచ్చటించినపిదప మహారాజశ్రీ డాక్టరు జొన్నలగెడ్డ మల్లపరాజుగారి యభివందనములతో సభ ముగింపఁబడెను.

# 'కళాప్రపూర్ణ'

## శ్రీ జయంతి రామయ్యపంతులుగారి యభివందనము.

విద్వాన్- వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

శా. శ్రీమంతంబయి యాంధ్రభారతి విరాజిల్లంగ యావత్కళా
శ్రీమంతంబు జయంతివంశ మనిపించెన్ గాదె సుశ్లోకుఁడౌ
రామయ్యార్యుని విశ్వతోముఖకళాప్రాగ్భార రంగద్యశ
స్తోమోద్భాశ 'కళాప్రపూర్ణ' బిరుదస్తుత్యార్థవద్వర్ణముల్.

సీ. పలుకుల రసము చిప్పిలఁగఁ బూర్వోత్తర
రామచరిత్రముల్ రచనసేసి
పుట్టువు సార్థకంబుగ సూర్యరాయని
ఘంటునిర్మాణభాగ్యంబు నెనసి
సరహస్యముగను భాషలు సర్వమును నేర్చి
సర్వజ్ఞుఁడను ప్రశంసను గడించి
గ్రామ్యవాదము తూల్చి గ్రాంథికాంధ్రసరస్వ
తికి నూత్నతేజ మత్తించి మించి,

గీ. జీవితం బాంధ్రసాహితీదేవిసేవ
కెనుబదేండ్ల వయస్సునఁ నేని వెనుక
యంజవేయక యొసఁగు జయంతిరామ
యార్యుఁడు "కళాప్రపూర్ణుఁ"డం చనుట ప్రాఁతె ?.

సీ. పగువంపు వయసునఁ బడసె బియ్యే బియెల్
బిరుద మాంగలకలాపరిచయమున
నటుపైని మాండలికాధికారమునఁ బ్రా
పించెఁ గలెక్టర న్బిరుద రాజ
మటు లక్ష్మి నేలుచు నిటు లాంధ్రసాహిత్య
పరిషజ్జనకుఁడను బిరుద మొందె
సంస్కృతాంధ్రములకు సరి కన్నడం బఱి
వము నేర్చి పొందె సర్వజ్ఞ బిరుద

మిన్నబిరుదులు దాల్చిన మిన్న రామ
యార్యునకు నాంధ్రవిశ్వ విద్యాలయము "క
ళాప్రపూర్ణ" మహాబిరుదప్రదాన
మాచరించుట దాఁ గీర్తి నందఁ గాదె.

చ. పుడమిపయిన్ నరాకృతిని బుట్టిననాఁటికె తాఁ గళాప్రపూ,
ర్ణుఁడగు జయంతిరామసుమనోవరు విశ్వకళాసదంబు నేఁ
డడరి 'కళాప్రపూర్ణ' బిరుదాంచితుఁ జేయుట యేమి గొప్పగా
నుడువుదు ? నేఁటికేనియుఁ గనుంగొనినందులకే నుతించెదన్.

చ. దొరతనమున్ వహించె నృపతుల్ ప్రణుతింపఁగ నీతిచేధురం
ధరుఁడయి, తద్విధంబగు నుదారు లనేకులు లేకపోరు గా
కరయ సమస్తభాషల రహస్యములన్ గ్రహియించునట్టి నే
ర్పరి మఱి యన్యుఁ గాంచెదమె రామయపండితుఁ దక్క నెచ్చటన్.

ఉ. ఈగతి వచ్చు నీబిరుదు లెల్ల నటుండఁగ సూర్యచంద్రతా
రాగణముండు దాఁకను ధరన్ స్థిరమై విలసిల్లు "గ్రామ్యభా
షాగళపాశ"మన్బిరుదు సార్వజనీన మొకండు మున్నె లే
దా ! గణుతింప రామయబుధాగ్రణి విక్రమ మెల్లఁ జాటుచున్.

ఉ. ఆంధ్రసరస్వతీహృదయమందలి సార మెఱింగి సూర్యరా
యాంధ్రనిఘంటుకర్తయయి యాంధ్రకృతుల్ రచియించి నిత్యని
రంధ్రయశంబు గాంచు మన రామయపంతుల కీయ సర్వమా
నాంధ్రసరస్వతీకవచ మన్బిరుదం బొకఁడే యొసంగినన్.

శా. మమ్మున్ దీవనసేయఁగాఁ దగు కళామాన్యుల్ వయోవృద్ధు, ల
త్యమ్మౌ సూక్తిగలాని, రామయబుధోత్తంసంబు నస్మాదృశుం
డెమ్మై దీవన సేయఁగాఁదగును గానీ వచ్చిరాయుష్యభా
గ్యమ్మున్ మాత్రమ కోరుకొందును దదీయాశీస్సులన్ గాంచఁగన్.

# కీ॥ శే॥ కోకా వేంకటసుబ్బారావునాయుఁడుగారు.

శ్రీపీఠికాపుర సంస్థానమునఁ బెక్కు సంవత్సరములనుండియు దివాన్ పదవిని వహించిన శ్రీ కోకా వేంకటసుబ్బారావునాయుఁడుగా రాకస్మికముగ 31-3-40 తేదిని దివంగతులైరని వ్రాయుట కెంతయుఁ జింతించుచున్నాము. వీరు పరిషత్కార్యాలయము చెన్నపురినుండి కాకినాడ మార్చినది మొదలు మా కార్యనిర్వాహకవర్గమున సభ్యులుగానుండి పరిషత్కార్యనిర్వహణమున సహాయులై యుండిరి. వీరి భాషాభిమానమును గార్యదీక్షయు నందఱకుఁ దెలిసినవియే. భగవంతుఁడు వీరియాత్మకు శాంతినొసఁగుఁగాత !

## అమాత్యస్మృతి.

విద్వాన్, పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి.

మ. పరమబ్రహ్మకృపావిశేషమునకున్ బాత్రుండు; ఛాత్త్రిండు బ్ర
హ్మాబుషిశ్రేష్ఠునకున్ సమాశ్రితసమూహాభ్యున్నతిప్రాపణా
దరయుక్తుండు దయార్ద్రచిత్తుఁడు మహాధన్యుం డమాత్యుండు భూ
వరువిశ్వాసము చూఱగొన్నతఁడు సుబ్బారావు చేరెన్ దివిన్.

సీ. బ్రహ్మర్షివర్యుఁడన్ బ్రథితి నార్జించిన
రఘుపతి వేంకటరత్నసుజను
పీఠికాపురమహీభృద్వర్యు నాస్థాన
కవిరత్న మసురామకవివతంసు
ఎల్లదిక్కులఁ గీర్తివల్లి నల్లుకొనంగఁ
జేసిన లక్ష్మీనృసింహకవిని
సితియుగంధరఖ్యాతి గాంచిన సుబ్బ
రావునాయుఁడు మంత్రిరత్నభూష

గీ. బ్రమింగినాఁడను నాయంత మేటి గలఁడె?
యనుచుఁ బొంగుచు నున్నాఁడ వకటె! నాల్గు
దినము లుండుము నిను బ్రమింగుడిట్టి విక్ర
ముండు రాఁగలఁ డిది స్మరింపుము ప్రమాథి!

# పోతనభాగవతము.

నిడుదవోలు వేంకటరావు, బి. ఏ.

---

సహజపాండిత్యకవితావిశారదుఁడై యాంధ్రదేశమునంతను భక్తిరస పారావారమున నోలలాడించిన పోతనమహాకవి తలఁపునకుఁ దగులఁగనే భాగవతమును మనస్మృతికి వచ్చుచున్నది. నేఁడు మనకు లభ్యమగుచున్న భాగవతమంతయుఁ బోతనకృతము కాకున్నను, గ్రంథమున విశేషభాగము రచియించినకవి పోతనయే యగుటచే నది పోతనభాగవత మని చెప్పుటలో నాశ్చర్యము లేదు. భాస్కరరామాయణమును, భాస్కరుఁడు కాక వేఱొక కొందఱుకవు లాగ్రంథమునందలి భాగములు రచియించినను, సంకుఁ ప్రధానుఁడు భాస్కరుఁడే యగుటచే భాస్కరరామాయణమని లోకమున వాడుకకెక్కినట్లు సింగన, గంగన, నారయ మున్నగుకవులు భాగవతములోని కొన్ని స్కంధములు రచియించియున్నను, పోతనరచించిన భాగవతభాగము వానియన్నింటికన్న నన్నివిధముల మిన్నయగుటచే దానిని పోతనభాగవతమని మనవారు వాడుట సమంజసము కాకపోలేదు. ప్రస్తుతము ముద్రితమైన భాగవతమున నేయేభాగము లెవరెవరిచే రచియింపఁబడినవో, చదువరులకు సుగమమగునట్లీక్రింద వివరించుచున్నాఁడను.

| స్కంధముపేరు. | | ఆశ్వాససంఖ్య. | గద్యపద్యసంఖ్య. | కవిపేరు. |
|---|---|---|---|---|
| 1. ప్రథమస్కంధము. | | | 529 | పోతన. |
| 2. ద్వితీయ | ,, | | 289 | ,, |
| 3. తృతీయ | ,, | | 1055 | ,, |
| 4. చతుర్థ | ,, | | 977 | ,, |
| 5. పంచమ | ,, | 1 ప్రథమాశ్వాసము | 183 | గంగన |
| | | 2 ద్వితీయ ,, | 168 | ,, |
| 6. షష్ఠ | ,, | | 530 | సింగన |

| | | | | |
|---|---|---|---|---|
| 7. సప్తమ | ,, | | 482 | పోతన |
| 8. అష్టమ | ,, | | 744 | ,, |
| 9. నవమ | ,, | | 73[illegible] | ,, |
| 10. దశమ | ,, | పూర్వభాగము | 1790 | ,, |
| | | ఉత్తర ,, | 1342 | ,, |
| 11 ఏకాదశ | ,, | | 127 | వెలిగందలనారయ |
| 12. ,, | | | 53 | ,, |
| | | | 9005 | |

పై పట్టికఁ జూచిన తొమ్మిదివేల గద్యపద్యములుగల మహాభాగవతమున * వేయియఱువదియొక్క గద్యపద్యములుమాత్రమే యితరులు రచియించినట్లు స్పష్టమగుచున్నది. పైని గద్యపద్యములు ముద్రితమైనవానిలో నాశ్వాసాద్యంతముల ననుసరించియే కవిపేరును సంఖ్యయును వ్రాయఁబడినవి. కాని యిందుఁ గొన్ని విశేషములుగలవు.

1. ద్వితీయస్కంధమున నారదునకు బ్రహ్మోపదేశము చేయు సందర్భమున—

ఉ. అట్టి యనంతశక్తి జగదాత్ముని నాభిసరోజమందు నేఁ
బుట్టి......... నామతంబునన్.

స్కంధము 2. పద్యము 93.

అనుపద్యము మొదలుకొని వెలిగందల నారయ చెప్పినకవిత్వముని ముద్రితమైనది. స్కంధాంతగద్య పోతనపేరనే కలదు.

| | | |
|---|---|---|
| * గంగన | 351 | గద్యపద్యములు |
| సింగన | 530 | ,, |
| నారయ | 180 | ,, |
| | 1061 | |

2. దశమస్కంధోత్తరభాగమున శ్రీకృష్ణుఁడు కేళీగృహమునందు సరసోక్తులాడుట యనుఘట్టమున—

సీ. కాటుక నెఱయంగఁ గన్నీరు వఱదలై
కుచకుంభయుగళ కుంకుమముఁదడియ
.......................పువ్వుఁబోఁలె- 237

అను సీసపద్యము మొదలు స్కంధాంతమువఱకు వెలిగందల నారయకవి విరచితమని, ప్రాచీనపండిత లిఖితపుస్తకములయందుఁ జెప్పఁబడియున్నదని గ్రంథపీఠికలయందుఁ దెలుపఁబడియున్నది.

క్రీ. శ. 1905 లో, ఆనందముద్రణాలయమువారి ముద్రణమున నా సందర్భమునఁ బుటయడుగున నీవిషయము తెలుపఁబడియున్నది. కాని క్రీ. శ. 1915 లో వావిళ్ల వారు ప్రకటించిన భాగవతమునం దీవిషయమా సందర్భమునఁ దెలుపఁబడియుండలేదు.

3. భాగవతమున నవతారికయందలి తొలిపద్యమును షష్ఠ్యంతములును శ్రీకృష్ణపరములుఁగానున్నను, స్కంధాద్యంతపద్యములు శ్రీరామాంకితములుగా నున్నవి. పంచమస్కంధమున గంగనయు, సింగనయు నాద్యంతములు కృష్ణపరముగానే చెప్పియున్నారు. వెలిగందల నారయ పోతనశిష్యుఁ డగుటచే నాద్యంతముల శ్రీరామపరముగాఁ జెప్పియున్నాఁడు-

4. భాగవతకవుల గద్యములు-

పోతన :—

ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర, సహజపాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతమను మహాపురాణమునందు.........కథలుగల...స్కంధము.

గంగన :—

ఇది శ్రీసకలసుకవిజనానందకర బొప్పయామాత్యపుత్ర గంగనార్యప్రణీతంబైన శ్రీమద్భాగవతమహాపురాణంబునందు......కథలుగల పంచమస్కంధమున...నాశ్వాసము.

సింగన :—

ఇది శ్రీసకలసుకవిజనమిత్ర శ్రీవత్సగోత్రపవిత్ర కసువయామాత్య పుత్ర బుధజనప్రసంగానుషంగ సింగయనామధేయప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణంబునందు......కథలుగల షష్ఠస్కంధము.

నారయ :—

ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర కేసన మంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్యప్రియశిష్య వెలిగందల నారయనామధేయ ప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహాపురాణంబునందు...... ద్వాదశస్కంధము.

ఇది మహాభాగవతప్రకృతముద్రితగ్రంథవివరణము.

పైని నేవివరించినరీతిని స్కంధాంతగద్యలయందు బమ్మెర పోతనామాత్యునిపేరు స్పష్టముగాఁ గానవచ్చుచున్నను, గ్రంథపాతములుగలుగుటకు, నాభాగములను వెలిగందల నారయాదులు పూరించుటకు నొకకథ యాంధ్రదేశమున మిక్కిలి వ్యాప్తిలోనున్నది. అది యిది :—

"ప్రస్తుతము వేంకటగిరి సంస్థానాధీశ్వరుల మూలపురుషుఁడైన భేతాళరెడ్డికి నేఁవతరమువాఁడగు సర్వజ్ఞసింగభూపాలుఁడు పోతరాజుగారి కాలమున రాచకొండ సంస్థానమును బరిపాలించుచుండెను. ఆతఁడు స్వయముగఁ గవియు మహావిద్వాంసుఁడునై శ్రీనాథాది మహాకవుల సన్మానించినాఁడు. ఆతఁడు పోతరాజు భాగవతము నాంధ్రీకరించుచున్నట్లు తెలిసికొని యాగ్రంథము తనకుఁ గృతినిమ్మని కోరెను. కాని యైహికేచ్ఛావిముఖుఁడగు పోతన నరులకుఁ గృతినీయ నొల్లనివాఁడగుటచే నాతని కోర్కె నిరాకరించెను. సింగభూపాలుఁ డందులకుఁ గుపితుఁడై యాగ్రంథము పూర్తియైనవెనుక దానిని బలాత్కారముగఁ బోతనయొద్దనుండి గ్రహించి, భూమిలోఁ బాఁతిపెట్టించెను.అంతఁ గొంతకాలమునకుఁ బోతరాజు చనిపోయినవెనుక శ్రీరామచంద్రమూర్తి సింగమనాయనివారి భార్యకుఁ గలలోఁ గానిపించి, పాఁతిపెట్టియున్న భాగవతమును బైకిఁ

దీయవలయునని చెప్పి యంతర్హితుం డయ్యెను. ఆమెయు భర్తను బ్రార్థించి వెలికిఁ దీయఁగ నందుఁ జాలభాగము శిథిలమయ్యెను. ఆశిథిలభాగమును వెలిగందల నారయామాత్యులు పూరించిరి."

విద్వద్రసికుఁడును, విద్వాంసుఁడు నగు సర్వజ్ఞసింగభూపాలచంద్రునికిఁ గళంకముఁగూర్చు నీయప్రథను దొలుత గ్రంథస్థముఁ గావించినవాఁడు కూచిమంచి తిమ్మకవి. ఈతఁడు పై లోకప్రవాదము నాధారము చేసికొని తన సర్వలక్షణసారసంగ్రహమున, తృతీయాశ్వాసమున రేఫ నిర్ణయప్రకరణమునఁ గడపటిభాగమునందు-

సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించునెడల
సర్వజ్ఞసింగమక్ష్మావరుం డది తన
కిమ్మని వేఁడిన నిడకయున్న
నలిగి యాపుస్తకం బవనిఁ బాఁతించినఁ
జివికి యందొక కొంత శిథిలమయ్యెఁ
గ్రమ్మఱ నది వెలిగందల నారయ
రాజును మఱి బొప్పరాజు గంగ
గీ. రాజు మొదలగు కవివరు ల్దేజమెసఁగఁ
జెప్పి రాగ్రంథములయందె తప్పులొదవెఁ
గాని పోతకవీంద్రునికవిత యందు
లక్షణం బెందుఁ దప్పదు దక్షహరణ!

3. ఆ. 266 ప.

తిమ్మకవి యీకీర్తిని వ్రాయుటకుఁగల కారణ మీకథ యతని యభిప్రాయములకుఁ దోడుపడుటయే యని తోఁచుచున్నది. పోతనభాగవతమున రేఫఱకారములకు మైత్రికూర్చెనని తిమ్మకవికి ముందు ముద్దరాజు

రామన యప్పకవి మున్నగులాక్షణికులు తమగ్రంథములందుఁ జెప్పిరి.*
తిమ్మకవి యట్టిపూర్వలాక్షణికాభిప్రాయముల ఖండింపఁదలఁచినవాఁడగు
టచే రేఫఱకారముల మైత్రిలేని పద్యములుమాత్రమే యుదాహరించి,
యవి పోతనరచితభాగవతభాగములోనివే యనియు, రేఫఱకారమైత్రి
గల స్థలములు శిథిలపూరణభాగములోనివనియుఁ జూపుటకు నీకథను
గ్రంథస్థముగావించి యున్నాఁడని విజ్ఞులకుఁదోఁపకమానదు. ఏలయనఁగా

1. రేఫఱకార నిర్ణయము పదునొకొండవశతాబ్దినుండియే యనఁ
గా, నన్నయనాఁటినుండి పడలనారంభించినది. తిక్కనాది మహాకవులీ
ప్రాససాంకర్యముఁ గావించియుండుటచేఁ బోతనాదిమహాకవులు దీనిఁ
బాటింపలేదు. మఱియుఁ దిమ్మకవిచెప్పిన పోతనభాగవతభాగమునందే
యిట్టి రేఫఱకారసాంకర్య మగపడుచున్నది. †కావునఁదిమ్మకవి పట్టుదలతో

---

*ఉ. బమ్మెరపోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహిఁ నేమిటంగొదువ యెంతయు నారసిచూడఁగాను రే
ఫమ్ములుఱాలునుం గలిసి ప్రాసములై తనరారినంగదా
యిమ్ముల నాదిలాక్షణికు లెల్లరు మాని రుదాహరింపఁగన్.

(అప్పకవీయము ౨-234)

†ద. ఎఱుగడ జీవనాపథము
దరలఁడు
మెఱయుచు
తెఱఁగున......

స్కంధము 7. పద్యము 202.

ద. పాఱఁడు లేచిదిక్కులకు
దూఱఁడు......
జీరఁడు
దాఱఁడు...

స్కంధము 7 పద్యము 194.

పై యుదాహరణములు రెండను పోతనామాత్యకవికృతమని నిశ్చయముగాఁ జెప్పఁ
దగిన సప్తమస్కంధమునుండి యుద్ధరింపఁబడినవి.

లేవని నిరూపించుటకుఁ బ్రయత్నము చేసియున్న ట్లీ క్రిందివిషయమువలన మనకు స్పష్టమగుచున్నది ‡

2 పోతనామాత్యుఁడు క్రీ. శ. 1400 ప్రాంతమువాఁడు. తిమ్మకవి క్రీ. శ. 1750 ప్రాంతమువాఁడు. ఇరువురకును నడుమ మూఁడువందల యేఁబది యేండ్లకాలము వ్యవధియున్నది తిమ్మకవికి ముందెవ్వరును నీకథను గ్రంథస్థము గావించియుండలేదు. కవులెవ్వరును నందు ముఖ్యముగ శిథిలభాగములఁ బూరించిన కవియు, పోతనప్రియశిష్యుఁడునగు వెలిగందల నారయ దీనిఁగూర్చి యేమియుఁ దెలిపియుండలేదు. పోతన మునిమనుమలు కేసన మల్లనకవులు తమ దాక్షారామపరిణయమునఁ గాని, విష్ణుభజనానందమునఁ గాని, వారికిఁ బావమఱఁదియగు సజ్జరపు పేరయలింగకవి తన యొడయనంబివిలాసమునఁగాని యీవిషయముఁదలఁప లేదు. మఱియుఁ దమపూర్వులలో మహాప్రసిద్ధుఁడగు పోతనఁగూర్చియు నాతని గ్రంథమును గూర్చియు నిట్టిప్రవాదములున్నచోఁ గవులగు తద్వంశీయు లెఱుఁగకుందురా ? మఱియు భాగవతమువంటి మహాగ్రంథమున నిట్టిగ్రంథపాతములు శిథిలభాగపూరణములు గలిగినచో నవి లాక్షణికుల దృష్టిని నాకర్షించును. క్రీ. శ. 1490 ప్రాంతమువాఁడగు తాతంభట్టు తనకవిచింతామణియందు పోతనవిరచితభోగినీదండకము నుదాహరించియున్నాఁడు. అందీభాగవతవిషయము లేకుండుటచే నప్పటి కీకథ

‡ రేఫఱకారములఁగూర్చి తిమ్మకవి భాగవతము నాధారముగాఁ జేసికొని వ్రాసిన విమర్శనము విమర్శనీయమై యున్నది. పోతన యనుప్రాసప్రియుఁడు. కావున ప్రాసమునందట్టి యవకాశము గల్గినపు డనుప్రాసము వేయుట యాతనికి ముఖ్యవ. ప్రాసయందుఁ దొలుత సాధురేఫము పయోగించిన సాధురేఫమును, శకటరేఫము పయోగించిన శకటరేఫమును ననుప్రాసముకొఱకు వ్రాసినవే గాని, పోతన రేఫశకటరేఫసాంకర్యము చేయని పట్టుదలతోఁ గాదు. ఈ క్రిందితిమ్మకవి చూపిన యుదాహరణమే పై నావాదమును సమర్థింపఁజాలియున్నది.

సీ. వెఱచినవారి దైన్యమున వేఁడిరునొందినవారి నిద్ర మై
మఱచినవారి సౌఖ్యమున మద్యము ద్రావినవారి, భగ్నులై
పఱచినవారి సాధుజనభావమువారిని గావుమంచు వా
చఱచినవారిఁ గామినులఁజంపుటధర్మము గాదుఫల్గునా. (సర్వల. 3 ఆ. పద్యము268).

లేదనియే తలఁపఁదగియున్నది. ఆవెనుక నేఁటిదనుక మహాప్రామాణి కుఁడని యెల్లరచే నేకగ్రీవముగ నంగీకరింపఁబడుచున్నవాఁడును, క్రీ. శ. 1650 ప్రాంతమువాఁడుననగు నప్పకవి యీసంగతి నెత్తుకొననేలేదు. అప్పకవి కాలమునాఁటి కీకథ కెంతమాత్రము ప్రచారములేదని యీ తనిగ్రంథముఁబట్టి స్పష్టముగా నిరూపింపవచ్చును.

నన్నయభట్ట సత్కవి జనంబుల కావ్యములు లేఖకపాఠములచేఁ బాడయ్యెననియు, వికటకవులు కొన్నివింతలు గల్పించి కవిజనాశ్రయ మునఁ గలిపినారనియు వ్రాసిన యప్పకవి, ఆంధ్రశబ్దచింతామణికొఱకు సారంగధరకథను గల్పించిన యప్పకవి కవిస్తుతియందు సహజపాండిత్యుని గాఁ బోతన సంస్మరించిన యప్పకవి, పోతనగ్రంథముఁ గూర్చిన యపవాదమున్నచో దానిని దనగ్రంథమున సూచింపకుండ నుండునా ?

మఱియు "బమ్మెరపోతరాజకృతభాగవతము సలక్షణమ్ముగా కిన్మహీనేమిటంగొదువ" యని చెప్పినపుడు పోతనకృతభాగవతభాగమంత యు సమగ్రముగనున్నట్లే తెలియుచున్నదిగదా ! ఇంకొక ముఖ్యవిష యము:—

అప్పకవికాలమునాఁటికి నాతనికి లభ్యమైన తాళపత్త్రగ్రంథము లలో నిట్టిశిథిలభాగపూరణమే గలిగినచో, నప్పటికి 'ఇచటినుండి వెలి గందల నారయకవిత్వ' మని వ్రాయఁబడియున్నచో దాని నతఁడారీతిగనే యుదాహరించును.

అప్పకవీయము చతుర్థాశ్వాసమున ఆకాశము నిత్యమైనందు లకు ద్వితీయస్కంధమునందు,

ఉ. సర్వఫలప్రదాతయును, సర్వశరణ్యుఁడు, సర్వశక్తియున్
సర్వజగత్ప్రసిద్ధుఁడును, సర్వగుణుండునునైన చక్రి యా
సర్వశరీరులున్ విగతసంగతిఁజెంది విశీర్యమాణులై
పర్వినచో నభంబుగతి బ్రహ్మముదాఁ జెడకుండు నెప్పుడున్.

అని యుదాహరించియున్నాఁడు.

ఈపద్యము నేఁటిముద్రితభాగవతమున ద్వితీయస్కంధము 210 పద్యముగానున్నది. ఇది వెలిగందల నారయకవికృతమని యప్పకవినాఁటి తాళపత్రములలో నున్నచో నదియాతఁడు వ్రాసియేయుండును. అట్లు వ్రాయకపోవుటచే నాకాలమున నీప్రవాదమే లేనట్లు స్పష్టమగుచున్నది.

కావున నీకథను సృష్టించినవాఁడు తిమ్మకవియేయని నాకుఁ బొడ కట్టుచున్నది.

ఇఁకఁ గథలోని ముఖ్యపురుషుఁడగు సింగమనాయనిఁ గూర్చి మనము తెలిసికొనిన నీగాథ కేవలకల్పితమనియే నిశ్చయమగుచున్నది.

పోతనామాత్యుని గ్రంథమును బలాత్కారముగఁ బాఁతిపెట్టించిన రాజెవ్వరు? సంస్కృతభాషామహావిద్వాంసుఁడై, మహీపాలుఁడై, రసార్ణవసుధాకర, సంగీతసుధాకరాదిశాస్త్రగ్రంథములు రచియించి, మల్లినాథునివంటి వ్యాఖ్యాతృచక్రవర్తికిఁ బ్రామాణికుఁడై, శ్రీనాథాది మహాకవులకుఁగూడఁ దన దర్శనము చేయునపుడు శారదాస్తవముఁ జేయించిన మహాప్రతిభాశాలి సర్వజ్ఞబిరుదాంకుఁడు- అట్టి మహాప్రభు విట్టి పనిచేయుననుట నమ్మఁదగినదిగా నుండలేదు రాజులెవ్వరైన కృతులను ఖిలముగాకుండ నాకవిచేఁ గాకున్న మఱియేరిచేనైన కృత్యాదులైన వ్రాయించి, తమపేరు గ్రంథములలో శాశ్వతముగ నుండునట్లు చేసికొందురే కాని యీవిధముగ గ్రంథమును ఖిలముగావింపఁజూతురా? మఱియు సింగమనాయనివారు కవులను సన్మానించెడువారేకాని వేఱుకాదు. మల్లినాథసూరికిఁ గనకాభిషేకసత్కారముఁ గావించిన దీప్రభువే! శ్రీనాథుని యాంధ్రకవితకు నలరి యాతని సమ్మానించిన దీమహారాజే! ఆంధ్రకవితయం దత్యంతాభిమానముగలిగి దైవభక్తిపరాయణుఁడై సర్వజ్ఞుఁడగు నిట్టి రాజకవిపండితగ్రామణి యిట్టి యకార్యము చేసెననుటయే దుర్భావ్యముగ నున్నది.

ఈవఱకు భాగవతపీఠికాకర్త లెవ్వరును నీకథను నమ్మఁదగినదిగా నుండలేదనియే వ్రాసిరి. దీనికిఁదోడు గ్రంథములోని కవితారీతిని నాథా

రముగఁ జేసికొని యీకథను నిలువఁబెట్టుటకుఁ బ్రయత్నములు జరిగినట్లు కానవచ్చుచున్నది. ఆవిధమును గొంచెము విమర్శించిన నిజము తేలును.

ప్రస్తుతము మనకు ముద్రితభాగవతములలో దశమస్కంధము పూర్వభాగమునఁ గుచేలోపాఖ్యానమున్నది ఇది పూర్వోక్తప్రకారము దశమస్కంధోత్తరభాగమున 237 వ పద్యమునుండి వెలిగందల నారయ కవిత్వమని యనుకొన్నచోఁ గుచేలోపాఖ్యానము నారయకవిత్వముగా నేర్పడుచున్నది. కుచేలోపాఖ్యానము, చిరకాలమునుండి గజేంద్ర మోక్షము, రుక్మిణీకల్యాణము మొదలగువానివలె నిత్యపఠనపాఠనవ్యవహారములలోనున్నది. కవితావిషయమున నిది పోతనకృతముకాదని యంగీకరించినచోఁ బై వ్రాఁత సత్యమగునేమో? పోతనకృతముకాదని యాంధ్రదేశమున నెవ్వరు సనఁజాలరు. పోతనకవిత గావుననే నేఁటికి బాల బాలికల నాలుకలయందుఁ దాండవమాడుచున్నది.

పోతనకవనరీతి ప్రథమాదిచతుష్టమునం దొకరీతిగను, యాపై నొకరీతిగను నుండుటకుఁ గారణము ద్వితీయస్కంధమునుండి చతుర్థస్కంధమువఱకును వెలిగందల నారయ పూరణమనియు, దశమస్కంధోత్తరభాగము నల్లేయనియుఁ గొందఱు చెప్పుచున్నారు. భాగవతములోని తొలినాలుగైదుస్కంధములు భగవత్తత్త్వప్రతిపాదకములు. సప్తమస్కంధమునుండి దశమస్కంధాంతము, కడమభాగము భగవద్భక్తిప్రతిపాదకములు. భక్తిరసావేశమున గ్రంథము రచియించిన పోతరాజు భగవద్భక్తిప్రతిపాదకములగు ఘట్టములలోఁ దన్మయుఁడై కవితారచనముఁ గావించినాఁడు. ఆ ... కవిత శృంగారభక్తిరససమ్మిళితమై పొంగిపొరలుచున్నది. తాత్త్వికవిషయమువివేచనముఁ గావించునపుడు సమతలముగఁ బారు జీవనదివలె శాంతమై యొప్పుచున్నది. కావునఁ గవితారీతిని నీకథ సమర్థించుటయుఁ బొసఁగకున్నది.

మన యాంధ్రభాషయందుఁగల మహాగ్రంథములలో భారత భాగవతరామాయణములు ముఖ్యములు. ఈమహాగ్రంథముల నొక్కరు

రచియించుట సాధారణముగాఁ గష్టమగుటచే నాంధ్రమున నీగ్రంథము లనేకకవులచే రచితములై యున్నవి. భారతము మువ్వురు కవులచేతను, భాగవతము నలువురుకవులచేతను, రామాయణ మైదుగురుకవులచేతను రచియింపఁబడుట మన మెఱింగినదియే. పోతన భాగవతమును రచియింపఁదలఁచుఁగొని తాను గ్రంథరచనకుఁ బ్రారంభించి, తొలి నాలుగు స్కంధములు రచించి, యావెనుక భక్తిరసప్రధానములగు సప్తమాష్టమనవమ దశమస్కంధములఁ దానే రచియింపఁదలఁచి, మధ్యస్కంధములలోఁ బంచమము గంగనకు, షష్ఠము సింగనకు నిచ్చి రచియింపుఁడని చెప్పి యుండవలెను. లేనియెడల సింగన కృత్యాదితోఁ బ్రారంభించుట పొసఁగదు. గంగన కృత్యాది వ్రాసికొనకపోయినను గద్యయం దాతనిపేరుండుటయుఁ గవితారీతి భాగవతకవులందఱకంటె న్యూనముగనుండుటయుఁ దొలినుండి వేఱుపడుచుండుటచే నదియు సింగనరీతిని స్కంధము తొలినుండి ప్రారంభించినాఁడని తెలియఁదగియున్నది. సింగనగ్రంథమున 'భాగవతనైష్ఠికుఁడైనవాని' యని పోతరాజుఁగూర్చి వ్రాసినవాక్య మాతఁ డప్పటికి (పోతరాజు) భాగవతరచనానైష్ఠికుఁడై యున్నాఁడని మనకుఁ దెలియుచున్నది దశమస్కంధాంతమునకు వచ్చుసరికిఁ బోతనకుఁ జాలకాలము పట్టుటచే నేకాదశద్వాదశస్కంధములఁ దనశిష్యుఁడగు వెలిగందల నారయకు నొసఁగియుండును. నారయ, పోతరాజు మరణించినవెనుకనైన నీరెండుస్కంధములు రచియించియుండవచ్చును. గ్రంథరచనాక్రమము ననుసరించి చూడఁగా నీరెండవపక్షమే సమంజసముగ నున్నట్లు తోఁచుచున్నది. ఏలయనఁగా- పోతనరచితభాగవతము శ్రీధరవ్యాఖ్య ననుసరించి యద్వైతపరముగ రచియింపఁబడినది. వెలిగందల నారయరచనము విశిష్టాద్వైతపరముగ రచియింపఁబడినది. పోతనకాలముననే రచియింపఁబడిన నాతఁ డట్లు వ్రాసియుండఁడుగదా! ఆతఁ డిట్లు భాగవతముఁ బూర్తిగావించి, శిష్యుఁడుగావున నాగ్రంథమును వ్యాప్తిలోనికిఁ దెచ్చియుండవలెను. చారిత్రకముగఁ బై విషయముఁ బరిశీలింప నిది భాగవతరచనాక్రమముగాఁ గన్పట్టుచున్నది.

గ్రంథరచనాక్రమము ననుసరించినను బైకథ యాధారరహిత మని యసందర్భమనియుఁ దేలుచున్నది. గ్రంథమంతయుఁ బోతిపెట్టఁ బడినచో పంచమ షష్ఠములు నేకాదశద్వాదశములు తొలినుండి చివర వఱకునుఁబోయినవా? ద్వితీయస్కంధమునుండి చతుర్థస్కంధము చివర వఱకును నావెనుక దశమస్కంధోత్తరభాగమునుండి తుదివఱకు శిథిలమై యాముందటిభాగములుమాత్రమే బాగుగనున్నవా? స్కంధములు విడదీయించి యేస్కంధమున కాస్కంధము పాతిపెట్టించినారా? పట్టుపట్టినట్టు లీయాభాగములనుమాత్రమే శిలముగావించి, తక్కినవి నిలుపుదమని యాక్రిము లేమైనఁగూడఁబలుకుకొనినవా? ఆపైనీభాగవతము ప్రస్తుతము మనకుఁ గన్పట్టురూపమునఁగూర్చినవా రెవ్వరు? ఈవిధముగ నూహాసంజనితములగు చిత్రాతిచిత్రములగు ప్రశ్నలెన్నియేని యీసందర్భమున బయలువెడలును. ఇవి జవాబులేని ప్రశ్నలు. గ్రంథరచనాక్రమము ననుసరించిచూడఁ బోతనకాలమున వేఱ్వేఱుకవులచే నాయాభాగములు రచియించుటకుఁ బ్రారంభింపఁబడెననియు నిర్ణయించుట సమంజసము. కవిజీవితకారుని యభిప్రాయము నిదియే.

ప్రథమాదిస్కంధములయందుఁ బోతనకవితారీతిని నిరూపించుటకు మనకు సుపరిష్కృతమైనభాగవతము కావలసియున్నది. ప్రస్తుతము ముద్రితమగు భాగవతము పెక్కుప్రక్షిప్తములతోనిండి ప్రమాణము గాకయున్నది. గ్రంథావతారికనుండి మచ్చునకుఁ గొన్నియుదాహరణముల నిచ్చెదను.

(1) అవతారికయందు భారతీస్తుతిరూపములగు మూఁడుపద్యములలో రెండు ప్రక్షిప్తములు. అందలి 'అంబ నవాంబుజోజ్జ్వల' అను పద్య మారణ్యపర్వమునఁ గలదు.

(2) ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్, సొమ్ములుకొన్నిపుచ్చుకొని, చొక్కి శరీరమువాసి, కాలుచే సమ్మెటవేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చిచెప్పె నీబమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్,

ఇదియును బ్రక్షిప్తమే. ఇది భాగవతమున 13 వ పద్యము. ఆపట్టున (12) వచనము, (13) ఇమ్మనుజేశ్వరాధము లనుపద్యము, ఆవెనుక 14, 15 పద్యవచనములు. (12) వచనమునం దుది "దక్షుండనై" అను నుత్తమపురుషాసమాపకక్రియతో "(13) చెప్పె నీబమ్మెరపోతరాజొకండు భాగవతము జగద్ధితంబుగన్" అను ప్రథమపురుషక్రియగలవాక్య మన్వయించుటలేదు. ఆపై యన్వయము సరిపెట్టుటకైన, నింకను శ్రీరామచంద్రమూర్తి దర్శనము నొసంగుట భాగవతము రచియింపుమని యాజ్ఞ నొసంగుట మున్నగు నవతారికాభాగము మునుముందంగనే 'భాగవతముం జెప్పె' నని వ్రాసినపద్య మన్వయింపకుండనున్నది. కావున దీనిని దరువాతివా రెవ్వరో చేర్చియుందురు. ఇప్పు డున్నచోట నస్థానపతితమై యున్నది.

3. పుట్టంబుట్ట శరంబునన్ మొలవ సంభోయాన పాత్రంబులన్ మెట్టన్.

పైపద్యమున, 'పుట్టంబుట్ట' అనఁగా వాల్మీకినిగాననియు 'శరమ్మునన్ మొలవ' అనఁగా స్కంధుఁడను, కుమారస్వామిని గాననియు, అంభోయానపాత్రంబులన్ మెట్టన్ అనఁగా వ్యాసుఁడనుగాననియుఁబోతన చెప్పుకొనినాఁడని, యర్థమని చెప్పుచున్నారు. కొందఱీయర్థము సమంజసముగ లేదనినారు. దీనికి వేఱుపాఠమైన గ్రంథమం దుదాహరింపఁబడలేదు. కొన్ని తాళపత్ర ప్రతులయందు, పుట్టన్, పుట్టశిరంబునన్ మొలవ, నంభోయాన పాత్రంబులన్ మెట్టన్.

పుట్ట, శిరంబున మొలచునట్లు పుట్టలేదు. అనఁగా వాల్మీకినిగాను, వ్యాసుఁడనుగాను, మానుషాతీత కవితాశక్తి సమన్వితులును, భగవదంశసంభూతులును నగు వాల్మీకి వ్యాసాదులవంటివాఁడను గానని భావము. పోతన కుమారస్వామి ప్రశంసచేసినట్లు కానవచ్చుచున్నను నాతఁడు షట్శాస్త్రములకు మాత్రమే యధిష్ఠానదేవత యగుటచేతను ప్రస్తుత

ము కవితావిషయమే యగుటచేతను నాపైవచనము * నందు వాల్మీకి వ్యాసులను మాత్రమే స్తుతించినాఁడని స్పష్టమగుచున్నది.

ఇట్టిపట్టులు భాగవతమునందుఁ జాలఁగలవు. ఇవి గ్రంథపరిష్కారణావశ్యకతను వ్యక్తము చేయుచున్నవి.

భాగవతము తొలుత క్రీ. శ. 1848 సంవత్సరమున ముద్రింపఁబడినది. తరువాత గ్రంథముల కన్నిటికి నిదియే యాధారమైనది. బమ్మెర పోతన జన్మస్థలవివాదమునకేమి, కాలనిర్ణయమునకేమి గ్రంథపాఠ వివేచనమునకు నిదియె మూలము. ముద్రణకర్తలగు శ్రీ పురాణము హయగ్రీవ శాస్త్రులవారప్పటికిఁ దమకుఁగల సాధనసంపత్తితో నొక పీఠికను వ్రాసియున్నారు. వారిపీఠికయందు గ్రంథపాఠాది వివేచనమునందీ సింగభూపాలుని కథ లేదు. పోతనయే యింతటి మహోత్తమభగవత్తత్త్వ భక్తిభావ సంపూర్ణమగు మహాగ్రంథము జానపదులకుఁ జిక్కిన నది పాడగునని దానిని దేవతార్చనపుఁ బీఠమునందిడి పూజించుచుఁ దన యవసానకాలమున నది తనకుమారుఁడగు మల్లనకుఁదన భాగవతము సంగతిఁ జెప్పెననియు నంత మల్లన యాగ్రంథముఁదీసి చూడఁగా నందు కొంతశిలమైయుండుటకుఁ జింతించుచుండఁగాఁ బోతన మల్లనకు స్వప్నమునందగపడి శిష్యుఁడగునారయను శిథిలభాగములు పూర్తిచేసి వ్యాప్తము చేయుమని యానతిచ్చెననియు నందు వ్రాయఁబడియున్నది.

తిమ్మకవికాలమున కీకథ పైరీతిగ వాడుకలోనుండిన నతఁడు సింగభూపాలప్రస్తావము తెచ్చియుండఁడని నా యభిప్రాయము. తిమ్మకవి కాలమునకుఁ దర్వాతి తాళపత్ర గ్రంథములలో రెండు-చోటుల నిచ్చట నుండి వెలిగందల నారయ కవిత్వమని వ్రాయఁబడియున్నది. దీనికిఁ గారణము తిమ్మకవి తనగ్రంథమున నావిషయము చెప్పియుండుటచే

---

* వచనమున వాల్మీకి, వ్యాసుని, బాణమయూరులను, కాళిదాసును, భారవిమాఘులను, నన్నయ తిక్కనలను గ్రమముగాఁ జేర్కొనినాఁడు. పైపద్యమున కవితావిషయప్రసక్తమైనదని మనకుఁ దెలియుచున్నదిగదా!

నని స్పష్టమగుచున్నది. తిక్కనకవికి ముందున్న తాళపత్ర ప్రతులలో నీవిష
యము లేనట్లు అప్పకవి యుదాహరించిన పద్యమునుబట్టి తేలుచున్నది.
మఱియు హయగ్రీవశాస్త్రులవారు తామిరువది ప్రతులు భాగవతము
ద్రణ సమయమున సేకరించితిమనియు, సందీవిషయము కానరాలేదనియు
నీకథ తెలిసినవెనుక మఱికొన్ని ప్రతులనుజూచిదీనిని గ్రంథమునందు నెల
కొల్పితిమనియుఁ బీఠికయందు వ్రాసియున్నారు. చూ. పు. 3-4

ఇంతియేకాదు ఆంధ్రసాహిత్యపరిషద్భాండాగారమునఁగలఁ బ్రాచీ
నతాళీదళసంపుటములలో నిచ్చటనుండి వెలిగందల నారయకవిత్వమను
మాటలు లేవు* కావునఁ దాళపత్రగ్రంథముల ననుసరించినను పైకథ
కల్పితమనియే నిర్ణయింపనగును.

షష్ఠస్కంధము నేకాదశ ద్వాదశస్కంధములును దొలుతనుండి
రచనాక్రమమున భాగవతమునుండి వేఱుపడుటచే దానితరువాతివారు
తిరిగి వానిని రచియించిరి. షష్ఠస్కంధము సింగనయేగాక కవులషష్ఠము
శృంగారషష్ఠము అనుపేర నంది మల్లయ ఘంట సింగయకవులు తెలిఁగిం
చిరి. అది యిప్పుడుకానరాదు. అప్పకవీయమునను సర్వలక్షణసారసంగ్ర
హమునను దీనియందుండి లక్ష్యము లుదాహరింపఁబడినవి. హరిభట్టార
కుఁడు షష్ఠస్కంధమేగాక ఏకాదశ ద్వాదశస్కంధములనుగూడ రచియిం
చియున్నాఁడు. ఇవి యాముద్రితములైనను మనకు లభ్యములగుచున్నవి.

పైకథలను గల్పించుట కేదేని యాధారమున్నయెడల నది వెలి
గందల నారయ యేకాదశ ద్వాదశస్కంధముల వలననేయని సందేహిం
చుచున్నాఁడను. తక్కిన స్కంధములన్నింటికన్నను నీస్కంధముల
వ్రాతప్రతులు మిక్కిలి తక్కువమాత్రమైనవి. ఆనంద ముద్రణాలయమున
క్రీ. శ. 1905 లో ముద్రింపఁబడిన భాగవతమునకుఁ గీర్తిశేషులు దేవ
పెరుమాళ్ళయ్యగారు వ్రాసిన విషయములఁజూచిన నిదిస్పష్టమగును.

*చూడుఁడీ ఈక్రిందిసంఖ్యగల తాళపత్రప్రతులు. 646, 728, 1191, 1201
1317, 1318, 1533, 1614, 1648, 2645.

అన్ని స్కంధములకుఁ గలవుగాని, ఈ స్కంధములకు సరియగు మాతృకలు వారికి దొరకలేదనియు, దొరకినవన్నియు నొకదానితో నొకటి సరిపోవక దోషభూయిష్ఠమై యున్నవనియుఁ గొన్ని పాఠములు పండితులు మూలానుసారముగ లేమిని మార్చి వ్రాసియుంచిరనియు నవి శోధనమున కభేద్యవ్యూహమును దాల్చియున్నవనియు వ్రాసినారు. చూ. 3-4 పుటలు. వారియూహకును నాధారము లేకపోలేదు. హరిభట్టారకుఁడు రచించిన యేకాదశ ద్వాదశ స్కంధములను వెలిగందల నారయ రచించిన యా భాగమును బరీక్షించినచో మనకీవిషయము స్పష్టమగును. వెలిగందల నారయ పోతరాజు శిష్యుఁడగుటచే క్రీ. శ. 1460 సంవత్సర ప్రాంతమువాఁడు. హరిభట్టారకుఁడు క్రీ. శ. 1530 సంవత్సర ప్రాంతమువాఁడు. నారయగ్రంథ మేకారణముచేతనో క్రిమిదష్టమై పోఁగా హరిభట్టారకుఁడా యీభాగములను తనపేరఁ బూరించినట్లున్నది.

మచ్చునకు వెలిగందల నారయకవి.

మ. విదితుండై సకలామరుల్ గొలువ నుర్వీభారము న్మాన్పి దు
ర్మద సంయుక్త వసుంధరాధిపతులన్మర్దించి కంసాదులన్
తుదిముట్టన్వధియించి కృష్ణుఁడతిసంతుష్టాత్ముఁడై యున్న చో
యదుసైన్యంబులు భూమి మోవఁగ నసహ్యంబయ్యె నత్యుగ్రమై.

మ. విదితుండై సకలామరుల్ పొగడ నుర్వీభారము న్మాన్పి దు
ర్మదసంయుక్త వసుంధరాధిపతులన్మర్దించి కంసాదులన్
దుదిముట్టన్వధియించి కృష్ణుఁడతి సంతుష్టాత్ముఁడై యున్నచో
యదుసైన్యంబులు భూమిలోన నవిషహ్యంబయ్యె నత్యుగ్రతన్.

గద్యములకు

పైవిషయమే దేని భాగవత శిథిలపూరణ కథకుఁ బీజమై యుండునేమో? ఇవియన్నియుఁ దరువాతివారు పోతన కంటఁగట్టియుందురు. వేయేల! స్పష్టముగా మనకు నగపడుచున్న సింగనాదుల. గద్యములు కూడ పోతనయందలి భక్తిచేఁ దరువాతివారు పోతన గద్యములను స్కం

ధాంతమునఁ జేర్చి వ్రాసినారు. ఇట్టిపట్టు లెన్నియేని తాళపత్రగ్రంథములఁ గలవు. అవి సుపరిశీలితములై పోతన భాగవతభాగము ప్రకటితమైన విజ్ఞులు వానినిజమెఱుఁగఁ గలుగుదురు పైవిషయములఁగూర్చి కొన్ని ముఖ్యాంశముల నిటఁ జూపుచున్నాను

1. భాగవతమును సర్వజ్ఞసింగమ భూపాలుఁడు పాఁతిపెట్టించెనను కథ కేవలముకల్పితమైయున్నది. తాతంభట్టు, ముద్దరాజు రామన, అప్ప కవియుఁ బోతనవంశస్థులగు కవులును దీనిని దమగ్రంథములలోఁ జెప్ప లేదు. కూచిమంచి తిమ్మకవి కాలమువఱకు నట్టిప్రవాదమే లేదు. తిమ్మకవి పోతనయందలి భక్తిచే నాతనిగ్రంథము సలక్షణమని నిర్ధారణ చేయుటకుఁ గల్పించినదే కాని వేఱుకాదు. ఈపట్టునఁ దిమ్మకవి యభిప్రాయములును విమర్శనీయములు.

2. భాగవత గ్రంథరచనాక్రమమును గవితారీతిని బరిశీలించినను, ప్రాచీన తాళపత్రగ్రంథములు పరిశోధించినను నీవిషయము నిశ్చితమగుచున్నది.

3. భాగవత రచనయందుఁ బాల్గొన్న కవులు గంగన,సింగన,నారయలును బమ్మెరపోతనయు సమకాలికులు. కడపటి రెండుస్కంధములు రచియించిన నారయ భాగవతము ప్రస్తుతము మనకు నగపడురీతినిఁ గూర్చెనని యూహింపఁ దగియున్నది.

4. ప్రథమ ముద్రణ భాగవతము తరువాతికిఁ గొంతయాధారమైనది. గ్రంథపరిష్కరణము క్రమముగ లేకపోవుటచే లోకప్రవాదముల నాధారముచేసికొని పండితులు గ్రంథపరిష్కరణమునకు నారంభించి గ్రంథముద్రిణము సాగించిరి. దీనివలన పోతనభాగవత స్వరూపము కొంతమాఱుగు పడినది.

5. పోతన విరచితమగు భాగవతభాగము-8 స్కంధములు, ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, సప్తమ, అష్టమ, నవమ, దశమములు, గంగన

విరచితము పంచమము, సింగన విరచితము షష్ఠస్కంధము, ఏకాదశద్వా దశములు వెలిగందల నారయకవి విరచితములు. పోతనభాగవత భాగము సంశోధితమై, సంగ్రథితమై, సప్రమాణమగు పాఠములతోఁ బరిష్కరింపఁబడి ప్రకటింపఁబడినచోఁ బోతనదివ్యమూర్తి మనకుఁ బ్రత్యక్షము కాఁగలదని విన్నపము.

---

## బొంకేది?

ఉభయభాషాప్రవీణ-మల్లాది సత్యనారాయణశాస్త్రి.

---

సాహిత్యవిశారద బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు శ్రీయాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికయందు "అభిజ్ఞానశాకుంతలము ప్రథమాఙ్కమున నాకుఁగలిగిన సంశయములని" కొన్నివిషయములను వెల్లడిం చుచు వీనికి సమాధానము విన నభిలషించుచున్నాఁడనని తమయుద్దేశ్య మును వెలిపుచ్చిరి. కవిసార్వభౌముఁడు తననాటకనాయకుఁడగు దుష్యం తునిచే రాజభావము మఱుఁగుపఱుప యత్నించెను. కాని మఱుఁగుపఱు పలేదు. ఆపనియేల చేసెనో యని శాస్త్రిగారి సంశయము.

శాస్త్రిగారి యుపన్యాసములను జూడ నాకీయభిప్రాయము పొడకట్టుచున్నది. నిజముగ వారి కిందు సంశయము పుట్టి నివర్తింపశక్య ము కానంతటిదై యుండునా యనియు, నట్టిది యొక సంశయమును ప్రశ్న కల్పించి మాబోఁటి విద్యార్థులవాఙ్ముఖమున కొకయవకాశము చూపి, మావలన నాసమాధానమును రాఁబట్టుకొని మాకొక గొప్ప స్థాన మిప్పింపఁదలఁచుటయే కాని వేఱు కాదనియును; ఏలయనిన శాస్త్రిగారు చిరకాలము సాహిత్యసంస్థయందుండి, యనేకమహావిద్వాంసులతో సహ వాసముసలిపి, ప్రస్తుతము విశ్రాంతిఁదీసికొనుచు మనదేశముననేగాక పాశ్చాత్యదేశములందును నాటకరాజమని యెన్నఁబడు నభిజ్ఞానశాకుంతల

మును గుఱించి చిన్నదిగాని, పెద్దదిగాని సంశయము కలిగియుండుట యసంభవమని కాని, వారియుద్దేశ్యముమాత్ర ముదారము నభిరామమునై యున్నదనుటలో సందేహము లేదు. లోకములోఁ దలిదండ్రులుగాని యుపాధ్యాయుఁడుగాని పిల్లవాని కేదోయొక మాట ప్రస్తావము మీఁద సమాధానము చెప్పుటయం దభిలాషఁ గల్పించువిధము నాకీపట్టున గోచరించుచున్నది. ఇట్టివానికి సమాధానము వ్రాయఁ బూనుటవలనఁ గాళిదాసుగారి "మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్" అను శ్లోకతాత్పర్యము నను గుఱియగుదునేమోయని సందేహించుచు నదియుఁ గొంత మేలే యను సాహసముతో నీపనికిఁ బూనుకొనుచుంటిని.

పై ప్రశ్నమువిషయమై కాళిదాసుగారి కుమారసంభవము పంచమసర్గములోని "అథాజినాషాఢధరః ప్రగల్భవా గ్జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా వివేశ కశ్చి జ్జటిల స్తపోవనం శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా"యనునది మొదలు చివరవఱకు నుండు శ్లోకములును జ్ఞప్తియం దుంచుకొనఁదగినవి. అవియు హైమవతి చేయు కఠోరతపములకు సంతసించి యడిగిన వరమీయఁ బ్రసన్నుఁడు గాఁ దలంచిన పరమశివుఁడు కైతవముతో బ్రహ్మచారియై వచ్చి యాడిన మాటలుగఁ గవిశిఖామణి సంఘటించెనుగాన శాస్త్రిగారికిఁ బ్రశ్నింపఁదగినవియై యుండును-దానికి సమాధానముగ "అసోఢా తత్కాలోల్లసదసహభావస్య తపసః కథానాం విస్రంభే ష్వథ చ రసిక శ్శైలదుహితుః. ప్రమోదం వో దిశ్యా త్కపటవటువేషాపనయనే త్వరాశైథిల్యాభ్యాం యుగప దభియుక్త స్స్మరహరః"అను శ్లోకతాత్పర్యము స్మరింపవచ్చును. కానఁ బరమేశ్వరుఁడు పార్వతినివలె దుష్యంతుఁడు శకుంతలను గొంచెము ఛలించె ననిన దోషమేమి ? అట్టి పరమశివుఁడు ప్రకృతనాటకకథానాయకునితో నుపమింపఁదగును.

అయినను "కన్యా వరయతే రూపం, మాతా విత్తం, పితా శ్రుతమ్, బాంధవాః కుల మిచ్ఛంతి, మృష్టాన్న మితరే జనాః" అనునట్లు సాధారణముగఁ గన్యలకు నితరైశ్వర్యములకంటె వరునిసౌందర్యమే హృదయాకర్షక మని తెలియుచున్నది. ఈమహాకవి తనకుమారసంభవము పంచమసర్గములోఁ బార్వతితో మాయావటు వన్నట్లు "వపుర్విరూపాక్ష మలక్ష్యజన్మతా దిగంబరత్వేన నివేదితం వసు— వరేషు య ద్బాలమృగాక్షి మృగ్యతే తదస్తి కిం వ్యస్త మపి త్రిలోచనే"యని పరమేశ్వరుని వరణీయతానర్హునిగఁ జేయ నీయభిప్రాయమునుగూడ వివరించియున్నాఁడు. కనుకఁ గన్యామానసాకర్షణమునకు మిగిలిన యైశ్వర్యాదులకంటె వరునిరూపమే యెక్కుడని తెలియుచున్నది. మాతాపితృబాంధవాదులు కోరు వరునియైశ్వర్యాదులకంటె ఫలభోక్త్రియగు కన్యకగోరు వరునిరూపవయస్సౌశీల్యాదులు ప్రధానములు-కనుకనే ప్రకృత నాటకములో దుష్యంతుని కణ్వాశ్రమద్వారప్రవేశమునకంటె ముందుగనే మహాకవి "రాజా—(స్తోక మన్తరం గత్వా)తపోవనవాసినా ముపరోధో మాభూత్-ఏతావత్యేవ రథం స్థాపయ. యావ దవతరామి॥ సూతః। ధృతాః ప్రగ్రహాః. అవతర త్వాయుష్మాన్. । రాజా, (అవతీర్య) సూత! వినీతవేషేణ ప్రవేష్టవ్యాని తపోవనాని నామ. ఇదం తావ ద్గృహ్యతామ్. (సూతస్య ఆభరణాని ధను శ్చోపనీయ.) సూత యావ దాశ్రమవాసినః ప్రత్యవేక్ష్య అహముపావర్తే తావ దార్ద్రపృష్ఠాః క్రియన్తాం వాజినః"అను నీవాక్యములచేత రాజును వినీతవేషస్వీకారమిషచేత జన్మభాగ్యసౌందర్యాదులను గనఁబఱచి శకుంతలచే వలపింప నెంచినట్లు వ్యక్తమగుచున్నది. మఱియుఁ బాత్రౌచితికి నచటి యెఱిఁగినవారి యెదలోఁ దనవినయసంపదను నెఱుఁగనివారి యెదలోఁ దన స్వభావ మధురాకృతి దర్శనము వలననే యెవరా యాతఁడను నాశ్చర్యచకితభావమును నెఱుకపఱుపను, బాడుకొలుపను, దుష్యంతునిచే నాడంబరరహితవేషస్వీకారము కవిమహాశయునిచేఁ

జేయింపఁబడెనని యెన్నఁదగును. కనుకనే "ప్రియంవదా (జనాంతికమ్) అనసూయే కోను ఖలు ఏష మధురగంభీరాకృతిః చతురం ప్రియ మాలపన్ ప్రభావవానివ లక్ష్యతే.''యని మహాకవి స్వభావముగ్ధలగు తాపసకన్యలచే భ్రూవిలాసానభిజ్ఞప్రీతిస్నిగ్ధనయనములచే దుష్యంతరూపము గ్రోలఁబడినదని చెప్పియున్నాఁడు. ప్రథమముననే తాపసకన్యలకు నితఁడు దుష్యంతుఁడని స్ఫురింపలేదు. అట్లుకానిచో "కోను ఖల్వేష"యను ప్రశ్నమే యసంగత మగునుగదా. ఇఁక నుత్తరమునందలి ప్రకాశము లోని "ఆర్యస్య మధురాలాపజనితో విస్రంభో మాం మన్త్రయతే-కతమః ఆర్యేణ రాజర్షివంశః అలంక్రియతే. కతమో వా విరహపర్యుత్సుకజనః కృతో దేశః-కిం నిమిత్తం వా సుకుమారతరోఽపి తపోవనపరిశ్రమస్య ఆత్మా పద ముపనీతః''అను ప్రశ్నవాక్యములవలన దుష్యంతు నిరాజభావము గుర్తింపఁబడలేదా యను శాస్త్రిగారి పునఃప్రశ్నము నకు నంతవఱకు విశిష్టజ్ఞానము కలుగలేదుగాన జిజ్ఞాసార్థముగా నన్న వాక్యములోని 'కతమ'శబ్దముయొక్క యర్థవిశేషమువలన నిది జిజ్ఞాసాపూర్వకప్రశ్నముగాని నిర్ణయపూర్వకప్రశ్నముగాదని సమాధానము చెప్పనగును.

మఱియు నాకారసంపన్నుఁడు చతురప్రియాలాపియగు నతిథి, గృహమేధికడ కేతేర నాతిథేయుఁడగు నెవఁడుగాని స్వాగతాదిపూజానంతరము చేయుప్రశ్నమున నెట్టిప్రతిపత్తి చూప నర్హము ? సామాన్య పరిప్రశ్నము సమంజసమా ? కనుక వారుత్తమప్రశ్నము చేసిరనియు నా కాలములో రాజభావము గుర్తించి యట్లడుగలేదనియు నూహించిన బాగుగ నుండును. మఱియు "సన్న్యస్తచిహ్నా మపి రాజ్యలక్ష్మీం తేజోవిశేషానుమితాం దధానః" యను రఘువంశశ్లోకములోని గోపరిపాలనాసక్తదిలీపమహారాజవర్ణనమునుబట్టి దుష్యన్తమహారాజునుగూడ ననిర్ధారణగా నొకపుణ్యలక్షణలక్షితుఁడని యామునుగుద లూహించిరని మన మూహింపవచ్చును. కాని యంతమాత్రమున"ఉభే—సస్మితమ్. కా వయం

పరిత్రాతుమ్. దుష్యన్త మాక్రంద. రాజరక్షితాని తపోవనాని నామ।
రాజా (అవసరో ఽ యమాత్మానం ప్రకాశయితుమ్) న భేతవ్యమ్.
(అర్ధోక్తే స్వగతమ్.) రాజభావ స్త్వభిజ్ఞాతో భవేత్. భవతు. ఏవం తావ
దభిధాస్యే." అను నీగ్రంథమునకును, "రాజా (ఆత్మగతమ్) కథ మిదానీ
మాత్మానం నివేదయామి. కథం వా ఆత్మాపహారం కరోమి. భవతు. ఏవం
తావ దేనాం వక్ష్యే. (ప్రకాశమ్) భవతి యః పౌరవేణ రాజ్ఞా ధర్మాధి
కారే నియుక్త స్సోఽహ మవిఘ్నక్రియోపలంభాయ ధర్మారణ్య మిద
మాయాతః" అను నీగ్రంథమునకును, నిర్ధారణగా దుష్యంతపరత్వము
చెప్ప శక్యముగాదుకదా. పైగా "దుష్యంత మాక్రంద" యను వాక్య
మునుబట్టికూడఁ బిదపవచ్చిన యతఁడు దుష్యంతుఁడని నిర్ధరింప నైతి
గాడు. అట్లైయైనచో మూఁడవయంకములో "సఖ్యౌ, విలోక్య ఉత్థాయ,
స్వాగత మవిలంబినో మనోరథస్య" యని పరిచితునన్నట్లు ప్రథమదర్శన
మందును బలుకకపోవుటకుఁ గారణ మేమి? కనుకఁ బై వాక్యములకు
దుష్యంతరూపార్థము వారు నిర్ణయించుకొనలేదనియే మన మూహింప
వలెను. ప్రథమదర్శనమం దెట్లని రనఁగా ("సర్వా రాజానం దృష్ట్వా
కించిదివ సంభ్రాంతాః) అనసూయా ఆర్య! నఖలుకిమపిఅత్యాహితమ్
ఇయ మావయోః ప్రియసఖీ మధుకరే ణాభిభూయమానా కాతరీ
భూతా (శకుంతలాం దర్శయతి) అని. ఇందు నపరిచితునితో
నన్నట్లును మునికన్యలు స్వభావోత్తానాశయ లన్నట్లును విశద
మగుచున్నది గదా! కనుక నిట్లు నిర్ధారణతోను, అనిర్ధారణతోను బలి
కిన వాక్యములకుఁ దాత్పర్యభేదమూహింపనగును. మఱియు దుష్యం
తుఁడు వైఖానసులవలనఁ గణ్వమహర్షి యాశ్రమమున లేఁడని వినియు
న్నవాఁడు గాన నాశ్రమములోఁ జేయఁదగిన పని యేమియు లేకపోయి
నను రాజధర్మమును సార్థకపఱుపఁగోరి యందుఁ బ్రవేశించెను, గాన
నందలి యెవరితోడనో యొకరితో మాటలాడి పోఁదలఁపుచేఁ బ్రవేశిం
చుచునే "అయే దక్షిణేన వృక్షవాటికా మాలాప ఇవ శ్రూయతే" యని

మాటలాడువారు వచ్చువఱకు నెదురుచూచెనేకాని యందగత్తెలగు మునికన్యలను బొంచి చూడఁదలంపుచే నట దాఁగియుండలేదు. "భవతు" పాదపాంతర్హితఏవ ఏనాం విస్రబ్ధం పశ్యామి." అను ముందు వాక్యము పొంచిచూడ నుద్దేశింపఁబడినదిగాదు. పొంచిచూచుట యనునది చతుర్థాంకములోఁ జెప్పఁబడినట్లున్నయెడల నగును గాని యిది యట్టిది గాదు. చతుర్థాంకములో నట్టిపని యనేకములగు భావములు పరస్పరాయత్తములైనట్లు స్పష్టపడినదిగాన నందుఁ గాముకలక్షణము సరియగు త్రోవను బోయినది. కనుక నచటఁ బొంచిచూచె ననినను దోషములేదు. కార్యనిమగ్నులగుటచే వారును రాజును జూడలేదు. రాజు పొంచి చూడఁదలఁచినట్లు చెప్పఁబడినయెడల లాలసత్వరూపదోషము ధీరోదాత్తనాయకునియందుఁ గట్టఁబెట్టినట్లగును. అది పంచమాఙ్కములోని పరవనితయనుకొని శకుంతలను జూడని రాజగు దుష్యంతునియందు మిగుల నింద్యమగు నారోపణము అట్లయినచో దుష్యంతుఁడు తనరాజభావము తెలిసిపోవునని సంశయించుటయుఁ దా నెవరైనది చెప్పుటలో సంకోచము పొందుటయు నెందులకనఁగా రాజభావ, వంశోన్నతి, వాస్తవ్యదేశాదులు, సాధారణముగ స్త్రీమానసాకర్షణమునకు నుపకరించునవిగాన వాని మూలమున నీశకుంతలయు దుష్యంతునియందు మనసు నుంచినదనుటలోనైన యతిశయము కావ్యమందు లేదని యాతనిశరీరసౌష్ఠవ, కాంతివిశేష, సౌశీల్యాది కన్యావరణీయాంశములవలననే యామెచిత్తమున్మాదింపఁ జేయవలెనను భావము మనసునం దుంచుకొని మహాకవి రాజుచే రెండుస్థలములయందు నుభయార్థవాచకములుగల వాక్యములను బదులుగాఁ జెప్పించినాఁడు. ఆయర్థములలో దుష్యంతయాపార్థము కొంచెము గూఢముగ వ్యక్తమగుచున్నది గాన నందుబొంకేమియు లేదు పాత్రౌచిత్యమునందును ధీరోదాత్తనాయకావికత్థనత్వలక్షణము సరిపడినదని యందు బొంకు శంక లేమియు లేవు.

మఱియు నరుహుగ నైశ్వర్యాదులను తృణీకరించు రూపైకపక్ష పాతిను లుందురను భావముతో మహాకవి "రాజభావ స్త్వభిజ్ఞాత్తో భవేత్" అనుచోట "రాజభావ స్తు" అని తు శబ్దమును బ్రయోగించి రాజత్వము కన్యామానసాకర్షణమున నకించిత్కరమని సూచనచేయుచు న్నాఁడని యెన్నఁదగును. ఈసందర్భమునఁ గాదంబరిలో మహాశ్వేత పుండరీకుని, మృచ్ఛకటికములో వసంతసేన చారుదత్తుని, గోరుట యుదాహరణములు.

మఱియు మహారాజులు తమచరిత్రము నెంతతక్కువగ వచించి నను నది యాత్మశ్లాఘగాఁ బరిణమింపకపోదని మహాకవి దుష్యంతునిచేఁ దననెట్లు తెలుపుకొందుమనియు నడిగినప్పుడు చెప్పకపోయినయెడల నా జ్ఞాపహారకత్వదోషము సంభవించుచున్నదనియు ననిపించి యాతనిధర్మజ్ఞ తను బాత్రౌచితిని వెలిపుచ్చినాఁడు. ఇఁక సఖులు శకుంతలతో దుష్యం తునినే యేల పిలువుమని చెప్పిరనిన "కాశ్యపః । శ్రూయతామ్. శ్లో॥ భూత్వా చిరాయ చతురంతమహీసపత్నీ దౌష్యంతి మప్రతిరథం తనయం నివేశ్య— భర్త్రా తదర్పితకుటుంబభరేణ సార్ధం శాంతే కరిష్యసి పదం పున రాశ్రమేఽస్మిన్" అనుదాని తాత్పర్యమును బట్టి యాకాల మున సమస్తభూమండలమునకు దుష్యంతుఁడే రాజు కాన నాతఁడే తపో వనరక్షితయు నగునని యాతనినే పిలువుమని చెప్పి రనవచ్చును గాని యాతఁడే వచ్చెననిమాత్రము వారికి నిర్ణయము లేదని యనుకొనవలెను.

మఱియు నీశ్లోకతాత్పర్యమువలన నుత్తమపృథ్వీపతులు ముది మిని పుత్రసంక్రాంతరాజ్యలక్ష్మీకులై శాంతారణ్యభూముల సపుంగిపుపు రను సామాన్యభావము తోఁచుచున్నది. గాన "కింనిమిత్తం వా సుకుమా రతరోఽపి తపోవనపరిశ్రమస్య ఆత్మా పద ముపనీతః" అను ననసూయా ప్రశ్నవాక్యము సార్థకమగుచున్నది. కనుక దుష్యంతాగమనము తాపస కన్యలచే నిర్ధరింపఁబడలేదని మనము నిశ్చయింపవగును.

మఱియు దుష్యంతుఁడు కణ్వాశ్రమద్వారమును బ్రవేశించిన తోడనే దక్షిణబాహు వదరుటయు, దానికి శాంతతపోవనభూముల నేమి తగినఫలము లభించునని యాతఁడనుకొనినట్లును, జెప్పఁబడినది గాన నా కాలములో నాతనికి ముందు జరుగనున్న లోకోత్తరసౌందర్యరాశి కాంతారత్నలాభముసంగతి లేశమును దెలియదు గదా. ముందుగనే వైఖానసులు రాజునకుఁ గానుపించి యాశ్రమములోఁ గణ్వమహర్షి లేఁ, డయిన నతిథిసత్కారమునకుఁగాను గూఁతు శకుంతలను నియోగించెఁ గాన నాశ్రమముఁ జొచ్చి సత్కారములనంది నీప్రతాపమువలనఁ గలిగిన నిర్విఘ్నమగు తపఃక్రియాసిద్ధులను గనులారఁ గాంచి యానందించి వెళ్లుమని చెప్పియుండిరిగాన ఋషియెడఁ దనను భక్తిసంపన్నునిగఁ దెలుప నామెనే చూచి వత్తునని రాజు వైఖానసులను పోద్రోనియెనని చెప్పఁబడి నది గాన నాతఁడాశ్రమమునందుఁ గొన్ని నిమేషములు మాత్ర ముందు నని యనుకొనెనుగాని జరుగనున్న విషయము నేమియు నెఱుఁగఁడని నిర్ణయింపవలయునుగదా. కనుకనే యాయన కొఱవడిన సంపత్తికిఁ గార ణమువిషయమై "శాంత మిద మాశ్రమపదం స్ఫురతి చ బాహుః కుతః ఫల మిహ స్యాత్" అని ప్రశ్నించుకొని దైన నేమోయని యుత్తరార్థ మును సమాధానముగ సరిపెట్టుకొనినాఁడు. ఇట్లుండుటచేత, నదివఱకే తెలిసి ప్రయత్నవంతుఁడై పొంచియుండు నీచనాయకునివలె వడి దుష్యం తుఁడు నడచుకొనలేదుగదా. అట్లయినచో నేల దుష్యంతుఁడు తనయునికి వారికిఁ దెలియనట్లు నటించెనని, యనఁగా నాటకీయవస్తువు నొకక్రమము లో నడుపవలెనుగాన రంగమంచమునందు మొదటనే రాజును బ్రవేశ పఱిచి పిదప నాయికను సఖులను బ్రవేశపఱచుచు వారిసమావేశము క్రమప్రాప్తమగునట్లుకవి, రాజుచే నాయికాగమనము ప్రతీక్షింపఁబడెనని స్వభావసిద్ధసమావేశముగ జతపఱచినాఁడు. కనుక దుష్యంతుఁడు తన రాజభావము వెల్లడికావచ్చునని కాని కాఁగూడదని కాని యభిప్రాయ ము పొందియుండలేదు. వైఖానసాదిఋషులు తమంతఁ దాము దుష్యం

తుఁడీతఁడని గుర్తుపట్టి యందులకుఁ గావలసిన ప్రశ్నము లడిగినప్పుడు సరియగు బదులు చెప్పనేకాని యనసూయ యడిగిన ట్లడిగియున్నచో ధీరోదాత్తలక్షణావికత్థనత్వములకు భంగకరముగ నే నీభూమండలాధిపతి యగు దుష్యంతుఁడనని సత్యమైనను, అతనివృత్తాంత మతనినోటనే యెట్లు వెల్లడియొనరించును మహాకవి. ?

ఈవిషయమున "యజ్ఞోఽనృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్ - ఆయు ర్విప్రాపవాదేన దానం చ పరికీర్తనాత్." అనియు. "యోఽన్యథా సంత మాత్మాన మన్యథా సత్సు భాషతే. స పాపకృత్తమో లోకే తేన హ్యాత్మాపహారకః" అనియు మనుస్మృతి యసత్యమాడుటను, మఱియొక తీరునఁ జెప్పుటను, నిషేధించుచున్నది. కనుకనే యుభయార్థముల నిచ్చు కొన్ని పదములు గల "రాజా। (సత్వర ముపసృత్య) శ్లో॥ కః పౌరవే వసుమతీం శాసతి శాసితరి దుర్వినీతానామ్. అయ మాచరత్యవినయం ముగ్ధాసు తపస్వికన్యాసు" అనియు "భవతి యః పౌరవేణ రాజ్ఞా ధర్మాధికారే నియుక్త స్సోఽహం మవిఘ్నక్రియోపలంభాయ ధర్మారణ్య మిద మాయాతః" అనియు వాక్యములను మహాకవి రాజుచే ననిపించినాఁడు. మఱియు "శ్లో॥ ఆత్మనామ గురో ర్నామ నామాతికృపణస్య చ-శ్రేయస్కామో న గృహ్ణీయా జ్జ్యేష్ఠాపత్యకళత్రయోః" అని మనుస్మృతి యాత్మనామానువాచనమును నిషేధించుచున్నది, గాన దుష్యంతునిచే దుష్యంతత్వము మహాకవి వెల్లడిచేయింపలేదు. (ఇప్పటికి నీయాచారము మనదేశమున నాచరింపఁబడుచున్నది. రామయ్య యందురని, కృష్ణయ్య యందురని పండితులు గూడఁ బ్రజల వాడుకను బిరుదాక్షరశూన్యముగవచింతురు) అట్లుండఁగా దుష్యంతుఁడు పండితుఁడుగాను సంప్రదాయము నెఱిఁగినవాఁడుగాను జిత్రింపఁదగినవాఁడుగాన నెట్లుగా నాత్మనివేదనము చేసికొనినట్లు కవి యాతని నిర్మించును ? మఱియు నిందు నిజముగ నామప్రశ్నము వారు చేసియుండలేదు. వంశ, దేశ, సమాగమనకారణములుమాత్రము ప్రశ్నింపఁబడినవి. అయినను వానియుల్లేఖనము

వలన నామోల్లేఖనమును జరిపినట్లే యగునని చెప్పుటయుఁ జెప్పకుండు టయుఁ గానట్లు పై రెండువాక్యములను దుష్యంతునిచేఁ గవి పలికించి నాఁడు. ఇందు బొంకేది ?

మఱియు నీకవి యాతాపసకన్యలలో నొకయామెను దుష్యంతు నిచే వలపింపఁదలఁచెనుగాన నాకన్యలు దుష్యంతునియైశ్వర్యాదు లనువిని ప్రియమంద రాదనియు నాతనిరూపవయస్సౌశీల్యాదులను గని ప్రియంపడవలెననియుఁ దలఁచి యట్లాతనిని శుద్ధవేషునిగఁ జేసి వలిపంపు తెరమాటున నుండు నర్తకు నట్లుగ నుభయార్థ కపదములమాటున నమఱించినాఁడు. శకుంతల రూపమోహితకావలెను గాని యైశ్వర్యమోహితకాఁగూడదని కవి మూలాతిశాయివస్తువును బొం దుపఱచినాఁడు. రాజస్త్రీయగు శకుంతల కణ్వాశ్రమస్థితికారణమున రాజార్హవివాహములలో గాంధర్వమునకుఁగాక మిఁగిలినవానికినర్హురాలు కాదని రూపమాత్రమోహితగఁ గవిచే నంగీకరింపఁబడినది. కనుకనే మహాకవి "ప్రియంవదా తావ దేనాం లజ్జావనతముఖీం పరిష్వజ్య స్వయం తాతకాశ్యపేన ఏవ మభినందితమ్. దిష్ట్యా ధూమాకులదృష్టే రపి యజమానస్య పావకేఏవ ఆహుతిః పతితా. వత్సే సుశిష్యపరిదత్తేవ విద్యా అశోచనీయాసి సంవృత్తా. అద్యైవ ఋషిప్రతిరక్షితాం త్వాం భర్తు స్సకాశం విసర్జయామి ఇతి" యని చతుర్థాంకములో ధ్వనిమర్యా దతో రూపమోహితయైనను శకుంతల యదృష్టమునఁ జేసి యాభిజా త్యాదిసర్వలక్షణలక్షితుఁడగుదుష్యంతునినేవరించెనని వివరించియున్నాఁడు

మఱియుఁ దృతీయాంకమున "ప్రియంవదా। (ప్రకాశమ్) సఖి దిష్ట్యా అనురూప స్తే అభినివేశః। సాగరం వర్జయిత్వా కుత్ర వా మహా నదీ అవతరతి. క ఇదానీం సహకార మన్తరేణ అతిముక్తలతాం పల్లవి తాం సహతే." అని సఖ్యనుసరణము శకుంతలను రూపమోహితగ నిర్ణయించుచున్నది. మఱియు "శకుంతలా। (ఆత్మగతమ్) కిం ను ఖలు ఇమం ప్రేక్ష్య తపోవనవిరోధినో వికారస్య గమనీయా ఽస్మిసంవృత్తా"

యని ప్రథమదర్శనద్వితీయక్షణముననే శకుంతలను కేవలరూపదర్శన మోహితగ నిర్మించుటవలనఁ బృథివీపతిత్వాదిధర్మములు వరణీయతయం దవ్యభిచరితకారణములు గావని స్పష్టపడుచున్నదిగదా. కనుకనే "త్వ య్యస్యాః కథ మప్యబాంధవకృతాం స్నేహప్రవృత్తిం చ తా" మ్మని సౌందర్యరాశి శకుంతల తనంతఁ దావలచుటయే రసికుఁడవగు నీయొక్క జన్మసాఫల్యమునకు హేతువని, వెంటనే యాదరింపఁదగినది శకుంతల యను భావము కవి వ్యక్తపఱచి యున్నాఁడు. మఱియు నైదవయంక ములో "శార్ఙ్గరవః। ఇత్థ మాత్మకృత మప్రతిహతం చాపలం దహతి. శ్లో॥ అతః పరీక్ష్య కర్తవ్యం విశేషా త్సంగతం రహః అజ్ఞాతహృదయే ష్వేవం వైరీభవతి సౌహృదమ్।" అని ప్రకృతశకుంతలావిషయముననే కాక రూపమోహితలైన స్త్రీలు గాంధర్వవిధిచేఁ బరిణీతలై సాధారణ ముగ నిట్లే వంచింపఁబడుదురని యట్లా యకార్యము చేయఁజనదని కవి తనకాలములో నందందు విరళముగాఁ బ్రచారమందున్న గాంధర్వవివా హము నిజముగ క్షత్రియకన్యలకు నుత్తమవివాహమని శాస్త్రమునందుఁ జెప్పఁబడినను బ్రకృతమున దృష్టదోషముగానఁ గూడనికార్యమును నిషే ధించు నీతి నుపదేశించుచున్నాఁడని నాభావము. అట్లుండఁగా నాతాప సకన్యలచే నాతని రాజభావము మొదటనే గుర్తింపఁబడినదను విషయ మునెట్లును నిర్ధరింపశక్యముగాదు గాన, నిందెందును బొంకవలసిన పని లేదు.

శ్లో. యది సంతి గుణాః పుంసాం వికసంత్యేవ తే స్వయమ్.

అనున ట్లుల్బణవేషకారణాభరణబాహుళ్యము లేకున్నను స్వభావమధు రమగు నాతనిరూపమే యతఁడు రాజపరిగృహీతుఁడని యనుమానింపఁ జేయుట, యందఱ కంగీకారవిషయముగానఁ గ్రమముగ వారు రాజభా వము గుర్తించి రనుటలోఁ బ్రత్యవాయ మేమియు రానేరదు. ఇఁక శకుం తలను ఋణవిముక్తను జేయుసందర్భమున నంగుళీయకముమీఁది దుష్యం తమహారాజా యనునామాక్షరములను జూచిన సఖులు పరస్పరముఖ

ములఁ జూచుకొనుటను గని, దుష్యంతుఁడు వేఱుగఁ దలఁపవలదు "అయం రాజపరిగ్రహః" యని యావాక్యార్థమును తనపరముగ నంగుళీయకపరముగ నుపయోగించుటలోఁ గొంచెము ఛలము గనఁబఱచెననిన ననవచ్చును. అయిన నప్పటికిఁ జాలసేపటినుండి నాయికానాయకులభావములను బరస్పరాయత్తములుగఁ జేసి యొక్కొక్కరియందు సాత్త్వికభావములు తలయెత్తఁగా సఖులచేఁగూడ లక్షింపఁబడినట్లు కవి యుపపాదించియున్న కారణమున దుష్యంతుఁడు తనరాజభావమును నుభయార్థపదప్రయోగములచేత ఛలింప యత్నించెననినను, సఖులచే నాభావము గుర్తింపఁబడినదనినను, అందు దోషములేదు. మహాకవి దుష్యంతుని శకుంతలచేఁ గేవలరూపము నాశ్రయించియే వలపించి పిదప నతని యైశ్వర్యసామర్థ్యాదిబాహ్యసంపత్తులు సహకారములుగ నాశ్రయించినఁ బ్రాధాన్యము వానికి రాదని నిశ్చయించుకొనినట్లు మొదటఁ గొంచెము గూఢముగను బిదపఁ గొంచెము వ్యక్తముగను రాజభావము నమర్చుటలో స్పష్టమగుచున్నది. కనుక నా ఛలము నొకపాటిగఁ జేయఁదగదు. ఆశ్రమవాసులందఱచే దుష్యంతునిరాక యెఱుఁగఁబడిన దనువిషయము ప్రస్తుతకార్యమునం దకించిత్కరముగాన దానివిమర్శనము వదలివేయఁబడినది.

మఱియు శకుంతలనుగూడఁ గేవలరూపలావణ్యసౌష్ఠవదర్శనముననే దుష్యంతునిచే వలపింపఁదలఁచి మహాకవి దేవలోకమునఁగూడ దుర్లభములగు నాభరణాంబరాదులను దలఁచినంతనే సన్నిధికిఁ గొనితేఁగల తపఃప్రభావసంపన్నుఁడగు కణ్వమహర్షి, తనయనుఁగునందనకు వార్ధకశోభివల్కలపరిధానమునే కట్టనిచ్చినాఁడని చెప్పియున్నందున నాయికానాయకుల స్వతస్సిద్ధవయోరూపసౌశీల్యాదులే యనురాగహేతువులనియుఁ, గనుకనే శీఘ్రసంగమహేతుగాంధర్వవివాహవిధి యావధూవరులచే నామోదింపఁబడినదనియుఁ, దెలియుచున్నది. మఱియు నావివాహవిధిని బెండ్లియాడఁబడిన శకుంతల యంతటియుత్తమాంగనను బెండ్లియాడిన దుష్యంతునంతటి పరమధార్మికుఁడు తిప్పలుపెట్టెనను విషయము

స్పష్టముగాఁ గలదుగానఁ గవి తనకాలములోఁ బ్రచారమందున్న రహస్యవివాహములు తమశ్రేయస్సును గోరు నుత్తమజాతికన్యలచే సర్వథా నిరాకరింపఁబడవలెనను నీతి యుపదేశింపనెంచినట్లు గోచరించుచున్నది. కనుకనే. "శకుంతలా! (అపవార్య) ఇద మవస్థాంతరం గతే తాదృశే ఽనురాగే కిం వా స్మారితేన. ఆత్మా ఇదానీం మే శోచనీయ ఇతి వ్యవసిత మేతత్." అని తనచేత రాగాంధదృష్టిచే రూపైకపక్షపాతిత్వ మవలంబించి మోసమందఁబడినదని యామెచేతనే చెప్పఁబడుచున్నది. ఇట్టి నీతి నుపదేశింప నెంచిన మహాకవి మాత్రాదిగురుజనాంగీకృతికిఁ గారణమైన యైశ్వర్యము మున్నగునవి తనకుఁ గలవని దుష్యంతునిచేఁ జెప్పించి మఱియొక వివాహవిధి ననుసరించి శకుంతలాపాణిగ్రహణము చేయఁబడినట్లు చెప్పియున్నయెడల నాశకుంతలకు నిట్టి యాపదలే లేకపోయెడివని నాటకనిర్మాణప్రధానప్రయోజనములలో నొకటియగు పై నీత్యుపదేశమును జేయలేకయే పోవును. గాంధర్వవివాహవిధిచొప్పున శకుంతలావివాహము చేయఁబడినదని కవిసార్వభౌముఁడు చెప్పఁదలఁచిననే దుష్యంతరూపాదులు శకుంతలానురాగప్రవర్తకములని నిర్బంధముగఁ జెప్పశక్యములు. కనుకఁ బరస్పరరూపసౌష్ఠవాదులును రాగకారణములైనప్పుడు మిగిలిన యైశ్వర్యాదులు పిదపఁ జెప్పఁదగినవి గాన వానితో మొదటఁ బనిలేదు. అట్లయినప్పుడు దుష్యంతునిచే బొంకించుటలో వచ్చిన నాటకప్రయోజనమేమియు లేదు. నాటకనాయకునియం దసత్యవాదిత్వము నెఱపినచో ధీరోదాత్తలక్షణము భంగించినట్లు గాఁ గలదుగాన "కాళిదాసాదీనామివ యశః" అను వృద్ధవిమర్శకసమాజమధ్యమందలి కాళిదాసునికీర్తికిఁ గళంక మాపాదించి నట్లగును.

---

# గ్రంథస్వీకారము.

1. కల్పవల్లికా-శ్రీమద్రామాయణవ్యాఖ్యా-బ్రహ్మశ్రీ బొమ్మకంటి నృసింహశాస్త్రిగారిచే రచింపఁబడినది ప్రథమసంపుటము బాలకాండము. వెల 1—4—0.

ఆసేతు హిమాచలము భక్తిశ్రద్ధలతోఁ బఠింపఁబడు శ్రీమద్రామాయణమున కిది యొకనూతనవ్యాఖ్యానము, ఈమహాగ్రంథమున కిదివఱలో ద్వైతవిశిష్టాద్వైతపరముగ నెన్నియో వ్యాఖ్యానములు గలవు. వ్యాఖ్యానచతుష్టయముతో నీగ్రంథమును వావిళ్ల వారు ప్రకటించియున్నారు గ్రంథకర్తలాంధ్రదేశమున సుప్రసిద్ధపండితబృందమని ప్రశస్తిఁగాంచిన 'బొమ్మకంటివట్టమున' తురీయులు, వ్యాకరణ, న్యాయ, వేదాంత మీమాంసాదిశాస్త్రములయందుఁ బాండిత్యము కలవారు. సంస్కృతభాషయం దీ నూతనవ్యాఖ్యానమును రచించి శ్రీరాముని శక్తిస్వరూపునిగ వీ రిందుఁ బ్రతిపాదించియున్నారు. వ్యాఖ్యానవిషయములఁ బామరులకుఁ దెలుపుటకై వీరిపుత్త్రులు దీని నాంధ్రీకరించి మూలముతోఁ బ్రకటించిరి. చతుర్వింశత్యక్షరాత్మకమగు గాయత్రీమంత్రము రామాయణమున ననుసంధింపఁ బడుటచే దేవీపరముగ రచించుటయే వాల్మీకి యభిప్రాయమై యుండునని నిశ్చయించి గ్రంథకర్త లీవ్యాఖ్యానమును రచించిరి. శ్రీమద్రామాయణమున కెందరెన్నివిధముల వ్యాఖ్యానముల రచించినను నది గ్రంథోత్కర్షహేతువే యగును, కేవలము శక్తిపరముగ రామాయణము నన్వయించుటయేగాక వీరుప్రాచీనవ్యాఖ్యానములఁగూడ విమర్శించి కొన్నితావుల నూతనవిషయములఁ దెలిపియున్నారు, ఈకల్పవల్లికా వ్యాఖ్యానమును జదివి విజ్ఞులానందింతురుగాక.

---

2. మౌలానా ఆజాద్-రామఘుర్ కాంగ్రెసు-శ్రీమాన్ కోమాండూరి శఠకోపాచార్యులుగారిచే రచింపఁబడినది. వెల 0-6-0 మాత్రమే.

గ్రంథకర్త లిదివఱలో వెల్సు (H. G. Wells) గారి ప్రపంచ చరిత్రమును జగత్కథయనుపేర ననువదించుటయేగాక నెహ్రూ, గాంధీ సుభాష్‌చంద్రబోసు చరిత్రములను వ్రాసియున్నారు. వీరు రాజకీయవిషయములు, ముఖ్యముగ కాంగ్రెసు సిద్ధాంతములును సుబోధముగఁ బ్రజాసామాన్యమున కందఁజేయు తలంపుతో నిట్టిగ్రంథములఁ బ్రకటించుచున్నారు. వీరికిఁగల దేశభక్తియే యిందులకుఁ దగినప్రోత్సాహము నిచ్చుచున్నది. ఢిల్లీ, రామఘర్ కాంగ్రెసుల కధ్యక్షులైన మౌలానా ఆజాద్‌గారి జీవితచరిత్రము చాలమందికిఁ దెలియదని చెప్పవలసియున్నది. వారు జాతీయభావమునకు, హిందూముస్లిము సఖ్యతకు నెట్లు నిరంతరము పాటుపడుచున్నారో యావిషయము సులభమగు రీతి నీగ్రంథమున వ్రాయఁబడియున్నది. వీరు రామఘర్ కాంగ్రెసులో నిచ్చిన యధ్యక్షోపన్యాసము గ్రంథాంతమునఁగలదు. ఆంగ్లభాషాజ్ఞానము లేని సామాన్యప్రజలకు కాంగ్రెసు ఆశయములఁ దెలియపఱచి, వారియందు జాతీయతను, దేశభక్తిని వృద్ధిపొందించుట కిట్టిగ్రంథములు మిక్కిలి యుపయోగకరముగ నుండును.

3. శబ్దమణిదర్పణము-మదరాసువిశ్వవిద్యాలయమునందలి కన్నడశాఖవారిచేఁ బ్రకటింపఁబడిన మైదవగ్రంథము వెల రు 2-8-0.

ఇది కేశిరాజకృతమగు ప్రాచీనకన్నడ వ్యాకరణము. దీనికి కేశిరాజురచించిన వృత్తితోడను, సంజయ్యరచించిన టీకతోడను బూర్వముద్రణములు గలవు, ఈగ్రంథమున లింగనారాధ్యునిచే రచింపఁబడిన వృత్తి మూలముతోఁ బ్రకటింపఁబడినది. లింగనారాధ్యుఁడు వీరశైవుఁడు. పదునాఱవశతాబ్దమువాఁడు. ఇతనివ్యాఖ్యానమునకు సూత్రాన్వయరత్నమాల యనిపేరు కొన్నితావుల మూలసూత్రముల సక్రమపాఠములు, కన్నడగ్రంథములనుండి యుదాహరణములు దీనియందుఁ గన్పడుచున్నవి. లింగనారాధ్యునికిఁ బూర్వమున వేఱొకవ్యాఖ్యానముండెడిదని యతని వృత్తియందుఁ దెలుపఁబడినది గ్రంథాంతమున పద్యముల యకా

రాద్యనుక్రమణికయు, శాస్త్రీయశబ్దములు, ఉదాహృతములగు పద్య భాగములు వీనియనుక్రమణికలును గలవు. మఱియు శబ్దస్మృతి, భాషా భూషణములనుండి కేశిరాజుసూత్రములకు సంబంధించిన సూత్రభాగ ములుదాహరింపఁబడినవి. ఉదాహృతములగు పదముల విపులమగుపట్టి కయుఁ గలదు.

కేశిరాజు తనగ్రంథమును బూర్వలాక్షణిక గ్రంథములగు కవి రాజమార్గము, శబ్దస్మృతి, భాషాభూషణముల ననుసరించియే రచించెను. కాని డాక్టరు బర్నెలుదొరగారు వ్రాసిన రీతిని స్వతంత్రమగు పోకడలను గనఁబఱచియున్నాఁడు. అంతియేగాక కన్నడభాషయందుఁబ్రచారమునఁ గలవేయి ధాతువులను, 'ఱ' కారయుతములగు 180 పదముల పట్టికయుఁ బ్రాచీనగ్రంథములఁగల కఠినపదములను, వానియర్థములనిచ్చు పట్టి కయుఁ జేర్చియున్నాఁడు, కేవలము పాణినీయమునే గాక నైంద్రవ్యా కరణమునుగూడ నుపయోగించి, తనభాష కీవ్యాకరణము నతఁడు రచిం చెను. ప్రాకృతవ్యాకరణ సూత్రములననుసరించి తద్భవములకు సూత్ర ములు రచించెను. ఈగ్రంథమునఁ బ్రకటనకర్తలచే నూఱుపుటలకు మిం చిన విపులమగు పీఠికగలదు. ఇందుఁ గన్నడవ్యాకరణములను గూర్చియు, గ్రంథమును గూర్చియుఁ బెక్కువిషయములు జర్చింపఁబడినవి. ఈగ్రం థము ప్రాచీనాంధ్ర తమిళభాషాస్వరూప నిర్ణయమున మిక్కిలియుపక రించుననుటకు సందియము లేదు. మదరాసు విశ్వవిద్యాలయము వారీ గ్రంథమును బ్రకటించుటయేగాక స్వల్పమూల్యము నేర్పఱచినందులకు వారికి మనకృతజ్ఞతను దెలుపవలసియున్నది.

**4.** రాధామాధవ సంవాదము:— వెలిదిండ్ల వేంకటపతివిరచితము. విజయనగరమున నాంధ్రవిజ్ఞాన సమితివారిచేఁ బ్రకటింపఁ బడినది వెల రు **1—0—0.**

ప్రాచీనాంధ్రప్రబంధములఁ బ్రకటించి యాంధ్రకవుల ప్రతి భను లోకమున వెల్లడింపఁ జేయుటయే యాంధ్రవిజ్ఞానసమితి ముఖ్యో

ద్దేశమని విజ్ఞప్తియందు నుడువఁబడినది. ఈసమితికిఁ గార్యదర్శులు శ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిగారి దివఱలో శృంగార గ్రంథమాల నేర్పఱచి యందుఁగొన్నిగ్రంథములఁ బ్రకటించియున్నారు. వీరు మరల నాంధ్రభాషాభిమానముతో నీగ్రంథమాలను మొదలిడుట మిక్కిలి ప్రశంసనీయము. పీఠికయందు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు కవిని గూర్చియు, కృతిపతియగు మగదల రామదాసామాత్యునిఁ గూర్చియుఁ బెక్కు విషయములఁ జర్చించి, కాలనిర్ణయ మొనర్చియున్నారు ఈప్రబంధము శృంగారరసప్రధానము. మృదుమధురమగు శైలిని రచింపఁబడి ద్రాక్షాపాకమున నలరారుచున్నది. పెక్కు వ్రాఁతప్రతులతో సంప్రతించి మరలఁబ్రకటింపఁ బడినది. భాషాభిమానులీయాంధ్రవిజ్ఞాన సమితినిఁ బ్రోత్సహింతురుగాక. పాఠకలోకమున కందుబాటుగానుండునటుల వెలతక్కువగ నేర్పఱుపవలయుననియుఁ, గేవలము శృంగారైక ప్రధానములగు ప్రబంధములకే గాక పునర్ముద్రణమునందని ప్రాచీన ప్రబంధములను గూడఁ బ్రకటింపయత్నింపవలయుననియు నీగ్రంథమాలాసంపాదకులను గోరుచున్నాము.

5. శ్రీగీతాసూత్రనవతి:— తెనాలి సంస్కృత కళాశాలోపాధ్యాయులగు జమ్ములమడక మాధవరామశర్మగారిచే రచింపఁబడినది. వెలనాలుగు అణాలు.

గీతా వ్యాఖ్యానములు పెక్కులుగలవు. గీతలయందలి ముఖ్యవిషయముల సుబోధకముగ జిజ్ఞాసువులకుఁ దెల్పుటకై గ్రంథకర్తలు సులభ వ్యాఖ్యానముతోఁ దొంబది సూత్రములఁ బ్రకటించియున్నారు. ఇందలి సూత్రములు భగవద్గీతలోని శ్లోకభాగములై యున్నవి. వివరణము సులభముగనున్నది. ధర్మాభిలాషయే గ్రంథరచనకుఁ గారణమని గ్రంథకర్తలువ్రాసియున్నారు. వారివిద్యార్థులకొఱకీగ్రంథముద్దేశింపఁ బడియున్నను గీతార్థమెఱుంగఁగోరువారికి సహాయకారిగనుండుననుటలో సందియము లేదు. గీతాపఠనమునకిట్టి గ్రంథములు ప్రథమసోపానములవంటివి. గ్రంథకర్తల యాశయము సుశ్లాఘ్యము.

6. జీమూతవాహనుఁడు:— ఉభయభాషాప్రవీణ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారిచే రచింపఁబడినది. వెల 0—5—0.

అహింసావ్రతము మొదలగు సత్యుత్తమవిషయముల బోధించు నీచరిత్రము కథాసరిత్సాగరము నాఁటినుండియుఁ బ్రఖ్యాతమైయుండి యున్నది. దీనినే హర్షవర్ధనుఁడు నాగానందమను చక్కని నాటకముగ రచించియున్నాఁడు. ఆ సుప్రసిద్ధేతిహాసమునే గైకొని గ్రంథకర్తలు పితృభక్తి, పెండిలి, ఆత్మసమర్పణ మను మూఁడు భాగములుగల గీతపద్య ప్రబంధము సులభమగుశైలిని రచించియున్నారు. ఇయ్యది విద్యార్థులకు మిక్కిలి యుపయోగకరముగనుండునని యందలి పండితాభిప్రాయములు చాటుచున్నవి. మచ్చునకొకటి రెండుపద్యములు—

భవ్యభవదీయ పాదసంవాహనంబు
సలుపునప్పుడు నేనొందుసంతసమ్ము
సర్వసర్వంసహా రాజ్యసౌఖ్యములను
ననుభవించుటలోఁ గాననైతిఁ దండ్రి.

ఆమెకనులు వర్షాభ్రమ్ములగుచు నశ్రు
వృష్టి కురియఁగ వాహనుహృదయసీమ
విమలకరుణారసార్ద్రిమై వెల్లివిరిసె
సరసులమనంబు రసవినిమ్నంది కాదె.

7. హరవిలాసము:—శ్రీనాథమహాకవిప్రణీతము. ఆర్. వేంకటేశ్వర్ అండుకో మదరాసువారిచే ముద్రింపఁబడినది. వెల రు 1—4—0.

ఈగ్రంథము మొదట కాకినాడ సరస్వతీపత్రికాధిపులచేఁ బ్రకటింపఁబడినది. తంజావూరు, మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారమునఁగల ప్రతులసహాయమున బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారీగ్రంథమునఁగల ముద్రణాది స్ఖాలిత్యములఁ దొలఁగించి తిరుగఁ బ్రకటించుట యాంధ్రలోకమున కత్యంతముదావహము. ఆంధ్రదేశమునఁగల వ్రాఁత ప్రతులసహాయమునముఖ్యప్రబంధముల నీరీతిని సంస్కరించి ప్రకటించుట

భాషాభిమానులకు ముఖ్యకర్తవ్యము. ఆయాపుటలయందు పాఠభేదము
లు చూపఁబడినవి. పెక్కువిషయములను, ముఖ్యముగ శ్రీనాథునిపదజా
లమును, ఆంధ్రీకరణమును గూర్చియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారొక విపు
లమగు పీఠికను రచించిరి. అశ్లీలమని తొలగింపఁబడిన పంచమాశ్వాసాం
త్యభాగ మనుబంధముగ నీయఁబడినది. ఒసగు, అధ్వానపుంబట్టు, కోహళి
స్నానము మొదలగుపదములనుగూర్చి పీఠికయందుఁ గొన్నివిశేషములు
దెలుపఁ బడినవి. శ్రీనాథుని యపూర్వ పదప్రయోగములను గూర్చి
శ్రీ శాస్త్రులవారింకను జర్చించిన బాగుండును.

8. Annals of the Sri Venkateswara Oriental Institute, Tirupati. Vol I. Part I.

శ్రీతిరుపతివేంకటేశ్వర దేవస్థానమువారిటీవల నొకప్రాచ్యవిద్యా
కళాశాల నేర్పఱచియున్నారు. ఆవిద్యాలయమువారిచేఁ బ్రకటింపఁబడిన
పత్త్రిక ప్రథమసంపుటమున మొదటిసంచిక మాకార్యస్థానమును జేరినది
దీనియందనుబంధముగ నీవిద్యాలయమునుగూర్చి శ్రీ కె. వి. రంగస్వామి
అయ్యంగారు, బెల్వాల్కర్ గారును వ్రాసిన నివేదికలుగలవు. ప్రాచ్యవిద్యా
పరిశోధకసంఘములట్టి పత్రికలను నడుపుట ముఖ్యకర్తవ్యము. మనకు
పూనా, మదరాసునందుఁ బరిశోధకసంఘములు ప్రకటించుచున్న పత్త్రి
కలు విదితములే. అముద్రితములగు ప్రాచీనగ్రంథములిట్టి సంఘములచేఁ
బ్రకటింపఁబడుచున్నవి. ఈసంచికయందుఁ బెక్కువ్యాసములేకాక, అత్రి
సంహితయందుఁ బ్రథమాధ్యాయమును, రెండవయధ్యాయమునఁ గొంత
భాగమును బ్రకటింపఁబడినవి. ఆంధ్రభాషకుపకరించు 'గ్రంథగ్రంథులు'
అను వ్యాసము శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే రచింపఁబడినది. దీని
యందుఁ గతిపయపదములనుగూర్చి సవిమర్శముగఁ జర్చింపఁబడినది. ఈ
పత్త్రిక చిరస్థాయియై యమూల్యములగు గ్రంథములను బెక్కింటిని
బ్రచురించి విద్వల్లోకమున కుపకరించును గాక.

---

# కావ్యాలంకారచూడామణి.

## కొన్ని పాఠభేదములు.

**వ్యాకరణవిద్యాప్రవీణ- చిలుకూరి పాపయ్యశాస్త్రి.**

---

(అనువృత్తము)

(3)

క. ప్రళయము నా సుఖదుఃఖా
దుల నింద్రియమూర్ఛనంబుఁ దొలఁగుటదానిన్
దెలియునది భూమిపతన
స్ఖలితాకారములచేతఁ గనుఁగొని చతురుల్. ప్ర-ఉ ౪౧-వ.

ఈపద్యమునందలి 'తొలఁగుట' యనుచోట 'క' 'గ' ప్రతులు రెండిటను 'తొడరుట' యనియేకలదు. సుఖదుఃఖాదులచే నింద్రియములు మూర్ఛనంబు విడుచుట ప్రళయమని ముద్రితపాఠమున కర్థము చెప్పవలయునుగదా! "ప్రళయ స్సుఖదుఃఖాద్యైర్గాఢ మింద్రియమూర్ఛనం" అనులక్షణముచే, సుఖదుఃఖాదులచే గాఢముగ నింద్రియములు మూర్ఛనందుట ప్రళయమని యాలంకారికసిద్ధాంతము. కావున 'తొడరుట' యనుపాఠమే యుండవలయును.

(4)

క. ఘనవిజ్ఞానం బాత్మకు
మనసుననే కలుగు నట్టి మనసున కబ్బున్
కనదింద్రియములచేతన్
వినఁగా వీనులకు నొదవు విషయప్రాప్తిన్. ఉ. ౧-వ ౧౫.

ఇట 'క' 'గ' ప్రతులలో "వినుతేంద్రియములకు నొదవువిషయప్రాప్తిన్" అనుపాఠముగలదు. విజ్ఞానము, ఆత్మకు మనసుచేతను, మనమున కింద్రియములచేతను వీనులకు, విషయప్రాప్తిచేతను గలుగు

నని ముద్రితపాఠమున కర్థము. విషయసంబంధమున శ్రవణేంద్రియము నకే గాక యితరములగు నింద్రియములకుఁగూడ విజ్ఞానము కలుగును; గాన 'వినుతేంద్రియములకు' అనియే యుండనగును. ఆత్మకు మనసుచే తను, మనమున కింద్రియముల చేతను, ఇంద్రియములకు విషయప్రాప్తి చేతను విజ్ఞానము కలుగునను నర్థమే సమంజసము; దానంజేసి యిచట వ్రాఁతప్రతులందలి పాఠమే యుక్తము.

(5)

చ. సురుచిరరత్న కీలి[1]తము సూతము బన్నసరంబు సూపు క
 ర్పూరపుఁ గరండముం దెఱచిపుచ్చు వెలుం[2]గుస నంచు విశ్వభూ
 వరుఁడొక యింతిఁ బల్లటయు వచ్చిన నెచ్చెలు లంతటంతటన్
 సురు[3]చిర సాలభంజికల సొక్కపు జోటు[4]లవోలెఁ జూడఁగన్.
 ఉ. గి. ప ౭౨.

ఈపద్యము తాటియాకుప్రతులల్లో నీ తీరున నున్నది.

సురుచిర రత్నకీలనముసూతము బన్నసరంబుసూపు క
ర్పూరపుఁగరండముందెఱచి పుచ్చు పలుంగుల నంచు విశ్వభూ
వరుఁడొక యింతిఁబల్లటయు వచ్చిన నెచ్చెలు లంతటంతటన్
సురగిరి సాలభంజికల సొక్కపుఁ బోటుల వోలెఁ జూడఁగన్.

ఇందు మొదటిదగు 'కీలితము' అనుచోట 'కీలనము' అనికలదు. రెండు పాఠములలో నేదియయినను నర్థము సమానమే; కాని వివిధప్రాంతములనుండి సేకరించిన ప్రతుల మూఁడిటఁ బాఠమొకేరీతిగ నుండుటం జేసి 'కీలనము'అనునదియే కవిసమ్మతపాఠమగు నేమో యనిపించుచున్నది.

ఇఁక 'వెలుంగుస' యనుచోట 'పలుంగుల' యనియే మూఁడు ప్రతులందును గలదు. పై పాదమున 'హారముఁజూపుము; రత్నములకట్టడపుఁబనిచూత' మనినట్లే, 'కప్పురపుఁ గరండముం దెఱచిపుచ్చుము, స్ఫటికములఁజూత' మనునన్యాపదేశముతోఁగూడిన యర్థమిటఁ గవ్యభిప్రేతము గానోపును.

'సురుచిర' యనుచోట 'సురిగిరి'యనుపాఠముగలదు. ఇట నీక్రియాపదము లేకున్నచో నర్థమే లేదు. ఏలయన-"ప్రియుఁడొక యింతిని జూచి యన్యాపదేశముగాఁ దనకార్యప్రాప్తిని గోరునపుడు చెలికత్తియ లచ్చటచ్చట సుందరమగు నాడుబొమ్మలవోలె" అనుచోఁ గ్రియాకాంక్ష వెంటనే కలిగి తీరును. దానిని బూరించుటకు వేఱొక క్రియాపదమును వెదకి తీసికొని రావలసివచ్చును. మఱియు సుందరమగు ననునర్థమును దెలుపు 'చొక్కపు' అనుపద ముండఁగ నీ'సురుచిర'యను పదము వ్యర్థమేయగును, కావున నిట నిదియే సరియగు పాఠమని చెప్పవగును ఇంతకు మూఁడుప్రతుల నొకేరీతిగఁ బాఠముండుటయునీవిషయమును స్థిరపఱుచుచున్నది.

'చొక్కపుజోటలవోలె' అనుచోట 'చొక్కపుఁబోటులవోలె' యనుపాఠమున్నది. రెండిట నేది యయినను నర్థము సరిపడవచ్చును.

(6)

సీ. వేదశాస్త్రరహస్యవిధు లెల్లఁ బరికించి
సవిఁ జతుర్వర్గప్రశస్తి నంది

... ... ... ... ... ... ... ... ...

గీ. అచట నచ్చటనున్న కావ్యాగమములఁ
జెలఁగి సత్త్వవిసాకర్య సిద్ధికొఱకు
నొక్కచోటనె యొడఁగూర్చ నుత్సహించి
సత్కళావర్తి విశ్వేశచక్రవర్తి ఉ ౧. ప ౫.

ఇట 'గ' ప్రతిలో 'సవి' యనుచోట 'సరి' యనుపాఠముగలదు. సవియను పదమునకు-అని, మిష, యనునర్థములు నిఘంటువులలోఁ గలవు. అట్టియర్థమిచటఁ బొసగనేరదు. కావున 'సమముగఁ జతుర్వర్గములయందుఁబ్రాశస్త్యమును బడసి' అనునర్థమునుగూర్చు 'సరి'యనుపాఠమే యుండనోపును.

మఱియు నిట గీతపద్యమునందలి చతుర్థపాద మీ ప్రతిలోఁబ్రథమపాదముగఁ గానవచ్చెడిని.

(7)

క. ప్రణయమున రాజనారా
యణుఁడతిశౌర్యముగఁ జేయునాదరణశుభ
క్షణ తృప్తి నఖిల నృపతులు
ప్రణతిప్రణుతులకుఁ జొరరు పరమోత్సుకులై. ఉ ౧. ప ౧౦౨.

ఇట 'క' 'గ' ప్రతులలో 'అతిశౌర్యముగ' అనుచోట 'అతిశయిత ముగ' అని కలదు. ఆదరణము చేయునపుడు శౌర్యమున కావశ్యకతయుండఁబోదు. కావున నీపాఠమే సమంజసము.

(8)

క. శంకింపక సురవనితా
శంకరులగు విశ్వవిభుని సమదభటులకున్
బింకముగ మేను లుబ్బినఁ
గంకణములు విరిసె శౌర్యగరిమోత్పత్తిన్. ఉ ౧. ప ౧౨౩.

'క' 'గ' 'చ' ప్రతులు మూఁడింటిలో 'కంకణములు' అనుచోట 'కంకటములు పగులు' అను పాఠము కలదు. సమదభటులకు శౌర్యాతిశయముచే మేనులుబ్బినఁగంకణములు(కరభూషణములు)విరిసెననుటకంటెఁ గంకటములు (కవచములు) పగిలెననుటలో నుత్సాహ మధికముగఁ గానవచ్చెడిని.

(9)

క. వినువారికిఁ గనువారికిఁ
దనరు విభావాను భావ దర్శనచయముల్
ఘనరసపోషకములు నాఁ
జనుఁ గవితా నాట్యములఁ బ్రసన్నాకృతులై. ఉ. ౨ ప. ౬.

ఇట మూఁడుప్రతులలోఁ బై రేఖాంకితస్థలమునఁ 'విభావాది భావదర్శనచయముల్' అనికలదు. 'విభావాది' అనుటచే విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములు గ్రహింపనగును. ఘనరసపోషకములు విభావానుభావములుమాత్రమే గాక సాత్త్వికవ్యభిచారిభావములు గూడ నగునుగాన వ్రాఁతప్రతులందలిపాఠమే యుక్తముగా నుండెడిని.

(10)

క. తిరమగు నొకయర్థముతో
సరియగు నర్థాంతరంబు సమకొల్పి తగన్
బరమైన నపరమైనను
ధరణి నిరూపింపఁగా నిదర్శనమయ్యెన్.   ఉ ౫. ప ౯౧.

ఈలక్షణమునకు మూలమగు కావ్యాదర్శమునందు నిదర్శనాలంకారలక్షణ మీతీరున నున్నది.

అర్థాంతరప్రవృత్తేన కించిత్తత్సదృశం ఫలం
సదసద్వా నిదర్శ్యేత యది తత్స్యాత్ నిదర్శనం.

'సదసద్వా' అనదానికి వివృతిగ 'పరమైన నపరమైన' యనుట సరిగాదు. దీనిఁబట్టి 'పరమైన నపరమైనను' అను వ్రాఁతప్రతులపాఠమే సమంజసము కావచ్చును.

(11)

ఉ. పంకజమున్ దొలంగి తదుపాంతచరన్మధుపప్రసక్తికిన్
గొంకి ఝషాదిరూపములకున్ జననాథుని వింతయక్కుపైఁ
గింకిరిగాఁగ లచ్చి తిలకించి యజస్రమునుండుఁగాత ని
శ్శంకఁజళుక్యవిశ్వమనుజప్రభుపుణ్యకటాక్షదృష్టులన్.   ఉ౧. ప-౨.

ఇట 'గ' ప్రతిలో 'కింకకుఁగాక' యని కలదు. పంకజమునువీడి, ఆ పంకజసమీపమునఁ జరించు మధుపప్రసారమునకుఁ దలఁకి, మత్స్య కూర్మాద్యవతారములకు లోనగు నాథుని వక్షస్థలముపై రోఁతయగునట్లుగా లక్ష్మి పరికించి విశ్వవిభుని పుణ్యకటాక్షదృష్టులం దజస్రమునుండుఁగాత ననునది ముద్రితపాఠమున కర్థము. ఇఁక వ్రాఁతప్రతియందలి పాఠమున కంతకంటె నర్థసారళ్య ముండునేమో? ఏలయన, కింకకుఁగాక యనఁగా, కోపమునకుఁ గాక, కోపమునకు వశముగాక యని భావము. ఇట్టి ప్రయోగము పెద్దనది వేఱొకచోటఁగూడఁ గలదు. చూడుఁడు:—

క. గజభుజగాదుల దెసఁగల
    గుజిబిజికింగాక పీడుకొన్నదివో లెన్ ... ఉ. ౫. ప. ౮౬.

గుజిబిజికింగాక = గుజిబిజికి వశముకాక యని యర్థము.

మఱియు, తో అంగి, కొంకి, యనుక్త్వార్థకప్రయోగములతో పాటు కింకకుఁగాక యనుచోట 'కాక' యనుక్త్వార్థకమునే కవి ప్రయోగించి నాఁడనుట లెస్స.

(12)

క. నవరస విస్ఫుటకరణ
    ప్రవణములగు నుచితరుచివిభావములెల్లన్
    వివిధస్త్రీపురుషులయం
    దవిరళముగఁ బొడముఁ దెలియనగును గవీంద్రుల్ ఉ ౧. ప. ౨౧

ఇట "ఉచితరుచివిభావములెల్లన్" అనుచోట 'ఉచిత రచితభావములెల్లన్' అని 'క' 'గ' ప్రతులలోఁ బాఠముకలదు. నవరసస్ఫూర్తిని గలుగఁజేయుటయందుఁ బ్రవణములగు, తగినరుచి గలిగిన విభావములన్నియు వివిధ స్త్రీపురుషులయందుఁ దఱుచుగఁ బొడమునని ముద్రితపాఠమున కర్థము. ఆలంబనోద్దీపనభేదముచే విభావము రెండువిధములు. ఇతరాలంకారికసిద్ధాంతముచొప్పున నాలంబనవిభావము నాయికానాయకులే యగుదురుగాన, వారలు స్త్రీపురుషులయం దవిరళముగఁ బొడముట సంభవింపనేగదా. మఱియు స్త్రీపురుషులయందు విభావములే పొడచు యితరభావములు పొడమకుండుటెట్లు? ఇఁక వ్రాఁతప్రతులలోని పాఠమును గ్రహించినచో, తగునట్లుగ రచియింపఁబడినభావములు—అనఁగా విభావానుభావ సాత్త్వికవ్యభిచారిభావములు—స్త్రీపురుషులయం దవిరళముగఁ బొడమునను నర్థము సిద్ధించును. అప్పుడు పైవిరోధము లుండఁజాలవు కావున నిట 'ఉచితరచితభావములెల్లన్' అనుపాఠమే సమంజసము.

ఇఁక 'తెలియగును గవీంద్రుల్' అనుచోట 'తెలియనగు సుకవీంద్రుల్' అని కలదు. ఇట నేపాఠమును గ్రహించినను సమానమే.

(13)

క. ఈకోల ధ్వజు ననిపెను
బోకుల చే నణ్గుఁ గడుపుఁ బొలిసినయరినా
రీకులము నెరయ శోకం
బాకారముదాల్చినట్ల యంగంబులతోఁ　　ఉ౧. ప. ౧౨౨

ఈపద్యము (క) (చ) ప్రతులలో నిట్లున్నది.

ఈకోలధ్వజు నసి పెనుఁ
బోకుల చే నణ్గుఁ గడుపుఁ బొలిసిన నరినా
రీకులము లెరియు శోకం
బాకారము దాల్చినట్టి యంగంబులతోన్.

తమ నడవడుల చేఁగంఠము కడుపుచెడిన శత్రునారుల సమూహము శోక మాకారముఁ దాల్చినట్లుగ నవయవములతో నిండునట్లుగా నీకోలధ్వజుని బంపె ననునది ముద్రితపాఠమున కర్థము. 'అనిపెను' అనుదానిని క్రియగా గ్రహింపక, అనిన్=యుద్ధమునందు, పెనుబోకుల చే=పెద్దపోకడల చే ననునర్థమును స్వీకరించినచో నప్పుడు క్రియాపదము లోపించును. ఆ పక్షమున పెనుఁబోకుల చే నని యర్థబిందుఘటితముగ నుండవలెను. అదియునుంగాక కోలధ్వజుఁడగు విశ్వేశ్వరు ననుపుటచే శోకాతిశయము స్ఫురింపనేరదు. ఎట్లయినను నర్థసారళ్యము గనఁబడదు.

ఇఁక వ్రాఁతప్రతులందలి పాఠమునకన్ననో "ఈవిశ్వేశ్వరుని ఖడ్గముయొక్క పెద్దపోకడల చేఁ గంఠమును గడుపును జెడిపోఁగా శత్రువులయొక్క స్త్రీసమూహములు శోకమాకారముఁ దాల్చినట్లున్నయవ యవములతోఁ బరితపించును" అనునర్థముతోఁచును. ఇచట ఎరియున్ అనునది క్రియాపదము. ఈపాఠమున నంతకంటె నర్థసారళ్యము గలదు. కావున నీపాఠమే సమంజసము కానోపును.

ఇట్లొక్కొక్క పాఠమును సోపపత్తికముగా వివరింపఁబూనితిమేని చో గ్రంథవిస్తరమగుచుగాన నిఁకమీఁద వ్రాఁతప్రతులందలి పాఠ...

ములనుమాత్రమే వివరించువాఁడ. వ్రాతప్రతుల పాఠములలోఁగొన్ని లేఖక ప్రమాదములుండియుండును. అట్టితావుల ముద్రితప్రతులందలి పాఠములే గ్రాహ్యములు. ఏమైన నున్నవాని నున్నట్లుగఁ దెలిపినచో విమర్శకులందలి గుణదోషములఁ బరిశీలించి సరియగు పాఠమును గ్రహింతురుగాక యని నామనవి

ఈ పాఠభేదములను నిరూపించునపుడు తొలుత ముద్రితపాఠములును బిమ్మట వ్రాఁతప్రతుల పాఠములు నుండును. 'క' 'గ' 'చ' అనునవి వెనుక నేఁ దెలిపిన సంఖ్యలుగల వ్రాఁతప్రతులందలి పాఠములకు సంకేతములుగాఁ దెలియునది. వెనుకఁ జర్చించిన పద్యములను వదలి మిగిలిన పద్యములందలి పాఠభేదములను గ్రమముగఁ దెపులుచున్నాఁడను.

## ప్రథమోల్లాసము.

౧ విద్వద్విశ్రమహేతుకం విహరతాం చాళుక్యవిశ్వప్రభొ
గ. విద్వద్విశ్రమహేతుకం విహరతాం చాళుక్యవిశ్వప్రభో.

౫ అశ్రుతవైరివర్గుఁడు సమాశ్రితభర్గుఁడు
గ. అశ్రుతవైరివర్గుఁడు సమర్చితభర్గుఁడు.

౮ స్పందనమొప్పఁ జెప్ప బహుపక్షబలంబునఁగ్రంమఁజెంది
గ. స్పందన నొప్పఁజెప్ప బహుపక్షఫలంబునఁ గ్రంమఁజెంది.
రాజహంస నివహంబులఁబట్టి వధించి సస్పతిన్
గ. రాజహంస నివహంబులగిట్టి వధించు సస్పతిన్.

౧౧ ఛందోవిచిత్రప్రచారము క. ఛందోవిచిత ప్రచారము

౧౨ కనుఁగొనిమొదఁగూర్చి యిత్తు క. కనికొనిమొకఁగూర్చి యిత్తు

౧౭ అర్థఘనతత్త్వవిబుద్ధము, భావముగ. అర్థవరతత్త్వవిబుద్ధము భావము

౨౦ అట్టివిజ్ఞానకలితమై యమరుభావము
క. గ. అట్టి విజ్ఞానకలితమై యలరుభావము.
సంజ్ఞలఁదనర్చు, క. గ. సంజ్ఞలఁదనర్చి

రసనిదానంబుగాఁగ, క. రసనిదానంబనాఁగ
గ. రసనిదానంబునాఁగ

౨౮ విశ్వజనపాలుని, క. గ. విశ్వనరపాలుని

౨౬ చతురాహ్వయంబు లుద్దీపనముల్
క. గ. చతురాహ్వయముల నుద్దీపనముల్

౨౭ హారకేయూరమంజీర కంకణకంఠికాదులు
క. హారకేయూర మంజీర కంకణకర్ణికాదులు
విభవములఁ బొందుఁజాళుక్య విశ్వవిభుఁడు
క. గ. విభవములఁబొందుఁ జాళుక్యవిశ్వనాథుఁడు

౨౯ లేఁతనిగ్గుతోఁ క. గ. లేఁతసిగ్గుతోఁ
బొదలెడి తారకల్, క. గ. బెదలెడి తారలున్
చెలికత్తెలకందముసేయు, క. గ. చెలికత్తెల కడ్డముసేయు
చెప్పనొప్పగున్, క. చెప్పనొప్పగన్, గ. చెప్పినొప్పగన్.

౩౧ స్తంభంబు నాఁగనెఱుఁగఁగవలయున్
క. గ. స్తంభంబునాఁగనెరయఁగవలయున్

౩౨ క్రొవ్వెఱియని, క. గ. క్రొవ్విఱియని
పొలుపడున్బగఱి, క. గ. పొలుపడున్బగతి

౩౩ ఇష్టస్పర్శన ప్రకాశన విధులన్
క. గ. ఇష్టస్పర్శన ప్రకాశితమరయన్

౩౪ గాఢాలింగనముల, క. గ. గాఢాలింగనమున
వడువున నొప్పున్, క. గ. వడువుననొప్పెన్

౩౫ సంహతి యశ్రు వంద్రు, క. గ. సంహతి నశ్రు వంద్రు
నఖముఖకృతమార్జనవిధులు, క. గ. నఖముఖకృతసర్జనవిధులు

౩౬ పరనృపవనితా, గ. పరసుతవనితా

౩౭ భయరోమహర్షణాదుల
క. భయరోష మర్షణాదుల, గ. భయరోమహర్షణాదుల

౩౮ రాగము గగలుగ దేర్పఁగ క. గ. రాగమున నలిగి తేర్పఁగ
నాగతుఁడగు, క. నాగరుఁడగు
రమణికలంగెన్, క. గ. రమణీయలంగెన్

౩౯ హార్షాదిరుజలు, క. గ. హార్షాదిజరలు

౪౦ మదవిమతులు వడవడ క. గ. మది విమతులు వదవద

౪౨ నెమ్మది మూర్ఛిల్లి, క. గ. నెమ్మది మూర్ఛిల్లు

౪౪ సారమతి విశ్వనృపతిని, క. సారమతి విశ్వనృప నిను

౪౫ చెమరు వాటిల్లు, క. గ. చెమట వాటిల్లు

౪౮ విబోధ కౌత్సుక్యములును, క. గ. విబోధ నౌత్సుక్యములును

౪౯ కారణంబై యొంటన్, క. గ. కారణంబై యొకటన్

౫౦ క్లేశముడుప నింతులతరమే, క. క్లేశముడుప నింతులవశమే

౫౧ ఇదియును నదియును యట్లయి. గ. ఇదియును నదియును యెట్లై.

౫౪ ఈనవశిశిరోపచార మేటికి నెలఁతక
క. ఈనవశిశిరోపచార మేటికి నలఁతక
గ. ఈనవశిశిరోపచార మేటికి నలితక

౫౬ కించిత్సంపదవిద్యో, క. గ. కించిత్సంపద్విద్యో
నించునె విశ్వమేదినీశ్వరుసభలోన్
క. నెంచరు విశ్వమేదినీశ్వరుసభలోక
గ. నించవు విశ్వమేదినీశ్వరుసభలోక

౫౭ పరబలమదవిద్యా, క. గ. పరబలగుణవిద్యా
తలుచగు దోషాచరణము, క. గ. తలుచుగ దోషాచరణము

౫౮ కవిగరిష్ఠు లసూయల్, క. గ. కవివరిష్ఠు లసూయక
వేమఱు భావింతురు, క. గ. వేమఱుఁగావింతురు

౫౯ పొందుగ నిజకృత్యంబుల, క. గ. పొందగు నిజకృత్యంబుల
చందం బత్రిప్రీతి నెఱుఁగఁజను, క. గ. చందం బాధ్భృతి నెఱుంగఁజను

౬౨ జనులరయంగక, క. గ. జనులడరంగక

౬3 ఘుర్ణతనువిదళతలక్, క. గ. ఘుర్ణతనువిరళతలక్
౬౪ అలఁతవొడమ నడలుచు, క. అలతయొదవ, గ. అలతవొడమ.
పడతుకలు పతులు మనుగడ, క. పడతులకుఁ బతులు మునుకడ
గ. పడతుకలపతులు మునుకడ

నడరఁగఁ గరవాలభైరవార్చలుసేయుక్
క. గ. నడరక కరవాలభైరవార్చలు సేయుక్
౬౬ మనలాసికాతనూల్లాసము, క. మనబాలికాతనూల్లాసము
౬౭ చింతనవిధుల మెఱయు, క. గ. చింతనవిధుల నొదవి
౬౯ నానతిఁజేసిన, క. నారతిఁజేసిన, గ. నాళతిఁజేసిన
పికంబు గూయు, క. గ. పికంబు గూసిక్
౭౦ దూరమునంగని రాగసక్తయై. క. గ. దూరఁగనుంగొని రాగసక్తయై
పయ్యెదఁజక్కఁజేర్చిఁ బొలపంబున మర్చిఁ గటాక్షవీక్షలన్.
క. గ. పయ్యెదఁ జక్కఁదీర్చిఁ బొలపంబు నమర్చిఁ గటాక్షవీధులన్.
౭౧ తనరు ననిష్టాగమనంబున. క. గ. తనరు ననివార్యాభిగమనమునను
౭౨ తదీయుతో వెస ముదంబున. క. గ. తదీయుతోడన ముదంబున
చన్నమనంబుఁ ద్రిప్పఁగా. క. చన్నమనంబుఁదివ్వఁగా
గ. చన్నమనంబు దింపఁగా
౭3 ప్రబ్బికొను వెఱగుపాటు క. గ. ప్రబ్బికొను వెఱఁగుపాటు
౭౬ నుత్యచరితవిశ్వేశ్వర. క. మత్యవిదితవిశ్వేశ్వర
గ. మత్యచలితవిశ్వేశ్వర
౭౭ రంద్ర వికారవిలోచన. క. కుంద్ర వికారవిలోచన
గ. రుంద్ర వికారవిలోచన
సాంద్రవికారముల. క. గ. సాంద్రవివేకమున
౭౯ పాలిత విశ్వంభరుఁడనుచు. క. గ. పాలితవిశ్వంభరుఁడగుచు
శశ్వత్పరి బోధసిద్ధిఁ జాటిరి జగతిన్
క. శశ్వత్పరి బోధవృద్ధిఁ జాగిరి జగతిన్
గ. శశ్వ త్పరిబోధసిద్ధిఁ జాఁగిరిజగతిన్.

౭౯ తత్పర తవిలంబమున. క. గ. తత్త్వరి తవిలంబమున
౮౦ వహింపవచ్చు నప్పుడు. క. గ. వహించి వచ్చినప్పుడు
౮౧ అమితవిచిత్రాలోచన. క. గ. అమితవిచిత్రాలోకన
సమయంబుల సంభ్రమించు. క. గ. సమయంబుల సంభవించు
ఆవేగమునాఁబడు. క. ఆవేగ మనాఁబడు
౮౨ సొబగారు విశ్వభూవరు. క. గ. సొబగార విశ్వభూవరు
౮౩ కథన వికటము. గ. కథన వికలము
౮౪ బాణకళాగర్వమున. క. బాణకళావర్గమున
౮౫ ప్రయుతముదము హర్షంబు. క. గ. ప్రియతముగా హర్షంబు
౮౭ కుపితాత్మున కుద్భవించు. క. గ. కుపితాత్ముల కుద్భవించు
మత్సరపాప వ్యపదేశంబుల. క. గ. మత్సరపాదవ్యపదేశంబున
నెఱుఁగ నగుఁ జతురులకున్. క. గ. నెఱుంగవలయున్ జతురుల్
౮౮ అగ్నికణము లురులు నీ. క. అగ్నికణము లురుల నీ
ఈవరగండభైరవుని. క. గ. ఈపరగండభైరవుని
౮౯ అలవున నలసత. క. అలపున నలసత
౯౦ బోటులచూపుల కింపొనర్చె. క. గ. బోటులచూపులకింపొనర్చె
చెలఁగెడు తేంట్లవన్ జెలిమి. క. గ. చెలఁగెడు తేఁటులం జెలిమి
౯౨ బలోపాయ సుదర్శనాంచల విభగ్నుల.
క. పరోపాయసుదర్శనాచలవిభగ్నుల
పచరింతు రెప్పుడున్. క. గ. ప్రసరింతు రెప్పుడున్
౯౪ అపస్మారులగతిఁ బొగులుచు. క. గ. అపస్మారులగతిఁ బొరలుచు
౯౫ చిత్తప్రియవనితాహతి. క. గ. చిత్తప్రియవనితాహృతి
౯౬ భ్రాంతులై తఱుచు. క. గ. భ్రాంతులై పఱుచు
తత్తత్ప్రదేశంబులన్. క. గ. తత్ప్రాంతదేశంబులన్.
౯౭ చిత్తమున నున్న యునికిని. క. గ. చిత్తముననున్న యునికిన
పుట్టునెఱిఁగి. క. గ. పుట్టువెఱిఁగి

౯౮ సాగరగిరిసరిదరణ్యా. క. గ. సాదరగిరి సరిదరణ్యా
౧౦౦ మనుజపతులకా. క. గ. మనుజపులారా !
అక్కజమగు. క. గ. అక్కజముగ
కమరిపోక. క. గ. కమలిపోక
౧౦౧ జడతయది కను ముదంబునఁబను.
క. గ. జడతయది దడును దనమునఁబడు
ఇష్టానిష్టకర్మభంజనములచో
క. గ. ఇష్టానిష్టకర్మభజనంబులచే
అడరెడు భయమోదాదులు
క. గ. అడరెడు భయమోహాదులు
౧౦౨ గుణగణవిగుణోత్కర్షణ క. గ. గుణవిగుణోత్కర్షణపరి
౧౦౪ ఆవెరగుల కలుగవలయు నలిగిన పిదపన్
క. గ. ఆవెరవులు గలుగవలయుఁ గలిగినపిదపన్
౧౦౭ నొట్టెడి నట్లంట నోప నొల్లక మదిలో
క. గ. జట్టెడి నట్లంట ముట్ట నొల్లక మదిలో
౧౦౯ తెలియనగున్. క. గ. తెలియఁదగున్.
౧౧౧ విస్ఫురిత వ్యాధిమనంబను. క. గ. విస్ఫురితవ్యాధిమనం జను
౧౧౨ కేలెరియు నొడలు దడివిన. క. కేలెత్తి మొడలు దడివిన
గోలంబను లూర్పులే శిఖుల మండిపడున్
క. రోలంబము లోర్పు వేశిరుల ప్రమందిపడున్
గ. రోలంబము లోర్పు వీశిరుల ప్రమందిపడున్
౧౧౪ తూణముఖంబునను. క. గ. తూణముఖంబులను
౧౧౬ సతతరసస్థాయిభావ. క. గ. సతతనవస్థాయిభావ
౧౧౮ స్థానజాతచేష్టాంగకమై. క. గ. చ. స్థానజాతచేష్టాత్మికమై
౧౧౯ ప్రతిపాదన మెఱుఁగందగు. క. గ. చ. ప్రతివాదనమెఱుఁగం దగు
౧౨౧ ఎఱిఁగితి మనుడున్. క. గ. చ. ఎఱిఁగితి మనుచున్

౧౨౧ శోకంబన(గను మదిలో. క. గ. చ. శోకంబన(జను మదిలో

౧౨౨ అంతరంగము నందున్. క. గ. చ. అంతరంగమున( దను
నియతంబగుచుండు( క. గ. చ. నియతంబుగనుండు(
ప్రాణినికరంబులకున్. క. గ. చ. ప్రాణినివహంబులకున్

౧౨౯ శ్రవణావలోకకథనంబుల చే. క. గ. చ. ప్రవణావలోకకదనంబుల చే

౧౩౦ బిరుదార్థము నిలుపలేని బిరుసు నృపులకున్
క. బిరుదార్థము నెఱపలేని బిరుదపు నృపులన్
గ. చ. ...............బీరపునృపులన్
అరుసుగ క. గ. చ. అరుదగు

౧౩౨ విశ్వభూవిభుడు. క. గ. చ. విశ్వభూవరుడు

౧౩౩ సంసారవికారము. క. గ. చ. సంసారవిచారము

౧౩౪ మహీలలనాపాలనమున నెనక మెస(గు వో
క. మహీలలనాధృతి నెసంగు నింపులు గను వో
ఓలియతీంద్రులు. క. గ. చ. వాలి యతీంద్రులు.

౧౩౫ ఇది నానావిధభావబోధపద ఘం చేరా రాజశ్రే
క. గ. చ. ఇది నానావిధ భావసంఘుదలెఱింగెన్ రాజు రాజశ్రేష్ఠా
భవాపాయంబు( దూలించు. క. గ. చ. భవాపాయంబు దూలించి
సమ్యగ్రాజతేజోనిధీ! క గ. సమ్యగ్రాజవిద్యానిధి.
చ...విద్యానిధీ!

౧౩౬ ఆత్మవిద్యావరిష్ఠుండు. క. చ. ఆత్మవిద్యావరిష్ఠుండు
గ. ఆత్మవిద్యావరిష్ఠుండు
అంగనాదివికాసుండు. క. గ. చ. అంగనాదివికాసుండు

---

# ద్వితీయోల్లాసము.

౧ తేజోఽలంకారుడు ధృతిసురశైలుడు
క. గ. చ తేజోఽలంకారకీర్తిశైలుడు

౨　అయ్యుపేంద్రుఁడటులేఁగెన్ గాన.
క. గ. చ. అయ్యుపేంద్రుఁ డిపు డేతెంచెన్‌గాన
నాథత్వమెంతేనొప్పు. క. గ. చ. నాథత్వ మిట్లీనొపున్
3　భావితశృంగారరసము.　,,　భావికశృంగారరసము
౫　స్థాయిభావంబులకు. గ. చ. స్థాయిభావంబునకు
వెన్నకుఁ బాకసంప్రాప్తిఁజేసి.
క. గ. చ. వెన్నకుఁ బాక సంప్రాప్తి చేత
౧౧　చుంబనమోదనప్రసాధనవిధులన్.
క. గ. చ. చుంబనసముచిత ప్రసాదనవిధులన్
౧౨　లజ్జాహాసభావంబు. క. గ. చ. లజ్జాహాసభాసంబు
నెచ్చెలికేసొంపు. క. గ. చ. నెచ్చెలికిన్‌సొంపు
౧3　పంచవిధభావకలిత.　,,　పంచవిధభావకథిత
గలసి. క. గదిసి. గ. చ. గదసి
౧౪　ఇందు శృంగారరసమును. క. ఇంక శృంగారరసమును
వివిధభావాదిక క్రియావింశతియును
క. వివిధభావోదయక్రియావింశతియును
గ. చ. వివిధభావోదయత్రయీవింశతియును
ఎఱుఁగఁబడు భావకుల. క. నెఱుఁగఁదగు భావుకులు
గ. చ. ఎఱుఁగబడు భావుకుల
కలిత, క. గదిత, గ. చ. కథిత
౧౫　ఇంగితముగఁ దత్ప్రకారము. క. గ. చ. ఇంగితములఁ దత్ప్రకారము
౧౭　సదోదారతయును. క. గ. చ. సదుదారతయును
అయత్నసంభవములగుచు. క. గ. చ. అయత్నసంభవము లనఁగ
౧౮　కిలకించితాభిధంబు. గ. చ. కిలికించితాభిధంబు
౧౯　విదితములిన్నియునుగూడి. గ. చ. విదితములన్నియునుగూడి
౨౧　కడకన్నులయందిడి మున్నుపోలె.

క. కడకన్నులయందిడె గ. చ. కడకన్నులయంటిద

వైమాళపుటాటకుంజనదు. క.గ.చ. హైమాళపుటాటకుంజొరదు

౨౨ శృంగారావిర్భావనివాసము. ,, శృంగారావిర్భావనిదానము

౨౩ అరవిరితమ్మిలో. గ. చ. అఱవిరితమ్మిలో

చూడ్కులదండడించు. క. గ. చ. చూపులంగందళించు

కన్గొనె సిగ్గుముందఱన్. క. కన్గొన. క. గ. చ. సిగ్గుముంగటన్

౨౪ చాళుక్యవిశ్వేశ్వరున్, క. గ. చ. చాళుక్యవిశ్వప్రభున్

౨౬ తలరు ననోన్యతుల్యగాత్రములయందు

క. తనరు ననోన్యతుల్యకాయములయందు

గ. చ. తనరు ననోన్యతుల్యగాత్రములయందు

౨౭ చనునింతికి, క. గ. చ. చనుగొంతికి

భూషణనికాయములం దడవంగ

క. గ. చ. భూషణనికాయములం దొడగంగనేల.

౨౮ విద్యాకౌశలులు. గ. చ. విద్యాకౌశలురు

ఎఱుంగంగాం దగు బుద్ధిన్. క.గ.చ. ఎఱుంగగాం బహుబుద్ధిన్

౨౯ గరువంపు నడం బోలుపారె. క. గరువంపు నతంబోలుపార

గ. చ. గరువంపు నతం బోలుపారె

౩౦ నిరస్తాలంకాల కరణయగు. క గ. చ. నిరస్తాలంకార కిరణయగు

౩౧ హృద్యమగుటం దామాధుర్యం. ,, హృద్యమగుటం దారమ్యత్వం

మండన లగనంబున. క. గ. మండలగనగంక

౩౩ సుశ్రీలం దనర్పంగ్రొవ్విరుల. క. గ. చ. సుశ్రీలందనర్చుక్రొవ్విరుల

౩౪ వ్రీడోదిత భయముం దగ. గ. చ. వ్రీడోదితభయముండంగ

౩౫ సత్యాశ్రయస్థల దత్యాతతసిద్ధులన్ విధికళాచాతుర్యమొప్పంబామి

క.గ.చ. సత్యాశ్రయస్థలదత్యాతతసిద్ధులవిభుకళాచాతుర్యమొప్పంబామి

౩౬ లలనకుం దగమ గుడనివేడ్కల

క. చ. లలనకుం దలమగు తనివేడ్కల

గ. లలనకుం దలమగుడనివేడ్కల

౩౭　పురణింప　　　క. గ. చ. పురిణించె
　　సాలమి నెన్న　　　,,　　సాలమి నెన్నె
　　సోలముం దెలుప　　　,,　　సోలమిందెలిపె
౩౯　మహారోషంబు సైరింప　　　,,　　మహారోషంబు సైరింపు
　　మానమాభరణమై. క. మానమావరణమై
౪౦　మనోరంజన ప్రసాదంబగుమక్.
క.గ.చ. మనోరంజన ప్రసాదనమగుచుక్
౪౧　శ్రీరమణీసరస్వతుల చేతలు. క.గ.చ. శ్రీరమణీసరస్వతుల చేష్టలు
　　వారిగనిమ్మనునట్లు యిత్తురవ్వారికి.
క.గ.చ. వావిరి నిమ్మనునట్లు యిత్తురా నారులకుక్
౪౩　కడచూడ్కిలోన. క. కవచూడ్కిలోన.
౪౪　మాని నవారుణ శాటకంబునుక్.
గ. చ. మానిన వారణ చేటకంబులుక్.
　　చెలువుగోరి ధరించిన. క. గ. చ. చెలువు వో ధరియించిన
౪౭　కజ్జలంబునిడి　　　,,　　కజ్జలం బొసగి
　　పరిణయాలంకార　　　,,　　పరిణయాలంకారు
　　చూచె విలోచనప్రభలు విభ్రాజిల్ల.
క.గ.చ. చూచు విలోకనప్రభలు విభ్రాజిల్లె
౪౯　విలోచనాంతముల క. గ. చ. విలోకనాంతముల
　　చూడుడన్నెలంతను. గ.చ, చూడ నన్నెలంతను
　　నెక్కొనుకూరిమిచంద మెట్టిదో.
క.గ.చ. నెక్కొను మక్కువచంద మెట్టిదో
౫౧　చూపట్టు భూదేవి　　క. గ. చ. చూపట్టెభూదేవి
　　తత్తద్విజృంభక్రియల్　　　,,　　తత్తద్విజృంభత్క్రియల్
౫౨　పరిపీడాదుల సుఖంబు　　　,,　　పరిపీడావర సుఖంబు

౫౩ చళుక్యనాథుని ,, చళుక్యనాథుఁడు

ఆ సౌగంధిక శ్రేణిచే ,, సత్సౌగంధిక శ్రేణిచే

జన నర్పించెను. క. చ. జన నర్పించెను

గ. జన నర్పించెడు

౫౪ మొఱఁగి పోవుట. క. మోగిపోవుట

౫౫ నుతింపు నెప్పుడున్. క. గ. చ. నుతింప నెప్పుడున్

౫౬ వికసితవర్తనమున క. చ. వికసితవర్తనమున

సేవకవర్తనమునను. క. సేవకవృత్తమునను

౫౭ కనుఁగొన నొప్పు కంఠమున. క. గ. చ. కనుఁగొన నొప్పు నంగముల

రంజనముగ నాడె ,, రంజనమున నాడె

చరణాక్రమంబులన్ ,, చరణాభ్రమంబులన్

౫౮ నొప్పునది విహృతి రసికుల ,, నొప్పు విహృతంబు రసికుల

౫౯ డెందము విన్నన య్యె ,, డెందము వింతయయ్యె

ఒకడిల్లఁదనం బొడఁగూడె. క. ఒక డిల్లఁదనంబునఁ గూడి

ముందటి లాగు గాదు. క. గ. చ. ముందటిలాగు గాదు

తన్ను సోఁకుటల్ ,, తన్ను జోఁకుటల్

౬౦ లలిత శ్రవణాలోకన ,, కలిత శ్రవణాలోకన

౬౧ అవల జాగర మన ,, పొల జాగర మన

త్రపాసంత్యక్తమనఁగ ,, ప్రపాసంత్యక్తినాఁగ

ద్వాదశావస్థమై ,, ద్వాదశావస్థలై

ప్రౌఢజనులు ,, ప్రౌఢమతులు

౬౨ ఎక్కెక్కింపున్ ,, ఎక్కెక్కింపన్

౬౩ ఉల్లముఁజూపు చూపు లన నొల్లని యుగ్గలు

క. గ. చ. ఉల్లముఁ జూపు చూపులును నొయ్యన యుగ్గలు

పెక్కువ మక్కువ చక్కఁడంబులున్

,,　పెక్కువ మక్కువ చక్కదంబులుక్
రంజిల్లుఁ జళుక్యవిశ్వనృపశేఖరు
,,　రంజిల్లెఁ జళుక్యవిశ్వనృపశేఖరు
౬౫　చూపులం దొరలి మానుగ. క.గ.చ. చూపులం దొరలిమానక
నానఁగఁ గారుకొన్న.　　క. మానుగఁ గాఱుకొన్న.
గ. మానుగఁ గొరకున్న　చ. మానుగఁ గారఁగొన్న
సొంపలరారెడు　　క.గ.చ. సొంపెసలారెడు
౬౬　పొండెడిచో　　,,　పొండెడుచో
౬౭　దక్కల యిక్కల నున్న　　,,　దక్కల నిక్కల నున్న
మరునమ్ములు వమ్ములు　　,,　మరునమ్ముల వమ్ములు
౬౮　సంతసముచేయు నుచితా.　క. సంతతముఁ జేయు రుచితా
గ. చ. సంతతముఁ జేయు నుచితా
౬౯　తగులేమ లీధరక్　　క.గ.చ. తగులేమ లూదరా
రాజకళాధరత్వముక్　　,,　కళాధరత్వముల్
౭౦　నల్లలనుడుకుచు నుండెడి　　,,　నుల్లలనుడుకుచు నుండెడి
జాగరాభిధానం బయ్యెక్　　,,　జాగరాభిధానముఁబడయుక్
౭౧　వేడ్కలీను పగలుం బగలయ్యె. క. వేడ్కరేలు పగలుం బగలయ్యె
అయ్యెనుదాన దీనికిం　　క.గ.చ. పగలయ్యెనటేని దీనికిం
చంద్రు నింపలరఁగఁ జూచుటం గువలయ ప్రియుఁడంటయు
గ. చ. విశ్వనృపాల చంద్రుఁడే నలవడు రూపు నంగువలయ
౭౨　సంగతి యరుదైన. క. గ. చ. సంగడి యెడరైన
౭3　అటమటమేల　　గ. చ. అటమిటయేల
క. అటమిగియేల
మంగననంగద భంగులయ్యె. క మంగగ యంగద భంగులయ్యె
గ. చ. నంగద నంగద భంగులయ్యె

సీకడ నాడి పాడికే క. సీకెడ యాడి పాడికే
వింట దూప దనువింట క.గ.చ. వింట తూప తనువిండ
౨౫ పల్కితింపార ,, పల్కెదింపార
౨౬ గజిబిజిగా ,, గసిబిసిగా
౨౭ క్రొన్ననఁగొన్న ,, క్రన్ననఁగన్న
తలంపు సలంప కున్న ,, తలంప నలంపకున్న
నేవెన్నెల నిల్తు ,, నేవెన్నెల కోర్తు
౨౮ తాపభర మది నాతికి ,, తాప భరమన్నాతికి
సంజ్వరమసంగ ,, సంజ్వరము నాఁగ
౨౯ వేచని విశ్వనాథు గుణవిశ్రుతుఁ దో కొనివత్తు మంచు
క.గ.చ. వేచని విశ్వనాథు పృథివీవరసుందరుఁ దెత్తుమంచు
పలుకెల్లగఁ జూచితి క. పలుకెల్లను గ. చ. పలుకెల్లగ
నోమిదేల క.గ.చ. నోమితేల
కీచలిమందు లేమిటికి ,, నీచెలిమందు లేమిమరు
నీవల నావలఁ దావలంబులై ,, లేమికిఁ దావలంబులే
౩౦ మోహ సంజ్ఞంబరయఁ ,, మోహసంజ్ఞంబడయుఁ
౩౧ దీప్తులు మాటు సేయుచో ,, దీప్తుల మాటుసేయుచో
మన యాసలు క. మనమాసలు
పలుకెన్నదు క. గ. చ. పలుకెన్నను
౩౨ సొమ్ముల పేరు ,, సొమ్ముల జరుగు
ఇంద్రియగుణవర్తన గ. చ. ఇంద్రియగుణాపర్తన
౩౩ తేటి జోటి నడయూహెను క.గ.చ. తేఁటి దూటి యదయూహెను
నింతియ ,, నింతిని
వదలక నోమి నోమి యదసం గడఁగానఁక
క. వదలక నోమి యేమి యద నంగద గాసఁగ
౩౪ ద్వాదశ దశయుం గలుగు. క.గ.చ. ద్వాదశియు దశ గలుగును
చెప్పిరార్యులు ,, చెప్పరార్యులు

౮౫ కలువదండలు మాటికిఁ బాటి ,, కలువతండము సాటికిఁ బాటి
తూపుల నవచ్చుట యెచ్చట ,, తూపులునువచ్చుట యెచ్చట
చిక్కఁగ నిక్కడ కేఁగుదెంచితిక్
క.గ.చ. చిక్కుల (లు) నిక్కడి కేఁగుదెంచితిక్

౮౬ పొలఁతుక చూచురా యబలపోకులు తేకులువిచ్చి
క.గ.చ. పొలఁతుక చూతురా దబలుపోకులు రేకులు దెచ్చి
చన్నుఁ గ్రేవలఁ బలుమాఱు గప్పెదు
,, చన్నుఁ గ్రేవలు పలుమాఱు గప్పెడి
పొలుచు లలాటరేఖ గని
గ. పొలుచులలాటరేఖగతి

౮౮ కరుణము క.గ.చ. కరుణయు

౯౦ మందముగ క. మందముగు
చేష్టితమగుచున్ క.గ.చ. చేష్టిత మరయన్

౯౧ వట్టి సంకల్పపురాల నవ్వు క. మించి సంకల్పపురాల నవ్వు
శిబికర్ణుల చాగము సేవగించు క. సిబికర్ణుల సాగము గేనగించు

౯౨ హాస్యమున కమరు గ. చ. హాస్యంబు నమరు
ఎఱిఁగింతుఁ దగు నెఱుంగ ,, ఎఱిఁగింతుఁ దగ నెఱుంగ

౯౪ వికాసికపోలము క. గ. వికాస కపోలము

౯౫ విహసితమును బ్రహసితము. ,, విహసితము నుపహసితము
మృదులనినదము బ్రహసితము ,, మృదులనినద ముపహాసితము

౯౬ శిరశ్చపలము క. శిరశ్చలనము

౯౭ ఆకులితాలంబభావము క.గ.చ. ఆకులతాలంబభావము

౯౮ ప్రాపించుః జక్కని ,, ప్రాపించెఁ జక్కని
చను దీనుండయి హీనుఁడై ,, చను హీనుండయి దీనుఁడై

౯౯ అనుభావములుగాఁగఁ గరుణమునకు
క. అనుభావములు నాఁగఁ గరుణ మమరు

గ. చ. .........నాఁగఁ గరుణ నమరు

౧౧౧ సాధువిభావాదికముల. క. గ. చ. సాధుకపాదాదికముల
విరోధంబులఁ దెలియఁదగు. క. విరోధములు దెలియఁదగు

౧౧౨ చూపి నటత్త్ర్యంబకలీల. గ. చ. చూపి నిజత్ర్యంబకలీల
జెక్కుఁ జక్కడచుచు చ. జక్కం జక్కడచుచు.
బలంబు నెఱపున్ క.గ.చ. చలంబు నెఱపున్
నెంచుఁ బొడమాయించు ,, నొంచుఁ బొడమాయించు

౧౧౪ వికృతనయనరాగాధర ,, భృకుటి నయన రాగాధర
స్వనగద్గదవైవర్ణ్య క. స్వరఘుర్ఘురవైవర్ణ్య
గ. స్వనఘుర్ఘురవైవర్ణ్య

౧౧౬ సులభోత్సాహస్థేయోభావ
క. చ. సులభోత్సాహస్థేయోభావ
గ. సులభోత్సాహస్థేయాభావ

౧౧౭ దానవీరసంజ్ఞం బడయుఁ. క. చ. దానవీరరస మగునదియుఁ

౧౧౯ పొడచూచి నంతటనె క.గ.చ. పొడచూచి యంతటనె
అర్థము నసంఖ్యాకంబుగా ,, అర్థ మతిసంఖ్యాకంబుగా

౧౧౧ పసగల్గినుదారసార ,, పసగల్గిను దానసార
రసికోత్సవమై ,, రసికోత్సుకమై

౧౧౧ చారుతరత్తరవారి గ. చ. చారు చరత్తరవారి
క. చారు చలత్తరవారి

ప్రజ్వలచ్ఛితిశిఖియంకపీఠమును దెంచె నరాతివధూటిపోరిలోఁ.
క.గ.చ. ప్రజ్వలచ్ఛితి యగు నంకపీఠమునఁ దెంచె నరాతివధూటిపోరిన

౧౧౩ విద్వేషము మ్మఁరుఁ దూలించి. క.గ. విద్వేషి మ్మఁరుఁగూలించి

౧౧౪ పటహా నిస్సానంబులు క.గ.చ. పటహా నిధ్వానంబులు
విభావసంజ్ఞము లరయుఁ ,, విభావసంజ్ఞం బడయుఁ

౧౧౭ క్షితిదానదయారణసంగతులకు ,, క్షితిపైదానదయారణగతులకు
వితతయథోచిత ,, వితతియథోచిత

౧౧౮ వ పద్యము తరువాత "ఇది వీరరస త్రితయము" అని కలదు.

౧౧౯ ప్రవ్యక్తంబగు భయమ యగు భయానకమహితోద్రిక్త
క.గ.చ. ప్రవ్యక్తంబగు భయమ తగు భయానక మహితోద్వృత్త

౧౨౦ వితత భయానకంబయిన క.గ.చ. వితత భయాకరంబయిన
గని యెల్ల వైరులన్ మతి దెరలించు
క.గ.చ. గని యట్ల వైరులన్ మతివెరపించు
నంచు వెతమాయ లొనర్తురు భీరు లద్రులన్
,, నంచు వెద (డ) మాయ లొనర్తురు భీతు లద్రులన్

౧౨౧ జను నెఱుఁగంగన్ క. గ. చ. జనుఁ దెలియంగన్

౧౨౨ జరపక విశ్వనాథునకు క. జరపగు విశ్వనాథునకు
మేని పుండ్లనుం బురువగు క. మేనిపుండ్లచే బురదగు
గ.చ. మేనిపుండులం బురవగు
దొరచెడి పుర్వులం క. గ. దొఱఁగెడు పుర్వులం
చ. దొఱఁగెడు పుర్వులం

౧౨౩ ఎప్పుడుఁ గాఱు చొంగలకు నెత్తిన చిప్పయుఁబోని మోవిపై
క. ఇప్పుడు గాఱు చొంగలుగు నెత్తిన చిప్పయుఁ బోని మోవిపై
కడుపుచీలిన కప్పయుఁ బోని యచ్చటున్
క.గ.చ. కడుపు చీరిన కప్పయుఁ బోని యెచ్చటున్
దప్పక సొమ్ముగాఁ. క. దప్పని సొమ్ముగా. గ.చ దప్పనికొమ్ముగా
దనరఁ దప్పులు మాటల. క.గ.చ. దనరు తన్వుల మానుట
శాస్త్రవుల నొల్లఁడు ,, వాదముల నొల్లఁడు
విశ్వ నరేంద్రుఁ డూకొనన్ ,, విశ్వనృపాలుఁ డూకొనన్

౧౨౪ మదికి లాగు గాని ,, మనసు లాగుగాని

౧౨౯ చళుక్యభూవిభు యశోవృద్ధి ,, చళుక్యభూవరు యశోవృద్ధి
౧౩౦ పులకస్వేద ప్రమదము ,, పులకస్వేద ప్రముఖము
సంచారులు గాఁజను ,, సంచారులు నాఁజను
౧౩౧ సమకొను నాలంబన మన ,, సమమగు నాలంబనమన
నతులము శాశ్వతము ,, నమలము శాశ్వతము
౧౩౨ బ్రహ్మప్రబోధస్థితిన్ ,, బ్రహ్మప్రబోధక్రియన్
విశ్వక్ష్మావరుఁ డెప్పుడున్ ,, విశ్వక్ష్మావిభుం డెప్పుడున్
౧౩౫ విష్ణుఁడు గర్త ,, విష్ణుఁడు భర్త
కరుణ కాషాయంబు. చ. కరుణాకషాయంబు
౧౩౬ బీభత్స మది యజుఃప్రసూతము
క.గ.చ. బీభత్స మట యజుఃప్రసూతము
౧౩౭ ఆది శృంగార జాతంబు. క. మహిని శృంగారజాతంబు
బీభత్సమునను భయానకంబు.
క.గ.చ. బీభత్సకమున భయానకంబు
౧౩౯ దరలు తమఃలోన. క. వరలు తమఃలోన
౧౪౦ అంగిరసప్రవృద్ధికిన్. గ. చ. అంగరసప్రవృద్ధికిన్
౧౪౧ రసవత్ప్రబంధలంపటుఁ బతిభూమఘుప్రఁడని మతిమెచ్చుదురు
క.గ.చ రసవత్ప్రబంధలంపటు లతి భూమఘువ్రఁడని వినుతిసేతురు
౧౪౨ కంటకారసికహర్త. గ. చ. కంటకార సికహర్త
౧౪౩ వారివినిపతిత. క. గ. చ. వారినీపతిత
౧౪౪ సకరుణాన్నృతచిత్తున్. క. సకరుణాహితచిత్తున్
సత్త్వ సంజాతవృత్తున్. గ. సత్త్వసంజాత వృత్తున్
కుకవిజన విదూరున్. క. గ. చ. కుకవిరచన దూరున్

---

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము ౨౮. { విక్రమ<br>జ్యేష్ఠ—భాద్రపదములు. } సంచిక ౨-3





కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

విడిసంచిక. రు. ౧-౦-౦.

1940 జూన్—సెప్టెంబరు.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౨౯. { విక్రమ జ్యేష్ఠ—భాద్రపదములు. } సంచిక౨-3.

శ్రీ

## నాటకము—హాస్యము.

దివాకర్ల వేంకటావధాని, ఎమ్. ఏ. ఆనర్సు.

---

రసానందజనకతా నీతిబోధనలు నాటకవృక్షముయొక్క రెండు పరిపక్వములైన ఫలములు. ప్రాచ్యపాశ్చాత్యలాక్షణికు లందఱు నీవిషయమున నేకీభావము వహించియున్నారు. ధనంజయుఁడు నాటకమున కానందమే ప్రధానఫలమనియు నీతివ్యుత్పత్త్యాదు లానుషంగికములనియు నుడివెను. డ్రైడెను మున్నగు పాశ్చాత్యవిమర్శకులుకూడ సంతోషమును గలిగించి నీతిని బోధించుటయే (to delight and teach) నాటకముయొక్క ప్రధానప్రయోజనమని నుడివియున్నారు. రసానంద జనకత్వము నాటకమున కందలి రసపరిపోషణమునుబట్టి వచ్చును. ప్రధానరసము పర్యాప్తముగాఁ బోషింపఁబడకపోయినచో రససిద్ధి కలుగనే కలుగదు. నీతిబోధనము నాటకకవి గ్రహించు వస్తువుపై నాధారపడి యుండును. అతఁడు నీతిబోధ కనువగు వస్తువునే గ్రహించుటచే నీప్రయోజనము మిక్కిలి సులభముగా సాధింపఁబడును.

నాటకమున దుర్నీతి వర్ణింపఁబడుచో నది లోకకల్యాణమునకు భంగముకలిగించుట యట్లుండ, సామాజికులలో నసహ్యభావమును

బుట్టించి రససిద్ధి కాటంకము కలుగఁజేయును. అందుచే నాటకకర్త నాటకమునకుఁ బ్రధానప్రయోజనమైన రసానందమునకు నిరోధము కలిగించునంత యధికముగాఁ గాక సామాన్యముగాఁ గథద్వారా నీతిని బోధించుచుండవలెను. దుర్నీతి నొకవిధముగా హేళనచేసినచో నది సామాజికులమనస్సులను బాగుగా నాకర్షించును. "ఇది దుర్నీతి. దీనిని బరిహరింపవలయును" అని పాత్రలచే ననిపించుటకంటె హేళనపూర్వకముగా దుర్నీతిని బరిహాసించుట నీతిబోధకు మిక్కిలి శక్తివంతమైన సాధనము. ఇట్టి పద్ధతి పరిహాసితమగు దుర్నీతికే వశులగు సామాజికులకు సైతము నీతిబోధతోపాటు రసానందమును గలిగించును. లేనిచో నాటకము కొందఱకైనను వైముఖ్యము ఘటించుట తటస్థించును.

హాస్యమువలన జనించు నవ్వే యానందమని భ్రమింపరాదు. రసానందహాస్యములకు స్వర్గమర్త్యముల కున్నంత భేదము కలదు. రసానంద మిహమును విస్మరింపఁజేసి, పాపమును బ్రక్షాళించు పరమానందము. హాస్యజాతమగు నవ్వితరుల యాకారాచారాదులయందలి వికృతత్వముచేఁగాని, వైపరీత్యముచేఁగాని కలిగెడు నధరచలనరూపమగు హాసము. హాస్యముకూడఁ బ్రాచ్యలాక్షణికులచే నొకరసముగాఁ జెప్పఁబడినది కాని దీనికాధారమునకుఁ గొంత లాఘవము చేకూర్చు గుణము కలదు విదూషకాది సామాన్యపాత్రలద్వారా మాత్రమే హాస్యమును వర్ణించుట కవకాశము కలదు; కాని, నాయకాద్యుత్తమపాత్రలచే దానిని బోషించుట కంత వీలులేదు. ఏలనగ నుత్తమపాత్రలముఖమున హాస్యమును బ్రయోగింపఁజేయుట వారి యుదాత్తతకు భంగము కలుగఁజేయును. కులీనులగు స్త్రీపురుషులుమాత్రమే ప్రాధాన్యము వహింపవలసిన విషాదనాటకములలో నీకారణముచేతనే హాస్య మంతగాఁ గానిపింపదు. అందుఁగూడ హాస్యమును బ్రవేశపెట్టవలెనన్న నందలి పాత్రలయుదాత్తతను గొంతవఱకుఁ దగ్గించి సామాన్యపాత్రలకుఁగూడఁ బ్రవేశము కలిగింపవలెను. అందుచేతనే "గోల్డుస్మిత్" ఉదాత్తమైన హాస్యము

(Exalted humour) మాత్రమే కావ్యములలో నుండవలె ననుట లోని యుదాత్త హాస్య పదములు రెండును బరస్పరవిరుద్ధములని నుడి వెను. ఏలయన హాస్యమునకు నుదాత్తముగానుండుటకుఁ జాల యం తరము.

శ్రవ్యకావ్యములు పండితులకుమాత్ర ముద్బోధము కలిగించును. అవి పామరులవిజ్ఞానమున కందరాని వౌటచే వారికెట్టి లాభమును గలి గింపఁజాలవు. దృశ్యకావ్యము లట్లుకాక పండితులకుఁ బామరులకుఁ గూడ నానందము కలిగింపఁగలవు. అందుచేతనే "కావ్యేషు నాటకం రమ్య"మ్మను నానుడి యేర్పడినది. నాటకములలోఁ బామరులనుసైతము రంజించు శక్తి నిసర్గముగానేయున్నను, హాస్యము దానికి మఱింత తోడ్పడును. నీతి యౌషధమువంటిది. కటువైన యాయౌషధమునకు హాస్యమను తియ్యని పంచదార కొంచెము కలిపినచోఁ బామరుఁడగు రోగి దాని నానందముతోఁ గైకొనును. అంత నాతని దుర్ణయరోగము తేలికగాఁ గుదురును. లేనిచో నీ నీత్యౌషధ మొంటఁబట్టుటయే దుర్ల భము. కాని యీహాస్యము నాటకకథలో నంతర్గతమై యుండుట మిక్కిలి యావశ్యకము. కొన్ని వీథినాటకములలో నటకుల నేపథ్యధా రణ మాలస్యమగుటచేతనో, పామరజనుల సంతృప్తికొఱకో కథతో సంబంధములేని కొంత హాస్యమును కేవలహాస్యముకొఱకే ప్రదర్శించు హాస్యము కథాసంవిధానముపై నంతగా దృష్టిలేని పామరజనులకు బాధకము కాకపోయినను మొత్తముమీఁద రససిద్ధికి విచ్ఛేదము కలిగిం చుననుటలో సందేహము లేదు. అందుచే నాటకమున హాస్యము కథా వస్త్వంతర్గతముగానే యుండవలయునుగాని నేలవిడిచ సాముగా నుండ రాదు.

రసములలో నన్నిటికిని సామరస్యము లేదు. కొన్నిరసములకు మఱికొన్ని రసములతోఁబొత్తుకుదురదు. ఇట్లొండొంటితోఁబొత్తుకుదురని రసముల నొకేనాటకమునఁ బోషింపయత్నించుట యానాటకమునందలి

రసపరిణామమునకు విఘ్నము కలిగించుటే. శృంగారహాస్యములకుబోలెఁ గరుణమునకును హాస్యమునకును బొత్తు కుదురదు. అందుచేఁ గరుణరసప్రధానములైన నాటకములలో నీహాస్యము ఛాయకూడఁ గానిపింపరాదు. షేక్స్పియరు హాస్యప్రియుఁడే యయ్యుఁ దనవిషాదనాటకములలో హాస్యమును బ్రవేశింపఁజేయకుండుట కిదియే హేతువై యుండును. కావున నాటకమునందలి ప్రధానరసమునుబట్టియు నీ హాస్యమునకు దానితోఁగల మైత్రినిబట్టియు దీనిని గౌణముగనో యధికముగనో వాడుచుండవలయును.

హాస్యమును హాస్యముకొఱకే (Humour for the sake of humour) వాడినచో నుండునంత నైర్మల్యము దానివలన నన్యప్రయోజనమును గూడ నాశించుచో నుండదు. నీతిబోధకైనను హాస్యము సహాయకారియే కాని యేకైకసాధనము కాదు. కొందఱు తమమనస్సులలోని సంస్కారభావములను బ్రజలహృదయములలోని కెక్కించుటకై యీహాస్యము సూతగాఁ గొందురు. కాని యిట్టిసమయములలో హాస్యము ప్రారంభమున మృదువుగానే యున్నను రానురాను దీవ్రమై దూషణములోనికి దిగును. ఇట్టి దూషణము హాస్యముయొక్క నైర్మల్యమును జెఱచుటయే కాక సామాజికుల కసహ్యభావమును గూడఁ గలిగించును. మనవాఙ్మయమున సర్వథా నిర్మలముగా నుండవలసిన వీరేశలింగంపంతులుగారి హాస్యమును వేమన్న హాస్యమును గొంతవఱకుఁ గలుషితములగుటకుఁ గారణ మీసంస్కారమునెడ వారికిఁగల యత్యుత్సాహమే.

కవియును సహృదయుఁడగు సామాజికుఁడును హాస్యవిషయముల నితరేతరసానుభూతిదర్శకులుగా నుండవలయును. లేనిచోఁ గవి తననైపుణ్యముచే సామాజికుల కానందము నొసంగలేఁడు; సామాజికుఁడు కవి సామర్థ్యము మెచ్చుకొని యానందింపను లేఁడు. హాస్యవిషయమునఁగూడఁ గవి సహృదయు లిరువురును సమరసభావమును గలిగియుండుట మిక్కిలి యవసరము. కవి యెట్టిపరిస్థితులందైనను దాను బ్రయోగించు హాస్య

మున కసభ్యతాదోషము కలిగింపరాదు. అతఁడు జనుల నాగరికత పరిశీలించి తదనుగుణమగు సరసహాస్యమునే ప్రదర్శింపవలెను గాని యామేర మీఱి ప్రవర్తించినచో నతని హాస్య మెంత కౌశలముతోఁ గూర్పఁబడినదైనను సామాజికులలో రోఁత కలిగించును. పానుగంటివారి హాస్యమున కిట్టి గతియే కొంతవఱకుఁ బట్టినది. సామాజికుఁడును నిట్టి విషయములలోఁ దనయహంకారమును గొంతవఱకు విడువవలెను. లేనిచో నాటకజన్యమగు రస మతనిపాలి కుండనేయుండదు.

నాటకపాత్రలకును సామాజికులకును గల సంబంధ మన్నియెడల నొకేమాదిరిగా నుండదు. నాటకకథా పరిస్థితులను బట్టి కొన్ని పాత్రలు శోచ్యములుగా నుండును. కొన్ని యసహ్యములుగా నుండును. శోచ్యులైన వారు ప్రమాదవశమున దోషముల నొనరించువారేయయ్యును సామాజికులు వారియెడ సానుభూతి చూపుదురు. ఇట్లు సానుభూతిసంధుక్షకములగు పాత్రలను బరిహాసపాత్రములుగా నొనరించుట సామాజికులమనములకు నొప్పి కలిగించును. ఇట్టివిషయములలోఁ గవి మిక్కిలి జాగరూకత వహింపవలయును. సురాపానాదివ్యసనము లోకవిధముగా శోచనీయములేయయ్యు హాస్యమునకు మూలములగుటయును, నిట్టి హాస్యము దురాచారనిరాసమునకు శక్తివంతమైన సాధనమగుటయుఁ గానిపించుచున్నది. ఇట్టిది తఱుచు నాటకకవి కథానిర్వాహముపై నాధారపడియుండును. ఎట్లైనను హాస్యము నీచవిషయజన్యమును గ్రూరతాచ్ఛాదితమును, నరసికతామయమును గాకుండుట యావశ్యకము.

# వినోదవిమర్శలు.

వేటూరి ప్రభాకరశాస్త్రి.

---

చ. పలుకులపొందులేక రసభంగముసేయుచుఁ బ్రాఁతవడ్డ మా
టలఁ గొని నేర్పుసూపి యొకటన్ హృదయం బలరింపలేక యే
పొలమును గాని యట్టి క్రమమున్ దమమెచ్చుగ లోకమెల్ల న
వ్వులఁ బొరయన్ జరించు కుకవుల్ ధర దుర్విటులట్ల చూడఁగాన్.

ఈపద్యము తిక్కనసోమయాజులవారి నిర్వచనోత్తరరామాయణము లోనిది. కుకవినింద. దీని యర్థమునుగూర్చి కొందఱితో నా కభిప్రాయ భేద మేర్పడినది. తిక్కనసోమయాజులవా రీపద్యమునఁ బ్రయోగించిన ప్రాఁతవడ్డమాట లన్న పదమునకు వ్యవహారమునుండి తొలఁగిపోయిన ప్రాచీనపదము లర్థమనీ, వానిఁ బ్రయోగించువారు కుకవులనీ, తిక్కన గర్హించెననీ కొందఱు వాకొనియున్నారు. నాకుఁ దోఁచిన యర్థ మిందు వివరించుచున్నాఁడను.

ప్రాఁతవడ్డమాట లనఁగా - పలువురు ప్రాచీనులు ప్రయోగించి యుచ్ఛిష్టమయిన పలుకుబళ్లు. పద్యార్థ మెల్ల వివరించిన నీయర్థము స్పష్టపడును. ఇందుకుఁ గవులు దుర్విటులతోఁ బోల్పఁబడిరి. ఆ యిరువెగలవా రును, పలుకులపొందు లేనివారు. అనఁగాఁ దీర్చి తిన్నగాఁ గవిత కూర్ప మాటలాడ) నేరరు. రసభంగము సేయుదురు. రచనలో (సంభాషణలో) నసిగా రసపరిపోషణము సేయఁజాలరు. పలుకులపొందు లేక, అనుటలో, గాశబ్ద్యము, మంచిపలుకులకూర్పలేమియు, రసభంగము సేయుచు- అను టలో సరసార్థసంగతి శాసింపలేమియుఁ జెప్పఁబడినది. ఇఁక నాలోపముఁ గప్పిపుచ్చుకొనుటకుఁగాఁ బ్రాచీనకవులు వాడిన మంచిపలుకుబళ్లను, (తొల్లింటిరసికకవులు నెఱపిన చమత్కారవాగ్వ్యవహారములను) మరలఁ దాము ప్రయోగించి, నేర్పు సూపఁబోయి వానినిగూడ నసిగా సరియ

యినపట్టులఁ బ్రయోగింపఁజాలమిచే రసికహృదయములను రంజింపఁ జేయఁ జాలకపోవుదు రని చెప్పుట యీక్రింది ప్రాఁతవడ్డమాటలు=పలువురు ప్రయోగించుటచే ప్రాఁతపడిపోయిన పలుకులను (అంతేకాని, నాఁడు వ్యవహారమున లేని, యుత్పన్నములయి పోయిన పలుకులని యర్థము కాదు) గొని నేర్పుచూపి యొకటన్ హృదయం బలరింపలేక=ఆమాటలను దమవిగాఁ బ్రయోగించుట యెఱుఁగనివారిముందు నేర్పుగాఁగానవచ్చినను, పూర్వోత్తరసందర్భముల నపిగాఁ బొసఁగింపఁజాలకపోవుటచే నొక్కపట్టునఁ గూడ (ఒక్కవ్యక్తిదగ్గఱ లేక, ఒక్కరచనా (సంభాషణ) ప్రసక్తినిగూడ హృదయావర్జనము సేయఁజాలుట, పొలమునుగాని యట్టి క్రమమున్ దమమెచ్చుగ లోక మెల్ల నవ్వులఁ బొరయన్ జరింతురు=సప్తవిధకవుల గద్యపద్యగేయాదికావ్యముల, శృంగారాదిరసముల పద్ధతులలో నేపద్ధతికిని జెందని దేదో వంకర తీరు (దత్తకపాంచాలాది విటభేదములలో నేభేదమునకుఁ బొందుపడని వంకర తీరు) తమకు నచ్చినదని సాఁగించుకొనుచు, ఎఱిఁగిన లోక మెల్ల పరిహసింపఁగాఁ దిరుగాడుచుందురు.

ఇక్కడ ప్రాఁతవడ్డమాట లనుటకు భ్రాంతివడ్డమాట లని పాఠమున్నట్టు మున్నెన్నఁడో శ్రీ నడకుదుటి వీరరాజుగారు వ్రాసినట్లు స్మరణము. ఆపాఠము మంచిదిగాఁ దోఁచదు. ప్రాఁతవడ్డ (పలువురు పలుమాఱు ప్రయోగించి యుచ్ఛిష్టములయిన) మాటల నుపయోగించువారు కుకవులని తిక్కన వెక్కిరించినాఁడు గాన నతనికిఁ బ్రియమయిన తీరు 'అపూర్వార్థశబ్దచారుకవిత' యని గుర్తించి, కేతన తిక్కనను

క. అగుననఁ గొమ్మనయ తిక్కఁడు
జగతి నపూర్వార్థశబ్దచారుకవిత మై
నెగడిన బాణోచ్ఛిష్టం
జగత్త్రియం బనిన పల్కు సఫలం బయ్యెన్.

అని నుతించినాఁడు.

ఇక్కడ నొక్కసంశయము :—పయిపద్యమున 'బాణోచ్ఛిష్టం జగత్త్రియం' బనిన పల్కు (ల్కు + అసఫలం?) సఫలంబయ్యె ననుచో నర్థ మెట్లు పొసఁగింపనగును ? శబ్దప్రపంచ మెల్ల బాణోచ్ఛిష్టము కాఁగాఁ గవిబ్రహ్మ తిక్కన యపూర్వార్థశబ్దసృష్టి చేసినాఁడా ?

---

# ముద్రిక.

చెళ్లపిళ్ల బంగారేశ్వరశర్మ.

---

చ. తనువునఁ జెమ్మటల్ వొడమె తామది వొంగె సటాసవాల్గనన్
గనుఁగవయందు బాష్పములు గ్రమ్మెఁగ సంతట సీత దానినిన్
గనుఁగొని లజ్జ గంతు లిడఁగా మఱియేమియుఁ బల్కలేక మో
మునఁ గనవచ్చు సిగ్గు విడిపోవఁగ నీనిధి నుంగరంబుతోన్.

క. మక్కువ ననియెడు ముద్దిడి
యిక్కడ నే నిట్టులుండ నీవు నిజేశుం
డక్కడ నెట్లుంటిరి విభుఁ
డక్కట నన్ గూర్చి యెప్పుడైనఁ దలఁచునే.

చ. నరపతిమౌళి రాముఁడకు నాకును సమ్మదప్రాప్తిసంబుగాఁ
బరిణయ మీవు చేసితి వభంగురసౌఖ్యప్రపంచ మేలఁగాఁ
జిరముగ లంకలో నిటులఁ జిక్కి తపించుచునుండ నన్ను నా
వరునిని గూర్పఁగాఁ దలఁచి వచ్చితె ? యుంగరమా రమాగ్రమా !

# చోడవంశము.

# I

## ఏఱువభీమ, నల్లభీమ, మైలమభీమ, చోక్కభీములు.

**వడ్డాది శ్రీరామచంద్రమూర్తి,** M. A., B. Ed.

P. R. C. School, Cocanada.

క్రీస్తుశకము పదుమూఁడు, పదునాల్గు, పదునేనవ శతాబ్దము లలో, ఆంధ్రదేశపు మాండలికవంశములలో నిప్పటి గోదావరి, విశాఖ పట్టణప్రాంతదేశమును బాలించి సూర్యవంశపుఁజోడుల మనియు, కరికాలాన్వయుల మనియుఁ జెప్పుకొనినట్టి చోడవంశ మొకటి. వీరి శాసనముల ననుసరించి వీరివంశము, ఆంధ్రదేశమున వేఱువేఱుభాగములఁ బరిపాలించిన తెలుఁగుచోడులు, రేనాటిచోడులు, వెలనాటిచోడులు, మొదలగు నితరచోడవంశములకు భిన్నమైన దనియు, కాకతీయసామ్రాజ్య వినాశనానంతర మాంధ్రదేశమునఁ గల్గిన యరాజకము నాధారము చేసికొని సామ్రాజ్యనిర్మాణమునకై ప్రయత్నము చేసిన మాండలికవంశములలో నొకటి యనియుఁ దెలియుచున్నది.

ఈచోడవంశీయులలో ముఖ్యులగు భక్తిరాజు, అన్నదేవచోడుల శాసనముల [1] ననుసరించి మన కీరాజవంశపుచరిత్ర చాలభాగము తెలియుచున్నది. వీనిలో, చోడభక్తిరాజు కండ్యకొలను శాసనము [1a] ననుసరించియు, అన్నదేవచోడుని రాజమహేంద్రవరపుశాసనము [1b] ననుసరించియు మన కీచోడవంశములోని రాజులపేర్లు చాలవఱకుఁ దెలియుచున్నవి. వీనివలన మన కీక్రింది వంశవృక్షములు లభించుచున్నవి.

---

1. (a) Bharati. July 1931 pages 120 ff (b) J. A. H. R. S. Vol. I P. 172 ff. (c) S. I. I., IV Nos. 1347, 1348, Vol. V No. 145 (d) Local Records Vol II P 210 ff. (e) An. Re. S. Epi. 254 of 1905.

| భక్తిరాజు కండ్యకొలను శాసనము లోని వంశవృక్షము. | అన్నదేవచోడుని శాసనము. రాజమహేంద్రవర వస్తుప్రదర్శన శాల లోనిది. |
|---|---|
| (Bharati. July 1931 Page 120) | (J. A. H. Rs. Vol. I. Page 172.) |
| | ... ...=అన్నమాంబ |
| నల్లభీముఁడు | ఏఱువభీముఁడు=ప్రోలాంబిక |
| దామభూపుఁడు=లక్ష్మి | దామనృపాలుఁడు=లక్ష్మి |
| సోమనృపతి=సూరాంబిక | సోమభూపతి=సూరాంబిక |
| గంగాధరుఁడు=ఇరుగాంబిక | గంగాధరుఁడు=ఇరుగాంబిక |
| భక్తిరాజు | కామరాజు అను భక్తిరాజు=అన్నమాంబ |
| | అన్నదేవుఁడు=ఇరుగాంబిక |
| | వీరభద్రుఁడు. |

పై శాసనముల ననుసరించి మనకు నల్లభీముఁడను ఏఱువభీముఁడు నీవంశములో మొదటివాఁడుగాఁ గన్పించుచున్నాఁడు. వేములవాడ భీమకవి కృతములుగా లక్షణగ్రంథములయం దుదాహరింపఁబడి, అనుశ్రుతములుగా వచ్చుచున్న చాటువులలో, ఏఱువభీమ, మైలమభీమ, చిక్కభీములను ముగ్వురు రాజుల పరాక్రమము లుద్ఘాటితములైనవి. పై మూఁడు పేర్లు చాటువులలో లభించుటయే కాక, ఏఱువభీమ, చిక్కభీముల పేర్లు శాసనస్థములై యుండుటచేతను, చాటుపద్యములలో నొకటియగు నీక్రింది పద్య మొక శాసనములో నుదాహృతమగుటచేతను మన కీపద్యముల లోని విషయముల చారిత్రకప్రాధాన్యము వేయిరెట్లధికమైనదిగాఁ బొడసూపుచున్నది.

చాటుపద్యమణిమంజరి ద్వితీయభాగము 59 వ పుటలోనున్న యీక్రిందిపద్యము.

ఉ. పన్ని తురంగమంబునకుఁ బక్కెరవెట్టినవార్త చారుచే
విన్న భయంబునం గలఁగి వేసటనాఁటనె చక్రకోట్టముల్
మన్నియ పట్టణంబులును మక్కున వేంగి కళింగ లాదిగా
నిన్నియు నొక్కపెట్టిగనె నేఱువభీమనృపాలుఁ ధాటికిన్.

(శ్రీ) జయంతిరామయ్యపంతులుగారిచే సంపాదింపఁబడి, ఆంధ్రసాహిత్యపరిషత్తు వారిచేఁ బ్రకటింపఁబడిన శాసనపద్యమంజరిలో 'కడప మండలమునందలి తాళ్లప్రొద్దుటూరు గ్రామమునందు ఆంజనేయస్వామి యాలయమునకుఁ దూర్పుగా నున్న ఱాతిమీఁద నున్నదని యీక్రింది మార్పులతోఁ బ్రకటింపఁబడినది.

ఉ. పన్ని తురంగమంబునకుం బక్కెర వెట్టినవార్త (హే ?) రిచే
విన్న భయంబునం గలంగె వీసరనాండునుం జక్రగొట్టమును
మన్నియ(వడ్లక్కేలియ)మ(ల ... ద్యప)వేంగిగళింగలాదిగా
నిన్నియు నొక్కనాండ ... ... ... నేఱువభీమ న్రిపాలుధాడికిని. [2]

పైనిఁ జెప్పిన ఏఱువభీమ, మైలమభీమ, చిక్కభీముల పేర్లొకే వ్యక్తివా లేక భిన్నవ్యక్తులవా యని చర్చించుటకుఁ బూర్వము, పాఠకుల సౌకర్యార్థమాచాటువులలోఁ గొన్నిటి నీక్రిందఁ బొందుపఱుచుచున్నాను.

చ. గరళపుముద్ద లోహ మవగాఢమహాశనికోట్లు [3a] సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపు కోఱలు పట్టుకార్లు ది
క్కరటి శిరంబు దాయ లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁడగు మైలమభీముని ఖడ్గసృష్టికిన్. [3]

ఉ. ఏఱువభీమ ! నీ పగతు ఱెక్కనికొండలు చంచలాత్ములై
దూఱనియట్టి ఘోరవనదుర్గములున్ వనితావిమోగులై

2. శాసనపద్యమంజరి ద్వితీయభాగము 69 వ శాసనము పుట 92.

3a. లోహమవగాహ 4355. ప. గ్రం. సం. మైలము భీమన లోహమవగాహ 3575 ,, సంకేతుల్. రాయ్యి, వాయ్యి, సంపాదకీయము.

పాఱని త్రోవలుం దిసని పండ్లును, నాకటఁ గూర లుప్పుగా
నేఱని కట్టెలుం గలవె యీలవణాంబుధివేష్టితావనిన్ ? ౩

ఉ. యాచకఖేచరుండు సుగుణాంబుధి సైలమభీమఁడిల్లిరక్
జూచి వరించె రంభ, మొఱఁ జొచ్చెఁ దిలోత్తమ దారి నిద్దఱున్
ద్రోచె ఘృతాచి ముగ్గురకు నొద్దిడి కయ్యము పుట్టె సంతలో
నాఁచుకుపోయె ముక్తిసతి నవ్విరి యద్దశఁ జూచి నిర్జరుల్
నోచినవారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే ధరన్.

చ. అహితులఁ దాఁకి పోరువెస నంబుధి కల్గిన నాఁటి రాము నో
గ్రహణమునాఁటి పార్థు గదగాఁ గౌరవు నేసిన నాఁటి భీము నా
గ్రహ మెసఁగం బురత్రయము గాల్చిన నాఁటి లలాటలోచనున్
మహినుతమింపఁగాఁ దగు నెసైలమభీముని భీమవిక్రమున్.

ఉ. నేపథుబ్రహ్మఁ జేరె నిజనిర్మలతేజము సూర్యులఁ జేరె నా
కారము కాముఁ జేరె నధికంబగు లక్ష్మి యనంతుఁ జేరె గం
భీరత వార్ధిఁ జేరెఁ గల పెంపు కులాద్రులఁ జేరెఁ గీర్తి దా
నూఱటలేక త్రిమ్మరుచునున్నది సైలమభీముఁడీల్గినన్.

## చిక్కభీముఁడు

మ. తెరలం బాఱి సభాంబుదాఁకినఁ బయోధిం జొచ్చినన్ శైలగ
హ్వరముల్ దూఱినఁ జిక్కభీముఁడు పృథ్వీనాతంబుఁ బోనిచ్చునే
గరుడుండై చని పట్టి మింటితుద నుగ్రగ్రాహుఁడై వచ్చి సా
గరమధ్యంబున ద్రుంచుఁ బట్టుకొను సింగంబై గుహాంతంబునన్.

క. ఆలమునఁ జిక్కభీముఁడు
వా లతివేగమునఁ బెఱికి వడి తునుఁ గవియన్
ద్రోలి పడ బనగి నేసెను ?
పతేరును గసిమి ఖైరవేశుం డెఱుఁగన్.

---

౩ ఈరెండుపద్యములు చాటుపద్యమణిమంజరి మొదటిసంపుటము 114 వ పుటలోనివి. మిగిలినవి రెండవసంపుటము ౬౮ వ పుటలోనివి.

## మైలమభీముఁడు

ఉ. వీరగుణప్రతాప గుణవిశ్రుత! మైలమభీమ! నీ యశం
బారభమాన తారకరహారవిలాసము నీ నికేతనం
బారభమాన తారకరహార విలాసము నీభుజార్గళం
బారభమాన తారకరహార విలాసము చిత్ర మిద్ధరన్.

చ. అసమునఁ గాసికానగరమం దసువుల్ త్యజియించినంతనే
యసదృశమైన కన్ను గల దచ్చట మైలమభీమభూప నీ
యసిఁ దెగిపడ్డ వైరులకు నంబకముల్ పదినూఱు లయ్యెనీ
యసికిని వారణాసికిని నంతర కొంత దలంచిచూచినన్.

అన్నదేవుని రాజమహేంద్రవరశాసనము ప్రకటించిన శ్రీ వద్దాది అప్పారావుగారు ఏఱువభీమునికి మైలమభీముఁడను నది నామాంతరమని వ్రాసియున్నారు.[4] చోడభక్తిరాజు కండ్యకోలను శాసనమును బ్రకటించిన శ్రీయుత టి. యన్. రామచంద్రన్‌గా క్రిందనుదహరించిన కారణములచే బైవారియూహ సరియైనది కాదని వ్రాసియున్నారు. "ఈ [ఏఱువ] భీమునికి మైలమభీముఁడను పేరు అతనితల్లినిబట్టియే కలిగినయెడల (అట్లీతోచును) వారియూహ [అన్నదేవునిశాసనము ప్రకటించిన శ్రీ వద్దాది అప్పారావుగారి యూహ] సరియైనది కాదని చెప్పవలెను. ఏలన వారు ప్రకటించిన రాజమహేంద్రవర శాసనమువలననే ఏఱువ భీమునితల్లి అన్నమాంబ యని తెలియుచున్నది. ఏఱువ భీమునికి నల్లభీముఁడను పేరు వర్ణమునుబట్టియో ప్రవర్తననుబట్టియో కలిగియుండునని" రామచంద్రన్‌గారు వ్రాసియున్నారు.[5] పర్యాలోచనమున మైలమభీమ ఏఱువభీమ, నల్లభీమనామము లొకరివే యనియు శ్రీ వద్దాది అప్పారావు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగార్ల 'ఏఱువభీమ, మైలమభీమ పదము లొక్కనిపేర్లే'[6] యన్న యూహ సరియైనదే యనియు

4 J. A. H. R. S. Vol I, P. 172 H.
5 Bharati July 1931 Page 120 ff.
6 చాటు పద్యమణిమంజరి. Vol II p. 58.
7 S. I. I. Vol. IV no 1216.

తోఁచుచున్నది. ఏలయన ద్రాక్షారామభీమేశ్వరస్వామివారి యాలయములోనిదగు శక 1043 నాఁటి శాసన మొకటి యీచోడవంశమునకు సంబంధించినట్టియు, ఏఱువ భీమునితండ్రి దేవమోయని సంశయింపఁదగినట్టిదియుఁగాఁ గన్పించుచున్నది. దీని ననుసరించి సమస్తభువనాశ్రయ మహారాజాధిరాజపరమేశ్వర పరమభట్టారక సత్యాశ్రయకులతిలక శ్రీ మత్త్రిభువనమల్లదేవరకాలమున సమధిగతపంచమహాశబ్ద మహామణ్డలేశ్వర వీరమాహేశ్వర కోడూరుపురవరేశ్వర సూర్య్యవంశోద్భవ కులతిలక కాస్యపగోత్ర కరికాలాన్వయనామాది సమస్త ప్రశస్త సహిత శ్రీమన్మహామణ్డలేశ్వర ఏఱువ తొణ్డయరాజుల మహాదేవి మైలమదేవి శకవర్షంబులు 1043 చైత్రబహుళ అమావాస్యా బుధవారమునాడు ద్రాక్షారామభీమేశ్వరమహాదేవర కొక అఖండదివిము సమర్పించినట్లు తెలియుచున్నది. చాటుపద్యములయందు ఏఱువభీమ, మైలమభీముల పరాక్రమముల వర్ణనను బట్టి యొకరేమోయనఁ దగియుండుటచేతను, పై శాసనములోని ఏఱువమాండలికుఁడగు ఏఱువతొణ్డయరాజు ఏఱువభీముని తండ్రియనియు, మైలమమహాదేవి తల్లియనియు, [ఏఱువమాండలికుఁడగుటచే ఏఱువభీముఁడనియు, మైలమమహాదేవి పుత్త్రుఁడగుటచే మైలమభీముఁడయ్యెననియు] అన్నదేవచోడుని శాసనమందు ఏఱువభీముని తల్లిగా సూచింపఁబడిన అన్నమాంబ ఏఱువతొణ్డయరాజుల రెండవభార్యయనియు నూహింపవలసియున్నది. తండ్రికి యిరువురు భార్య లున్న యిరువురి పేర్లనుగూడ శాసనముల నుదాహరించుట యీవంశీయుల కాచారమే. [8] ఏఱువతొణ్డయరాజు కుమారుఁడు, ఏఱువమాణ్డలికుఁడగుటచే

---

8 స్వస్తిశ్రీ శకవర్షంబులు 1259? అగు కేటిపురాధిప,ఆశ్వయుజ శు ౧౦ యందు సూర్యవంశోద్భవులైన భక్తి రాజుంగారి అన్నెమ్మదేవంమ్మగారికిన్ని, నిరవద్యపుర చక్రవైరాలంకారమైన చాళుక్య నారాయణబిరుదుగల పనుమండి చోడరాజుంగారి కుమారుడైన నాగరాజుంగారి, లక్ష్మీదేవంమ్మగారికిన్ని వుదయించిన వీరదేవమ్మగారికిన్ని వుదయించిన గండరగండభేరుండ రాయవేశ్యాభుజంగ రవికులతిలక రాజపరమేశ్వరరూప నారాయణ................సకలదేవాదిబిరుద అన్నెమ్మదేవభూపాలుడు etc.

Local Records Vol II page 210.

ఏఱువభీముఁడనియు, మైలమమహాదేవులకు జనించినవాఁడగుటచే మైల
మభీముఁడనియు వర్ణమునుబట్టి నల్లభీముఁడనియు నీతనినామము వ్యవ
హరింపఁబడి యుండును. అందుచే ఏఱువభీమునికి మైలమభీముఁడనునది
నామాంతరమను నూహ సరియైనదే యని తోఁచుచున్నది.

ఇఁకఁ జాటుపద్యములలోను, శాసనములలోను నుదాహరింపఁ
బడిన చిక్కభీముఁడు, ఏఱువభీముఁడు నొకరా? వేర్వేఱువ్యక్తులా? యను
విషయము చర్చింపవలసియున్నది. ఈచిక్కభీముని శాసన మొకటి ద్రాక్షా
రామభీమేశ్వరాలయములో మనకు లభించుచున్నది. [9] కాని యీశాస
నము మిక్కిలి యసంపూర్ణముగాఁజదువఁ బడినది. దీని ననుసరించి మన
కీ క్రింది వంశవృక్షము లభించుచున్నది.




పై వంశములోని నంబిరాజుయొక్కయు, అతనికుమారుఁడు త్రై
లోక్యమల్లరాజుయొక్కయు శాసనములు శక 1053[10] శక 1081[11] నాఁటి
వి రెండు మనకు లభించుచున్నవి. వీని ననుసరించి చిక్కభీమరాజుతండ్రి
త్రైలోక్య మల్లరాజనియు 'సమధిగతపంచమహాశబ్ద మహామణ్డలేశ్వర

9. S. 1. 1. Vol IV no 1039.

10. S. I. I. IV No 1127.

11. S. I. I. IV No 1128.

కొల్లిపాకపురవరాధీశ్వర దుర్జయకులకుముదచంద్ర రిపుగజమృగేంద్ర మల్లికావల్లభ పరాంగనాదుర్లభ విలాసవిద్యాధర భోగపురంధర కృష్ణవేణ్ణానదీతీరదక్షిణషట్సహస్రవిషయాధీశ్వర వీరమాహేశ్వర కీర్తిసుధాకర గుణరత్నరత్నాకర వేంగీచాళుక్యమూలస్తంభ రిపుదళితకుంభికుంభ జయాంగనాగ్రహతోరణ సత్యహరిశ్చంద్ర దీనానాథ జనసస్యప్రమేఘవర్ష సంభ్రమరిగండ్రవారణనామాదిసమస్తప్రశస్తిసహితుడైన సింగేయమార్గాధిపతి యని తెలియుచున్నది.

ఏఱువభీముని తండ్రియని సూచించిన ఏఱువతొండయరాజుబిరుదావళులు, చిక్కభీమునితండ్రియగు త్రైలోక్యమల్లరాజు బిరుదావళులతోఁ బోల్చిచూచిన, ఏఱువభీముఁడు, చిక్కభీముఁడు సమకాలికులైనను వేఱ్వేఱువంశములకు సంబంధించినవారని తెలియుచున్నది. ఏఱువతొండయ, ఏఱువభీములు కరికాలాన్వయులు సూర్యవంశోద్భవులు కోడూరుపురవరేశ్వరులు. చిక్కభీముని సంతతివారు దుర్జయకులమువారు 'శ్రీ క్రిష్ణవేణ్యానదీదక్షిణషట్సహస్రావనీవల్లభ కొల్లిపాకసప్తసహస్రావనీవల్లభులు. వీరువురి బిరుదావళులుకూడ భిన్నములే. అందుచే చిక్కభీముఁడు ఏఱువభీముఁడు సమకాలికులే కాని నొకరు మాత్రము కారని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.[12]

మనకు లభించిన ఏఱువతొండయరాజుల శాసనమునుసరించి అన్నదేవచోడుని రాజమహేంద్రవరశాసనములోని వంశావతారక్రమ మొకపురుషాంతరము ముందుకు జరిగినది. ఈ చోడవంశమునకు ఏఱువతొండయరాజు మూలపురుషుఁడగుచున్నాఁడు. పశ్చిమచాళుక్యచక్రవర్తియగు ఆఱవవిక్రమాదిత్యునికి సామంతుడై ఏఱువభూమండలీకులుగానుండి, తరువాత రాజకీయపరిస్థితులలోఁ బ్రాముఖ్యతవహించినదీ చోడవంశము.

---

12. చిక్కభీము నివురాజ్యాలు [illegible] కొల్లిపాక పరిపాలించిన పరిచ్ఛేదవంశీయుల శాసనములు [illegible] (S.I.I. IV rs 985-986) చిక్కభీముని సంతతివారి నీపరిచ్ఛేదవంశమువారు సాధించియుందురు.

# తృతీయోల్లాసము.

| | | | |
|---|---|---|---|
| ౧ | పొంగారన్ వివరింతునేర్పడ | క. | పొంగారన్ వినిపింతుసమ్మతి |
| | గేడింపక యాదరింపుఁడు | క. | గీడింపక యాదరింపుఁడు. |
| | | గ. | గేటింపక యాదరింపుఁడు. |
| ✓ | దూషణమేళనంబు | క. గ. చ. | దూషకామేళనంబు |
| | వెలయుగుణములు | ,, | వెలయుగుణముల |
| ౬ | తనుఁజెప్పమదింపనిపెద్ద | ,, | తనుఁజెప్పి మదింపనిపెద్ద |
| ౮ | పరభూపాల పలాయన | గ. చ. | పరభూపాళి పలాయన |
| ౧౦ | అరుదగు | చ. | అరుదుగ |
| | నయప్రియుచేతికినిచ్చి | క. గ. చ. | నయక్రియ చేతికినిచ్చి |
| ✓ ౧౧ | సద్ద్విజాతుల వంశప్రభవుండు | ,, | సద్ద్విజాములవంశప్రభవుఁడు |
| | అన్నాయకుఁడభిమతముగ | ,, | అన్నాయకుఁడభినుతముగ |
| | అనఁబొగడొందుఁ | ,, | అనఁబెంపొందుఁ |
| ౧౮ | కీర్తిసతివార్తల నిమ్ములనించు | ,, | కీర్తిసతివార్తలఁగ్రిమ్ములదించు |
| | లచ్చికేయెడల | ,, | లచ్చికీయెడల |
| | ధీరలకుఁ జిత్తమునందు | ,, | ధీరులకుఁజిత్తమునందు |
| ౨౦ | వరాళికపయిఁ | క. చ. | వరాటికపయిఁ — |
| | గౌడిపై | క. గ. చ. | గాళిపై |
| | నీమాటలరాతిరాజతనయా | ,, | నీమాటలరాగరాజతనయా |
| ౨౩ | పృథివి నేతత్సహాయులు | ,, | పృథివినేతృ సహాయులు |
| ౨౪ | తగుఁగార్యపేశలుండు | క. | గురుకార్యపేశలుండు |
| | | గ. చ. | గురువాక్యపేశలుండు |
| | తొడఁగి నవ్వించునేని | క. గ. | తొడఁగి నగిపించునేని |
| | | చ. | తొడరి నగిపించునేని |

౨౫ ఒప్పున్ మదత్వంగత్ క.గ.చ. ఒప్పుస్మతి త్వంగత్

౨౬ గుణాయత్తార్థములు ,, గుణాయతభేదములు

౨౭ వ పద్యమునకుఁ దరువాత "అదియె" అనికలదు.

౨౮ శీలార్జవకలితయు క. శీలార్జనకలితయు

౨౯ సంధివేళలఁ క. గ. చ. సంధికాలముఁ

౩౦ పరిణీత రాగరసముల ,, పరిణీత యంగరసముల

౩౧ రసముసంమునగు నుతింప ,, స్వీయ రసమునగునుతింప

తనకు పెండ్లిమాటలు గ.చ. తనదు పెండిలిమాటలు

౩౪ కైకొని యెపుడుమీఱుచున్న క.గ.చ. కైకొనియెప్డుదారుమున్న

౩౬ జవ్వనములోన నడుగిడ ,, జవ్వనములోన నడుగిడి

నివ్వటిలగబద తెలుఁగని క. నివ్వటిలఁగ బహుతెలుఁగని

గ. నివ్వటిలం గరుడుతెలుఁగని చ. నివ్వటిలంగబుడుతెలుఁగని

ముగ్ధయనఁగనభినుత క.గ.చ. ముగ్ధయనఁగ నభినుత

౩౭ ఆత్మసీమంబున కస్త్రాడు ,, ఆత్మసీమంబున కస్త్రాడు

గ్రాలఁగడఁగు వాలికచూడ్కి. క. గ్రాలఁగదురువాలికచూడ్కి

సిగ్గుతో సుడివడంగ క. గ. చ. సిగ్గులో సుడివడంగ

నలకనైతోఁచు ,, నలికనై తోఁచు

ఊష్మశరదాగమంబుల ,, ఉష్ణశరదాగమంబుల

౩౮ సమలజ్జయుఁ బ్రేరేపఁగ ,, సమలజ్జయుఁ బేరేపగు

౩౯ సమాయతాంగవిస్ఫూర్తిపై. క. సమాయతాంగవిస్ఫూర్తికి

సంపత్తి దళుకులొత్త క.గ.చ. సంపదదళుకులొత్త

మృదుగల్ల పాళిపై క. మృదుగండపాళిపై

భావజక్రీడఁగవఁగూడి చ. భావజక్రీడగమిఁగూడి

సూచన:—"నుబ్బుచుల్లంబు జనువులనుగ్రహింప" అను సీగీతపాదము క. గ. చ. ప్రతులు మూఁడింటను రెండవపాదమై యధికముగఁ గనపట్టుచున్నది. ఇట్టిగీతి పంచపాదిదై యున్నది.

౪౧　కొంగులోపలఁ బిక్కటిల్లె　క గ.చ. కొంగులోపల గ్రక్కటిల్లెడు
　ప్రణయానురాగ సంపత్తిలో ,, ప్రణయానురాగసంపత్తితో
　పీడ్వాటుపనిగల　,, పీడ్వాటుపనిగల

౪౨　ధీరాధీరయు ధీరేతరయును　గ.చ. ధీరాధీరయధీరయును
　అనంగఁద్రివిధాఖ్యలిలన్　క. యనఁగనెనఁగుఁ ద్రివిధాఖ్యలిలన్
　　గ. చ వరుసఁద్రివిధాఖ్యలిలన్.

౪౪　లసితములైన లేఁజెమరులన్ క.గ.చ. లసితములైనకొంజెమటలన్
　శ్రమంపడకుండిన　చ. శ్రమంపడకుండిన

౪౫　నేరమిఁ చేసినపతి　క. గ. చ. నేరము చేసినపతి
　ధృతికడకోదవన్　క. ధృతికడలోడువన్
　　గ. చ. ధృతికదలోదవన్

౪౬　ప్రతిభవహించిలాటి క. చ. ప్రతిభసహించి. క. తాళి
　పతిపయిఁ బాఱఁజిల్కి క. గ. చ. పతిపయిఁబాఱఁజల్లి
　పరికించెనోకదే　,, పరికించియోకదే

౪౯　ఊటాడఁ బల్కి　క. ఊటాటఁబల్కి
　తరుణిమానము లేఁతకు　క. గ. చ. తరుణిమానపు లేఁతకు

౫౦　చూపుచూపులనలరింపదయ్యె ,, జూచుచూపులుపచరింపదయ్యె
　నెన్నడఁజూపుచుండుటన్　,, నెన్నడఁజూపుచూపులన్

౫౧　మాటలనా　,, మాటలయది
　తగవరిదలఁపన్　,, తగవడిఁదలఁపన్

౫౨　సంతతమోదంబు　,, సంతతమోహంబు
　సోత్ప్రాసోక్తికింజొచ్చినన్　,, సోత్ప్రాసోక్తిచేఁజొచ్చినన్

౫౪　పర్యాప్తికినెగ్గుగా　గ. చ. పర్యాప్తికి సిగ్గుగా
　క్ష్మాపవ్రాతకిరీటుమ్రొక్కి క.గ.చ. క్ష్మాపవ్రాతముచూడమ్రొక్కి
　　క. చ. తెలచెంజాళుక్యపిశ్వేశ్వరున్
　ఇలిచెజాళుక్యవిశ్వేశ్వరున్　గ. తెలసెంజాళుక్యవిశ్వేశ్వరున్

౫౬ సంప్రవాసినివాసకసజ్జిక క. గ. చ. సంత్రివాదినివాసకసజ్జిక

౫౯ చతురత్వంబలరారుచుండె క. గ. చ. చతురత్వంబెలరారుచుండె

రత్నగర్భయన లాభంబు గ. చ. రత్నగర్భయగు లాభంబు

౬౧ కర్ణాటికాశ్మీరతో క. గ. చ. కర్ణాటికస్త్రీటితో

౬౨ మతిదండాడుకుంజెంబెడు క. గ. మతిదరపిల్లుచునుండెడు

చ. మతిమఱపిల్లుచునుండెడు

తలంచిచన్న గ. చ. తలంచుచున్న

౬౩ ఆశలమాఱుపాటు క. గ. చ. ఆశలమాగుపాటు

౬౪ నవరసగీతవాద్యము క. గ. చ. నవతరగీతవాద్యము

గవయగు రాచకర్జము ,, గవమగురాచకర్జము

౬౬ మంగిటికై నడసాగసపాంగము తిమిరంబెదిరల

క. గ. చ. మంగిటికినడగుసాగదపాంగము తిమిరంబురేకు

నడపగం దవితో క. లరయుడతనితో గ. చ. ంరయుదరనిలో

౬౭ ఘనాఘనాకలితము క. గ. చ. ఘనాఘనావళితముఙ

భయదోద్యచ్ఛతకోటి క. చ. భయదోద్యచ్ఛాంకోటి

చపలావలోకములు శోభిల్లఙ చ. చపలావలోకనము శోభిల్లఙ

మెచ్చికవయుఙ క. గ. చ. మెచ్చంగవయుఙ

౬౯ తెలియండ ,, తెలియుండ

౭౧ చాళుక్యక్షితినాథ ,, చాళుక్యక్షితిపాల

నీవేలోజాలము ,, నీవేలోయాలము

౭౩ పరిలేపస్ఫుటహేమకుంభ ,, పరిపూర్ణస్ఫుటహేమకుంభ

వెలుంగు పురి ,, వెలింగి పురి

౭౪ చెలియుదా సియుధాత్రియు ,, చెలియుధాత్రితనూజయు

లింగినియుం గారుప్రను ,, లింగినీకారుప్రలు

ప్రియతంత్రములను ,, ప్రియతంత్రములకు

| | | | |
|---|---|---|---|
| ౭౬ | గానివిభావాది | గ. చ. | గ్లానివిభావాది |
| | సద్మకాలాదిరసప్రరోహణము | క.గ.చ. | అశ్మకాష్ఠాదిరసారోహణము |
| | శాసనాగ్రహసంచారి | గ. చ. | శాసనాసక్తసంచారి |
| ౭౭ | చతురశ్రోత్రసుఖాకరామృత | ,, | చతురశ్రోత్రసుధాకరామృత |
| ౭౮ | దివ్యంబైన కృతిత్రయంబ | ,, | దివ్యంబైనశ్రుతిత్రయంబ |
| | అక్షయ్యంబులై పేర్చు | ,, | అక్షయ్యంబులైయుండు |
| ౮౦ | అలవివేకియు | ,, | అతివివేకియు |
| | ఈహితకావ్యములను | ,, | ఈహితకార్యములను |
| ౮౧ | ఛలవర్ణగుచ్ఛపిచ్ఛిల | ,, | ఛలవర్గగుచ్ఛపిచ్ఛిల |
| ౮౩ | బహువిధయమకార్థబంధ | క. గ. చ. | బహువిధయమకానుబంధ |
| | నిహితవిచిత్రములై | క. | విహితవిచిత్రములై |
| ౮౬ | శబ్దములును విరళములగు | క. గ. చ. | శబ్దముల నవిరళములగు |
| ౮౭ | శబ్దాదిదోషపటుగుణ | ,, | శబ్దార్థదోషపటుగుణ |
| ౮౮ | సుందరత శక్తి యదియా | ,, | సుందరశక్తియ యదియా |
| ౯౦ | సపున విహరింప రవ్విభులు | ,, | సపునవిహరించి రవ్విభులు |
| ౯౧ | గద్యపద్య విమిశ్ర | ,, | పద్యగద్య విమిశ్ర |
| ౯౨ | తత్త్వావ్యంబు భవ్యంబిలన్ | గ. చ. | సత్త్వావ్యంబు భవ్యంబిలన్ |
| ౯౪ | కేళీవిహారదీర్ఘిక | క. గ. చ. | కేళీవినోదదీర్ఘిక |
| | భ్రాంతసుస్థితమైన | ,, | భ్రాంతసంస్థితమైన |
| | ఎప్పుడు నొప్పు | ,, | ఇప్పుడు నొప్పు |
| ౯౫ | గురుసుధాప్తియు | ,, | గరుసుదావియు |
| | నరుదారంగ నజుని | క. | నరుదెంచంగక నజుని |
| | | గ. చ. | నరుదేరంగనజుని |
| ౯౯ | ఉన్నత సర్వోత్తర | క. | ఉద్గత సర్వోత్తర |
| | పోలెన్ జూడనంభోధికిన్ | ,, | పోలన్ జూడనంభోధికిన్ |
| ౯౭ | రుచితయును మొదలుగా | క. గ. చ. | రుచిరతయు మొదలుగా |

౯౮ చెలువారఁగ నవరత్న ,, చెలువారఁగ ఘనరత్న
మంగళనాదంబులతోడ ,, మంగళనాదంబులు జెప్ప
౯౯ సమాంకితముకుళ ,, సమంకితముకుళ
నుతింపఁబడు వసంతముసందఁగ ,, నుతింపఁదగు వసంతముసందఁగ
౧౦౦ కీరము లంగజాత గ. చ. కీరము లంతజాత
పల్లవార్చులు దలిర్చఁగ క.గ.చ. పల్లవార్చులఁ దనర్చఁగ
విశ్వనాథావనీవరుతో ,, చంద్రవంశావనీవరుతో
౧౦౧ సరసపటీరోశీర ,, సరళపటీరోదార
౧౦౨ ధారామండితసాలభంజికల ,, ధారామందిరసాలభంజికల
యంత్రోద్గళత్సారామోద క. యంత్రోద్గరత్సారామోద
విస్తారంబులై పర్వ క. విస్తారంబులై పర్వ
౧౦౩ కరకాంత్రాతస్ఫుట గ. చ. కరకాపాతస్ఫుట
౧౦౪ సద్యోల్లసద్విపులానందము క.గ.చ. సద్యోల్లసద్విపులానందము
అంబరాభరణ సద్వేషంబు ,, అంబరాభరణ సంద్వేషంబు
సేవించుప్రగల్భకామినిగతిఁగ క. సేవించి ప్రగల్భకామినిగతిఁగ
౧౦౫ వన్నె వెట్టును క. గ. చ. వన్నె వెట్టుచు
ఘనస్తోమంబుసంబర్వ ,, వనస్తోమంబుసంబర్వ
నవరాజద్రాజహంసావళిఁగ ,, నతరాజద్రాజహంసావళిఁగ
ఆమోదప్రదమైన ,, ఆమోదప్రదమైన
౧౦౭ బలవత్ప్రాలేయక ,, బలవత్ప్రాలేయక
౧౦౮ కాశ్మీరససాంకవాగురు ,, కాశ్మీరరసాంకవాగురు
పట్టికాంబర గ. చ. పట్టకాంబర
౧౧౦ మూతుగుపందలాత్మలఁగ క. మూతుగు బంద లాత్మలఁగ
౧౧౧ కైరవపుంజవిలాసంబు క. గ. చ. కైరవపుంజవిలాసంబు
కొంకుగాక వెన్నెలగ్రోలెడు ,, కొంకుక వెన్నెలగ్రోలెడు
పోడవుసందగుఁబోగడఁగ క. పొడవుదగుఁ బోగడంగ
గ. చ. పొడవుసందగుఁ బోగడఁగ

౧౧౨ అదెరౌద్రాకృతిఁజూచె క. గ. చ. అది రౌద్రాకృతిఁదోఁచె
ఆటోపమేపారె	క. ఆటోపమేపార
ఆపదఁదూలించెను	క. గ. చ. ఆపదఁదూలించెను
నచ్చుటనవెలుంగు	గ. చ. నచ్చునయవెలుఁగు

౧౧౩ హారతానచ్చరితుఁడు క. గ. చ. హారరాజచ్చరితుఁడు

౧౧౪ ఆదిమమూలంజననొప్పు క. గ. ఆదిమమూలంబున నొప్పు

౧౧౫ చారుతరచైత్ర సంపత్ గ. చ చారుతర నేత్రసంపత్

౧౧౬ పొగడను సొబగొప్ప	క. పొగడల సొబగొప్ప
గ. చ. పొగడల బాగొప్ప
సురపొన్న మేని	గ. సురపొన్న మేని
మన్మథారామముల	క. మన్మథాంగావలుల
గ. చ. మన్మథాగావలుల

౧౧౭ వళులునువీచికావళులు క. గ. చ వలలును వీచికావళులు
నాభులుఁ సుడులు చేతులు ,,	నాభులుఁ దిరులు చేతులు
మించులుగొనుచూడ్కులఁ గ. చ. మించులు గనుచూడ్కులఁ

౧౧౮ కాదంబరి నాపానమునకు క.గ.చ. కాదంబరి యాపానమునకు

౧౨౦ తొయ్యలి యొర్తొక్కతె	,,	తొయ్యలి యొర్తొక్కతె
ఉగ్మలి యొర్తొక్క	,,	ఉగ్మలి యొక్కర్తుక
గోష్ఠిచేఁ	క. చ గోష్ఠిలోఁ. గ. గోష్ఠితోఁ

౧౨౧ తనరు నెనబడినాల్గు	క. గ. చ. తనర నెనబడినాల్గు
వానికి స్ఫురణసొంపు	,,	వాని విస్ఫురణసొ పు

౧౨౨ చొక్కుచెమర్చిన	క.	చెక్కుచెమర్చిన
మురిపెంపు సిగ్గున	క. గ. చ. మురిపంపు సిగ్గున
అరిగి శయనీయము	,,	అలగి శయనీయము

౧౨౩ కడువెచ్చుటలును. క కడుమెచ్చుటలును గ.చ. కడువెచ్చుటులును

౧౨౪ తగనెల్ల వివేకము క. తగవెల్లవివేకము. గ. చ. తగవెల్లివివేకము

౧౨౫ విజయముననుబ్బి	క.గ.చ. విజయమునకునుబ్బి

| | | | |
|---|---|---|---|
| ౧౨౭ | కన్యావరాభిరమ్యక్రియలున్ | గ. చ. | కన్యాపరాభిరమ్యక్రియలున్ |
| ౧౨౮ | కడుమచ్చిక నెచ్చెలులు | క. గ. చ. | కడుమక్కువ నెచ్చెలులు |
| ౧౨౯ | పుత్రోదయమందు | ,, | పుత్రోత్సవవేళ |
| ౧౩౧ | అగుగూఢాభ్యంతరముల | ,, | అగూఢభిత్త్యంతరంబు |
| | నగశృంగంబుల | ,, | నగశృంగంబున |
| ౧౩౨ | నెమ్మిమైం దరలు చో | క. గ. చ. | నెమ్మికింగొరలుచో |
| | దేశకాలగతులున్ | క. గ. చ. | దేశకాలగతియున్ |
| | నిర్ణయించుటనునీ | ,, | నిర్ణయింపుమనునీ |
| ౧౩౩ | నవ్యసునీతియు | ,, | నవ్యసనీతియు |
| | దూత్యమునను జను | ,, | దూత్యమునంగంజను |
| ౧౩౪ | ఉత్తేజుండగు | ,, | ఉత్తేజంబగు |
| | దూతోద్యోదార | ,, | దూతోదార |
| | స్వాంతత నిగ్రహించు | ,, | స్వాంతత విగ్రహించు |
| | నరనాథౌఘుం బెవర్తించు | క. | నరనాథౌఘుంబు వర్ణించు |
| | | గ. చ. | నరనాథౌఘుంబవర్తించు |
| | నత్యుత్తుంగాచల | ,, | గత్యంత్తుంగాచల |
| ౧౩౫ | వ్యూహాదికములు | క. గ. చ, | వ్యూహాదికముల |
| | స్ఫుటరుచులు | ,, | స్ఫుటరుచుల |
| ౧౩౬ | అమరాహీనరవంబు | క. గ. చ. | అమరాలాపరవంబు |
| | ప్రతిఘాతనధ్వనులు | ,, | ప్రతిఘాతినిధ్వనులు |
| | అగ్రిమవిశ్రాంతికి | ,, | అగ్రిమవిక్రాంతికి |
| ౧౩౭ | అరుదారంగాచిహ్నతుల | క. గ. చ. | అరుదారంగాంచిహ్నతులు |
| ౧౩౯ | కావ్యంబు నంతటం బాటించి | ,, | కావ్యంబునాదటం బాటించి |
| | స్ఫుటభేదంబులెఱింగి | ,, | స్ఫుటభేదంబు నెఱింగి |
| ౧౪౦ | రాజనరేంద్రవంశజుండు | ,, | రాజనుహేంద్రవంశజుండు |
| | కీర్తిరామ రఘురామ | ,, | కీర్తిధామరఘురామ |

# చతుర్థోల్లాసము.

---

| | | | |
|---|---|---|---|
| ౧ | శ్రీవిశ్వేశ్వర కరుణాశ్రీ | క. గ. చ. | శ్రీవిశ్వేశ్వరచరణ శ్రీ |
| | కీర్తి శ్రీ విశద. క. కీర్తి శ్రీదళిత గ. చ. | | కీర్తిశ్రీ వలిత |
| ౨ | విరచింపఁదగుఁ | చ. | వివరింపఁదగుఁ |
| 3 | దేవనమస్కృతి | క. గ. చ. | దైవనమస్కృతి |
| | వితతాశీఃపద మొండె | గ. | వితతాశీర్వద మొండె |
| ౪ | కవిసంసిద్ధపదంబు | క. గ. చ | కవిసంసిద్ధిపదంబు |
| ౫ | గద్యాత్మకంబు | ,, | గద్యాత్మికంబు |
| ౬ | ఆరూపమచంపూకావ్యత | ,, | ఆరూపమచంపూకావ్యము |
| ౭ | ఇటువలెనె ముక్తకాది | ,, | ఇటువలె ముక్తపదాది |
| ౯ | ద్వికమునాఁగసలరు | ,, | ద్వికంబునానమరు |
| | త్రింశదాఖ్యమవల | ,, | త్రింశదాఖ్యమాల |
| ౧౧ | ఉదాహరణమను | ,, | ఉదాహరణయను |
| ౧౨ | త్ర్యశ్రాదివితతయుతి | క. | త్ర్యశ్రాదివితతియుతి |
| ౧౪ | ఝుటనాఁగ. క. ఝుటినాఁగ. | | గ. చ. మొటినాఁగ |
| | పంచమి పాణినాఁబరఁగు | క. గ. చ. | పంచమి వాదినాఁబరఁగు |
| | కీర్తిమతి సుభగయును | ,, | కీర్తిమతియు సుభగయు |
| | నాఁగను నొప్పునెపుడు | ,, | నఁగనొప్పునెపుడు |
| ౧౫ | నామధేయసమములుగా | ,, | నామధేయసమములై |
| ౨౦ | నాయక విభవములనకు | క. | నాయక విభవములరు |
| | | గ. చ. | నాయక విభవములకు |
| ౨౨ | సరివిభక్తుల | క. | సతవిభక్తుల |
| | సిద్ధమగుచు | క. గ. చ. | సిద్ధమగుచు |
| ౨౩ | ఉత్ఫుల్లకమది | ,, | ఉత్ఫులకమరి |

| | | | |
|---|---|---|---|
| ౨౪ | కథనమిదియు | ,, | కథనమిదియ |
| | తెలియుఁడొాండెడ | క. | తెలియదొాండెడ |
| | పటుపదార్థాప్తి | క. | పటుపదార్థాప్త |
| | | గ. చ. | పదపదార్థాప్త |
| | తత్ప్రిదవిధులజ్ | గ. చ | తత్పదవిధులజ్ |
| ౨౫ | బిరుదములనఁజనువానిన | క. గ. | బిరుదములనఁ జను దానను |
| ౨౬ | వితరణ శబ్దపూర్వ | క. గ. చ. | వితరణలబ్ధపూర్వ |
| | బిరుదార్థము చెప్పుట | ,, | బిరుదావళిచెప్పుట |
| ౨౮ | తాళదళమ్ములు | ,, | తాళదళంబుల |
| | భాషం బొాలుపుగఁనమరింపుఁడు | ,, | భాషల బొాదలుపుడమరిం పుఁడు. |
| ౨౯ | గదురుపట్లను నెడనెడ | క. | గదురుపట్ల నెడనెడ |
| | | గ. చ. | గలుగుపట్టుల నెడగెడ |
| | జయదేవదేవయనెడు | క.గ.చ. | జయ జీవ దేవయనెడు |
| 3౧ | మెండగుదళము | క. | మెండుగదళములు |
| | తుదపైనుండును | క. తుదపైనుండెను గ.చ. | తుదపైనుండెడు |
| | నొండెనరుగచ్ఛనులై | క. గ. చ. | యొండెయుతగుచ్ఛములై |
| 3౨ | వెడలింపఁగవలయు | ,, | వెడలింపఁగవలయు |
| 33 | కవిభిభుని | క. | కరివిభుని |
| | సింధురముగ దీవసల | క. గ. చ. | సింధురుగాదీవెసల |
| 3౪ | దళాష్టకమిడిన | ,, | దళాష్టకమిట్లు |
| 3౫ | ఆదిమాక్షర యమళకము | ,, | ఆదిమాక్షరయమకములు |
| | చతుఃస్కంధములయందు | ,, | చతుష్కంధములయందు |
| | సచ్ఛముగ | ,, | సచ్ఛముగ |
| 3౬ | కవినామనాయక | గ. చ. | కవినాథనాయక |
| | స్వస్తివచః కవితాద్య | క. | స్వస్తివచః కలితాఢ్య |

| | | | |
|---|---|---|---|
| ౩౭ | పద్యమునఁ జతుర్దళమున | క. గ. చ. | పద్యమునఁ జతుర్దళియును |
| | గల ఘనపద్యము | ,, | గల ఘనగద్యము |
| | గుచ్ఛతతి యనవలయుఁ | ,, | గుచ్ఛతతియును వలయుఁ |
| ౩౯ | కామసహితస్తుతులన్ | క. గ. చ. | కామసేవ్యస్తుతులఁ |
| ౪౦ | సరియాపది రేకులచే | ,, | సరిఁజౌపద రేకులచే |
| ౪౧ | రంగద్ద్విదళినపొసఁగ | ,, | రంగద్ద్విపదలనుబొసఁగ |
| | కృతిసంగతయగు | క. | కృతిసంగతియగు |
| ౪౪ | కృతులకువిశ్వేశచక్రవర్తి | క. గ. చ. | కృతులకుఁ జాళుక్యచక్రవర్తి |
| ౪౬ | విశ్వేశుఁడు శివచూడామణి | ,, | విశ్వేశుఁడు నిజచూడామణి |
| | వెండికొండకొండికయయ్యెఁ | ,, | వెండికొండకొండయ యయ్యెఁ |
| ౪౭ | తియ్యనిపలుకుల్ | ,, | తియ్యఁబలుకులుఁ |
| | సలికపునడుములు | ,, | నళికపునడుములు |
| | విభునిపొలఁతులకెపుడుఁ | ,, | విభునిపురవనితలకుఁ |
| ౪౮ | తగవిశ్వేశ్వరుఁజేసిరి | ,, | తగవిశ్వవిభునిజేసిరి |
| ౫౦ | ఉత్కంఠరంగావించు | ,, | ఉత్కంఠతఁగావించు |
| ౫౧ | సాగరుండని | ,, | సాగరంబని |
| ౫౨ | లాటీర్ఝూటీవధూటీ | చ. | లాటీఘోటీవధూటీ |
| | కైరవాసక్తములుగనదులం | క. గ. చ. | కైరవాసక్తములుగనలులం |
| ౫౪ | చారుగుణంబు లరాతిరాజ | ,, | బారుగుణంబులు రాజరాజి |
| ౫౫ | లోకమునఁబేర్చు | ,, | లోకములఁ బేర్చు |
| | పాకమనఁగమధురంబు | ,, | పాకమధికమధురంబు |
| ౫౭ | లీలామన్మథమంథరంబులు | ,, | లీలామంథరమన్మథంబులు |
| | ఉచితాకూతానురాగంబులుఁ | ,, | ఉచితాకూలానురాగంబులుఁ |
| ౫౮ | అంతర్గూఢార్థసరస్వాంతంబగు | ,, | అంతర్గూఢార్థరసస్వాంతంబగు |
| | కామినీమణులు కుప్యద్దర్పలై | ,, | కామినీజనులుకుప్యద్దర్పలై |
| ౬౧ | శ్రవ్యముగనదియు | ,, | శ్రవ్యముగనదియ |

| | | | |
|---|---|---|---|
| ౬౨ | గంగయందనంగ | ,, | గంగయందుమంద |
| ౬౪ | వైరిపాలుపు. | క. వైరిపాడుపు. గ. చ. | వైరిపాడవు |
| ౬౬ | శాతమదాష్టదంతులు | క. గ. చ. | సాతిమదాష్టదంతులు |
| | వ్రాతమునిల్వనయ్యొ | ,, | వ్రాతము విన్ననయ్యొ |
| ౬౮ | సాత్వతియునునటభారతియుఁ | చ. | భారతియును నటసాత్వతియుఁ |
| | కరణీయంబుల్ | క. గ. చ. | కరణీయ లొంగిఁ |
| ౬౯ | సరళరచిత | క. | సకలరచిత గ. సరసరచిత |
| ౭౧ | దళదిందీవర | క. | దళితేందీవర |
| | సంవళితస్నేహములుఁ | క. గ. చ. | సంవళితస్మేరములుఁ |
| | సంపూర్ణంబులై యత్తతిఁ | ,, | సంపూరంబులై యత్తతిఁ |
| ౭౧ | ఆసూఢాభ్యుద్గతార్థయత్న | ,, | ఆసూఢాత్యుద్గతార్థయత్న |
| | ద్భుతముల్గాక్రామము | | ద్భుతముల్దాక్రామము |
| ౭౨ | భైరవమహోద్యత్తడ్గ | ,, | భైరవభుజోద్యత్ఖడ్గ |
| | భంగించు దండించు | ,, | భంగించు తుండించు |
| ౭౩ | చెప్పఁబడునవియును | ,, | చెప్పఁబడినయవియు |
| ౭౫ | ఈషదుక్తిప్రగల్భ | ,, | ఈషదుక్తప్రగల్భ |
| ౭౬ | ఉబ్బును రొంగిఁ | ,, | ఉబ్బును రనిఁ |
| ౭౮ | ఈడితలగు | చ. | ఈడితమగు |
| | పాంచాల లాటికా | క. | పాంచాలిలాటికా |
| | కావ్యాడంబరకరుణార్థ | క. | కావ్యాడంబర కరణార్థ |
| ౮౦ | జనునదిపూరణ | క. గ. చ. | జనునదివితరణ |
| ౮౧ | విశదాల్పప్రాణవర్ణ | చ. | విశదాల్పప్రాసవర్ణ |
| ౮౨ | కోమలమైనరచన | క. గ. చ. | కోమలమైనవచన |
| | నాఁగఁగ్లిష్టశాస్త్ర | ,, | నాఁగశ్లిష్టశాస్త్ర |
| | స్మృతివాదపటిష్ఠ | చ. | స్మృతిపాఠపటిష్ఠ |
| ౮౩ | పదములతో నర్థము | క. గ. చ. | పదములలోనర్థము |
| | సలలితమగునెచట | గ. | సలలితముగనెచట |

| | | | |
|---|---|---|---|
| | వలిపపుంబయ్యెద | క. | వలి పెపుంబయ్యెద |
| | తొలకాడెడు | చ. | తొలుకాడెడు |
| ౮౬ | తనరంగ్రియాకారక | క. గ. చ. | తనరుక్రియాకారక |
| ౮౭ | ఓజోగుణమనంగా | ,, | ఓజోరీతి యనంగను |
| | బాహుళ్యము రా | ,, | బాహుళ్యముఁదా |
| | భాజనమైయొప్పు | చ. | భాజనమై నెగడు |
| ౯౦ | వర్గద్వితీయబహుత | గ. చ. | వర్గతృతీయబహుత |
| ౯౧ | యాద్విజయజనంబులో | క. గ. చ. | యద్విజయజనంబులన్ |
| | ఉత్కటయును నా | ,, | ఉత్కటయును నై |
| ౯౨ | సరిత్సారితాత్రిభృష్టాధి. | చ. | సముత్సారితాత్రిభృష్టారి |
| | చళుక్యవిశ్వవిభు | గ. | చళుక్యవిశ్వపతి |
| | పెంపొందితా | క. గ. చ. | పెంపెట్టిదో |
| | క్రీడాగతిఁ | క. గ. | క్రీడాగతుల్ |
| ౯౩ | శూరారులశ్రుత | గ. చ. | శూరాదులశ్రుత |
| | రంభాపరినృత్యకృత్యముల | క. | రంభాకృతనృత్తనృత్యముల |
| | | గ. చ. | రంభాకృతనృత్యకృత్యముల |
| ౯౬ | తఱుచు లేక | క. గ. చ. | తఱుచుగాక |
| ౯౮ | తనరుమాధుర్యగుణమునఁ దగును జెప్ప | | |
| | క. గ. చ. పొసఁగ మాధుర్యమునఁ జెప్పటగుణంబు | | |
| | నోజమునఁ జెప్ప | క. | నోజమును జెప్ప |
| ౯౯ | దక్కియున్నప్రాణములు | క. గ. చ. | చిక్కియున్నప్రాణములు |
| ౧౦౧ | మనుమోహేంద్ర | ,, | మనుభూపేంద్ర |
| | ప్రకారక్రమా | ,, | ప్రకామప్రమా |
| ౧౦౨ | నందకపాణి | చ. | నందకహేతి |
| | శైవకళా | ,, | శైవకథా |
| | శూరసైన్యాళిజైత్రా. | క. గ. చ. | శూరసైన్యాతిజైత్రా |

# పంచమోల్లాసము.

---

| | | | |
|---|---|---|---|
| ౧ | శ్రీకాళీపతిపద | క. గ. చ | శ్రీకాశీపతిపద |
| 3 | అదిమొయ్యదియనఁగా | ,, | అవిమొయ్యవియంటేని |
| | ప్రకారంబులైవర్తిల్లు | ,, | ప్రకారంబులఁ బ్రవర్తిల్లె |
| ४ | జాతియనంబరఁగు | ,, | జాతియునననఁబరఁగు |
| ౫ | నిర్మలమునై | ,, | నిర్మలినమై |
| | వాలొప్పున్ | ,, | వాలేఁచున్ |
| ౯ | ప్రతిపాదోపమలు | ,, | ప్రతిపాదోపములు |
| ౧౦ | ఇంపుం గలుగంగఁజేయు | గ. | ఇంపుంగదఃరంగఁజేయు |
| ౧౨ | ప్రౌఢప్రియమై | క. గ. చ. | ప్రౌఢప్రియమై |
| ౧3 | చెవికెఱబఱమగు క. చెవికెరపడమగు గ. ఎడపరమగు | | |
| | | చ. | ఎరసరమగు. |
| ౧४ | వనధివిపులం బనఁగన్ | | వనము విపులంబనఁగన్ |
| ౧४ | చంద్రుఁడవదాతుఁడు | గ. | చంద్రుఁడరరాతుఁడు |
| | | చ. | చంద్రుఁడరదాతుఁడు |
| | ఉపమ లపహాసనకరములు | క. | ఉపమలపహాసంకరములు |
| | | గ. చ. | ఉపమలపహాసాకరములు |
| ౧౫ | క్రియాపదములుఁ బొలుచుచోట | క. గ. చ. | క్రియాపదములఁ బోల్చుచోట |
| | దొరయుగడ | క. గ. చ. | దొరసుగడ |
| ౧౬ | సాటి పగిదినా | ,, | లాగరిదియొన |
| | పరుసునాఁగను | ,, | పరసునాఁగను |
| ౧౭ | ప్రపంచితము రూపకంబు | ,, | ప్రపటుకమది రూపకంబు |
| | బహువిధలీలన్ | ,, | బహువిధమఃలిలన్ |

| | | | |
|---|---|---|---|
| ౧౮ | చకోరసంఘములు | ,, | చకోరసంఘమును |
| ౨౧ | సాంద్రతరంబుగనెల్లెడ | ,, | రుంద్రతరంబుగనెల్లెడ |
| ౨౩ | మొదలను నడుమనునొండెన్ | ,, | మొదలందుద నడుమనొండెన్ |
| | పొదలితదర్థము క. పొదరితదర్థము గ. పొదచితదర్థము | | |
| | కృతులనందంబెపుడున్ | క. గ. చ. | కృతులకందంబెపుడున్ |
| ౨౪ | బలిబలిభేదములకు | ,, | బలిబలభేదములకు |
| | విభుఁడెల్లపలన్ | ,, | విభుఁడెల్లపుడున్ |
| ౨౬ | విశ్వేశ్వరుండిచ్చుఁజో | ,, | విశ్వేశ్వరుండిచ్చు చో |
| ౨౮ | తత్పురవర పరిఖా | క. చ. | తత్పురపురపరిఖా |
| ౩౦ | నలుగాలనిలిచె | క. గ. చ. | నలుగాలనడచె |
| ౩౧ | నడమునిమేధోక్తి | ,, | నడపునిమేధోక్తి |
| ౩౩ | వేఱయర్థము యోజించి | ,, | వేఱయర్థము నోజించి |
| ౩౪ | క్షమలో వేఁడని | ,, | క్షమతో వేఁడని |
| ౩౫ | కామవిహితస్వభావ | ,, | కాక విహితస్వభావ |
| ౩౮ | స్ఫురదాధ్మాత | గ. | స్ఫురణోదార |
| | చలదస్పష్ట | క. | చరదస్పష్ట |
| ౩౯ | తగువినిహితార్థగర్భిత | క. గ. | తగువిహితార్థాగర్భిత |
| | | చ. | తగువిహితార్థ విగర్భిత |
| ౪౦ | మూర్తులంగదిసి క. మూర్తులంగవిసి | గ. చ. | మూర్తులంగదిసి |
| | దుర్వర్ణంబు నర్థించి | క. గ. చ. | దుర్వర్ణంబు నగ్గించి |
| ౪౨ | పొరినేకపదముచే | ,, | పోలికపదంబుచే |
| ౪౩ | పెల్లేమని చెప్పనంతయు | ,, | పెల్లేమని చెప్పనెంతయు |
| ౪౪ | చెలువంబగు | ,, | చెలువంబుగ |
| | ఉత్ప్రేక్షావ్యంజనములచే | ,, | ఉత్ప్రేక్షావ్యంజకములచే |
| ౪౫ | ఇంపారనది | క. | ఇంపారునది |
| ౪౮ | ఇద్ధక్రియాసంపూర్ణంబులు | క. గ. చ. | ఇష్టక్రియాసంపూర్ణంబులు |

| | | | |
|---|---|---|---|
| ౫౦ | అవనిపాలపాలకునిచే | ,, | అవనిపాల పాలితులచే |
| | అశ్వారూఢులు నంబరాభరణ | గ. చ. | అశ్వారూఢులునుంబ రాభరణ |
| | చారుస్థితిఁ సత్కవుల్ | క. గ. | చాటుస్థితిఁ సత్కవుల్ |
| ౫౧ | సంలక్షితమై | ,, | సంవీక్షితమై |
| | కైకొనఁదగు | క. గ. | చేకొనఁదగు |
| ౫౩ | దేశకల్పనముత్తోడి | క. గ. చ. | లేశకల్పనముత్తోడి |
| ౫౪ | గదిసిననేర్పుతోడ | క. గ. | గదిసిననోర్పుతోడ |
| ౫౫ | ఉపమలఁబరిపాటి | క. గ. చ. | ఉపచితపరిపాటి |
| | నొడువన్నిపుణత్వము | గ. చ. | నొడువునన్నిపుణత్వము |
| ౫౯ | అసితంబగు రత్నాది | క. గ. చ | లసితంబగు రత్నాది |
| ౬౦ | చెలిమాటుచేరి | గ. చ. | చెలిమాటచేరి |
| | పడంగనిమ్ముల | క. గ. చ. | పడంగఁ గ్రిమ్ముల |
| ౬౧ | స్మితములచ్ఛవెన్నెలఁ | ,, | స్మితము లేఁతవెన్నెలఁ |
| ౬౨ | తృణముగఱచి జేయని | క. | గఱచి బేయని |
| | కనుఁగొని కాచుట | గ. చ. | పసివడిగాచుట |
| | గొనకొని యరి | క. | గొఁకొని యరి |
| ౬౩ | రుద్రుండగు విమతనరో | క. గ. చ. | రుద్రుండు విరతనగరో |
| | ముద్రణత కదనగతి | గ. చ. | ముద్రణత పవనగతి |
| ౬౪ | అమరావతికరగించుమ | క. గ. చ. | అమరావతికరగింపుమ |
| ౬౫ | పరఁగినభీతిఁ | ,, | పఱచినభీతిఁ |
| ౬౬ | శుండాలశుండావలీ | క. | శుండాలతుండావలీ |
| ౬౮ | మహిమవినికని | గ. చ. | మహిమకనివిని |
| | అమరనగములనమల | క. | అమరనగరములంపాల |
| ౭౨ | సురుచిరరత్నకీలితము | క. | సురుచిరరత్నకీలములు |
| | | గ. చ. | సురుచిరరత్నకీలనము |

| | | | |
|---|---|---|---|
| | తెలిచిపుచ్చువెలుంగున | క. గ. చ. | తెలిచిపుచ్చుపలుంగుల |
| | నెచ్చెలులంతటంతటన్ | ,, | నెచ్చెలులంతసంతటన్ |
| | సురుచిరసాలభంజికల | ,, | సురిగిరిసాలభంజికల |
| | చొక్కపుజోటులవోలె | ,, | చొక్కపుబోటులవోలె |
| ౭౩ | దైవవశమునఁజాగెనేని | ,, | దైవవశమునసాగెనేని |
| ౭౪ | పదమంజరులున్ | క. | పదసుంజరులన్ |
| ౭౫ | అతులైశ్వర్యాశ్రయముల | క. గ. చ. | అతులైశ్వర్యాశయముల |
| | నంచితసంపద్బహుళము | గ. చ. | సంచితసంపద్బహుళము |
| ౭౬ | మండనమహోదారాయ్యంబు | క. గ. చ. | మండనమహావర్యంబు |
| | అహితనుతిశ్రీకంబు | ,, | అహితనుతశ్రీకంబు |
| ౭౭ | భావింతురు విశ్వభూవిభుని | గ. చ. | భాషింతురువిశ్వభూవిభుని |
| ౭౮ | ఏకార్థోక్తంబయ్యు | క. గ. చ. | ఏకార్థంబేయయ్యు |
| | ననేకార్థముచిలుకుచుండు | ,, | ననేకార్థముఁబలుకుచుండు |
| ౮౦ | మరునుద్వేలదశోక | గ. చ. | మరునుద్వేలదశోక |
| | విశ్వభూపవిపులోద్యానావళి | గ. చ. | విశ్వభూపతిపురోద్యానావళి |
| ౮౧ | ప్రీతివిషయేతరార్థ | క. గ. చ. | ప్రీతివిశేషతరార్థ |
| | పతాకయెత్తరు | ,, | పతాకయెత్తను |
| | త్రోవరుద్భట | ,, | త్రోవసుద్భట |
| | రవంబెలర్పరతి | ,, | రవంబెలర్పదట |
| | స్ఫుటజూటంబులఁదాల్తురు | ,, | స్ఫుటజూటంబులఁద్రాల్తురు |
| ౮౪ | నిర్ఘాతంబు ఘోరానల | క. గ. చ. | సిర్ఘాతంబు కాలానల |
| ౮౫ | తమలోనొంటనురెంటఁ | ,, | తమలో నొంటనిరెంటఁ |
| | లోచనముల నశ్రువారములు | ,, | లోచనములనశ్రుపూరములు |
| | సాల్వుడు | క. పాల్వుడు చ. | సాల్వుడు. |
| ౮౭ | సేవాదికంబుల విసువుచేత | క. గ. చ. | సేవాదికంబుల విసపుచేత |
| | అడియునొనర | ,, | అడియయొనర |

| | | | |
|---|---|---|---|
| ౮౮ | ఒరులవంకఁ జరింపమి | ,, | ఒరులవంకఁ జలింపమి |
| | పశులకు నెల్లవృత్తి | క. | పశులకు నెల్లప్రీతి |
| | అభీప్సి తేందిరావసుమతియైన | క. | అభీప్సి తేందిరావసుపతియైన |
| | దృష్టియవృత్తి | గ. | దృష్టియతృప్తి |
| ౯౦ | ఇంతులనేఁపక | క. | ఇంతులనంపఁగ |
| | కాంతలనేఁపక | ,, | కాంతలనేఁపఁగ |
| | వధూటులనేఁపక | ,, | వదూటులఁబేల్పఁగ |
| | | గ. చ. | వధూటులఁ బ్రేల్పక |
| | ఏరీతినటంచు | క. గ. చ. | ఏరీతులనంచు |
| ౯౧ | పరమైన నపరమైనను | గ. చ. | వరమైన నవరమైనను |
| ౯౨ | నుండియుఁ జెందకుండిరేఁ | క.గ.చ. | నుండియు వేఁడకుండిరేఁ |
| | నత్తెఱఁగు నిశ్చితకృత్యమ | ,, | నిత్తెఱఁగు నిశ్చితకృత్యమ |
| ౯౩ | క్రియాసదృశయగుచు | ,, | క్రియాసదృశియగుచు |
| | సంఘటనమునేఁ | ,, | సంఘటనములుఁ |
| ౯౪ | సాగె దిక్కులను | ,, | సాగె దిక్కులకు |
| | పరాగముప్రాకె నభంబు | గ. చ. | పరాగముద్రాకె నభంబు |
| ౯౫ | వెడవీఁకల పోకలనారి | క. గ. చ. | వెడవీఁకల ప్రోఁకలనారి |
| | తూపెచటఁదోలిన | ,, | తూపెచటు దోలిన |
| ౧౦౦ | చూచి తద్విభుమహత్వం | ,, | చూచితద్విభుమహత్త్వం |
| ౧౦౧ | సవరనయి | క. | సమరనయి |
| ౧౦౨ | ఘనకీలాలములుబ్బఁ | క. గ. చ. | ఘనకీలాలమునుబ్బ |
| ౧౦౪ | సూక్ష్మబంధముగ క. సూక్ష్మబోధమున | గ.చ. | సూక్ష్మబోధనము |
| | ఒజ్జలవి దర్పమెలర్ప | క. గ. చ. | ఒజ్జలయి దర్పమెలర్ప |
| ౧౦౫ | శైవతంత్ర విలసత్ | గ. | దైవతంత్ర విలసత్ |
| ౧౦౬ | కంఠీరవుఁడుద్బంధుర | క. గ. చ. | కంఠీరవ ముద్బంధుర |
| | వరాహకేతుఁడు | క. | వరాహకేతువు |
| | కుముదబాంధవుఁడెపుడుఁ | క. గ. చ. | కుముదబంధుండెపుడుఁ |

# షష్ఠోల్లాసము.

| | | | |
|---|---|---|---|
| ౧ | విజయ తత్పరవేశుఁడు | చ. | విద్యాతత్పరవేశుఁడు |
| ౨ | లోలిన యొకకొన్ని | గ. చ. | లోలిన నొకకొన్ని |
| ౫ | ఆనంద కరణమగును | క. గ. చ. | ఆనందకరణమగుచు |
| ౬ | సమకోప విభూషిత | చ. | సమకోపవిభూప్రియ |
| | భూమిభృద్బహు | క. | భూమిభుగ్బహు |
| ౭ | అంగాంగికములచేత | క. | అంగాంగికతనచేత |
| | | గ. చ. | అంగాంగికలనచేత |
| ౮ | సత్రాచారము చెప్పనొప్పు | క.గ.చ. | క్షత్రాచారము చెప్పనొప్పు |
| | సమ్యక్ప్రీతి వర్తింతురు | క. | సమ్యక్ప్రీతిఁ గీర్తింతురు |
| | ఒకతెఱఁగిది | గ. చ. | ఒకతెఱఁగిడి |
| ౧౧ | శబ్దార్థ ప్రకటనముల | ,, | శబ్దార్థప్రకటమ్ముల |
| ౧౪ | సుందర రతిహాసరుచులు | క. గ. చ. | సుందరదరహాసరుచులు |
| ౧౬ | అక్కజంపుటన్నెక్కక | చ. | అక్కజంపు నన్నెక్కక |
| | బ్రదుకునిక్క | క.గ. చ. | బ్రదుకనిక్క |
| | నరేంద్రుఁడిక్కడఁ | క. | నరేంద్రుఁడక్కడఁ |
| ౧౭ | చక్కదమర్థా | గ.చ. | చక్కడమర్థా |
| ౧౮ | నామధారకుల | క. గ. చ. | నామధారికుల |
| ౧౯ | ఆఖ్యఁ బెరయుఁ | ,, | ఆఖ్యంబడయుఁ |
| ౨౦ | వావినచేరవె | ,, | వాలికఁజేరవె |
| | | గ. చ. | వాలినఁజేరవె |
| ౨౨ | నిత్యసముత్థ క. నిత్యసమృద్ధ | గ. చ. | నిత్యసమృద్ధి |
| ౨౩ | చెప్పనెఱఁగనేని | క. గ. చ. | చెప్పనెఱఁగిరేని |
| ౨౪ | ఎసకమెసఁగ | ,, | ఎసఁగమెసఁగ |
| | వారలు ప్రజలుగారు | ,, | వారును బ్రజలుగారు |

౨౬ వితీర్ణియా గ. వితీర్ణయా

వితీర్ణికసితకీర్తి క. గ. చ. వితీర్ణికి సితకీర్తి

ఉత్తమ నిత్యసంపదల్ ,, ఉత్తమనిత్యసంతతుల్

౨౭ సారనామాఖ్యఁ జెందుఁ చ. సారసమాఖ్యఁ జెందుఁ

౩౩ విశ్వవిభుని పటువిక్రమముల్ క. గ. చ. విశ్వవిభునిపటువిభ్రమముల్

౩౬ తుదను భావాలంకార ,, సరసభావాలంకార

యమకంబాదృతము ,, యర్థంబాదృతము

౩౭ ఇంపుగఁదొడరి గ. చ. ఇంపుగఁ జెలఁగి

గతులకల్యాణ ,, నతులకల్యాణ

౩౮ పద్మాకరమన క. గ. చ. పద్మాకరమున

పరికల్పితమగుచు ,, పరికల్పితయగుచు

౩౯ పరగండ భైరవునికవి ,, కరవాలభైరవుని కవి

౪౧ వసవర్గాఙ్కుంను గ. చ. వసవర్గాంకుంను

౪౩ శౌచప్రతాపాతి చ. శౌచప్రతాపాది

బలభద్ర బంధురంబు క. గ. చ. బలభద్రబంధురతయు

౪౪ వ పద్యముతరువాత గ.చ ప్రతులలో నీకందపద్యమధికముగాఁగన్పట్టుచున్నది.

క. శరణాగత జనరక్షక
ధరణీరథ (ధర) శీతశైలఁ (దళితశైల) తనయేశలస
ద్ధరిణాంక కళాధరశం
కర శాంత దయానాథ కాశీనాథా!

౪౬ కవితసంత్యభాగాక్షరముల్ క.గ.చ. కవితసంత్యపాదాక్షరముల్

౪౭ చతురు పరార్థ్యశీలు ,, చతురుఁబదార్థశీలు

అభీప్సితభూరిదానముః గ. చ. అభీహితభూరిదానముః

౫౬ భావనజీవుః క. గ. చ. పావనజీవుః

౫౭ భావనజీవున్ ,, పావనజీవున్

| | | | |
|---|---|---|---|
| ౫౮ | శ్రితులు వొగడుదురు | గ. చ. | శ్రితులు వరగుదురు |
| | సిరివరఁగుటకై | గ. | సిరిగలుగుటకై |
| ౫౯ | గలవర్ణములతోడి | క. గ. చ. | గలవర్ణములనైన |
| ౬౧ | ధితిమించి | ,, | ధృతిమించి |
| | శ్రితినిర్మితికిసిలియిచ్చిరి | ,, | కృతినిర్మితికినిరియించిరి |
| | గిరిపతాకిచెంగటివిమతుల్ | ,, | కిరిపతాకిచేఁ గవివితతుల్ |
| ౬౨ | సుముఖులుసుఖులును | గ. చ. | సుముఖులునుందుం |
| ౬౩ | గోసారులునుంజళుక్య | క. గ. చ. | గోసారులునై చళుక్య |
| ౬౫ | ప్రవరగుణగరిష్ఠుఁ | ,, | ప్రవణగుణగరిష్ఠుఁ |
| | ధాతవిశ్వేశుఁగాంచుఁ | గ. | భావవిశ్వేశుఁగాంచుఁ |
| ౬౬ | వలయనవకంబు | క. | వలయదశకంబు |
| | ఆఱురేఖలుఁ లిఖించి | గ. చ. | ఆఱు జేకులు లిఖించి |
| | వీతిక్రమాత్మిప్రియా | గ. చ. | వీతిక్రమాత్మిక్రియా |
| ౬౮ | ఎనుబదిపదములుగా | క. గ. చ. | ఎనబదిపదములుగా |
| ౬౯ | ద్విడధీశనుత్య | ,, | ద్విషధీశనుత్య |
| | భావార్థసారజ్ఞు | ,, | భావార్థసారజ్ఞ |
| | నుచ్ఛ్రితసారస్వతభూతి | క. | తచ్ఛ్రితసారత్వవిభూతి |
| | | గ. చ. | సంచితసారత్వవిభూతి |
| ౭౦ | పురుజులుదట్టాడి | ,, | పురుజులందట్టిడి |
| | | క. | పురుజులదట్టాడి |
| ౭౧ | మధుమత్సమ | ,, | మధుభిత్సము |
| | సంగతదోషంబులు | క. గ. చ. | సంగతిదోషంబులు |
| ౭౩ | కొన్నికొన్నిధర | చ. | కొన్నిగల్గుధర |
| | ఉత్థితవేగాకుల | గ. చ. | ఉద్ధతవేగాకుల |
| | డిండీరపిండాకృతిఁ | క. గ. చ. | డిండీరఖండాకృతిఁ |
| | ధృతిసందర్భముచోట | క. | ధృతి సంధ్యర్థముచోట |

| | | | |
|---|---|---|---|
| ౭౪ | సముదితములై | క. గ. చ. | సముదితములగు |
| | అసుఖాస్పదములయి | ,, | అసుఖాస్పదములగు |
| ౭౫ | సందిగ్ధనష్టప్రయోజన | ,, | సందిగ్ధకష్టప్రయోజన |
| ౭౬ | అప్రయుక్తిపదమున | ,, | అప్రయుక్తపదమన |
| ౭౭ | ఆహవములఁ బొల్లులగునే క. | చ. | ఆహవమునఁబొల్లలగునే |
| | | గ. | ఆహవమునఁ బోలలగునే |
| ౭౮ | ధరనేలె ననఁగ | క. గ. చ. | ధరయేలెననఁగ |
| | వనధికి నీవనధరపదము | క. గ. చ. | వనధికినై వనధరపదము |
| | నలిననియెడునదియొగినన్ | ,, | వలవనియెడనలినొగినను |
| ౮౧ | ఎపుడుననిన | చ. | ఎపుడుననఁగ |
| ౮౩ | అప్రయోజన సంశ్లిష్ట | క. గ. చ. | అప్రయోజకసంశ్లిష్ట |
| ౮౪ | పురికాంతలనఁగ | ,, | పురికాంతలనిన |
| | . స్థితియుచితమనంగ | ,, | స్థితియుచితమొయనంగను |
| ౮౮ | జాడపడు | క. | జాడఁబడు |
| ౮౯ | జనపతికృప | గ. చ. | జనపతికృత |
| ౯౦ | నీరొలుకబట్టఁగడు | క. గ. చ. | నీరొలికి పట్టుఁగడు |
| | అన్నట్లన్నెరని | చ. | అన్నట్లన్నారని |
| | | గ. | అన్నట్లన్నరస |
| ౯౧ | నాతిగనయంబ | క. | నాతికనయంబు |
| | పొక్కిలిరొంపి | క. గ. చ. | పొక్కుడురొంపి |
| ౯౨ | బర్బరతర్కిత | గ. | బర్కరతర్కిత |
| ౯౨ | అవనికైన | గ. చ. | అవనిపైని |
| | గల్గుమైత్ర్యకారణంబు | క. గ. చ. | కలుగుమిత్రకారణంబు |
| ౯౫ | పునరుక్తికంబు | ,, | పునరుక్తకంబును |
| | వ్యాకీర్ణంబునాఁగ | ,, | వ్యాకీర్ణంబునెల |
| | సమాప్తిక పునరాత్తకంబు | ,, | సమాప్తితపునరాత్తకంబు |

| | | | |
|---|---|---|---|
| ౯౭ | ఈపద్యమున, ప్రతుల మూడింటను సంధులుకలిసియే యున్నవి. | | |
| | పలుకులలో నచ్చులు | ,, | పలుకులతో నచ్చులు |
| ౯౮ | ఆజినెసంగునెడల | క. గ. చ. | ఆజికిఁ జూగునెడల |
| ౧౦౦ | గంభీరమగు మనంబు | ,, | గంభీరమరిమనంబు |
| | పెక్కుమాటల నొకమాట | ,, | పెక్కుమాటలకొకమాట |
| ౧౦౨ | జగంబుల నెల్లఁ | ,, | జగమ్ముల నెల్లఁ |
| | సుందరతను శూరతనన | గ. | సుందరతను శూరతనానన |
| ౧౦౩ | చొప్పునెఱుంగఁడు | క. గ. చ | చొప్పున నెఱుఁగఁడు |
| ౧౦౫ | వదులభంగినైరి | | వదులభంగులైరి |
| ౧౦౬ | పరునకు నరిపదము | ,, | పరునకు ననుపదము |
| ౧౦౭ | నెగడనెగడె | ,, | నెగడె నెగడి |
| ౧౧౦ | వారకవనగృహము | ,, | వైరికి వనగృహము |
| ౧౧౧ | మార్కొనఁ బలుల | ,, | మార్కొనఁ బులుల |
| | ఈభటుఁడనంగ | గ. చ. | ఈభటుఁడు నాఁగ |
| ౧౧౨ | ఓలిఁజెప్పెద నొప్పఁ | క. గ. చ. | ఓలిఁజెప్పెదునొప్పఁ |
| ౧౧౩ | తత్త్వంబనంగ | క. గ. | తత్త్వంబుననఁగ |
| ౧౧౪ | ధనదునకు | క. | ధనదులకు |
| ౧౧౫ | కులమును పౌరుషంబు | క. గ. చ. | కుల మురుపౌరుషంబు |
| | ఈవితతు లేల | ,, | ఈవిమతు లేల |
| ౧౧౬ | కుక్కలును బోలెదనుజులు | ,, | కుక్కలునుబోనిదనుజుల |
| | మిక్కుటముగఁ గదర | ,, | మిక్కుటమునఁ గదరి |
| ౧౨౨ | కృత్యంబు గడచి | ,, | కృత్యంబుగదిశి |
| | అవలిపని సేయునని | ,, | ఔలఁ బనిసేయునని |
| | చెప్పునట్టికృతుల | ,, | చెప్పునట్టికవిత |
| ౧౨౩ | నీసూడరిమాటలు | క. | నీచూడరిమాటలు |
| | | గ. | నీచూడనిమాటలు |

౧౨౪ పోడిమిచెఱునట్టి క. గ. చ. పోడిమిచెఱునిట్టి
౧౨౬ చర్మగోరక్షణార్థంబ గ. శర్మగోరక్షణార్థంబు
౧౨౭ తలఁపవు చూపులు క. సొలపపుచూపులు
గ. తలపపుచూపులు చ. తలవపుచూపులు
౧౨౯ దిక్సమయకవిరుద్ధ గ. చ. దిక్సమయజవిరుద్ధ
౧౩౦ దనియించునాఁగ గ. చ దనియించునఁగ
౧౩౧ గ్రీష్మకాలంబుమత్తిలి ,, దేశకాలంబు మత్తిలి
వారలమెదనించు క. చ వారలసదరించు
గ. వారలనదలించు
౧౩౫ శాంతియు నితనికి గ. చ. శాంతమునితనికి
దయితలనక క. గ. చ. నైతులనక
అసంగతిస్తుతి క. గ. చ అసంగతస్తుతి
౧౩౮ అపుష్టార్థప్రవిహతి క. గ. చ. అపుష్టార్థార్థవిహతి
౧౪౧ చ్యుతసంస్కృతి క. చ్యుతిసంస్కృతి
గ. చ. చ్యుతిసంస్మృతి
౧౪౨ అలంకారము శాస్త్రీయంబ క గ. చ అలంకారముగ శాస్త్రీయంబ
తొలఁగనెఱుచుటకొఱకై ,, తొలఁగనేఁరుటకొఱకై
౧౪౫ మారావృస్సై ,, మారవృసస్సై
నిభృతవరమనస్కై గ. చ. విభృతవరమనస్కై
౧౪౬ రణశూరతా క. గ. చ. సమరశూరతా
జయవాజిక్రై క. చ. జయదాజక్రై గ. యజవాజక్రై

# సప్తమోల్లాసము.

| | | | |
|---|---|---|---|
| ౧ | కోవిదుకై నయవిశేష | క. గ. చ. | కోవిదునకునై యశేష |
| ౫ | విద్యాకందము | క. | విద్యానందము |
| ౬ | వాచకాభినయము | క. గ. చ. | వాచికాభినయము |
| ౮ | ప్రియయది యేటిది | క. చ. | ప్రియయిది యేటిది |
| | | గ. | ప్రియయిడియంటిది |
| ౯ | గిరిజాతాకృతులు | క. గ. చ. | గిరిజాత్మాకృతులు |
| | గరుడునిపై | ,, | గరుడునికై |
| ౧౦ | అవియెయ్యవియనిన | ,, | అవియెయ్యవియంటేని |
| | కదాసజ్ | చ. | సవాసజ్ |
| | సహాసణ్ | గ. చ. | నహాసణ్ |
| | తిర్యగుదిత | క. గ. చ. | తిర్యగుచిత |
| | వాక్యాంతరంబులంబోల్లులై | ,, | వాక్యాంతంబునఁ బొల్లవ్రాలై |
| | నగణంబులు గ్రమంబున | ,, | నగణంబులనఁ గ్రమంబున |
| ౧౧ | చెప్పఁబనిదను | ,, | చెప్పుపనితను |
| ౧౨ | తగిలించున్ | ,, | తగులించున్ |
| | బ్రమిసి కాగుహా | ,, | భ్రమశికాగుహా |
| ౧౪ | అధిదైవతమంద్రు | ,, | అధిదైవతమయ్యె |
| ౧౫ | చద లధిదైవంబు | క. చ. | జలధి దైవంబు |
| ౧౬ | పింగళుఁడు కదాసజనణ్ | గ. చ. | పింగళుఁడు సదాసజ్నాన్ |
| | కృతిసిఁ జెప్ప | క. గ. చ. | కృతికిఁ జెప్ప |
| ౧౮ | సహాస ననిపలుక | ,, | నహాస ననిపలుక |
| ౧౯ | గురులుగురులఘువ్రులు నెన్ని | ,, | గురుగురు లఘువ్రులును నెన్ని |
| ౨౧ | లోవంకవాఁయ | ,, | లోవంకవాఁయి |

| | | | |
|---|---|---|---|
| | ఏవంకయు లేని వ్రాఁత | ,, | ఏవంకయు లేనివ్రాయి |
| | ఎసఁగును లఘువై | క. | ఎసఁగు లఘువునై |
| | జైవాతృక రేఖాయుత | క. గ. చ. | జైవాతృకరేఖాయత |
| ౨౩ | వపుః ప్రభ | గ. చ. | వపుః ప్రథ |
| ౨౪ | కృతికృపులునుతృపిదృపులును | క. | కృతికృతులవి తృపువిదృపుల |
| | | గ. చ. | కృత కృప్తుల విదృపులం |
| | నిలుచుపదము పిఱుఁద | క. గ. చ. | నిలిచిపదము పిఱుఁద |
| | కృతిలో నగణములకు | ,, | కృతిలో గగణములను |
| | రెట్టిగాఁదగు నెఱుఁగన్ | క. | రెట్టిగా నెన్నఁదగున్. |
| ౨౫ | కావ్యంబునన్ | క. గ. చ. | కావ్యంబులన్ |
| ౨౬ | వెలయును మాత్రాయుత్త | గ. చ. | వెలయును మాత్రాయత్త |
| ౨౭ | యుక్తిపదముల | క. గ. చ. | యుక్తపదముల |
| ౨౮ | పురనిధి శశిది | ,, | పురశరశశిది |
| | కావ్యబంధన వెలయన్ | గ. చ. | కావ్యబంధస వెలయున్ |
| ౩౨ | అచ్చుల దొరసియుండ | క. గ. చ. | అచ్చులఁదొఱఁగియుండు |
| ౩౩ | నిత్యార్యచర్య | గ. | సత్యార్యచర్య |
| | నరులఁబ్రహరించు | చ. | నరులఁబ్రహసించు |
| ౩౪ | బూాజరిపుఁడు | క. | బుక్షవిభుఁడు |
| | విశ్వమనుజనాథవిభుఁడు | క. గ. చ. | విశ్వమనుజనాథుఁడెపుడు |
| ౩౫ | ఉరుకీర్తులనెగడు | గ. చ. | ఉరుకీర్తుల వెలయు |
| | ఆబిడౌజోనిభుఁడై | క. గ. | ఆఖిడౌజనిభుండై |

విచారించేది పద్యానగలసిద్ధి:—

క. తానంతబులను వరుస
నానంచుంబలికె నియ్య (గాని) యచ్చేనియు హా
ల్లేనియుఁ జెప్పమి పూర్వా
నూనానుమతంబున వళు లుభయముఁజెల్లున్.

3౫ వ పద్యముతరువాత నీపద్యము రెండుప్రతులలో నధికముగఁ గన్పట్టుచున్నది.

తుదినున్న క.గ.చ. తుదనున్న

3౬ వాొదితమవంగడములలో క.గ.చ. పొది తమవంగడములలో

కచటతపల వర్గాక్షరముల్ క. కచటతపలు వర్గాక్షరముల్

3౭ చతురయశస్సితచ్ఛత్రి క. చతురకీర్త్యతిసితచ్ఛవి

గ. చ. చతురకీర్తివిహితచ్ఛవికి

ఆయోధనజయదాశ్వభంజకీ క.గ.చ. ఆయోధనజయదాశ్వభంజకీ

కోలఘాలునకు గ. కోలతాలునకు

తేజోవిభావసునకు క.గ.చ. తేజోవిభాసురునకు

3౯ కృకవాలునల్లె క. బుబువాలడాసి

గ. చ. బుబువాలఁబాసి

కుత్వమునకున క.గ.చ. కుత్వమునకృతి

తత్కాదిళాంత క. తత్కాదిభాంత. గ.తత్కాదితాంత

సిద్ధార్ణతతిఁ క. సిద్ధాంతతతిఁ

ఒకవంగళము క.గ.చ. ఒకవంగడము

నణలుఁజెలఁగునొకటియై ,, నణలు చెలఁ వొక్కటియై

౪౦ మదబుద్ధులుం ,, మదబుద్ధలం

పొందుటలెల్లఁబోల వే ,, పొందుటలెల్లఁబొల్ల వే

౪౧ చతురుపాయ క. సమముపాయ గ.చ.సమముపాయ

౪౨ అమమతకాస్పదంబు క. గ. చ. అమమతకాశ్రియంబు

నాదరంబరిరణక్రియ ,, నాకరంబతిరణక్రియ

అమత్తవృత్తియై ,, అమత్తవృత్తమై

౪3 మరవలఱలేక క. మరవఱలలేక. గ. చ మరవఱలు లేక

పొరిఁబొందిన పుష్పబుభుములు పొసఁగినచోటఁ

క.గ.చ. పొరిమూదినదూతిచనిన పుష్పబుభుములచోఁ 'లోఁ.క.'

౪౪ రసికవరుఁడు చ. రసికవిభుఁడు

వరుస మెఱిఁగి క. గ. చ. వరుస మెఱుఁగు

౪౫ అజ్జలాని క. చ. అజ్జలాడి గ. అజ్జలాగి
ఆవడి సభలోన క. గ. చ. ఆపడి సభలోన
పుడమి తేండ్ల నేల ,, పుడమి తేండ్రి నేల
౪౬ వితీర్ణమునకు ,, విలోకమునకు
౪౭ వళులుపరస్పరవర్ణయుక్తి క. ఉపరిస్వర వర్ణయుక్తమైనం జెల్లుఁ
గ. చ. వళు లుపరిస్వరవర్ణయుక్తి
౪౮ ప్రారబ్ధంబుల నిర్వహించు క. గ. చ. ప్రారభ్యంబుల నిర్వహించు
రాగిల్లు నుల్లాసియై చ. భాసిల్లునుల్లాసియై
౪౯ బహుధనావాప్తిచో క. గ. చ. బహుధనావాప్తిచే
౫౧ మంత్రమూర్త పంచాక్షరంబు ,, మంత్ర ముక్తపంచాక్షరంబు
౫౨ పూతార్థమహాశయుండు ,, పూతశ్రుతిమహాయశుండు.
౫౫ ద్వీపవరమత్త కేసరి ,, ద్వీపమదమత్త కేసరి
యతీంద్రియఖేలనుఁడు గ. యతీంద్రియ ఖేలనుఁడు
౫౭ వానికెల్ల నవని క. గ. చ. వానికెల్ల యవని
౫౮ కేసరి జేచినచో ,, కేసరి వ్రేసినచో
తత్పదవారిజా ,, తత్పదపారిజాత
౫౯ తర్కఖేదద ,, తర్కఖేదద
౬౦ లోకాశ్రయుబిరుదోదగ్రుఁ ,, లోకాశ్రయ బిరుదోదగ్రుఁ
డుగ్రజనవరసేనా డగ్ర నరవరసేనా
౬౧ నిత్యసత్యకృద్వ్యాప్తులు ,, నిత్యకృత్యసద్వ్యాప్తులు
౬౩ కాంతవ్యాతపజ్జీవసి గ. చ. కాంతవ్యాపతజ్జీవసీ
సాటికిఁ బాటి క. సాటికిఁ బోటి
౬౬ భూకాంతు లెట్టిచనవో క. భూకాంతు లెంతచనవో
నాకవిటోత్తముల క. చ. నాకవిదోత్తముల గ. నాకవిపోత్తముల
అన్యోన్యపదంబున గ. అన్యోన్యపదంబుల
౬౭ కొండఱోనోలాయుం క కొండఱోనోరొండెం
గ. కొండఱోనాలెండుం

| | | | |
|---|---|---|---|
| ౬౮ | అన్యోన్యహితత్వసంపదల నొందిరి | క.గ.చ. | అన్యోన్యహితానుకూలతల నందిరి |
| | సుఖానుకూలతల | గ. | హితానుకూలతల |
| ౬౯ | కలికరికల్లడంబు | క.గ. | కలుకరికల్లడంబు |
| | లోలమాస | గ.చ. | లోలమాన |
| | ఆడెడి వీటిడి | చ. | ఆడిరి వీటిడి |
| ౭౦ | మాచన్ననమాచన | క. గ. చ. | మాచన్నకుమాచన |
| ౭౧ | నుడువులనచ్చికుట | ,, | నుడువులకచ్చికుట |
| ౭౨ | కవులోడఁబడికన్ | ,, | కవులోడఁబడినన్ |
| ౭౩ | అరవిందహితుఁడు | ,, | అరవిందవిభుఁడు |
| ౭౬ | ఇడునెడఁ బ్రాసాక్షరములు | ,, | ఎడనెడఁ బ్రాసాక్షరములు |
| | పదవిభాగముల | ,, | పదవిభావముల |
| | కబ్బముల నెల్ల | ,, | కబ్బముల కెల్ల |
| ౭౭ | నిస్తంద్రములును | ,, | సతంద్రములును |
| ౭౯ | నిర్మలులగుటన్ | క. | నిర్మలమగుటన్ |
| ౮౦ | యన్నిపాదంబులకున్ | గ. చ. | యెన్నిపాదంబులకున్ |
| ౮౩ | దానాంబువివిధ | క. దానంబువివిధ | గ. చ. దానంబువిబుధ |
| ౮౪ | శీలమునుదన్నవపది | క. చ. | శీలంబువినతన్నపపరి |
| | | గ. | శీలనము వినుతన్నపతికిన్ |
| ౮౬ | తాళముదాళము | గ. చ. | తాళము తాడము |
| | ప్రాసయుక్తిం జెల్లున్ | ,, | ప్రాసయుక్తముల య్యెన్ |
| | మేదురక్రోధుఁడయ్యునవాదృతుండు | గ. | మేదురక్రోధియయ్యు ఖలాదృతుండు |
| ౮౮ | లక్షణాంబిక | క. గ. చ. | లక్షణాంబిల |
| ౮౯ | కాకోదరుఁడు | గ. చ. | కాకోదరము |
| | జగతింబరఁగున్ | క. గ. చ. | జగతింబరఁగెన్ |
| ౯౦ | ఇదిలౌకిక | ,, | అదిలౌకిక |

# గ్రంథస్వీకారము.



1. విస్మృతకళింగాంధ్రకవులు—శ్రీ అడిదము రామారావుపంతులు గారిచే రచియింపఁబడినది.
2. వాల్మీకిచరిత్రము—రఘునాథభూపాలప్రణీతము.
3. ధర్మజ్ఞచరిత్రము—శ్రీ వేపకొమ్మ గురు వేంకటసుబ్బయ్యగారు వారిసతీమణి ఆదిలక్ష్మమ్మగార్లచే సంకలితము.

పై మూఁడుగ్రంథములును విజయనగరమునందలి ఆంధ్రవిజ్ఞానసమితి ప్రచురణములు. ఈసమితివా రిదివఱలో వెలిదిండ్ల వేంకటపతిప్రణీతమగు రాధామాధవసంవాదమును ప్రథమప్రచురణముగఁ బ్రకటించియున్నారు. ఈసమితి కధ్యక్షులు భాషాభిమానులును, ఉదారస్వభావులును, శ్రీవిజయనగరసంస్థానము చీఫ్ ఇంజనీరు గానున్న శ్రీవేపకొమ్మ గురు వేంకటసుబ్బయ్యగారు. వీరలు శృంగారగ్రంథమాలాప్రకాశకులగు శ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిగారియొక్కయు విజయనగరవాస్తవ్యులగు తదితరపండితులయొక్కయు సహాయమున ఆంధ్రవిజ్ఞానసమితి నేర్పఱచి గ్రంథములఁ బ్రకటించుచున్నారు. వీ రీసమితి యాదాయము నంతయు గ్రంథప్రచురణమునకు గ్రంథకర్తలకుఁ బ్రాచీనగ్రంథసంపాదనమునకును వినియోగింతుమని తెలిపియున్నారు. ఆయుద్దేశ్య మెంతయుఁ బ్రశంసనీయము. భాషాభిమాను లీసమితిలోఁ బోషకులును,చందాదారులు నై వీరి యుద్యమమునకుఁ జేయూఁత నొసంగుదురుగాక.

పై గ్రంథములందు విస్మృతకళింగాంధ్రకవు లనునది గ్రంథకర్తలచే నిదివఱలో వ్యాసరూపమునఁ బ్రకటింపఁబడియున్నది. కొన్ని యీ పత్రికయందును, మరికొన్ని విజయనగరకళాశాలా పత్రికయందును బ్రకటితములు. వానిని గ్రంథరూపమునఁ దిరిగి ముద్రించుట యాంధ్రవాఙ్మయచరిత్రపరిశోధకుల కెంతయు నుపయోగకరము. ఇందుఁ గళింగదే

శమునకు (నేఁటివిశాఖపట్టణము, గంజాముజిల్లాలకుఁ) జెందిన పదునైదు కవీశ్వరులనుగూర్చి గ్రంథకర్తలు మనకు విపులముగఁ దెలిపియున్నారు.

రెండవగ్రంథమగు వాల్మీకిచరిత్ర మిదివఱలోఁ జిత్రాడ యము ద్రితాంధ్రగ్రంథసర్వస్వమువారిచే ముద్రింపఁబడినది. కవియగు తంజాపూరి రఘునాథభూపాలుని గూర్చియు, నతని యాస్థానమునయున్న చేమకూర వేంకటకవి మొదలగు కవీశ్వరులనుగూర్చియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు చక్కని పీఠికను వ్రాసియున్నారు. వాల్మీకిచరిత్రము మృదుమధురమై దక్షిణాంధ్రవాఙ్మయమున నగ్రస్థానమును వహించుచున్నది. కవిత్వమునుగూర్చి రఘునాథభూపాలుఁడు చెప్పిన పద్యములే యతని కవిత్వమును వర్ణించుననిన నతిశయోక్తి కాఁజాలదు.

క. చెప్పవలెఁ గప్పురంబులు
కుప్పలుగాఁ బోసినట్లు, కుంకుమ పైపై
గుప్పినక్రియ, విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్.

క. చెవులకుఁ జవులై, చల్లఁగఁ
గవులకుఁ దవులై సమస్తకావ్యకళాబం
ధువులై రససింధువులై
యవురా! యనఁ గవిత లవని నలరఁగవలదా. (1—25,16)

మూఁడవదగు ధర్మజ్ఞచరిత్ర మొకసంకలితగ్రంథము. ఆంధ్రవిజ్ఞానసమితి కధ్యక్షులగు శ్రీ వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్యగారును, వారిసతీమణిఆదిలక్ష్మమ్మగారును నాయాగ్రంథములఁగల భక్తిరసపూరితములగు పద్యరత్నముల నేర్చి, వానిని స్కాందపురాణాంతర్గతమగు ధర్మజ్ఞచరిత్రమను కథాసూత్రమునఁ గూర్చి యీగ్రంథమును రచించియున్నారు. వీరు విజ్ఞానసమితికిఁ బ్రోత్సాహకులగుటయేగాక భాషాభిమానముతో విశేషమగు వ్యయమును భరించి గ్రంథములఁ బ్రకటించుచున్నారు, వీరి కాంధ్రులు తమకృతజ్ఞతను దెలుపవలసియున్నది. పూర్వ

కవివిరచితగ్రంథములను దమగ్రంథమాలయందుఁ బ్రకటించుటయే
గాఁక వీరు స్వయముగఁ గృషిసల్పి యమూల్యములగు పద్యముల
సేకరించి, ధర్మజ్ఞచరిత మనుపేర నీప్రబంధమును బ్రకటించియున్నారు.
ఇందు వర్ణాశ్రమధర్మములు, శివయోగపద్ధతి, పంచాక్షరీమంత్రమహిమ
మొదలగునవి వర్ణింపఁబడినవి.

4. శ్రీ వేంకటాద్రీయము—తిరువూరు వెంకటాద్రిగారిచే రచింపఁ
బడినవైద్యనిఘంటువు ప్రథమసంపుటము. వెల రు 8—0—0.
ఈగ్రంథము వైద్యుల కుపయుక్తమగునటుల చరకసుశ్రుతాది
గ్రంథములఁ బరిశీలించి, ఓషధులయొక్క లక్షణములు, గుణములు,
పర్యాయపదములు, ఆఙ్గ్ల సంస్కృత తెలుఁగు ద్రవిడ, కర్ణాటాది పద
ములు, వివరణముతోడను, మూల శ్లోకములతోడను సమకూర్పఁబడినవి
సులభమగు భాషలో నాంధ్రవివరణము వ్రాయఁబడినది. పెక్కు గ్రంథ
ములఁ బరిశోధించి సంపూర్ణముగ నుండుటకై గ్రంథకర్త లిద్దానిని రచిం
చిరి. ఇయ్యది నిఘంటువని పేర్కొనఁబడినను యామయావస్తువుల గుణదో
షముల విచారణ మొనర్చునప్పుడు వైద్యవిషయములను గూడఁ దెలుపు
చున్నది. ఇది నిఘంటువునఁ బ్రథమభాగము. ఇందు ఉద్భిజ్జ వర్గము
మాత్రము కలదు. కేవలము వైద్యమునకేగాక యాంధ్రభాషకుఁగూడ
నిట్టి నిఘంటువులు మిక్కిలి యుపయోగకరములు. ప్రాచీనగ్రంథములఁ
గల పెక్కుపదముల యర్థము నిట్టి గ్రంథముల సహాయమున మనము
గ్రహించుటకు వీలగుచున్నది. గ్రంథకర్తలు త్వరలో మిగిలిన భాగము
లను గూడ ముద్రింతురు గాక. వలమువారు హాజరీకు గ్రామవాస్త
వ్యులగు గ్రంథకర్తలకు వ్రాయవలయును

---

# చాళుక్యభీముఁడు ప్రథమాంధ్ర కవి కాఁడు.

బండారు తమ్మయ్య.

ఆంధ్ర వాఙ్మయమున నింతవఱకు నుపలబ్ధమయిన గ్రంథసామగ్రిని బట్టి నన్నయభట్టారకుఁడు ప్రథమాంధ్రకవియనియు నాతని యాంధ్ర మహాభారతమే తొలికావ్యమనియుఁ బలువురుపండితుల యభిప్రాయమ యియున్నది. ఇందు కనుగుణముగనే, నన్నెచోడుని కుమారసంభవము వెలువడినతరువాతఁగూడ నాతనికావ్యము నన్నయభారతమున కిటీవలిదే యని తమకుఁ దోఁచిన యుపపత్తులతో నిరూపించు పండితు లాగ్రంథ మందలి,

క. మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

అనుపద్యమున నుదాహృతుఁడయిన చాళుక్యరాజు నన్నయభారతము నకుఁ గృతిపతియగు రాజరాజనరేంద్రుఁడే యని తలంచుచున్నారు. ప్రత్యక్షప్రమాణముగఁ గానవచ్చు నన్నయభారతమును బట్టియు నాంధ్ర వాఙ్మయమునఁ జిరకాలమునుండి వచ్చుచున్న వాడుకనుబట్టియుఁ బయి యభిప్రాయము సమంజసమనియే యెంచఁదగును; గాని దానిని ద్రోసి పుచ్చుటకుఁ దగిన యాధారములు లేవు.

శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు 'ఆంధ్రభూమి' లోను విభూతిపత్త్రిక (సం 1 సం 2) లోను బ్రకటించిన "నన్నిచోడ నన్నయభట్ట కవులు సమకాలికులే" అను వ్యాసమున, సంస్కృతకవిస్తుతుల వెనుక రచించిన "మునుమార్గకవిత" యనుపద్యముతరువాత నన్నెచోడుఁడు తన కుమారసంభవములో

చ. సురవరులం గ్రమంబుగ వ, చోమణిసంహతిఁ బూజచేసి, మ
ద్గురుచరణారవిందముల, కుం దగసమ్మతిఁ జేసికొల్చి, వి
స్తరమతులం బురాణకవి, సంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల, సంస్తుతిచేసి మనోముదంబునన్.

అనుపద్యము వ్రాసియుండుటచే నీపద్యమునందలిక్రమమునుబట్టి పూర్వపద్యోదాహృతులగు "చాళుక్యరాజు మొదలగుపలువురు" దేశికవీశ్వరుల నియే గణింపఁ దగునుగాని, రాజరాజువంటి దేశికవితాపోషకులని తలంపరాదనియు నందుచే నన్నయభారతము తరువాతనే నన్నెచోడుని కుమారసంభవము రచింపఁబడినదని విమర్శకులు పలువురు నిర్ణయించుటసాహసమని చెప్పవలసివచ్చినందుకుఁ జింతిల్లుచున్నామనియుఁ దమయభిప్రాయమును దెలియఁబఱిచిరి; కాని యావ్యాసమునందు దేశికవితను సృజించిన యాచాళుక్యరాజెవరో శ్రీరెడ్డిగారు పేర్కొనలేదు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక (సం 28 సం 1)లో నేఁ బ్రకటించిన "నన్నెచోడునికాలము" అనువ్యాసములో "పుట్టించు" అనుప్రేరణక్రియకు "సృజించు - లేక రచించు" అని యర్థము చెప్పుట సమంజసముకాదనియు, నన్నెచోడుని పద్యమునుబట్టి రాజరాజువంటి చాళుక్యనృపాలురు నన్నయభట్టువంటి దేశికవులచే నారంభింపఁజేసిన దేశికవితారచనమే ద్యోతకమగుననియు, నన్నెచోడుఁడు పయిరెండుపద్యములకు నడుమ దేశికవులస్తుతించినకొన్ని పద్యములు వ్రాసియుండుననియు నవిమనకుదొరకిన యాతని కుమారసంభవైకప్రతిలో లోపించియుండుననియు, అట్లుకానిచో నన్నెచోడుఁడు "దేశిసత్కవుల సంస్తుతిఁజేసి" యనుటలో సాముదాయికదృష్టినే కయికొనియుండునని తలంపనగుననియు వ్రాసియుంటిని. మఱియు నావ్యాసమునందు, శ్రీరెడ్డిగారు తమవ్యాసమున నపూర్వమగు చిత్రప్రదర్శనమొనర్చుచు నన్నెచోడుఁడు కుమారసంభవమును విక్రమశకగతవర్షము 1110 అగు జయసంవత్సర చైత్రశుద్ధ తృతీయామంగళవారము క్రీ. శ. 15-3-1054) నాఁటికి ముగించియుండునని తిథివారసహితముగ నిర్ణయిం

చిన యింతసిద్ధాంతమునందలి వైపరీత్యమును గూడ వెల్లడించియుంటిని
నేనిపై శ్రీరెడ్డిగారు దగిన సమాధానముల నింతవఱకుఁ బ్రకటించినట్లు
కానరాదు.

ఆంధ్రకవిత్వమును దొలుత నారంభించినదెవరో యొక చాళు
క్యరాజయి యుండుననను తమయభిప్రాయబీజమును మొలకలెత్తించుటకుఁ
గాఁబోలు శ్రీ వేంకటకృష్ణారెడ్డిగారు ప్రమాథిసంవత్సరము ఉగాదికి
నెల్లూరునుండి వెలువడిన "జమీన్‌రైతు" ఉగాదికానుక సంచికలో
"చాళుక్యరాజు చాళుక్యభీమకవికాదా?" అనుమఱియొక యింతవ్యాసము
ను బ్రకటించి, అందలి విషయములనే యనువదించి విస్తరించుచు
ది 22-10-1939 నాఁడు ప్రకటితమయిన విభూతిపత్త్రిక (సం 1 సం. 9)
లో "చళుక్యభీముఁడే చాళుక్యరాజదేశిసత్కవి" అను వేఱొకవ్యాసమును
గూడఁ బ్రకటించియున్నారు. మొదటివ్యాసమున కెత్తుగడగా శ్రీరెడ్డి
గారు "ఆంధ్రకవితాపట్టాభిషిక్తుండైన నన్నయభట్టోపాధ్యాయ సార్వ
భౌమునికంటె ప్రాచీనుఁడైన దాక్షారామచాళుక్యభీమ కవిసార్వభౌముఁ
డు కలఁడని కాశీఖండకవిసమయుచరిత్ర చెప్పుచున్నది." అనువాక్యముల
రచించి, రెండవవ్యాసము మొదట "నేనివ్యాసములో దేశికవితఁ బుట్టించి
తెనుంగు నిలిపిన చాళుక్యరాజు "చళుక్యభీమ"దేశిసత్కవియని కాశీఖం
డాది కావ్యప్రమాణములతో నిరూపించతలఁచినాను." అని లిఖించియు
న్నారు. ఈచాళుక్యభీముఁడు రమారమి క్రీ శ. 892 మొదలు 922
వఱకు వేంగీరాజ్యమును బరిపాలించిన తూర్పుచాళుక్యరాజు.

నన్నెచోడుఁడు నన్నయభట్టునకుఁ బూర్వుఁడను వారివాదమును,
దరువాతివాఁడను వారివాదమునుగూడ నంగీకరింపక యాకవులిరువురు
సమకాలికులను నొకవినూత్నవాదమును బ్రకటించు కుతూహలముతో
శ్రీరెడ్డిగారు రచించిన "నన్నిచోడ నన్నియభట్టకవులు సమకాలికులే"
అను వ్యాసములోఁ గుమారసంభవరచనాకాలనిర్ణయమునకు వారవ
లంబించిన చిత్రవిచిత్రవినూత్నపద్ధతిని దిలకించినవారికి శ్రీరెడ్డిగారి విమ

ర్శనవిధానమందలి వైలక్షణ్యము గోచరించియే యుండును. అట్టి మార్గమునే ప్రస్తుతవ్యాసరచనమునందుఁ గూడ వా రవలంబించియున్నారు. ప్రథమాంధ్రకవి నన్నయభట్టారకుఁడయినను, శ్రీరెడ్డిగారు తలంచునట్లు చళుక్యభీముఁడయినను మఱొకఁడయినను, సమగ్రవాక్యములఁగాని వాని వలన వ్యక్తమగు సమన్వయార్థములఁగాని కయికొనక, ఎచ్చటెచ్చటనో యున్న యందదుకు పదములను, వ్యస్తవాక్యములను గ్రహించి యిచ్చవచ్చినట్లు వానికి సంబంధమును ముడిపెట్టి, విచ్చలవిడిగఁ గావలసిన యర్థములఁ జెప్పి వింతసిద్ధాంతము లొనర్చు వినూత్నవిచిత్రవిమర్శనవిధానమునకు శ్రీవేంకటకృష్ణారెడ్డిగారిని ప్రప్రథమాచార్యులుగ నెన్నఁదగు నని నాయభిప్రాయము.

ఇఁక రెడ్డిగారు చళుక్యభీమరాజును ప్రథమాంధ్రకవిగా గణించుటకయి గ్రహించిన వింతమార్గమును దిలకింపుఁడు.

కాశీఖండకృతిపతియగు వీరభద్రారెడ్డి యన్న వేమారెడ్డి శ్రీనాథునిఁ బ్రశంసించుచుఁ బలికినట్లు లాగ్రంథావతారికలోఁ జెప్పఁబడిన,

"శా. ఈక్షోణిన్ నినుఁబోలు సత్కవులు లే(వే)రీ నాఁటికాలంబునన్
దాక్షారామ చళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షింపన్ గవిసార్వభౌమ భవదీయప్రౌఢసాహిత్యముల్."

అనుపద్యమునందలి "నినుబోలు సత్కవులు లేరు" అను సిద్ధాంతవాక్యము శృంగారశ్రీనాథునితో సరితూఁగఁజాలిన శృంగార చళుక్యభీమ సత్కవి కలఁడని వ్యంగ్యముగాఁ జెప్పక చెప్పుచున్నదఁట. ఇట్టి యపూర్వవ్యంగ్యత యీపద్యమునందు నేఁటికి శ్రీరెడ్డిగారికి వినూత్నముగా స్ఫురించినదిగాని యింతవఱ కెవరికిని గోచరించినదికాదు. పయి పద్యము రెండవపాదము నందలి "చళుక్యభీమ" అనుపదైకదేశమును మాత్రము గ్రహించి శ్రీరెడ్డిగారీవినూత్నసిద్ధాంతమున కుపక్రమించుచున్నారు. ఇందు చళుక్యభీమవర అనుటకు చళుక్యభీమపుర అనుపాఠము

కూడఁగలదు. దక్షారామము, చళుక్యభీమవరము (పురము) వేమ వీర
భద్రారెడ్ల పాలనమునందలి రెండుపుణ్యక్షేత్రములు. ఇవి పంచారామ
ములలోఁ జేరినవి. ఈరెండు తావులందునుగూడ భీమేశ్వరనామాంకిత
ములగు శివలింగములు వెలసియున్నవి. పంచారామములలోని కుమా
రారామమే చళుక్యభీమవరము. ఇది దక్షారామమునకిరువదిమైళ్ల
దూరమున సామర్లకోటదగ్గఱ నిప్పటికిని భీమవరమను పేరితోనే పిలు
వఁబడుచున్నది. ఇది శ్రీరెడ్డిగారుకూడ నెఱుంగకపోలేదు. చళుక్యభీమ
వరమనియు, చాళుక్యవంశరాజధానియగు చాళుక్యభీమవరము" అనియు
గ్రామనామములనుగూడఁ దమవ్యాసములలో వారుదాహరించినారు.
కాని యిక్కడమాత్రము "వర" శబ్దమును విడఁదీసి గంధర్వాప్సరోభామి
నులకు విశేషణముగా గ్రహింతురుకాఁబోలు. "పుర" శబ్దపాఠమును వీ
రసలే గ్రహించినట్లు తోఁచదు. ఇప్పుడు ద్రాక్షారామ మని పిలువఁ
బడు దక్షారామునందును, కుమారారామ మని వ్యవహరింపఁబడు
చళుక్యభీమవరమునందును బూర్వము స్వామికైంకర్యమునకయి నాట్య
గాంధర్వ విద్యాపారీణలగు వేశ్యామణులు పెక్కురుండెడివారు. శ్రీనా
థుని భీమఖండము చదివినవారికది తెల్లమగును. వలయునపుడీ వేశ్యా
మణులు వేమవీరభద్రారెడ్ల కొలువుకూటమున కేఁతెంచి తమవిద్యా
నైపుణ్యమును బ్రదర్శించెడివారు, కాశీఖండమునందలి.

సీ. త్రైలోక్యవిజయాభిధంబైన సౌధంబు
  చంద్రశాలా ప్రదేశంబునందు
సచివసైన్యాధీశ సామంతనృపవార
  సీమంతినీ జనశ్రేణి గొలువ
శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు
  విద్వత్కవీంద్రులు విస్తరింపఁ
గర్పూరకస్తూరికా సంకుమదగంధ
  సారసౌరభము దిక్పూరితముగ

గీ. నిజభుజావిక్రమంబున నిఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరుని యంక మాశ్రయించి
నిండుకొలువుండెఁ గన్నుల పండువుగను.

అను పద్యమువలన నిది ద్యోతితమగును. త్రైలోక్యవిజయాభిధానసౌధమున నిండుకొలువు పైని వర్ణించినరీతిని సాగుచున్నసమయముననే రెడ్డివేమవిభుఁడు శ్రీనాథునిఁగూర్చి "ఈక్షోణిన్ నినుబోలుసత్కవులు లేరు" అను పయిపద్యమును బలికినది. దీనిలోని "వైరాజ్యభారంబు" అను దానియర్థ మేమయి యుండునని పలువురు సందేహములఁ బ్రకటించిరి. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తామురచించిన శ్రీనాథకవిచరిత్రములో నిందుఁగూర్చి కొంత చర్చించి వైరాజ్యశబ్దమునకు సరియగునర్థమును జెప్పకపోయినను బద్యము చెప్పఁబడిన సమయసందర్భములఁబట్టి "ఈకొలువుకూటమున నృత్యమొనర్చు దాక్షారామచళుక్యభీమవరక్షేత్రములందలి వేశ్యామణులు తమవక్షోజద్వయముపయి యలందిన చందనకుంకుమముల పరిమళములు సభాంతరాళముల గుబాళించునట్లే నీ ప్రౌఢసాహిత్యసౌరభములుకూడ వాసికంటె నెక్కుడుగ నెల్లయెడల వ్యాపింపనేర్చును" అని పద్యముయొక్క భావార్థమయి యుండునని వ్రాసియున్నారు. ఇందుపయి 1933 సంవత్సరమున రాజమహేంద్రవరమున జరిగిన యాంధ్రసాహిత్య పరిషద్వార్షికోత్సవసభలో నేను "శ్రీనాథకవిప్రయోగములు" అను వ్యాసమును జదువుచు దానిలోఁ బయిపద్యమునుగూర్చికూడ ముచ్చటించుచు శ్రీ వీరభద్రరావుగారు చెప్పిన యర్థముకంటె విశాలమగు మఱియొకయర్థము నాకును నామిత్రులు శ్రీ ఇవటూరి సుందరయ్యగారికిని స్ఫురించినదనియు వైరాజ్యభారంబు" అనుటకంటె "వైరాజ్య పారంబు" అనునది శ్రీనాథుని పాఠమయియుండునని తలంచుట సమంజసమనియుఁ జెప్పి యీక్రింది యర్థమును వివరించితిని. గంధసారఘుసృణములు, అనఁగా మలయజకా

శ్మీరములు (చందనకుంకుమములు) వరుసగా రెండు వేర్వేఱు దేశముల
కుఁ (రాజ్యములకు) జెందినవి. గంధసారమునకు నిలయమగు మలయ
పర్వతమున్న పాండ్యరాజ్యము మొదటిది. కుంకుమమునకు జన్మస్థాన
మగు కాశ్మీరము రెండవది. పారమనఁగా నవతలియొడ్డు. మలయపర్వత
మున్న రాజ్యభాగమున కవతలనే సముద్రమున్నది. కాశ్మీరరాజ్యమున
కవతలనే హిమాలయపర్వతములున్నవి. "శ్రీనాథకవిసార్వభౌమా ? ఈ
భారతక్షోణిలో నీవంటి సత్కవు లీనాఁటికాలమున లేరు. దాక్షారామ
చళుక్యభీమపుర వేశ్యామణుల వక్షోజములందలి చందనకుంకుమ సౌర
భములు వారినృత్యవేళలయందు సభాంతరాళములనిండి గుబాళించునట్లు
నీ కవిత్వసౌరభములు వానినతిక్రమించి యాచందనకుంకుమముల జన్మ
స్థానములగు పాండ్య కాశ్మీర రాజ్యముల దాఁటి యాసేతుహిమాచల
పర్యంతము వ్యాపింపఁజాలును"

శ్రీనాథకవి ప్రయోగము" లను నా పూర్వోక్తవ్యాస మటు
తరువాతఁ బరిషత్పత్త్రిక (సం 24 సం 4) లోఁ గూడఁ బ్రకటింపఁబడినది.
సభలో విన్న పండితులుగాని పత్త్రికలోఁజదివిన పాఠకులుగాని ఈయి
యర్థము సరికాదను ప్రతివాదము నెవరు నింతవఱకుఁ బ్రకటింపలేదు.
ప్రకరణసందర్భములఁబట్టి పర్యాలోచింప నీపద్యమున కిట్టియర్థమే సమం
జసముగ నుండునుగాని యిందులోఁ జళుక్యభీముఁడను నొక పూర్వకవి
ప్రశంస వ్యంగ్యముగఁగాని వాచ్యముగఁగాని యున్నదని తలఁచుట కెట్టి
యవకాశమును లేదనియే నాయభిప్రాయము. శ్రీ వేంకటకృష్ణారెడ్డి
గారి కిట్టిసహజస్వాభావికార్థములతోఁ బ్రసక్తి లేకుండుట శోచనీయము
"చళుక్యభీమ" అనుపదము వెనువెంటనేయున్న "వర (పుర)" శబ్దముల
మాట యేమి ? వానితోడి సమన్వయ మెట్లు ? అను విచారమే వారి
లేదయ్యెను. "చళుక్యభీమ" అనుపదము దొరకినదిగదా చాలును. దా
నినిబట్టి ప్రాకులాడి మఱికొన్ని కారణాభాసములతో సంబంధమును ముం
వెట్టి యాకాశహర్మ్యముంబోలు నపూర్వసిద్ధాంతమును బ్రకటింపవచ్చు

నని వారు ముచ్చటపడిరి. ఈయభిప్రాయసమర్థనమునకయి వారు ప్రదర్శించిన పరికరపటుత్వమునుగూడ నిఁక విలోకింతము.

శ్రీనాథుఁడు కాశీఖండమునకు ముందు రచించిన భీమఖండములో సత్కావ్యలక్షణమునుగూర్చి చెప్పిన,

మ. హరచూడాహరిణాంకవక్రతయుఁ గా । లాంతస్ఫురచ్చండికా
పరుషోద్గాఢపయోధర స్ఫుటతటీ । పర్యంతకాఠిన్యమున్
సరసత్వంబును సంభవించె ననఁగా । సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాడ్జీహ్వారంగంబులన్.

అనుపద్యము "ప్రౌఢసాహిత్యములతోఁదులతూఁగిన దైవరాజ్యభారంబు సాహిత్యదైవరాజ్యభారంబు" అనివాచ్యముగాఁ జెప్పుచున్నదఁట. శ్రీరెడ్డిగారీవాక్యమున నుద్దేశించిన భావమేమియో నాకు స్పష్టముగ బోధపడలేదు సాహిత్యములతోఁ దులతూఁగిన దైవరాజ్యభారంబు సాహిత్యదైవరాజ్యభారంబని యూరక పదములను దిరుగవైచినంతమాత్రమునఁ బ్రయోజన మేమి? వక్రత, ధ్వని, వ్యంగ్యము ననునవి యాలంకారికమతములో నించుమించుగ సమానలక్షణార్థకములు. పయిపద్యములో శ్రీనాథుఁడు పేర్కొనిన "వక్రత" ధ్వనివ్యంగ్యము ను బోధకమనియు, చండికావక్షోజకాఠిన్యము గాఢసమాస బంధమునకు ద్యోతకమనియు, ఈరెంటిని గలిగి పయిఁగా నన్నిటికంటె ముఖ్యమగు సరసత్వమును గలిగిన సత్కావ్యములు చిరస్థాయులై వెలయఁగలవనియుఁ జెప్పుటయే పయిపద్యమున శ్రీనాథుఁ డుద్దేశించిన భావమని నేఁ దలంతును. ఈలక్షణము లాతని కృతులయందు నిండారియుండుట పండితులకెల్ల ననుభవమే. "భీమఖండమునఁ జెప్పిన స్పష్టార్థమునే కాశీఖండములో శ్రీనాథుఁడు వ్యంగ్యముగా వివరించెననియు, పయోధరస్ఫుటకటీపర్యంతకాఠిన్యమును, సరసత్వంబును గలిగిన కావ్యములను వక్షోజద్వయగంధసారఘుస్పణదైవరాజ్యభారంబు అనే ప్రౌఢసాహిత్యవ్యంగ్యముగఁ (వాచ్యముగా) జెప్పినాఁడనియు, కాశీఖండమందలి గంధసార (చందనము)

ఘుసృణము (కుంకుమపువ్వులు) భీమఖండమందలి సరసత్వచిహ్నములే కాని మైపూఁతలు కావనియు, "నాళీకభవవధూస్తన పాళీకహ్లార రమ్యపరిమళలహరీ శాలీనతా విధాయి వ। చోలీలలు తల్లనార్థి సురభికి నమరున్" అను భీమఖండపద్యమున శ్రీనాథుఁడు స్తనరమ్యపరిమళలహరీ (తెమ్మెరలు) వచోలీలలు, అని నిరూపించియున్నాఁడని యుపోద్ఘాతము కొంత చెప్పి, రెడ్డిగారు "దాక్షారామ చళుక్యభీమ-ద్వైరాజ్యభారంబు""చళుక్యభీముని (సంస్కృతాంధ్ర) వచోలీలలు (ప్రౌఢసాహిత్యములు) అని నిర్ణయింపవచ్చుననియు, పయి రెండుపద్యములలో శబ్దభేదమే కాని భావభేదము లేదని స్పష్టమగుచున్నదనియు సెలవిచ్చిరి. కవితాబంధమును యువతీవక్షోజాతకాఠిన్యముతోను, సరసకవిత్వసౌరభములను సుగంధపరిమళములతోడను సరిపోల్చుట కవులందఱకు సర్వసామాన్యమే. ఈవిషయమున శ్రీనాథుఁడు క్రొత్తగఁ జెప్పిన దేదియు లేదు. కవితాలక్షణవిషయమున రెడ్డిగారు పేర్కొనిన భీమఖండ కాశీఖండపద్యములందలి స్పష్టార్థవ్యంగ్యార్థము లెట్టివయినను వానివలనఁ జళుక్యభీముఁడను కవియొక్క ప్రౌఢసాహిత్యప్రసక్తి కేమాత్రమయిన సంబంధ మున్నదేమో సహృదయులు నిర్ణయింతురుగాక.

ఇఁక శ్రీనాథుని దని పలుకుచు తలంచు

శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ ! కస్తూరికా
  భిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
  దక్షారామచళుక్య భీమవరగంధర్వాప్సరో భామినీ
  వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.

అను చాటువునుగూడఁ బేర్కొని యది "ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు - " అను కాశీఖండపద్యమాతృకనుండి పుట్టినదని సెలవిచ్చి యా పద్యముకూడఁ దమయూహకే తోడగునని తలంచి యీ రెండు పద్యములకుఁ బాఠకుల సౌకర్యార్థమని తమ విపరీతపద్ధతిప్రకార మిట్లు దండాన్వయము వివరించినారు.

("అక్షయ్యంబుగ" అను పద్యమునకు)

"ఓ సాంపరాయని తెలుంగాధీశ! దాక్షారామ చళుక్యభీమ (వరగంధర్వాప్సరో భామినీవక్షోజద్వయ కుంభికుంభములపయి వాసించుచున్న - ప్రసిద్ధికెక్కిన కావ్యసమయము భీమఖండములో కలదుగద) తద్వాసనలు (ఆసత్కావ్యవాసనలు) కలిగిన సుకవిరాడ్బృందారకశ్రేణికిన్ (ఆశ్రేణిలోచేరనవాఁడు) కస్తూరికాభిక్షాదానము అక్షయ్యంబుగ చేయుమురా; అని శ్రీనాథుఁడు సభాపూజ్యముగ తెలుంగాధీశుని ప్రార్థించినాఁడు"

("ఈక్షోణిన్" అను పద్యమునకు)

"ఓ శ్రీనాథకవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యములు దాక్షారామ చళుక్యభీమ (వరగంధర్వాప్సరో భామినీవక్షోజ ద్వయగంధసారఘుసృణములు - కాఠిన్యమున్ సరసత్వంబును సంభవించె ననగాసత్కావ్యముల్)......సాహిత్యద్వైరాజ్యభారంబున్ అధ్యక్షించున్ (ప్రౌఢోక్తి) కనుక ఈక్షోణిన్, ఈ నేటికాలంబునన్ నినుబోలు సత్కవులు లేరు" అని రెడ్డి వేమవిభుఁడు సభాపూజ్యముగా ప్రశంసించినాఁడు"

చీకటిలోని చిందులాటవలె నీయన్వయము లెంత గందరగోళము గానున్నవో వేఱ చెప్పనక్కఱలేదు. సందర్భశుద్ధి వీనియం దెంతవఱకున్నదో నిర్ణయింప సహృదయులే ప్రమాణము.

మఱి యింకను వింతలోవింత కాశీఖండావతారికలోని "ఈ క్షోణిన్......" అను పూర్వోక్తపద్యమునకు మునుముందేయున్న "వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు..." "అను సీసపద్యములో శ్రీనాథుఁడు ప్రప్రథమమునఁ గవిత్రయము కంటెముందు వేములవాడ భీమకవిని పేర్కొనుటచేతను, కస్తూరి రంగకవి తనయానంద రంగరాట్ఛందములో "ఆదిమసుకవి భీమనకు దండము పెట్టి నన్నయభట్టునకు నతిఁ బ్రమొక్కి" అని వ్రాసియుండుటచేతను, శ్రీ రెడ్డిగారు ఆదికవియని తాముతలంచు చళుక్యభీముఁడే యా వేములవాడ

భీమకవియనియు, చళుక్యభీమనయన్నను, దాక్షారామ చళుక్యభీమనయన్నను, వేములవాడ భీమనయన్నను నొక్కనికే పేళ్ళనియు నిర్ణయించు సాహసమునకుఁ గూడ సిద్ధమయినారు.

ఇంతకయి వీరుచెప్పెడి యుపపత్తులనవలోకింపుఁడు. వీనిలో శ్రీ రెడ్డిగారి వాక్యము లనున్నదున్నట్లు లుదాహరింపక సమన్వయ సౌకర్యమునకయి భావార్థవిరోధము కలుగకుండ స్వల్పపుమార్పులు చేర్పులు నచ్చటచ్చట నొనర్చితిని. ఇందుకు రెడ్డిగారు పాఠకులుకూడ నన్ను క్షమింతురుగాక !

1. "ఈక్షోణిన్ నినుఁబోలు సత్కవులు లేరు." అను పద్యములో శ్రీనాథుఁడు చాళుక్యభీముని సాహిత్యద్వైరాజ్యభారంబును దన ప్రౌఢసాహిత్యము లధ్యక్షించును (అతిశయించును) అని ప్రౌఢోక్త్యలంకారము నాశ్రయించి వ్రాసినను నది వాస్తవముకాదు. ఏలయన "వచియింతు వేములవాడ (వేములవాడ చాళుక్య) భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు" అను కాశీఖండచారిత్రక వ్యాఖ్యానము కలదు. ఛందోనిర్బంధమువలనఁ గాఁబోలు వేములవాడ చాళుక్య భీమనకు మాఱుగా "నామైకదేశే నామగ్రహణమ్" అను న్యాయప్రకారము వేములవాడ భీమనయని వ్రాసినాఁడు. వేములవాడ (చళుక్య) భీమన దాక్షారామ చళుక్య భీమకవి కాకపోఁడని కాశీఖండోపోద్ఘాతచరిత్ర చెప్పుచున్నది.

2. గోదావరిజిల్లాలో అత్యంతసామీప్యమునున్న వేములవాడకును, దాక్షారామమునకును, చాళుక్యభీమవరమునకును శ్రీనాథుఁడు భేదమును పాటింపక దాక్షారామ చళుక్య భీమన* యన్నట్లె వేములవాడ చళుక్యభీమనకుగాను, వేములవాడ భీమన అని సంగ్రహించినాఁడు.

---

* శ్రీనాథుఁడు చళుక్యభీమవర" అని గ్రామనామమునే గాని "చళుక్యభీమన" అను పురుషనామము నేమాత్రము "ఈక్షోణిన్" అను పద్యములోఁ గాని "అక్షయ్యంబుగ" అను చాటువులోఁగాని మఱెచ్చటఁగాని పేర్కొనలేదని పాఠకు లెఱుంగుదురుగాక ! శ్రీరెడ్డిగారిది పాటింపక యీ కాశీహర్మ్యములు నిర్మింపఁబూనుట యాశ్చర్యము

3. కాశీఖండము పీఠికలోని పయి రెండుపద్యములలో నట్లు వ్రాసియుండియు శ్రీనాథుఁడు సంస్కృతాంధ్రకవిస్తుతి యొనర్చిన పూర్వకవిస్తుతిపద్యములో నాంధ్రకవిస్తుతిలోఁ గేవలము

"శబ్దశాసను నన్నయాచార్యుఁ దలఁచి
సత్కవిశ్రేష్ఠుఁ దిక్కయజ్వను భజించి
సత్ప్రబంధమహేశ్వరు శంభుదాసు
నధికతరభక్తి సంయుక్తి నాదరించి."

అని వ్రాసినాఁడేకాని వేములవాడ భీమకవిని స్మరింపక విడిచి పెట్టినాఁడు. ఇందువలన బ్రాహ్మణకవియైన శ్రీనాథుఁడు చాళుక్యరాజకవియైన వేములవాడ భీమకవికి నమస్కరింపలేదని తోఁచుచున్నది

4. శ్రీనాథకవిసార్వభౌముని ప్రౌఢసాహిత్యములు ఒక్కొక్కమాటు వేములవాడ చళుక్య) భీముని వైరాజ్య (కవితా) భారంబును అధ్యక్షించును (అతిశయించును) అనే రెడ్డివేమవిభుని ప్రశంస నాధారముగాఁ గొని, విజేతయైన శ్రీనాథకవిసార్వభౌముఁడు తనకు ప్రతిద్వంద్విగా నిలిచి యోడిపోయిన దాక్షారామ చళుక్యభీమున యనే వేములవాడ (చళుక్య) భీమునకు నమస్కరింపకుండుటవల్ల శ్రీనాథుని యభిమానముద్యోతము కాకపోదు.

మహాశయులారా! చూచితిరా? మన రెడ్డిగారు తాము సృష్టింపఁదలఁచిన గగనకుసుమమును నిలువరింప నెన్ని యసంగతులకుఁ బాల్పడుచున్నారో! దక్షారామము, చళుక్యభీమవరము, వేములవాడ వేర్వేఱు గ్రామములయినను నవి సమీపస్థము లవుటచే శ్రీనాథుఁడు వానికి భేదమును బాటింపఁడయ్యెనఁట. ఎట్టి యవివేకియైన నిట్లొనర్చునా? వానికి భేదమును బాటింపక యైక్యమునే గ్రహింపఁదలఁచినచో వానిలో నేదియో యొకటిమాత్రమే గ్రహించి దానినే యీ భీమశబ్దమునకు ముందేల నిలుపఁడయ్యెను? చాళుక్యభీమనయే యైన యీ వేములవాడ

భీమన నొకసారి స్మరించియుఁ గవిస్తుతిలో నాతనికి నమస్కరింపకుండుట యాతఁడు బ్రాహ్మణుఁడు కాకపోవుటచేతనఁట. మఱియు రెడ్డివేమవిభుని ప్రశంసామాత్రమునఁ దాను చాళుక్యభీమనకంటె గొప్పకవి నగుదునని మురిసి యుబ్బిపోయి యా యభిమానము చేఁగూడ నాతనికి నమస్కరింపఁ డయ్యెనఁట. చాళుక్యభీముఁడు శ్రీనాథునకంటె సుమారు 500 సం వత్సరముల ముందున్నవాఁడు. అట్టిచో నాతఁడొక గొప్ప పూర్వకవి యను తలంపే యాతనికున్నచో వేమారెడ్డి ప్రశంసమాత్రమునఁ దానా తనికంటె గొప్పవాఁ డగుదునని గర్వించి యాతని కభివందనమొనర్చుట మానునా. అట్లే యైనచోఁ దగుదునని మరల నాతనిని సామ్యమునకుఁ దెచ్చికొని యాతనివలె నుద్దండలీల వచింపనేర్తునని చెప్పికొనుట యెం దుకు? పయిఁగా నీ కవిస్తుతులలో బ్రాహ్మణాఽబ్రాహ్మణ సమస్య గూడ శ్రీనాథున కంటఁగట్టుటయా? పాపమివియన్నియు శ్రీరెడ్డిగారు తెచ్చిపెట్టినవేగాని శ్రీనాథునకీ గొడవలేమియు లేనేలేవు. ఆతనిదృష్టిలో నసలు చాళుక్యభీముఁడను నొక కవి లేనేలేఁడు. ఆతని పూర్వులెవరు పేర్కొని స్మరింపని యొక యపూర్వకవి నాతఁ డెట్లు భావింపనేర్చును? ఆతఁడు వాస్తవముగా విన్నది వేములవాడ భీమకవినిగుఱించియే. ఆతనిఁ గూర్చిన యైతిహ్యములు, ఆతఁడు రచించిన చాటువులు గ్రంథములు కొన్ని శ్రీనాథుని కాలమునకు వ్యాప్తియం దుండియుండును. వాడుక కథలఁబట్టి యా భీమకవికూడ బ్రాహ్మణుఁడేగాని యితరకులజుఁడు కాఁడు. దక్షారామ భీమేశ్వరుని యనుగ్రహమువలన నొక బ్రాహ్మణవితంతువు నకు నందనుఁడయి యుదయించినవాఁడు. కావుననే

> "ఘనుఁడఁ వేములవాఁడ వంశజుఁడ, దక్షారామభీమేశ నం
> దనుఁడఁ, దివ్య విషామృతప్రకట నానాకార్యధుర్యుండ, భీ
> మన నాపేరు వినంగఁ జెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా
> ఘనసారాది సుగంధవస్తువులు వేగం దెచ్చి లాలింపురా."

అను చాటుపద్యములో దక్షారామ భీమేశనందనత్వమును బేర్కొని

యున్నాఁడు. ఐతిహ్యములఁబట్టి చాటువులఁబట్టి యాతఁడు నన్నయభట్టు నకు సమకాలికుఁడో యించుక యిటీవలివాఁడో కాఁదగును.

“వచియింతు వేములవాడ భీమనభంగి...“అనుపద్యములో శ్రీనాథుఁడు కేవలము కాలపౌర్వాపర్యమును పాటించినట్లు తలంప నవకాశము లేదు. శ్రీ రెడ్డిగారు చెప్పినట్లు “అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ...” అనుచాటుపద్యము “ఈక్షోణిన్ నినుబోలు...” అను కాశీఖండపద్యమునుండి యేర్పడినదనుటకంటె నాచాటుపద్యమునందలి “దక్షారామ చళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ” అను భాగమే కాశీఖండపద్యమున శ్రీనాథుఁడు గైకొనెననుట సత్యమునకు సమీపముగ నుండునని నాయభిప్రాయము. కస్తూరికాఘనసారాది సుగంధవస్తువులకయి వేములవాడభీమకవి యొక తెలుంగాధీశునిఁబైని పేర్కొనిన “ఘనుండన...”అను పద్యమునం దర్థించియున్నాఁడు. ఆ తెలుంగాధీశుఁడు సాంపరాయని తెలుంగాధీశుఁ డవునో కాదో నిశ్చయముగఁ జెప్పఁజాలము కాని సాంపరాయని తెలుంగాధీశయని “అక్షయ్యంబుగ...”అనుపద్యములో మరలఁ గస్తూరికాభిక్షాదానమునకయి సంబోధింపఁబడి యర్థింపఁబడిన వాఁ డాతఁడే యయి యుండఁదగునని నాయభిప్రాయము. భీమకవి జన్మస్థానమగు వేములవాడకు రెండుమూఁడు మైళ్ల దూరమునన్ సాంపరాయనిపురము (ఇప్పుడు సంపరయని పిలువఁబడు గ్రామము) ఉన్నది. పూర్వమది యొక రాజుచేఁ బరిపాలింపఁబడి వైభవముతో విలసిల్లిన పట్టణమని తెలియుచున్నది. శ్రీనాథుని భీమఖండములోఁ గూడ నీసాంపరాయనిపురము పేర్కొనఁబడినది. తెలుంగురాయనికి సాంపరాయనిపురమునకుఁగల సంబంధము పరిశోధింపఁ దగినది భీమకవి తెలుంగురాయని మొదట దర్శించినపుడు నిజనామప్రకటనాదికము గావించికొని, కృతపరిచయుఁడయిన యాతనిని మరల సందర్శించినపుడు “సాంపరాయని” విశేషణముతో నాతనిఁ బేర్కొనియుండును. భీమకవి యుద్దండశైలియందలి గౌరవముచేతనే శ్రీనాథుఁడాతనిని

గాశీఖండావతారికలో “వచియింతు వేములవాడ భీమనభంగి...” అను
పద్యములో స్మరించి యాపద్యము వెనువెంటనే యాయుద్దండశైల్యాను
కరణసూచకముగ “క్ష” ప్రాసతోనే “ఈక్షోణిన్...” అనుపద్యమును
వ్రాసి భీమకవియందలి గౌరవముచేఁ బూర్వోక్తపద్యభాగమును మార్పు
లేకుండ నందు గ్రహించినాఁడని నాతలంపు ఈవిషయముల నిదివఱలో
నా “శృంగార శ్రీనాథవిమర్శనము”నందును “శ్రీనాథకవిప్రయోగము
లు” అను వ్యాసమునందును వివరించియే యుంటిని కావున శ్రీనాథుఁడు
వేములవాడ భీమకవిని మాత్రమే పేర్కొనెననియు, ఆతనికిఁ జాళుక్య
భీమరాజునకు నెట్టిసంబంధమును లేదనియు నీయిరువురకు నించుమించుగ
రెండువందల సంవత్సరముల యంతర మున్నదనియు, శ్రీనాథుని దృష్టిలోఁ
జాళుక్యభీముఁడను కవి లేనేలేఁడనియు బుద్ధిమంతులకు దోఁపకపోదు.
ఈసందర్భమున రెడ్డిగారు శ్రీనాథుఁడు ఛందోనిర్బంధమునఁ జాళుక్య
భీమనయనుటకు మాఱు వేములవాడ భీమనయని వ్రాసియుండుననుట
మఱియు నాశ్చర్యకరము. చెప్పఁదలఁచిన విషయములకు శ్రీనాథకవి
సార్వభౌమునకు ఛందస్సద్గతుల నేర్చునా ! “విరచింతుఁ జాళుక్య, విభుఁ
డు భీమనభంగి” అనియో “విరచింతుఁ జాళుక్య. భీమనవిధమున” అని
యో వ్రాయనేరఁడయ్యెనా ?

కస్తూరిరంగకవి యప్పకవికంటెఁ గూడ నర్వాచీనుఁడు. ఆతఁడు
తనఛందోగ్రంథమున నుతించిన భీమకవి కవిజనాశ్రయ మను ఛందో
గ్రంథమునకుఁ గర్తయని తలంపఁబడు వేములవాడ భీమకవియే యయి
యుండును. ఆతనికి నాదికవియను విశేషణమును జేర్చుటలో రంగకవి
వాడుకకథలను అప్పకవీయమునఁ జెప్పఁబడిన సంగతుల ననుసరించి
యుండును. అప్పకవి నన్నయభట్టు భారతమును నాంధ్రశబ్దచింతామ
ణిని గలియుగాదిని రచించినట్లు తనయవతారికలో వ్రాసినాఁడు. భీమ
కవి వ్రాసిన రాఘవపాండవీయాది గ్రంథములను నన్నయభట్టడంచెనను
నైతిహ్యములఁగూడ నాతఁడు గ్రంథస్థమొనరించినాఁడు. ఈలాక్షణిక

గ్రంథకర్తలకుఁ జారిత్రకజ్ఞానము చాలఁ దక్కువ. నన్నయభట్టు క్రీ. శ. 1030 ప్రాంతమువాఁడని శాసనాద్యాధారములచే వ్యక్తమగుచుండ నాతఁడు కలియుగాదిపురుషుఁడను నప్పకవి వ్రాఁతకేమి ప్రామాణ్యముండును? ఇట్లే యాతని ననుసరించిన కస్తూరిరంగకవి భీమకవికిఁ జేర్చిన యాదికవి విశేషణమునకుఁ బ్రామాణ్యము చరిత్రజ్ఞుల దృష్టిలో సిద్ధింపనేరదు. ఇంతకు నాతఁడు పేర్కొనిన భీమకవి మనరెడ్డిగారు తలంచినట్లు చాళుక్యభీమరాజనుట కెట్టియాధారమును లేదుగదా!

వేములవాడభీమకవి గోదావరిమండలమువాఁడనియు నాతని జన్మస్థానము దక్షారామ సమీపమందలి వేములవాడయనియు వాడుకనుబట్టి యుఁదెలియుచున్నది. ఇందుకు వ్యతిరేకముగ నాతఁడు నిజామురాష్ట్రమునందలి వెలిగందలకు సమీపమందున్న వేములవాడ వాస్తవ్యుఁడనువాదమొకటి కొంతకాలమయి బయలుదేఱినది. ఇందుఁగూర్చి శ్రీ జయంతి రామయ్యపంతులుగారు కవిజనాశ్రయ పీఠికలోఁ గొంత చర్చించి యావాదముపట్లనే మ్రొగ్గుచూపియున్నారు. కవిజనాశ్రయకృతిపతి రేచన నిజామురాష్ట్రము ప్రాంతమువాఁడుగ గోచరించును. ఆప్రాంతమందలి వేములవాడలో నొకభీమకవి యుండెనేని నాతఁడే కవిజనాశ్రయకర్తయై యుండుననువాదము కొంత సంగతముగానే యుండును. ఆసందర్భములో లేములవాడ భీమకవియు వేములవాడ భీమకవియు నొక్కఁడే యనుటకంటె నిరువురు వేర్వేఱుపురుషులని తలంచుటయే సమంజసమని నాయభిప్రాయము. చాటుపద్యములలో నుదాహృతుఁడయిన వేములవాడ భీమకవి గోదావరీమండలములోని వేములవాడ వాస్తవ్యుఁడనియే చిరకాలమునుండి గొప్పవాడుకగానున్నది. ఆతని చాటువులలో నుదాహృతులయిన కళింగగంగు మున్నగు రాజులుకూడ గోదావరీమండలమునకు సమీపమందున్న మండలములలో రాజ్యపాలన మొనరించినవారు నిజాముమండలమందలి వేములవాడ భీమునకు వీరి సందర్శన మంత సంగతముగానుండదు. ఆవిషయమెట్లున్నను శ్రీ వేంకటకృష్ణారెడ్డిగారీయురు

పురుభీములు నొక్కఁడేయనియు నాతఁడే చాళుక్యభీముఁడనియుఁగూడ నీక్రిందివిధమున విచిత్రముగ వ్రాసినారు.

"ఇఁకఁ గాశీఖండమందలి 'వేములవాడ భీమనభంగి'కి "వేమల వాడభీమనభంగి" అనేపాఠముండవచ్చునా? అనేసమస్యను విచారింతము. దాక్షారామ, చళుక్యభీమవర, గంధర్వాప్సరోభామిని అనే వేమల వాడలలో దాక్షారామ చళుక్యభీమన అనేచాళుక్యభీమకవికలఁడు. దీనిని గోపరాజకవి గుర్తించి తన సింహాసనద్వాత్రింశికలోఁ గ్రింది చమత్కార చరిత్రను కల్పించినాఁడు."

క. "లేములవాడక శుచియై
లేములవాడం జరించు లేమలవాడం
దా మెఱసిన భీముని నుత
భీముని బలభీము విమతభీమునిఁ దలఁతున్."

"ఈపద్యమందలి బలభీముఁడు రాజైన చాళుక్యభీముఁడని శబ్ద సారస్యమువల్ల ఊహించవచ్చును. వేమలవాడ దా మెఱసిన 'బలభీముఁడు' శుచియైయుండుట సంభవము. ఇది గ్రామచరిత్రకాదనియు, గోపరాజ కవికల్పిత సాహిత్యగ్రామచరిత్రమనియు తోచుచున్నది. కాన కాశీఖం డములోనున్న "వచియింతు వేమలవాడభీమనభంగి నుద్దండలీల నొక్కొ క్కమాటు" అనేమూలపాఠమే సింహాసనద్వాత్రింశిక యతిస్థానపాఠ ముగానున్నదని చెప్పవచ్చును. (ఇట్లయినప్పటికిని కాశీఖండ పాఠాంతర ములను దాళపత్రగ్రంథములలో పరిశీలింపవలసియున్నది). ఇంతకు "వేమలవాడభీమన" అనే కాశీఖండమూలపాఠము—శృంగారభీమనకు భాషాంతరీకరణ బిరుదమేగాని, వేములవాడ భీమన వంశనామము కాదని కూడ చెప్పవచ్చును."

కాశీఖండమును ముద్రించినవారెవరు నెప్పుడు "వచియింతు వేములవాడభీమనభంగి" అనుచో "వేమలవాడభీమన" అనుపాఠమును సూచించియైన నుండలేదు. ఈపాఠముకూడ నుండియుండు నను వాద

మును శ్రీ రెడ్డిగారే నేఁడు తెచ్చిపెట్టుచున్నారు సింహాసనద్వాత్రింశిక రచించిన కొఱవి గోపరాజకవి నిజామువుండలమువాఁడు శ్రీనాథునకుఁ గొంచెముటీవల క్రీ॥ శ॥ 1460 ప్రాంతమందున్న వాఁడు.

ఈతని తాతతండ్రులు రేచెర్ల వెలమరాజులయొద్ద మంత్రిత్వము నెఱపినవారు. సింహాసనద్వాత్రింశికను బ్రకటించినది యాంధ్రసాహిత్య పరిషత్తు ఈ గ్రంథమునకుఁ బరిషత్తునకు దొరకిన ప్రతులంత పరిశుద్ధమైనవికావు సందిగ్ధపాఠములు పలుతావుల నున్నవి. శ్రీ రెడ్డిగారు పేర్కొనిన వేములవాడ కళుచిస్మై..." అను పద్యమునందు మొదటి రెండు పాదములకు సరియగు నర్థము కుదురుటలేదు. రెండవ పాదమునందలి "లేములవాడం జరించు "అనుచో వేములవాడ యనికూడఁ గొన్నిప్రతులలో నున్నట్లు పరిషత్తువారు సూచించియున్నారు. లేములవాడ, వేములవాడ పాఠములెట్లున్నను నిందుఁ బేర్కొనఁబడిన భీమకవి కవిజనాశ్రయకర్తయే యని గోచరించును.

ఉ. భీమునపద్యమన్న గడుఁ బ్రీతివహించుచు మేలుమేలు నా
నేమిది చెప్పినారమచ నిక్కమె ప్రాసము గూర్చినాఁడనొ
నేమిదికాదు దీనివడి కెక్కడి కర్థ మిదెట్టి దీ గణం
బేమని పెట్టినాఁడవని యెగ్గులువట్టుఁ గుబుద్ధి పెద్దలన్"

అను పద్యముకూడ దీనిని సూచించును.

గ్రంథావతారికలోని కవిజనాశ్రయకర్త భీమకవి నిజామువుండలమువాఁడని తలంచుటయే సమంజసముగ నుండునని పైనే వ్రాసియుంటిని. ఈపద్యమునకు ముందు గోపరాజకవి నన్నయభట్టునే స్తుతించినాఁడు చూడుఁడు.

క. ఆభారత పర్వత్రయ
మీభారతవర్ష మెల్ల నెఱుఁగఁ దెనుఁగునన్
శ్రీభారతిగతిఁ జెప్పిన
నాభావుకమును దలంతు నన్నయభట్టున్

కావున గోపరాజకవికి నన్నయభట్టే కవిజనాశ్రయకర్తయగు భీమకవికంటెఁ బూర్వుఁడను నభిప్రాయమున్నట్లు గోచరించును. ఇంతకుఁ జాళుక్యభీముఁడే కవిజనాశ్రయకర్తయనుట కెట్టియాధారమును లేదు. ఆతని రాజధాని విశాఖపట్టణమండలమందలి యలమంచిలి యైనట్టులాతని శాసనములవలనఁ గాన్పించునని చరిత్రజ్ఞులు వ్రాయుచున్నారు. ఇట్టి చాళుక్యరాజు నిజామురాష్ట్రమందలి వేములవాడలోనుండి కోమటి రేచన కంకితముగా గ్రంథమునురచించుట యసంభవమని వేఱచెప్పనక్కఱలేదు. రెడ్డిగారుదాహరించిన పద్యమందలి నుతభీమ, బలభీమ, విమతభీమ, యనువిశేషణములును ప్రాసమునకయి తేఁబడినవేగాని మఱియొకటికాదు. ఇతరాధారములు లేనప్పుడు కేవలము "బలభీమ" యను విశేషణమునుబట్టి రాజైన చాళుక్యభీముఁడే యాకవియని యూహింపవచ్చునని రెడ్డిగారు వ్రాయుట సరికాదు.

మఱియు "వేములవాడ భీమన"యనునది శృంగారభీమనకు భాషాంతరీకరణ బిరుదమేకాని వంశనామముకాదని వారు తలంచుటగూడ నసంగతము. నిజామురాష్ట్రమందలి లేములవాడకు వేములవాడయను వ్యవహారముకూడ నుండెననియు, మఱియు నచ్చటి శాసనములలో నాగ్రామమునకు "లేమ్బలవాడ" యనుపాఠము గానవచ్చుచున్నదనియు, 'లేమ్బల' క్రమముగా లేమల, లేముల, వేముల యయి యుండవచ్చుననియు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు పూర్వోక్తమయిన కవిజనాశ్రయ పీఠికలో వ్రాసియున్నారు. ఇంతకు గ్రంథములందును జాటుపద్యములందున నుదాహృతులయిన వేములవాడభీమనయు లేములవాడభీమనయు నొక్కఁడయినను వేర్వేఱు పురుషులయినను నాతఁడు చాళుక్యచక్రవర్తి భీమరాజని తలంచుట సర్వవిధముల నసంగతమని సహృదయులకుఁ దోఁపకపోదు. రెడ్డిగారు చెప్పునట్టు లాతఁడు చాళుక్యభీమరాజేయైనయెడఁ గోమటి రేచనకుఁ గృతిచెప్పుట, కస్తూరికాది సుగంధవస్తువులకఁ తెలుంగురాయని యాచించుట మున్నగు నికృష్టత్వములకాతని గుఱిచే

యాతనికిఁ బదభ్రష్టత తెచ్చినవారమగుదుము. ఇట్టిసందేహములు శ్రీరెడ్డిగారికిఁగూడఁ గొంతవఱకుఁ గలిగినట్లున్నది. కావుననే విభూతిపత్త్రికలో వారి రెండవ వ్యాసములో "క్రీ॥ శ॥ 9 శతాబ్దమందు చాళుక్యభీమక యాస్థానములో కవిజనాశ్రయము పుట్టెనని చెప్పకూడదా ? అని పరిశోధింపుఁడు" అని లోకమును హెచ్చరించియున్నారు. కవిజనాశ్రయ విషయమున నిదివఱకే తగినంత పరిశోధనము జరిగినది. దొరకిన ప్రతులలో గొన్నింటివలన నయిన భీమకవి కృతికర్తయనియు, గోమటి రేచన కృతికర్తయనియు విమర్శకులు నిర్ణయించియుండ రెడ్డిగారు హెచ్చరించు నీప్రథాపరిశోధనమున కవసరమేమున్నది ? ముంజేతికంకణమున కద్దమేల? కవిజనాశ్రయమునకుఁ జళుక్యభీమనకు నెట్టిసంబంధము లేదనుట సత్యసమ్మతమయిన సిద్ధాంతము.

తెలుంగురాయనిఁ గస్తూరికాది సుగంధవస్తువులకై యాచించిన పద్యకర్తృత్వము, చళుక్యభీమునియెడ సమర్థించుటకయి రెడ్డిగారు పద్యమందలి తెలుంగాధీశయను పాఠమును "త్రిలింగాధీశ" యని మార్చి "ఇందలి త్రిలింగాధీశుఁడు స్వామికాని రాజుకాఁడని" వ్రాసిరి. కాని యాస్వామియెవరో తెలుపరయిరి. వా రుద్దేశించినది శిలావిగ్రహరూపమున శ్రీకాకుళక్షేత్రమున వెలసిన యాంధ్రనాయకస్వామి కాదుకదా! అట్లయినచోఁ బాపము చళుక్యభీమునకుఁ బదభ్రష్టతకు మాఱు మతిభ్రష్టతను రెడ్డిగారు కలిగించినవారగుదురు. ఎట్టి మతిమంతుఁడయిన నిట్టి సుగంధవస్తువులకయి గుడిలోనుండు శిలావిగ్రహమును యాచించునా ? ఇంతకుఁ జాళుక్యరాజ్యమునకుఁ జక్రవర్తియగు నా చళుక్యభీముఁ డీవస్తువులకయి యొరుల యాచింపవలసిన దుస్థితికేల లోనయ్యెను ?

మఱియు నీసందర్భమున వేములవాడభీమనతోఁ జాళుక్యభీమన నైక్యమొనర్చుటకయి రెడ్డిగారు వ్రాసిన వింకను గొన్ని వింతవాక్యములు చిత్తగింపుఁడు.

"చాళుక్యభీమకవి గోదావరిజిల్లాకు చెందినవాఁడు. ఇంతేకాక

చళుక్యభీమకవి ముదివేము (ముదివేములవాడ) చాళుక్యవంశజుఁడు. కనుకనే "ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ" అని తన చాటుపద్యమును వ్రాసియున్నాఁడు. విధవాకుమారుఁడైన చాళుక్యరాజ జన్మప్రకార కథ నమే తద్వంశజుఁడగు (ముది) వేములవాడ భీమన కంటఁగట్టఁబడినదని కూడ శాసనచరిత్రాధారముతో సమన్వయము కుదురుచున్నది. అనఁగా దాక్షారామమునకు పూర్వమా ప్రదేశములో "ముదివేముల వాడ" గ్రామముండెడిదా? అని పరిశీలింపుఁడు. ఈ 'ముదివేము' తియ్యగాపండి ద్రాక్షారామమైనదా? పిదప దాక్షారామమైనదా? అటు పిమ్మట దక్షారామమైనదా?"

ఈవాక్యము లర్థమగుటకు ముందు పాఠకులకు రెడ్డిగారు పేర్కొనిన "ముదివేము" గొడవ కొంత చెప్పవలసియుండును. తూర్పుచాళుక్య రాజుల శాసనములు కొన్నిటియందు వారి వంశచరిత్రము చెప్పుటలో వారిపూర్వులలో విజయాదిత్య నామాంకితుఁడగు రాజయోధ్యాపురము నుండి దిగ్విజయార్థము దక్షిణాపథమునకేతెంచి త్రిలోచన పల్లవునితోఁ బోరాడి రణరంగమున నిహతుఁడయ్యెననియు నప్పుడు గర్భవతియగు నాతని భార్య ముదివేము నామాగ్రహారమున కేఁగి యచ్చట విష్ణుభట్ట సోమ యాజి యను బ్రాహ్మణునిచే నిజపుత్రికయుంబోలె నాదరింపఁబడెననియు, నామెకుఁ గలిగిన కొమరునకు విష్ణువర్ధనుఁడను నామ ముంచిరనియు నాతఁడే వానికి మూలపురుషుఁడయి వెలసెననియుఁ జెప్పఁబడినది. ఇందు కనుగుణముగనే తూర్పుచాళుక్యరాజులు పలువురు తమ నామముల చివర విష్ణువర్ధన నామమునుగూడ ధరించిరి. మూలపురుషుఁడగు విష్ణువర్ధ నుఁడు పుట్టిపెరిఁగిన యాముదివేము అగ్రహారమే మన రెడ్డిగారుదాహ రించినది. దీనికిని వేములవాడ భీమకవి జన్మస్థానమని పలువురు తలంచు గోదావరిజిల్లాలోని వేములవాడకును నెట్టిసంబంధమును లేదు. "వేము" అనుపదమును పైకొని బదరీబాదరాయణులకుంబోలె లేనిసంబంధమును ముడివెట్టుట ఘటనాఽఘటన సమర్థులగు రెడ్డిగారికే చెల్లినది. వేముల

వాడకు ముదివేములవాడయను వ్యవహార మెప్పుడును లేదు. చళుక్యశాసనములలో నుదాహృతమయిన యీ ముడివేము కడపజిల్లాలోని ముడియను గ్రామమై యుండునని చరిత్రజ్ఞులభిప్రాయపడుచున్నారు. అంతియేగాని వేములవాడతో నెవరు సంబంధమును ముడిపెట్టుటలేదు. ముదివేము తియ్యగాఁబండి ద్రాక్షయగుట ప్రకృతివిరుద్ధము; లోకానుభవశాలి వేమనయోగీంద్రుఁడు "తినఁగఁదినఁగ వేము తియ్యనై యుండును" అనుచెప్పెను. ముదివేముగాని లేఁతవేముగాని నేలవేముగాని తియ్యగాఁబండి ద్రాక్షగాని ద్రాక్షారామముగాని యవుట లోకమందసంభవము. రెడ్డిగారి చేతులలోఁ గవులుకానివారు కవులవుచున్నారు. కావున "ముదివేము" ద్రాక్షారామ మగుటకూడ వారివ్రాఁతలయందే సంభవమగును గాని యన్యత్రకానేరదు. ఇఁక దక్షారామముమాట యేమనఁగా దక్షవాటియగు దక్షారామమే లోకవ్యవహారములో రానురాను దాక్షారామము తరువాత ద్రాక్షారామమయినది. అంతియేగాని ద్రాక్షారామము క్రమక్రమముగా దక్షారామము కాలేదు. రెడ్డిగారు భీమేశ్వర పురాణమును బాగుగాఁ జదివికొని లోకజ్ఞతగ్రహించి యథార్థమును దెలిసికొందురుగాక. ద్రాక్షారామమని పేరేగాని యిప్పుడాప్రాంతమందు ద్రాక్షతోట లేమియులేవు. పూర్వముగూడ నుండినట్టు లెట్టి నిదర్శనములులేవు. విధవాకుమారుఁడైన చాళుక్య విష్ణువర్ధనుని జన్మప్రకార కథనమే తద్వంశజుఁడగు (ముది) వేములవాడ భీమన కంటఁగట్టఁబడినదని రెడ్డిగారు వ్రాయుట మఱియు నాశ్చర్యము. విష్ణువర్ధనుని జన్మవృత్తాంతమునకును వాడుకకథలోని వేములవాడభీమకవి జననకథకును సామ్యమే లేదు. విష్ణువర్ధనునితండ్రి విమలాదిత్యుఁడు చనిపోవునప్పటి కాతనిభార్య గర్భవతిగానుండి నెలలునిండినపిదపఁ గుమారునిఁ బ్రసవించినది. అట్టి విష్ణువర్ధనునకు విధవాకుమార బిరుదమును రెడ్డిగారు ప్రసాదించుట న్యాయ్యమేనా ? భీమకవితల్లి కేవలము విధంతువేగాని యామెకు దక్షారామ భీమేశ్వరుని వరమువలననే భీమకవి యుదయించెనని వాడుకకథ.

పయిఁగా నీ లోకవ్యవహారమునుబట్టి భీమకవి బ్రాహ్మణుడేగాని క్షత్రియుఁడు కాఁడని వెనుకనే వ్రాసియుంటిని.

వేములవాడభీమకవి శాపానుగ్రహసామర్థ్యమును బ్రకటించు చాటుపద్యములు కొన్ని యాంధ్రవాఙ్మయమున నిప్పటికిని నిల్చియుండుట పాఠకులకు సువిదితమే. అందులో రాజకళింగగంగును గూర్చిన క్రిందిపద్యములు రెండును సుప్రసిద్ధములు.

ఉ. వేములవాడభీమకవి వేగమెచూచి కళింగగంగు తా
సామముమాని కోపమున సందడి దీఱిన రమ్ము పొమ్మనెన్
మోమునుజూడ దోస మిఁక ముప్పదిరెండుదినంబు లావలన్
జామున కర్థమం దతని సంపద శత్రులఁ జేరుఁగావుతన్.

ఉ. వేయి గజంబులుండఁ బదివేలు తురంగము లుండ నాజిలో
రాయలగెల్చి సజ్జనగరంబునఁ బట్టముఁ గట్టుకో వడిన్
రాయకళింగగంగు కవిరాజు భయంకరమూర్తి చూడఁ దాఁ
బోయిన మీనమాసమునఁ బున్నమపోయిన షష్ఠినాఁటికిన్.

వీనినిగూర్చిన వాడుకకథలు యథార్థము లైనచో నిందుదాహృతుఁడయిన కళింగగంగు క్రీ॥ శ॥ 1077 సంవత్సరములోఁ బట్టాభిషిక్తుఁడయి డెబ్బదిసంవత్సరములవఱకుఁ గళింగదేశమును బరిపాలించిన అనంతవర్మచోడగంగు కానగుననియు, ఉత్కలదేశమందలి జాజనగరమే సజ్జనగరము కానోపుననియుఁ జరిత్రజ్ఞులు తలంచుచున్నారు. ఈయనంతవర్మ చోడగంగునకు దక్షిణమున వేంగిచాళుక్యులతోను, ఉత్తరమున నుత్కలాధీశులతోను బడమరఁ జేదిదేశం బేలు కాలచుర్యులతోను యుద్ధములు ఘటిల్లి, తాత్కాలికముగ గెలుపులు నోటములుగూడఁ గలుగుచుండెడివి. మఱియు నీతనితండ్రియు నన్నయభట్టున కాశ్రయుఁడగు రాజరాజనరేంద్రుఁడును దోడియల్లుఁడు వేములవాడ భీమకవి చిరకాలజీవియని వాడుక. నన్నయతో నాతనికి సమకాలికత్వముఁ గూర్చు నైతిహ్యములతో సమన్వయము చేసినను భీమకవి యనంతవర్మచోడగంగు

కాలమున నుండుటలో నసంభవ మేమియులేదు. ఇట్టి యెడ మనరెడ్డిగారి పద్యముల కర్తృత్వముకూడ వేములవాడ భీమనకేయని, తాము తలంచు చాళుక్యభీమునకే యారోపించుచుఁ దత్సమర్థనమున కయి యవలంబించిన వింతమార్గముల విలోకింపుఁడు. చాళుక్యభీముని శాసనములు కొన్ని లోకమునకు దొరకినవి. అందులో క్రీ॥ శ॥ 892 నాఁటి అత్తిలిశాసనమును కీర్తిశేషులు శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుపంతులుగారు వివరణముతో ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక (సం॥సం6) లోఁ బ్రకటించియున్నారు. అందులోఁ జాళుక్యభీముని పెదతండ్రియగు గుణగవిజయాదిత్యుని వర్ణనలో

"అథచకాలింగ గంగరూప్యాది, కోశ (స) లేశద్విపాదిచ,
పాండ్యపల్లవ హేమాది హరత్యా ఇత్థమాహరత్"

అనియున్నది. దీనికిఁ గళింగదేశాధీశులగు గంగరాజుల రజతాదికములను, కోసలదేశాధీశుల గజాదికములును, పాండ్యపల్లవరాజుల సువర్ణాదికములనుదాహరించి గుణగవిజయాదిత్యుఁడు విజయయాత్రలొనర్చెనని సహజమగు సమంజసార్థములను శ్రీ లక్ష్మణరావుగారు తెలుఁగున వివరించియేయున్నారు కాని మనరెడ్డిగారు పయి శాసనపంక్తులను బరిషత్పత్త్రికనుండియే గైకొనియుఁగూడ శ్రీ లక్ష్మణరావుగారి వివరణ మేమియుఁ బాటింపక "కాలింగగంగ" శబ్దమొక్కటిదొరకినది గదా కృతార్థులమయితిమని తలపోసి, తమ వితపరీతధోరణితో జమీన్ రైతు ఉగాదికానుకలోని మొదటివ్యాసములో నిట్లువ్రాసియున్నారు.

"వేములవాడ భీమకవి కళింగగంగని సంపదశత్రులఁ జేరుఁగావుతన్" అని శపించిన చాటుపద్యముకలదు. దీనికనుగుణముగా క్రీ. శ. 892 సంవత్సరమందలి చాళుక్యభీముని అత్తిలిశాసనములో తనపెదతండ్రి గుణగవిజయాదిత్యుఁడు క్రీ శ. 892 సంవత్సరములో కాళింగగంగుని రజతాదులను (రూప్యాదులను) గ్రహించినట్లు కలదు. ఇందువల్ల కళింగగంగును శపించిన వేములవాడ భీమకవికూడ క్రీ. శ. 892 చాళుక్య

భీమునితండ్రి కాలమునాఁటివాఁడు. కాన చళుక్యభీమకవికి సమకాలికుఁడని నిర్ణయింపవచ్చును. ఇఁక నీయిద్దరికవులకు భేదమున్నదా? ఒకవేళ వేములవాడ భీమకవి- చాళుక్యభీమకవి కాకపోయినప్పటికి క్రీ. శ. 1053, సంవత్సర ప్రాంతమందలి నన్నయభట్టుకంటె క్రీ. శ. 892 సంవత్సర ప్రాంతమందలి (కళింగగంగు సమకాలికుఁడైన) వేములవాడభీమకవి ఆదిమకవియని నిర్ణయించుట సత్యదూరము కాదు. కనుకనే "వచియింతు వేములవాడ భీమనభంగి......"అని కాశీఖండములో రెడ్డివేమవిభుఁడు శ్రీనాథునిఁ బ్రశంసింపఁ గలిగినాఁడు. ఈఆంధ్రకవి ప్రశంసాకాలమును వేములవాడ భీమకవికి సమకాలికుఁడైన కాలింగ (కళింగ) గంగు ప్రస్తావన కల క్రీ శ. 892 సంవత్సరమందలి అత్తిలిశాసనము బలపఱుచుచున్నది. "వేములవాడ భీమకవి, వేగమెచూచి......" అనేచాటుపద్యార్థము క్రీ. శ. 892 గుణగవిజయాదిత్యుని లేక ఇతని తమ్ముఁడైన యువరాజ విక్రమాదిత్యుని యుద్ధసన్నాహమును శాపమిషతో చెప్పుచున్నది. సంధికాఁబోలు. "వేయిగజంబులుండ......"అనే చాటువు మరల సజ్జనగరప్రాప్తిని శాపపరిహారమిషతోఁ జెప్పుచుండ లేదా? యిదినిజమైనచో దీనివలన కాలింగగంగు క్రీ. శ. 892 సంవత్సరప్రాంతయుద్ధములో చాళుక్యభీముని పెదతండ్రి విజయాదిత్య రాజులనో లేక, ఇతనితండ్రి యువరాజ విక్రమాదిత్య రాజులనో గెల్చి సజ్జనగరమునఁబట్టముకట్టుకొన్నాఁడనికూడ చెప్పవచ్చును. ఇంతకును వేములవాడవంశజుఁడ దక్షారామ భీమేశనందనుఁడ......" నానాకావ్యధుర్యుండ భీమన నాపేరు...' అనే చాటుపద్యమువల్ల వేములవాడ భీమకవి, దాక్షారామ చళుక్య భీమేశనందనుఁడని యూహింప నవకాశమున్నది" అత్తిలిశాసనములోని "కాలింగగంగ" శబ్దము కళింగదేశాధీశ సూచకమగు సాముదాయిక పదముగాని ప్రత్యేకవ్యక్తి సూచకము కాదని బుద్ధిమంతులకుఁ జెప్పనక్కఱలేదు. ఇష్టార్థసిద్ధికై యిచ్చవచ్చిన యర్థమును పిచ్చలవిడిగఁ జేయువారికిఁ జెప్పఁదగినది లేదు. చెప్పినప్రయోజనము లేదు. రెడ్డిగారు

చాటుపద్యములందలి కళింగగంగు అనంతవర్మచోడగంగు కాఁదగునను చరిత్రజ్ఞుల యభిప్రాయముల నొప్పరికించి వానినిగూర్చి యించుకయుఁ దమవ్యాసములలోఁ జర్చింపకుండుట శోచనీయము. పయినిఁ బేర్కొనిన రెడ్డిగారి వాక్యములఁబట్టి మొదటివ్యాసమును వ్రాయునాఁటికి వారు చాళుక్యభీముఁడు వేములవాడ భీమకవి వేర్వేఱుపురుషులే కాఁదగున నెడి యనుమానముతోఁ గొంతవఱకుఁ ద్రొక్కులాడి, తుదకు వేములవాడ భీమకవి చాళుక్యభీముని నందనుఁడు కావచ్చుననెడి యభిప్రాయమున నిలుపుకొన్నట్లు కాననగును; గాని విభూతిపత్రికలోని రెండవవ్యాసమును వ్రాయునప్పటికా యిరువురకు సంపూర్ణైక్యమునే సమర్థించినట్లు లావ్యాసమందలి "వేములవాడ భీమకవికి వేములవాడ చళుక్యభీమకవి" దాక్షారామ చళుక్యభీమకవి, "చాళుక్యవంశ రాజధానియగు చాళుక్యభీమవర" చళుక్యభీమకవి, ఆదికవి భీమన అను పర్యాయనామములున్నట్లు స్పష్టమగుచున్నది.'' అను వాక్యములఁబట్టి తెల్లమగుచున్నది. చాళుక్యభీమవరము చాళుక్యవంశ రాజధానిగా నున్నట్లు లెట్టియాధారములు లేవు. చళుక్యభీమునిచే నిర్మింపఁబడుట లేక పునర్నిర్మాణము గావింపఁబడుట మూలముననే యాగ్రామమున కానామము గలిగెనను చరిత్రజ్ఞుల వ్రాఁతలను రెడ్డిగారు గుర్తింపకుండుట యాశ్చర్యము. వేఁగి, విజయవాడ, రాజమహేంద్రవరము కొంతకొంతవఱకు వేంగిదేశమునకుఁ జాళుక్యుల రాజధానులుగా నున్నట్లు కాన్పించును. చళుక్యభీముని కాలములో వారు ఁడీరాజ్యమును విశాఖపట్టణమందలి యెలమంచిలిలోనుండి పాలించినట్లు లిదివఱకే చెప్పియుంటిని. మొదటివ్యాసము చివరను శ్రీ రెడ్డిగారు "కాని శ్రీనాథకవి సార్వభౌముఁడంతటి చాళుక్యభీమకవి కావ్యము లాంధ్రసారస్వత దురదృష్టమువల్ల కాలగర్భమున దాఁగియున్నవచు టకంతె మిగిలిన సాక్ష్యము లేదు" అను వాక్యమును లిఖించినారు. తగిన సాక్ష్యము లేదని తలంచియు రెడ్డిగారు కారణాభాసములతో నిట్టి యపూర్వ సిద్ధాంతమును బ్రకటించుట సాహసమని నాయభిప్రాయము.

పాఠకమహాశయులారా? చళుక్యభీమనృపాలుండు కవియు నందునను దేశికవితఁ బుట్టించిన ప్రథమాంధ్రకవియు నగుట వాస్తవమే యైనచో నింతటి యుత్కృష్టవిషయము నాతఁడు తన శాసనములలోఁ జెప్పికొనియే యుండును. ఆతనిసంతతివారైనను దమశాసనములలో దాని నగ్గడించియే యుందురు. అట్టిదేదియుఁ గానరాదు. వేయేల! రాజరాజనరేంద్రుని ముత్తాతకుఁ దాతయగు నీతనికిట్టి ప్రశస్తియే యున్నచో నన్నయభట్టారకుఁడే తన భారతమున దానిని జేర్కొనియుండును. రాజరాజనరేంద్రుని మనుమలు తమశాసనములలో నాతని భారతకృతిపతిత్వమును "ఆంధ్రీచకార" అను విశేషణముతో నుగ్గడించిరికదా! పూర్వకవు లొక్కరయినఁ జాళుక్యభీముఁడు ప్రథమాంధ్రకవియైనచో నాతనిని బేర్కొనకుందురా! ఇది కేవలము నేఁడు శ్రీ వేంకట కృష్ణారెడ్డిగారి మేధోరంగమునుండి యుద్భవించిన యద్భుతాపూర్వవృత్తాంతమే గాని యందులో సత్యము కించిత్తయిన లేదనియే నానిశ్చితాభిప్రాయము. విజ్ఞులు విశేషవిమర్శన మొనరించి యథార్థమును నిర్ణయింతురుగాక! "పృథ్వీ నృపతులు నూతనప్రియులుగారె" "క్రొత్త యొకవింత ప్రాఁత యొకరోఁత" యను నానుడులను విపరీతముగ గ్రహించి, శ్రీమంతులు ధీమంతులు నగు శ్రీ వేంకటకృష్ణారెడ్డిగా రిట్టి యాకాశహర్మ్యనిర్మాణములకయి తమ ధీసంపత్తులను వినియోగింపక సక్రమము సత్యసమ్మతము నగు సాహిత్యవిమర్శనమునకయి వానిని వినియోగించి చరితార్థు లయ్యెదరుగావుత మని సుహృద్భావముతో మనవి చేయుచున్నాను.

# శ్రీమహిశూరమహారాజకృష్ణరాజేన్ద్ర సార్వభౌమస్మృతిః

కావ్యకలానిధి చిదమ్బరశాస్త్రీ,
మైసూరుసంస్థాన శతావధానీ.

శ్లో. దాతా రసజ్ఞః కవికల్పశాఖీ కర్ణాటకక్ష్మాతలసార్వభౌమః ।
కృష్ణప్రభు ర్య ద్దివమభ్యగా త్తత్సుధీజనానాం దురదృష్టమేవ.

శ్లో. ఇక్ష్వాకు స్స ధరాపతిః కృతయుగాలఙ్కారభూతో గతో
రామో దాశరథి ర్గతస్స భగవాం స్త్రేతాయుగాలఙ్కృతిః ।
రాజా ధర్మతనూభవోఽపి చ గతస్స ద్వాపరాలఙ్కృతిః
శ్రీమా౯ కృష్ణమహీపతిః కలియుగాలఙ్కారభూతో గతః.

శ్లో. సన్తి క్షితీన్ద్రా బహవో ధరిత్ర్యాం
తేషాం కథాఽనేకవిధా తథాఽఽస్తామ్ ।
కృష్ణప్రభో ర్విశ్వజనీనగాథా
స్సచేతన శ్చేద్భువి విస్మరేత్కః.

శ్లో. సత్యవ్రతం కృష్ణవిభోస్స్మృతం చేన్న విస్మయం కస్య తనోతి జన్తోః ।
తత్తాదృశః క్ష్మాతలసార్వభౌమో గతో దివం హన్త విధే ర్బలేన.

శ్లో. ధర్మాణాం పరిరక్షణేఽపి తదనుష్ఠానేఽపి బద్ధాదరః
ప్రాయస్సమ్ప్రతి దృశ్యతే జనపతిః కృష్ణప్రభో ర్నేతరః ।
తస్మిన్ రాజకులోత్తమే గతవతి స్వర్గం విధేరాజ్ఞయా
ధర్మా నిశ్శరణాః కథం పర మితస్థాస్యన్తి హన్త క్షితౌ.

శ్లో. స్వభావసిద్ధం నిధనం న శక్తో విలఙ్ఘితుం కోఽపి కుతో విషాదః ।
కృష్ణప్రభో శ్శాశ్వతకీర్తికాయః ప్రమోదహేతు ర్భవతాజ్జనానామ్.

# సంస్కృతకవయిత్రులు—మఱికొందఱు.

(ఈయూణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు, యం. ఏ.)

ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకులు, పిఠాపురరాజకళాశాల, కాకినాడ.

---

అవతరణిక—

'జనవాణి జన్మదినసంచిక' (ఆగష్టు 1937) లో 'వికటనితంబ' యను కవయిత్రినిగూర్చి నాఁటికి లభించినపరికరములతో నొకవ్యాసము నుప్రకటించితిని. తరువాత 'సచిత్రాంధ్రవారపత్త్రిక' (సంపు. 30. సంచిక ౧౫. డిసెంబరు 1937) లో నామెనుగూర్చిన విశేషాంశములను, ఫల్గుహస్తిని, ప్రభుదేవి, సుభద్ర, జఘనచపల, ఇందులేఖ యను కవయిత్రీపంచకమునుగూర్చి మఱియొక 'సందర్భము'ను బ్రచురించితిని. పిమ్మట 'జనవాణి' ('ద్వితీయజన్మదినసంచిక'—ఆగష్టు 1938) లో 'మారుల, మోరిక, చిన్నమ్మ, నాగమ్మ' యను నలువురు సంస్కృతస్త్రీకవులఁగూర్చిన యుపన్యాసమును బ్రచురించితిని. కుతూహలముగలపాఠకు లాయాసంచికలను బరిశీలించెదరుగాక! ఇటనాఱుగురు కవయిత్రులనుగూర్చి వివరింపఁబడును.

11. లక్ష్మీదేవీఠాకురాణి: (క్రీ. 15 వ శతాబ్దము)

ఈమె మిథిలాధినాథుఁడై, క్రీ. 15 వ శతకమున రాజ్యపాలన మొనరించిన శివసింహప్రభువుయొక్క పట్టమహిషి. చక్కనికవయిత్రి. ఈమె పద్యములు రెండుమాత్రము లభించినవి. అందు మొదటిశ్లోకమును ద్వాదశరాసులనామముల నిమిడ్చి యెట్లు మనోజ్ఞముగా రచించెనో గమనింపఁదగును.

౧. శ్లో. 'ఆక్రాన్తా దశమధ్వజస్యగతినా, సమ్మూర్ఛితా నిర్జలే
తుర్యద్వాదశవత్, ద్వితీయమతిమ, న్నేకాదశాభస్తని
షో షష్ఠీ కటిపక్షచ్ఛవిః చ, నవమభ్రూః, సప్తమీకర్జితా
ప్రాప్నోత్యష్టమవేదనాం, త్వమధునా తూర్ణం తృతీయో భవ'.

వివాహోచితవయస్క యయ్యు నవివాహితయై మదనశరవిద్ధయగు నొకానొకస్త్రీయవస్థ యిట వర్ణింపఁబడెను.

కాంచీపురసమీపమునందలి అగరంగ్రామవాసియగు ఏ. యం. శ్రీనివాసాచార్యపండితుఁడుకూడ నిట్టిచమత్కారముం జూపుచురచించిన యీక్రిందిపద్యము నవలోకింపఁదగును.

౧. శ్లో. 'మేషారోహనిభం నిరీక్ష్య వృషభం మత్వాత్వయా ద్వన్ద్వభా
వాత్మైర్య కర్కటకత్ ప్రతీపగమనా సింహావలగ్నాఞ్చితా
కన్యా సా వతులాపి వృశ్చికసమైర్బాణైర్ధనుర్వ్యర్పితై
రాముక్తా మకరధ్వజేన కలితా, కుమ్భస్తనీ మీనదృక్.'

౨. శ్లో. 'చపలం తురగం పరినర్తయతః
పథి పౌరజనాన్ పరిమర్దయతః
నహి తే భుజభాగ్యభవో విభవో
భగినీభగభాగ్యభవో విభవః'—('లక్ష్మీతాకురాజ్ఞ్యాః.')

---

† ఈపద్యమునకుఁ బాశ్చాత్యసంస్కృతవిద్వద్వతంసుఁడగు గ్రైర్సన్ పండితుఁడు (Dr. G. A. Grierson) ప్రాచీనభారతీయజ్ఞానవిచారకమగు 'ఇండియన్ ఆంటిక్వేరీ' (Indian Antiquary, Vol. XV. p. 318) అను మాసపత్త్రికలోఁ జిరకాలముక్రిందటనే యొసఁగిన యాంగ్లభాషానువాదము మాత్ర మిట నుల్లేఖింపఁబడును. సహృదయు లూహించుకొందురుగాక.

' Attacked with the severe onslaught of the God of Love is she; distraught like a craft or a fish in a dry place is she; Oh! thou bull-minded one, the damsel, round of arms as a water jar, with arched eye-brows (the destined wife of thou who art like a shop-keeper's wife who plies the scales (who has no equal). She feels pain like that of a scorpion bite. Surely, let the resu't of married life relieve her'.

పై శ్లోకము 'సూక్తిసాగర'మను నముద్రిత సుభాషితకోశమున మనకవయిత్రి కృతముగాఁ గనఁబడుచున్నది. కాని యాంధ్రదేశమున నొక యితిహాస మీశ్లోకమునుగూర్చి వినవచ్చుచున్నది; యెంతవఱకిది సత్యమో చెప్పఁజాలము.

ధారానగరాధినేతయగు భోజుని రాణి లీలావతీదేవి. ఈమెకు సైరంధ్రి కంచుకవతి. ఈమె కూఁతురు కాంచనమాల. ఈమెను రాజస్యాలకుఁడగు లీలావతిసోదరుఁడు వలచి యొకనాఁడతిదార్జన్యమున నామెను దనగుఱ్ఱముపై నెక్కించుకొని పోవుచుండెను. వేశ్యయైనను గాంచనమాల కాతనిపొడ గిట్టదు. కాళిదాసుఁడను కవిపై నామెకుఁ బ్రేమ మెండు. దైవయోగమునఁ గాళిదాసకవి వారికెదురుపడి పైశ్లోకముచే రాజస్యాలకుని నిపుణముగా నుపాలంభించి, యామెను వాని చెఱనుండి విడిపించెనఁట.†

(దారికడ్డువచ్చిన పురజనులను గొట్టుచు నిపుణముగా గుఱ్ఱపుస్వారిచేయు నీవైభవము నీసోదరియందు మక్కువకలిగియుండు నామె భర్తయొక్క దాక్షిణ్యావిశేషమునఁ గలిగెను గాని నీభుజబలమువలనఁ గలిగినది కాదని భావము.)

**12. త్రివేణి: (క్రీ. 1817-1883)**

దాక్షిణాత్యవిదుషీరత్నము, కవయిత్రి, బహుగ్రంథకర్త్రి. ఉదయేంద్రపురవాసి, 'యాదవరాఘవపాండవీయ' మను త్ర్యర్థకసంస్కృత కావ్యరచయితయునగు అనంతాచార్యుల పుత్రిక. శ్రీపెరుంబూదూరు

---

† ఈపద్యమును గథను శ్రీ చిలకపాటి రామానుజశర్మగారు 'కాళిదాసచరిత్ర ప్రకరణము'న (119-122 పు.) నుదాహరించియున్నారు. ఇందుఁబేర్కొనఁబడిన కాళిదాసకవి సుప్రసిద్ధరఘువంశాదికృతికర్త కాఁడనియుఁ, దన్నామసామ్యముగల వేఱొకకవి కావచ్చుననియుఁ, బ్రఖ్యాతుఁడగు కాళిదాసమహాకవికంటె భోజుఁడు కొన్నివందల సంవత్సరము లర్వాచీనుఁడనియు నెఱుఁగఁ జనును. శర్మగారినాటకమునఁ బై పద్యమున కించుక పాఠభేదము గలదు: 'చపలం'—'చతురం', 'భుజభాగ్య' 'భుజవీర్య' (కాళిదాస చరిత్రప్రకరణము—కపాలిముద్రాక్షరశాల, చెన్నపురి, 1908.)

పట్టణవాసియగు ప్రతివాదిభయంకర వేంకటాచార్యులీమె భర్త. ఈమెకుఁ ద్రివేణియను నామము నిడుటకు హేతు వేమన—కావ్యమును నదితోఁ బోల్చుట ప్రాచీనకవిసంప్రదాయము.

కవిరాజసూరి 'రాఘవపాండవీయము'న

'శ్రీమద్రామాయణం గఙ్గా, భారతం సాగరో మహాన్
తత్సంయోజనకార్యజ్ఞః కవిరాజభగీరథః
మనోజ్ఞరామాయణభారతాఖ్య
భాగీరథీసాగరసంనిపాతే
స్నాతః ప్రకుర్వన్త్వవగాహలీలా
మస్మిన్నఘచ్ఛేదిని కావ్యతీర్థే.'—1 స. ౪౧, ౪౪ ప.

అని రామాయణమును గంగానదితోఁ బోల్చియున్నాఁడు. ఇట్లే యనంతాచార్యకవి భారతభాగవతరామాయణములను మూఁడుకావ్యనదులను (గంగాయమునాసరస్వతులు ప్రయాగలో సంగమము నందినట్లు) 'యాదవరాఘవపాండవీయ'మను తనకావ్యమున సమ్మేళనము చేసెను. త్రివేణీసంగమమువలెఁ బవిత్రమగు తనకావ్యరచన పూర్తియగుటతోడనే యీతనికిఁ బుత్రికాలాభము కలిగెనఁట. అందువలన నీకన్యామణికిఁ ద్రివేణియను పేరొసఁగఁబడెనఁట. వివాహమునకుఁ బూర్వమే యీమెకవితాప్రజ్ఞ ప్రస్ఫుట మగుచుండెనఁట! జగద్విఖ్యాతకీర్తి నందిన సరోజినీదేవి కడుబాల్యముననే 8000 పాదములుగల యాంగ్ల కావ్యమును రచించెనని తెలిపినచో బాలకవయిత్రియగు త్రివేణిప్రజ్ఞ మనకంత విడ్డూరముగాఁ గన్పట్టదు. వివాహానంతరము భర్తృచరణారవిందముల సన్నిధి నీమె దర్శనములఁ బఠించెను. ఏకైకపుత్త్రుఁడు తనకన్నులయెదుట చనిపోవుటచేతను, భర్త యకాలమృతినందుటచేతను నీమె వైరాగ్యముచెంది సన్న్యాసినిగా జీవితశేషమును వెళ్లఁబుచ్చెను.

ఈమె రచించిన 'హారతిపంచకము'ను విని యానందించి యచ్చటి 'జిల్లాకలెక్టరు' ఆప్రాంతముల దొరకిన కొన్నివిగ్రహముల నీమెకొసఁగెను. ఈవిగ్రహములఁ బ్రతిష్ఠించుటకై యీమె యొకయాలయమును

నిర్మింపఁదలఁచి తిరువానూ్కరుసంస్థానమున కరిగెను. అక్కడ నీమె విశేషముగా సత్కరింపఁబడెను. మైసూరుసంస్థానప్రధానామాత్యులగు దివాన్ రంగాచార్యులువారికి నీమెయెడ విశేషగౌరవ ముండెడిది. వారి సమాదరణమువలననే యీమె యాలయనిర్మాణమును గొనసాగింపఁ గలిగెనఁట. ఈకవయిత్రి రచించిన గ్రంథము లనేకములు గలవు. ఎట్టి క్లిష్టసమస్యలనైన నాశువుగాఁ బూరించుటయందీమె కసదృశప్రజ్ఞ కలదు. సంస్కృతస్త్రీకవులలో నీమెరచించినన్ని కావ్యముల మఱెవ్వరును రచించియుండ లేదు. ఏకావ్యప్రసూనములచే నీమె సంస్కృతశారదారాధన మొనరించె నన—

అ. స్తోత్రాత్మకములగు కావ్యములు—

౧. లక్ష్మీసహస్రము. ౨. రంగనాథసహస్రము.

ఈరెండును వేదాంతదేశికుల 'పాదుకాసహస్రము'ను, వేంకటాధ్వరి 'లక్ష్మీసహస్రము' నాదర్శముగాఁ గొని రచింపఁబడియుండును.

ఆ. రసగర్భములగు లఘుకావ్యములు, ((Lyrical poems.)

3. శుకసందేశము. † ౪. భృంగసందేశము. †

ఇ. మహాకావ్యములు—

౫. రంగాభ్యుదయము. ౬. సంపత్కుమారవిజయము.

ఈ. నాటకములు—

౭. రంగరాట్సముదయము. ౮. తత్త్వముద్రాభద్రోదయము.

ఇందీకడపటిగ్రంథము కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయము' వలెను, వేదాంతదేశికుల 'సంకల్పసూర్యోదయము'వలెను నాధ్యాత్మిక విషయవిచారకమగు (Allegorical) రూపకము.

**13. లక్ష్మీరాజ్ఞి—(క్రీ. 19 వ శతాబ్ది.)**

ఈమె కడతనాడు, ఇకవలం, కొవిలోగం ('Kadathanadu, Ikavalam, Kovilogam') అను మలబారుదేశమునందలి పట్టణ

† ఈనామములతో నితరకవులు రచించిన సంస్కృతకావ్యములను గూర్చి మదీయ 'సంస్కృతదూతకావ్యచరిత్రము' (1937) ను జూచునది.

ములకు రాణి. క్రీ. 1890 ప్రాంతముల జీవించియుండెను. ఈమె 'సంతానగోపాలకావ్య' మను మూఁడు సర్గములకావ్యమును నిర్మించెను. భాగవతమునందలి దశమస్కంధమునను, హరివంశమునను గానవచ్చు నీకథ యిందలి యితివృత్తము—

ఒకానొక బ్రాహ్మణుని కొడుకులు పదిమందియు నొకరివెనుక నొకరు చనిపోవుట. అర్జునుఁడు కడపటిశిశువును రక్షించెదనని ప్రతిజ్ఞ చేసి, విఫలుఁడై యగ్నిప్రవేశము చేయనెంచుట. అప్పుడు శ్రీకృష్ణుఁ డాతనిని వారించి, చనిపోయిన పదిమందిశిశువులను వైకుంఠమునుండి తీసికొనివచ్చి, బ్రాహ్మణు ననుగ్రహించి, యర్జునుని రక్షించుట.

ఈకావ్యమునఁ దృతీయసర్గము యమకప్రచురముగా నుండును.

**14.** జ్ఞానసుందరి: (క్రీ. 19-20 శతాబ్దములు.)

ఈమె వేశ్య, కుంభకోణనివాసిని. 1910 వ సంవత్సరప్రాంతములఁ గాలధర్మమునందెను. శ్రీవత్సగోత్రజులగు కుప్పుస్వామిశాస్త్రి వర్యుల శిష్యురాలు. ప్రసిద్ధకవయిత్రి. ఈమెవక్తృత్వనైపుణిని, బద్య పఠనకౌశలమును, గానకళాప్రావీణ్యమును జెవులార విని, యామె నాట్యమును గన్నులారఁ గాంచి యమందానందము నందిన వృద్ధు లనేకులు నేఁటికిని దాక్షిణాత్యమండలముల యం దున్నట్లు తెలియు చున్నది. మధురానగరవాసియగు ఆర్. ఫిషర్ (R. Fisher) అను నుత్తమన్యాయవాది (బారిష్టర్) యీామెకుఁ బ్రధానాశ్రయుఁడఁట. ఈమె తనకవితాప్రావీణ్యమును మైసూరుసంస్థానమునఁ బ్రదర్శించి, యా మహారాజుచే 'కవిరత్న' బిరుదముచే సన్మానింపఁ బడెను. తా ననేకగ్రంథములను రచించిన ట్లామెయే చెప్పుకొనెను. కాని వీనిలో 'హాలాస్యచంపువు' †మాత్రము లభించినది. ఇందాఱు స్తబకము లు గలవు. మధురయందలి మీనాక్షీసుందరేశుల వివాహాదికవృత్తాంత

† శ్రీ విద్యాముద్రాలయమున ముద్రితము, కుంభకోణము, 1906.

ము లిందు వర్ణింపఁబడెను. ఈమెకవిత ప్రాయికముగా ననుప్రాసప్రచు రముగా నుండును. మచ్చునకు రెండు పద్యములు:

౧. శ్లో. 'మధురీకృతగరళత్వాత్ మధురాభిఖ్యా తదాది సా నగరీ
నిజసీమస్థఫణిత్వాత్ విభాతి హాలాస్యనామత శ్చైహ.'

పై పద్యమున మధురకు హాలాస్యపురమనియు, మధురాపుర మనియు, నామములు గల్గుటకు హేతువు నిరూపింపఁబడెను.

౨. శ్లో. 'తస్యా లలాటలీనస్వాహాపతిరివ శాన్తసన్తాపః
రేజే కుఙ్కుమతిలకవ్యాజా న్నూనం బుధా హి కాలవిదః.'

ఈమెశయ్య యంతసరళముగా నుండదు గాని, యీమెకుఁగల గీర్వాణభాషాప్రౌఢి తత్కావ్యమునఁ బ్రస్ఫుటమగుచుండును.

15. శ్రీ దేవీ బాలరాజ్ఞి—

పేరునుబట్టి యీమె రాణియని యూహింపఁజనును. ఈమె దేశ కాలములు ప్రకృతము తెలియవచ్చుటలేదు. ఈకవయిత్రి శ్రీమద్భాగవ తమునందలి కథలను గైకొని 'చంపూభాగవత'మను కృతిని రచించెను. భాగవతమును సంస్కృతమునఁ జంపువుగ రచించిన కవీంద్రు లనేకులు గలరు. వారినామముల నిటఁ బేర్కొందును. ౧. అనంతనారాయణ పుత్త్రుఁడగు చిదంబరకవి. ౨. కుమారడిండిమునితనూజుఁడగు మూఁడవ రాజనాథుఁడు. 3. వెల్లాలకులోత్పన్నుఁడు నాంధ్రదేశీయుఁడు నగు అభి నవకాళిదాసకవి. ౪. అభినవకాళిదాస-గోపాలశాస్త్రి. ౫. కొల్లూరి రాజశేఖరకవి, ఆంధ్రదేశస్థుఁడు. ౬. భారతచంపువును రచించిన అనంత భట్టు. ౭. రామభద్రకవి.

16. రాధాప్రియ—

ఉత్కలదేశమున (ఒరిస్సా) నొక మహారాజును, రఘునాథదేవ వర్మతనూజుఁడునగు విశ్వనాథదేవవర్మకుఁ బట్టపురాణి కవయిత్రి రాధా ప్రియ. భార్యాభర్త లిరువురును గలిసి 'రాధాగోవిందశరద్దాస'† మను

† 11 వ ప్రచురణము, ఉత్కలసాహిత్యముద్రాలయము, అత్ఘుర్ (Athgurh, Orissa) 1917.

* 'రాధాప్రియ' వ్యాఖ్యతో ముద్రితము, ఉత్కలముద్రణాలయము, కలకత్తా, 1915.

పద్యకావ్యమును రచించిరి. ఇందు రాధాకృష్ణుల శరత్కాలరాసక్రీడలు వర్ణింపఁబడెను. రాజకవి యగు విశ్వనాథదేవవర్మ రుక్మిణీకృష్ణులవృత్తాంతమును 'రుక్మిణీపరిణయము'* (చరితము) అను నామముతో 11 సర్గముల మహాకావ్యమును రచించెను. పట్టమహిషి, విద్వత్కవయిత్రీమతల్లియునగు రాధాప్రియ భర్త రచించిన మహాకావ్యమునకు 'రాధాప్రియ'యను నొక ప్రౌఢవ్యాఖ్యను రచించెను. సంస్కృతభాషా వాఙ్మయములలోఁ గఠోరవ్యవసాయ మొనరించిన నారీమణులే బహు విరళము. అందును గృతినిర్మాణదక్షులగు విదుషీమణు లింకను విరళము. అట్టియెడ భార్యాభర్త లిరువురును సంస్కృతమునఁ జక్కని పాండితిని బడసి కవితాపాండితీస్ఫోరకములగు గ్రంథముల రచించుట యద్భుతానందజనకముగా నున్నది. క్రీ. 17 వ శతాబ్దిలో వంగదేశమున మహాపండితుఁడగు కృష్ణనాథుఁడును, విదుషీమణియగు నాతని ధర్మపత్నియుఁ గలిసి 'ఆనందలతిక'యను చంపువును సంస్కృతమున రచించిరి. 18 వ శతాబ్దమున దక్షిణదేశమున విలసిల్లిన ఘనశ్యామవిద్వత్కవియు నాతని ధర్మపత్నులు విదుషీమణులునగు సుందరి, కమలయుఁ గలిసి రాజశేఖరుని 'విద్ధసాలభంజిక'కు వ్యాఖ్య రచించినట్లు ఘనశ్యాముని వాక్యమును బట్టి తెలియుచున్నది.

ఉపసంహృతి—

కాలాంతరమునఁ దక్కిన గీర్వాణకవయిత్రులంగూర్చిన వ్యాసములు ప్రచురింపఁబడును. సంస్కృత కవయిత్రులంగూర్చి డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులుగారు(యం.ఏ., యం ఎల్, పి హెచ్ డి) డాక్టర్. వి. రాఘవన్, డాక్టర్. యతీన్ద్రవిమలచౌధురి, (యం. ఏ., పి. హెచ్ డి.) మొదలగు విజ్ఞులువ్రాసిన గ్రంథములు నాకెంతయు నుపయోగించినవి.

---

# సంస్కృతలోకోక్తిముక్తావళి.

ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యుఁడు, ఎం. ఏ. కాకినాడ.



## పస్పశము.

శ్రీ విజయనగరమహారాజాంగ్లకళాశాలలో నించుమించుఁ నర్ధశతాబ్దము ప్రధానసంస్కృతాధ్యాపకులుగను నాంధ్రపండితులుగను నుండి పదులకొలఁది విద్యార్థుల కాంధ్రగీర్వాణభాషావాఙ్మయములఁ గఱపి ధన్యులై, ప్రకృత మెనుబదివర్షములు దాఁటియు వాసనాబలమున సారస్వతసేవావ్యసనమును దొలఁగించుకొనఁజాలక, యింకను ద్రావిడభాషాగ్రథితమగు వైష్ణవదివ్యప్రబంధామృతము నాంధ్రసువర్ణపాత్రమున నింపిన సుగృహీతనామధేయులగు ఉ. వే. శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యపాదులవంటి మహామహులు ప్రాతఃకాలతారకలవలె సారస్వతాకాశమున బహువిరళముగాఁ గానవచ్చెదరు. ఆంధ్రగీర్వాణములయందు విద్వత్కవులై, యాంగ్లద్రావిడభాషలలో జితశ్రములై, సంస్థానాస్థానకవీంద్రులైన వీరిపవిత్రనామము నెఱుఁగనివారాంధ్రవాఙ్మయప్రపంచమున నుండరని చెప్పవచ్చును. వీరు రచించిన 'లౌకికన్యాయవివరణ' మను గ్రంథరాజము నాంధ్రసాహిత్యపరిషత్తువారు 1939 వ సంవత్సరమునఁ బ్రకటించియున్నారు. అందు 232 సంస్కృతలోకోక్తులు, న్యాయములు, ఆభాణకములు వివరింపఁబడినవి. ఇందింకను జేర్పవలసినవి పరస్సహస్రముగఁ గలవు. ఆచార్యచరణులచరణాంతమున గీర్వాణభాషావాఙ్మయముల నధ్యయనముచేసిన శిష్యపరమాణువునగు నేను వారికృతి కనుబంధమును గూర్చి సహృదయలోకమునకు నివేదించుచున్నాను. ఆచార్యులవారికృతిలో నడనడ ముద్రణదోషములు గలవు; కొన్ని యాభాణకములకు సంబంధించినశ్లోకములు

వా రుదాహరింపలేదు; ఆయాలోకోక్తులకుఁ బ్రసిద్ధగ్రంథములలో లభించు నాకరములఁ గొన్నిటిని వా రుల్లేఖింపలేదు. 'ఉజ్జ్వలమతులైన పండితులసన్నిధి నించుకబోధశాలినై' నే నాంగ్లాంధ్రగీర్వాణగ్రంథములఁ బరిశ్రమముగాఁ బరిశీలించి, పైలోపలేశముల నా తెలివియెంతకలను బట్టి సవరించి, ఆంగ్లాంధ్రముల ననురూపములగు సూక్తుల నుదాహరించెదను. ఈయనుబంధనిర్మాణమున నేఁ బరిశీలించినకృతులలో నొకటి 'సంస్కృతన్యాయములు'— 2 భాగములు. (లక్ష్మీగ్రంథమండలి, తెనాలి, 1939). దీనికి వ్యాఖ్యానము రచించినపండితులు శ్రీ కూచిభొట్ల ప్రభాకరశాస్త్రి, శ్రీ ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి యను వారు. వీ రుదాహరించిన కొన్నివాక్యముల కాకరమే చూపలేదు; కొన్ని చోటుల గ్రంథమును మాత్రము పేర్కొని, యేప్రతియో, యేప్రకరణమున నేపద్యమో (లేక పుటయో) యుల్లేఖింపక- సురేశ్వరవార్తికము, భాగవతము, శాంకరభాష్యము, కుమారసంభవము, విక్రమోర్వశీయము, మహాభాష్యము- ఇట్లు పేర్కొనియున్నారు. ముద్రాశాలలు లేని ప్రాచీనకాలమునఁ దాళీదళసంపుటములతో గ్రంథవ్యాసంగము చేయు దినములలో సరిరీతిగాఁ బ్రమాణముల సరిగా నుదాహరింపకపోవుట యించుక క్షంతవ్యము కావచ్చునేమో, కాని ముద్రణాలయములు గల నేఁడు వీ రిట్లు ప్రమాణముల సమగ్రముగాఁ జూపకుండుట శోచనీయము. ఒక వాక్యము మహాభాష్యములోని దనియో, మహాభారతములోని దనియో వీరు పేర్కొనినచో నాస్థగల మావంటి పాఠకుల కెంతకాలము వ్యయపఱచి, యెంతప్రయాసపడిన నావాక్య మాయాగ్రంథములలో లభించునో వీ రేమైన నాలోచించియుండిరా? ఒకవేళ ప్రమాదవశమున మహాభారతమనుటకు వారు మహాభాష్యమని యుండిరా, పాఠకుఁడు వ్యర్థముగా శ్రమపడుటయేకాని, యాయాకరము లభించుటయే దుస్తరము. ఇట్లు సరిగా ప్రమాణముల నాకరముల నుదాహరింపని గ్రంథకర్తలను జేకబ్ పండితుఁడు (Colonel G. A. Jacob) తన

'లౌకికన్యాయాంజలి' (౧ భాగము - నిర్ణయసాగరముద్రాలయము, బొంబాయి, 1900 సం.) పీఠికలోఁ దీవ్రముగ నిరసించి యున్నాఁడు.† ఈముక్తావళి సూర్యాలోకభాగ్యము నంది సహృదయకంఠాభరణముగాఁ గాక!

— ౨33 (1) * పంకప్రక్షాళనన్యాయము —

(లౌకికన్యాయాంజలి. I భా. 24. 48. పుట. సంస్కృతన్యాయములు, 47 పు; సంస్కృతలోకోక్తులు, 659 సంఖ్య.)

'అడుసు (బురద) త్రొక్కనేల, కాలు కడుగనేల?' అర్థమనర్థప్రదము. ధర్మకార్యాచరణము కొఱకైనను ధనేచ్ఛ వాంఛనీయము కాదు. ధనసంపర్కమేమాత్రమైనను గీడు నొసఁగుటచే నట్టిధనమును గోరనేల? ఆపదలపాలు గానేల? అనుసందర్భమున 'పంచతంత్రము'న (II భా. 165 ప.) నీక్రిందిశ్లోకము గలదు:

'ధర్మార్థం యస్య విత్తేహా తస్యాపి న శుభావహా
ప్రక్షాలనాద్ధి పఙ్కస్య దూరాదస్పర్శనం వరమ్.'—(సుభాషితరత్నభాండాగారము. ౧౭౦ పు. 472 ప. 'వ్యాసమునేః')

---

† 'In Taranatha Tarkavachaspati's *Vacaspatyam* we have a list of 151 *nyayas*, popular and technical; but references to works where they are to be found are few and far between, and this considerably lessens their value. Thirty of these were reproduced in V. S. Apte's dictionary, in 1890 but with the same defect. Again in 1875, Pandit Satyavrata Samasrami published a small pamphlet of 36 popular maxims together with a large number of purely technical ones, and professed to give a reference for each of them.[§] But a man who refers you to the *Bhagavata-Purana*, to 'A Comentary on the *Vedanta-Bhashya*' or to 'A Commentary on the *Kavya Prakasa*' and vouchsafes no further information whatever, is a worthless guide; and such mere semblance of guidance deserves nothing but reprobation. One can tolerate ambiguity of this kind in the ancient writings; but in modern times, when printed books of reference abound, such vaguenes is inexcusable.'

*ఇట్టి గుఱుతు గల లోకోక్తులు శ్రీ వేంకటరమణాచార్యులవారి 'లౌకికన్యాయ వివరణము'న లేవని గ్రహింపునది.

మల్లినాథసూరి 'ప్రత్యాసన్నే' (౧-4) అను మేఘసందేశపద్య వ్యాఖ్యలో నిట్లు వ్రాసియున్నాఁడు—"దయితా-జీవితాలమ్బనార్థీ సన్ వర్షాకాలస్య విరహిదుస్సహత్వాత్—'ఉత్పన్నప్రతీకారాదనర్థస్య ఉత్పత్తిప్రతిబన్ధ ఏవ వర' మితి న్యాయేన ప్రాగేవ ప్రియాప్రాణధారణోపాయం చికీర్షుస్సన్నిత్యర్థః"—(8 పు. వేంకటరాయశాస్త్రిగారి ప్రతి.)

'ప్రక్షాలనాద్ధి...వరమ్' (చూ. రత్నసముచ్చయము, ౬౦ పు, 1111 సంఖ్య; లోకోక్తిరత్నప్రభ, ౪౧ పు, 920 సం; ఆభాణకమాల, 3౧ పు. 145 సం; సంస్కృతలోకోక్తులు, 730 సం; సంస్కృతలోకోక్తిచంద్రిక, 277 సం.)

బ్రహ్మసూత్రభాష్యము (IV. ౧. 16) పై నానందగిరివ్యాఖ్యలో నీన్యాయము రెండుసారు లిట్లు పేర్కొనఁబడినది:

'అగ్నిహోత్రాదీనా మపి పుణ్యాన్తరవద్వినాశత్వాత్ పఙ్కప్రక్షాలనన్యాయాపాతా దారురుక్షుణాపి తాని న అనుష్ఠేయాని.'

'ధీనాశ్యానామపి కర్మణాం అనుష్ఠానస్య విద్యోత్పత్త్యర్థతయా పఙ్కప్రక్షాలనన్యాయాఽవకాశాత్ పూర్వం జ్ఞానాదనుష్ఠేయాని అగ్నిహోత్రాదీని ఇతి సిద్ధాన్తప్రతిజ్ఞాం వివృణోతి'. పైసూత్రముపై 'భామతి' 'భాష్యరత్నప్రభ'లను గూడఁ జూడఁదగును.

బ్రహ్మసూత్రభాష్యమున మఱియొకచోటఁ గూడ (III. 2. ౨౨)
శంకర భగవత్పాదులు—'ప్రక్షాళనాద్ధి...వరమ్'

అను శ్లోకపాదమును రెండుసారు లుదాహరించి యుండిరి. ఈ భాగముపై వ్యాఖ్య వ్రాయుచు ఆనందగిరి 'పంకప్రక్షాళనన్యాయము' నుమూఁడుసారులు పేర్కొనియుండెను.

పంచతంత్రములోనిదని సామాన్యముగా నెంచఁబడు నీపద్యము మహాభారతమునఁ గూడఁ గానఁబడుచున్నదని 'జేకబ్' పండితుఁడు వ్రాసి యున్నాఁడు (లౌ. న్యా. అం. 1. ౪౫ పు.) మహాభారతము నందలి పాఠ మిట్లున్నది.

'ధర్మార్థం యస్య విత్తేహా వరం తస్య నిరీహతా
ప్రక్షాలనాద్ధి పఙ్కస్య శ్రేయో న స్పర్శనం నృణామ్'
—(అరణ్యపర్వ. ౨. 49. బొంబాయిప్రతి)

పంచతంత్రపాఠమునే శంకరాచార్యులు స్వీకరించి యున్నారు.
పై లోకోక్తికి సరియగు నాంగ్లలోకోక్తి—
'Prevention is better than cure.'

వివిధవైద్యవిధానములలో సామాన్యముగా రోగనివారకౌషధములు ప్రయోగింపఁబడుచుండును. 'హోమియోపతి' మొదలగు కొన్ని విధానములలో మాత్రము రోగోత్పత్తినిరోధకములగు మందులు వాడుచుందురు. పై లోకోక్తి కిది లౌకికోదాహరణము.

— ౨౩౪. (2) * వర మద్య కపోతః, శ్వో మయూరాత్. †—

రేపు దొరకునన్న నెమలికంటె నేఁడు చేఁజిక్కిన పావురమైనను మేలే—దీనికనురూపములగు సంస్కృతలోకోక్తులు:

—3. 'వరం తత్కాలోపనతా తిత్తిరీ, న తు దివసాన్తరితా మయూరీ'.—
—(విద్ధసాలభంజిక. ౧ అం. 21 పు.)

వేఱొకనాఁడు లభించునన్నయాఁడునెమలికంటె నేఁడు లభించిన తిత్తిరిపక్షి (తీతుపుపిట్ట) యే మేలు.

† సంస్కృతలోకోక్తులు, 1031 సం; ఆభాణకమాల, 13 పు. ౬౨ సం; సంస్కృత న్యాయములు, 351 పు; లౌ. న్యా. అంజలి, ౧. 32 పు; లో. ర. ప్రభ, 56 పు. ౧౨౫౧ సం.

— 4. 'వరం సాంశయికాన్నిష్కా దసాంశయికః కార్షాపణః'. —
—(ఆభాణక. ౧౩ పు.)

సందేహాస్పదమయిన బంగారునాణెముకంటెఁ గర్షమెత్తు తూనిక గల వెండినాణెమైనను సందేహములేనిదగుచో(మాఱునదగుచో)మేలు.

ఇదియు, 'వరమద్య' యనునదియు వాత్స్యాయనుని 'కామసూత్రము'న (౧౫ పు.) నుల్లేఖింపఁబడి యున్నవి.

— 5. 'వరం జీవన్ గర్దభః, న పున ర్మృతో ఘోటకః' —
—(ఆభా. మా. ౧౩పు.)

చనిపోయిన గుఱ్ఱముకంటె జీవించినగాడిద యైనను మేలు.

వీనికి సమానములగు నాంధ్రాంగ్లలోకోక్తులు:

'అరువాఱుకాసులకంటె రొక్కము మూఁడుకాసులు మేలు

'A bird in the hand is worth two in the bush'.
'To-day is better than two tomorrows.'

— ౨౩౫ (6) విక్రీతే కరిణి కిమఙ్కుశే వివాదః ? † —

గొప్పవిలువగల యేనుఁగునే యమ్మివేసి కొలఁదివెలగల యంకుశము నీయనని పెనఁగులాడుట యేల ?

'గుమ్మడికాయ పోవుచుండ నూరకొని, ఆవగింజలు పోవుచుండ నట్టె పట్టి చూచెనఁట.'

'Penny-wise and pound-foolish'.

పైలోకోక్తి సమస్యగా గ్రహించి యెవరిచేతనో యీక్రిందిపద్యములు రచింపఁబడెను.—

అ 'కాన్తారే ఘనతిమిరే భుజఙ్గమేభ్యో
నో భీతా, న చ గణితా మహాపగాపి,
కిం బాలే ! వససి భయం మదఙ్ఘ్రిసఙ్గాత్, విక్రీతే.' (స. ప. మా. 61 పు. ౨౯)

† లా. న్యా. వి. 110 సం. ౩౮పు; సం. న్యా. ౩౫౧పు; స. ప. మా. 61 పు. ౨౯—౩౧ శ్లో; రత్నస. 1502సం. ౮౧పు; సం. లో. 1049 సం. ౧౬౨పు; లో. ర. ప్రభ. 1283 సం. ౫౭ పు.

(జారిణిని గూర్చి విటుని వాక్యము—పిల్లా, ఈ యడవిలో గాఢాంధకారమున, పాములు మొదలగు క్రూరజంతువులకును భయపడక, మహానదిని గూడ నవలీలగా దాఁటిన నీవు నాశరీరసంగమున కేల జడిసెదవు? ఏనుఁగు నిచ్చి యంకుసము కొఱకా పీకులాట !)

ఆ. "సౌమిత్రి ర్వదతి 'విభీషణాయ లఙ్కాం
దేహి త్వం భువనపతే! వినైవ కోశమ్'
ఏతస్మిన్ రఘుపతి రాహ వాక్యమేతద్, విక్రీతే." (స. ప. మా. 61 పు. 30)

(శ్రీరామునితో లక్ష్మణుని వాక్యము- 'జగత్పతీ, ధనాగారము మాత్రము తీసికొని, తక్కినలంకారాజ్యమును విభీషణున కీయఁదగును' — అనఁగా రాముఁడు 'ఏనుఁగు నిచ్చివేసి యంకుశముకొఱకుఁ బెనఁగులాట యేల' యనె నఁట.)

ఇ. 'సంపీతేఽధరమధుని, స్తనే గృహీతే
సంజాతే గతవసనే తథోరుయుగ్మే
కిం నీవీగత మబలే! రుణత్సి పాణిం, విక్రీతే.' (స. ప. మా. 61 పు. 30).

(ప్రియురాలినిగూర్చి ప్రియుని వాక్యము—అధరమధు వాస్వాదింపఁబడ, స్తనగ్రహణము చేయఁబడ, జఘనము విగతవసనము కాఁగా, నిఁక నబలా! నీవియొద్దకుఁ జేరిన నాకరము నేల యడ్డగించెదవు. ఇదెట్టులున్నదనఁగా నేనుఁగు నిచ్చి యంకుశముకొఱకుఁ దగవులాడిన ట్లున్నది.)

— ౨౩౮. (7) * శ్రోత్రియవిటన్యాయము. —

(సంస్కృతన్యాయములు. ౧౮౭ పు)

ఛాందసవిటుఁడు ప్రియురాలిని మడి గట్టుకొని రమ్మనె నఁట— అని పై గ్రంథమునందలి శాస్త్రిసోదరుల వ్యాఖ్య. కాని యీనడుమ శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు సంస్కృతన్యాయములంగూర్చి ప్రకటించినవ్యాసమున† పై వ్యాఖ్యను గాదని యీక్రిందిపద్యము నుదాహరించిరి:

'వేదాధ్యయనసంపూతే మోచ్ఛిష్టం కురు మే ముఖే
ఆస్తిచే న్మహతీ ప్రీతి ర్వామం కర్ణం దశస్వ మే.'

(అధరపానావసరమున ఛాందసప్రియుఁడు ప్రియురాలితో ననిన వాక్యము — వేదాధ్యయనముచేఁ బవిత్రమగు నావదనము నెంగిలి చేయకుము. అంతకుతూహలముగా నున్నచో నా యెడమచెవిని గొఱుకుము )

పై శ్లోక మీాక్రిందివిధముగా సుభాషిత-మణికంఠహారమున (171 పు. ౪౭౭ ప.) నున్నది—

'సామగాయనపూతం మే నోచ్ఛిష్ట మధరం కురు,
ఉత్కణ్ఠితాసి చే ద్భద్రే! వామం కర్ణం దశస్వ మే'.

('కస్యాపి'-శార్ఙ్గధరపద్ధతి. 4062 ప. ౬౨౦ పుట)

('సంభోగరసికురాలగు ప్రియురాలు ప్రియునియధరమున దంతక్షతములఁ జేయ యత్నింపఁగా నాకామినితో ఛాందసుఁడగు ప్రియుఁడు పలుకుచున్నాఁడు') రసాస్వాదనావసరమున శ్రోత్రియుఁడు కుంఠితహృదయుఁడని లోకప్రవాదము. కాళిదాసమహాకవి యిట్టులు నుడివియున్నాఁడు.

'వేదాభ్యాసజడః కథం ను విషయవ్యావృత్తకౌతూహలః
నిర్మాతుం ప్రభవే న్మనోహర మిదం రూపం పురాణో మునిః'.

(విక్రమోర్వశీయము. 1. ౮ ప.)

(వేదాభ్యాసముచే మొక్కపోయినబుద్ధితో విషయసుఖవిముఖమగుహృదయముతోఁగూడిన యాముసలిముని యీమనోహరరూపము నెట్లు నిర్మింపఁగలుగును ?)

'బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్'. (మనుచ. 2. ౧౬.)

అని పెద్దనయు నుడివియున్నాఁడు గదా.

వీణాప్రవీణయగు నొకసుందరి

'వీణాభ్యసనవేళాయాం మహాం మామలక స్తనీ'

† 'విభూతి'-పుంజము 3, రేఖ 1, ౫౭-౭ పుట. (జూలై 1911)

అని తన గానకళానైపుణిని గూర్చి నుడువఁగా వేదాధ్యయనజడుఁడగు నామెభర్త యిట్లు తనవేదవిద్యావైదుష్యమును గూర్చి చెప్పుకొనె నఁట.

'వేదాభ్యసనవేళాయాం వార్తాక—వయమ్'.

'వైదికుని చేతివిడెము'-అను తెనుఁగుజాతీయము గూడ నిట్టిదే.

—౨౩౭.(8) *యా లతాన్విష్యతే సైవ లగ్నా సంప్రతి పాదయోః—

తాను వెదకఁబోయినతీఁగె తనకాళ్ళకుఁదగులుకొనినట్టులు తానే కార్యముకొఱకుఁ బ్రయత్నింపఁబోవుచున్నాఁడో దానిఫలము తలఁపని తలఁపుగా ననాయాసముగా సిద్ధించుట. పై పద్యపాదము కాంచనాచార్యుని ధనంజయవిజయవ్యాయోగములోనిది. దీనికి నుత్తరార్ధము:

'కురురాజోఽభియాతవ్యః స్వయమేవ సమాగతః' (౧౫ ప. 3 పుట.)

ఈలోకోక్తికి ననురూపములగు తెనుఁగుసామెతలు:

అ. వెదకఁబోయిన తీవ కాలఁ దవిలె.

ఆ. మ్రొక్కఁబోయినదేవర యెదురైనట్లు.

ఇ. ఆడఁబోయినతీర్థ మెదురైనది.

పై మూఁడు లోకోక్తులు ననురూపములే కాని ప్రయోగమున నించుక భేదము చూపట్టును. మనకంటెఁ జిన్నవారిని తక్కువవారిని జూచుట కేఁగునప్పుడు వారిని మార్గమధ్యముననే కలసికొనుట తటస్థించుచో 'వెదకఁబోయినతీవ కాలఁ దగిలె' ననియు, నిట్టి సందర్భముననే మనకుఁ బూజ్యులగు పెద్దలవిషయమునఁ దక్కిన రెండు సామెతలను వాడుదుము. ఇఁక వీనికిఁ బూర్వప్రయోగములు:

అ. 1. క. 'వినిరోయుతీఁగ కాళ్లం
బెనఁగెఁగదా యనుచుఁ బొంగి భీష్ముఁడు ద్రోణున్
ఘనభుజు నభీష్టపూజల
ధనధాన్యవిధానముల ముదంబునఁ దనిపెన్.'

భారత. ఆది. ౫. 219 ప.

2. మ. 'వెదకంబోయినతీవ కాలఁ దవిలె న్వేయేల, (దుర్వాసుచే)'
ఉత్తరహరివంశ. ౪. 163.

3. శా. 'చూడంబోయెడు తీవ కాళ్లఁదవిలెన్ శూరోత్తమా! సంగర
క్రీడారోపితచాపటంకరణమూకీభూతలోకత్రయా!
యీడా నీకొక రంభుమంతుఁడవె నీ, వీడేరె నాకోర్కె నేఁ
డాడంబోయెడుపుణ్యతీర్థ మెదురై యబ్బెం బుధోద్ధారుణిన్.'
సుదక్షిణాప. ౨. 64.

4. క. 'వెదకంబోయిన తీఁగియ
పదములఁ దగిలినవితంబు పాటింపఁగ ని
న్నెదుటనె కనుగొంటిని స
మ్మదమున హరిణాంక వినుము మానినివెతలన్.'
తారాశశాంకవిజయము ౪. 102.

ఆ. 1. ఉ. 'ఆడఁగఁబోవుతీర్థ మెదురైనవిధంబున నల్లి యేను జే
పాడియ చంద్రశేఖరు నుపాస్తి యొనర్చి యుపాయసంబుతోఁ
జూడఁగవచ్చువాఁడ నయి చూచుచునుండఁగ నీవ వచ్చి తో
చేడియ! యెట్టిపుణ్యములు చేసినవాఁడనొ ప్రాగ్భవంబునన్.'
హరవి. ౭. 124.

2. క. 'మది నూఱడు మిఁక సీతలఁ
పుఁదలంపన్ గూడె నాడఁబోయినతీర్థం
బెదురుగ వచ్చినక్రియ ని
మ్మదిరేక్షణ తాన వచ్చె మనకడ కర్థిన్.' దశకుమార. 3. 142.

3. శా. 'చూడంజూడ నృసింహకీర్తిచయ మీక్షోణీసభామధ్యమం
దేడం జూచినఁ దానదైయె నెగడఁగా నీక్షించి మిన్నేటిని
రాడంబోయెడి చేసితాపసులు, మేలౌ ప్రేమాల సిద్ధించెఁగా
నాడంబోయినతీర్థమంచు మదిలో హర్షింతు రశ్రాంతమున్.'
నరసభూ. ౫. 57.

4, సీ. 'ఎదురయ్యె నాడఁబోయిన తీర్థ మద్భుత
నూవహిల్లంగ నీయవసరమున.'
శంకరకవి, హరిశ్చంద్ర. ౪. 102.

5. ద్వి. 'పుడమిపై మరుఁడ ! నీ పొందు సేఁ గోరి
తడ వాయె నేఁటికి దైవయోగమున
నాడఁబోయినతీర్థ మరుదెంచినట్లు
నేఁడు మోహము నీఱ నినుఁ జూడఁగంటి.'
సారంగధర. ౧. 571-'74.

6. ఉ. 'ఆడఁగఁబోవుతీర్థ మెదురైనగతిన్ భవదాగమంబు బల్
వేడుకతో నిరంతరము వేఁడుచునుండఁగ నేఁడు మాకుఁ జే
కూడె నభీప్సితంబు లొనఁగూడె నమాత్యసుహృజ్జనంబు మా
నాడును భృత్యకోటి సదనంబులు ధన్యతనొందె మాధవా.'
—అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి. భద్రాపరిణయ. 3-30.

౭. క. 'ఈవేళ ద్రొక్కఁబోయిన
దేవర యెదురయ్యె, బుద్ధదేవర మనకుం
గావలసిన వర మియ్యఁగఁ
దా వచ్చినవాఁడు, రండు తామరసాక్షుల్.'
—దశావతార. బౌద్ధ. 347.

ఇట్టిభావమే భవభూతికృతియందును గలదు.—

శ్లో. 'అన్వేష్టవ్యో యదసి భువనే భూతనాథః శరణ్యో
మా మన్విష్య న్నిహ వృషలకం యోజనానాం శతాని
క్రాన్త్వా ప్రాప్తః స ఇహ తపసాం సంప్రసాదోఽన్యథా చేత్
క్వాయోధ్యాయాః పునరుపగమో దణ్డకానాం వనే వః.'
—ఉత్తరరామచరిత. ౨ -13.

— ౨౩౦. (9) * శీతాంశో రమృతార్పణమ్. —

అమృతకిరణుఁ డగు చంద్రున కమృత మర్పించినట్టులు నిష్ప్రయో జన మైనపనులయం దిది వర్తించును. ('కుమ్మరివీధిని కుండలమ్మూట')

— 10. * హిమాద్రౌ హిమవిక్రయః. —

హిమాలయపర్వతమునొద్ద మంచుగడ్డ నమ్మూట.

— 11. * ఆయస్కారవాటికాయాం సూచీవిక్రయః. —

కమ్మరవీథిని సూదు లమ్మూట.

దీని కనురూపమగు నింగ్లీషుసామెత.—

'To carry coals to Newcastle.'

'జర్మన్'సామెత—'To carry water to the sea.'-(Proverbs from East and West, p. 29)

ఇంగ్లండుదేశములోని న్యూకాసిల్ నగరమున బొగ్గు సమృద్ధిగా దొరకును. అక్కడకు బొగ్గు తీసికొనివెళ్లుట వృథాయాసము.

1. శా. 'వాతాందోళితచందనాగరులతావ్యాలీఢకేళీవనీ
జాతంబుల్ భవదీయసద్మగృహముల్, చైత్రుండు నీబంటు నీ
కేతత్కాననజాతసూనచయం బే మిచ్చి పూజించుటల్
శీతాంశో రమృతార్పణ మ్మను క్రియం జేకొమ్ము చేతోభవా.'
—వసుచ. 3. 172.

2. శ్లో. 'సేవయా దృష్టకష్టస్య దాక్షిణ్యోత్పాదనే శ్రమః
అస్యైవ న స భృత్యానాం హిమాద్రౌ హిమవిక్రయః.'
—రాజతరఙ్గిణి. 3. 138.

('అతికష్టసాధ్యమగు నీతనిసేవఁ జేయు తమయం దీతనికి దాక్షిణ్యము గలుగునట్లు ప్రయత్నించుట హిమాద్రియందు మం చమ్మూటకై పూనుకొనుటవంటిది') —ఆంధ్రరాజతరంగిణి. ౭౭ పు.

3. శ్లో. 'వ్యక్షితాస్య సదాచారం కలికృత్యం ద్విషి త్వయి
ప్రారబ్ధో దేవ! భోజేన హిమాద్రౌ హిమవిక్రయః.'

—రాజత. ౪. 3102.

4. 'కి మాత్థ రే కితవ సాధు సమ్యగుక్తం.—
అయస్కారవాటికాయాం సూచీవిక్రయ ఏవ దస్మాభిః కి ముపాలంభి.

—వసంతతిలకభాణ. ౧౪ పు'

— ౨౩౯. (12) *త్వయా స్వహస్తేన అంగారాః కర్షితాః —

నీచేతులతో నీవు నిప్పులను నలిపితివి. స్వయంకృతాప రాధము
నట్ల నిది వర్తించును.

— 13. * నాహ మాత్మవినాశాయ బేతాళోత్థాపనం కరిష్యామి. —

బేతాళమును లేపి నాకు నేను హానిని దెచ్చుకొనను.

దీని కాంగ్లమున—

'To dig one's own pit (grave)'.

'I shall not raise a devil for my own destruction.'

—(Apte:- Guide to Sanskrit Composition, pp. 327-'28.)

ఫ్రెంచ్ భాషాలోకోక్తి:

' The fool cuts himself with his own knife. '

— (Proverbs from East and West, p. 25.)

అనురూపములగు నాంధ్రలోకోక్తులు—

'కొంగున నగ్ని డాఁచినట్లు'. 'చెట్టు కొట్టి పై వేసికొనినట్లు'.
'తన్నుఁ గట్టఁ ద్రాళ్లు తానె తెచ్చుకొనునట్లు'.

— 14. * అజాకృపాణీయన్యాయము. —

దీనికిఁగల రెండుమూఁడు వివరణములలోనొకటి పై సామెతలవంటిదే.

'యథా అజయా భూమిం ఖనిత్వా ఆత్మవధాయ కృపాణో దర్శితః,
తత్తుల్యం వృత్తం కేనచి దాత్మవినాశాయ కృతం అజాకృపాణీయమ్.'†
—వర్ధమానుని 'గణరత్నమహోదధి'. 3. 196

(కత్తి లేకపోవుటచేఁ దన్నుఁ జంపఁజాలక యుపాయము నరయు చుండు నొకనిపై నొకమేఁక మదమునఁ గాలిచే నేలఁ ద్రవ్వెను. అట్లు త్రవ్వఁగా మట్టిలోఁ గప్పఁబడిన యొకకత్తి బయటపడెను. దానిచే నాతఁ డామేఁకను దెగటార్చె నఁట. ఇట్లాజంతువు తనగోతిని దానే త్రవ్వు కొనెను.)‡

1. శ్లో. 'అనాలోచ్య ప్రేమ్ణః పరిణతి, మనాదృత్య సుహృద
స్త్వయాకాణ్డే మానః కిమితి తరళే సంప్రతి కృతః ?
సమాకృష్టా హ్యేతే ప్రళయదహనోద్భాసురశిఖాః
స్వహస్తే నాఙ్గారా స్తదల మధునారణ్యరుదితైః.'

['స్వహస్తే నాఙ్గారాః సమాకృష్టాః—ఇత్యనేన భవత్యా అజ్ఞతైవ అనర్థః కృత ఇతి సూచితమ్.'— వేమభూపాలుని శృఙ్గారదీపికా వ్యాఖ్య]
—అమరుశతక. ౭౮ ప.

(అతని యనురాగ మెట్టిదో యనియైన నాలోచింపక, చెలులమాటలు లెక్కచేయక, నీ వసమయమున నాతనిపై నలిగితివి. దీనికి ఫల మాతఁ డలిగి వెడలుటయే. కావున నీవు చేసినపని ప్రళయాగ్నిజ్వాలాజటాలంబులయిన నిప్పులను దెచ్చి మీఁద వైచికొనిన ట్లయినది. కార్యము మించినతరువాత నిప్పుడేల యరణ్యరోదనము చేసెదవు.)

2 కొంగున నగ్ని (చిచ్చు) దాఁచుకొనినట్లు—
(తననాశమును దానే కొని తెచ్చుకొనినట్లు.)

---

† లౌకికన్యాయాఞ్జలి. 1. భా. ౧ పుట.

‡ సంస్కృతన్యాయములు. ౮ పుట.

తే. 'మన్నుమ నందఱ నెవ్వనిమహితశక్తి
యెక్కుడై సంగరంబునఁ జిక్కుపఱచె
నట్టికర్ణునిఁ, గొంగున నగ్నిఁ డాఁచి
నట్లు, లెమ్మాయి డాఁచితో యమ్మ చెపుమ'.

—భారత. స్త్రీపర్వ. ౨. 178.

3. కొఱవిని దల గోఁకికొనుట.

(కొఱవితోఁ దల గోఁకికొనిన, తల కాలి స్వవ్యాఘాతమే యగును గాని తలదురద తీరునా?)

చ. 'మెఱసిన మృత్యుదేవతకు మృత్యువులైనముకుందదాసులన్
దరలక మాఁదుకొం టరయఁ దాఁ గొఱవిం దల గోఁకుకొంట.'

—శ్రీరంగమహాత్త్వ. 3. 686.

4. క. 'చిఱునవ్వు నవ్వ, భళిరే
కొఱవిం దలగోఁకికొనుటకుం దలఁచిరి, యే
డ్తెఱ నిత్తఱిఁ బైకొని నే
నఱిమెద యమునగరి దరియ నరివర్గములన్.'

—సిద్ధిపెగడ ధర్మయామాత్యుఁడు నలచరిత్ర. ౨. 124.

5. తే. 'ఇట్టి చలపాది నొట న న్నెఱిఁగి యెఱిఁగి
యెట్లు గైకొనె దమయంతి నీ నలుండు?
కొఱవి చేఁబూని తలగోఁకుకొనఁదలంచెఁ
గటకటా! గర్వమున మీఁదు గానఁడయ్యె.'

—ధర్మయామాత్యుఁడు నలచ. ౪. 252.

6. క. 'వెఱ పోకయింతయు లే కీ
తెఱఁగున మీను నెవ్వఁ డింత తెగి చేసెనొకో
ఎఱిఁగెఱిఁగియుండి యకటా
కొఱవిం దల గోఁకుకొనుటకుం దలపెట్టెన్.'

—రాజశేఖరచ. ౨. 23.

7. క. 'జలధిఁ బడఁ గడపె మును నను
వలదు నరభ్రాంతి నీకు వైరం బేలా
బలవంతునితోఁ, గొఱవిం
దల గోఁకికొనంగఁ దగునె దనుజాధీశా.'

—రామాభ్యుదయ. ౫ ఆ. 156. ప.

8. తన్ను గట్టఁ ద్రాళ్ళు తానె తెచ్చుకొనునట్లు.

సీ. '...ఆత్మోకఘాతార్థ మత్యంతమూఢులై
చేయరానివి మీరు చేసినారు
మిమ్ముఁ గట్టఁగఁ ద్రాళ్ళు మీరె చేకొంటిరి
యిఁక మీరు వగవంగ నేమి కలదు ?'

—శివధర్మోత్తరఖండ ౪. 97.

9. క. 'తను గట్టఁ ద్రాళ్లు తానై
కొనివచ్చినజాడ యనుచుఁ గుదియించి కరం
బునఁ బాశముఁ గొని దానన
వనధీశునిఁ గట్టె నసురవర్యుం డాజిన్.'

—కవికర్ణరసాయన. ౨ ఆ. 119 ప.

10. 'కుడిచి కూర్చుండలేక చెట్టు గొట్టి పయి వేసికొన్నాఁడు.'

—ధర్మజరాజసూయ ౭౦ పు. 2 పఙ్క్తి.

—౨౮౦. (15) *హస్తకటకః కిం దర్పణేనేక్ష్యతే ?—

చేతికున్న కడియము నద్దములోఁ జూడవలెనా ? పైలోకోక్తి భోజుని 'సరస్వతీకంఠాభరణము'న నుదాహరింపఁబడినయొకానొకపద్యమునఁ గలదు. ( I. 159 ప. ౧౧౦ పు)

'హా తో జో జ్జలదేశ నైవ మదనః సాక్షాదయం భూతలే
తత్కిం దీనఇ సచ్ఛమా హతవపుః కామః కిల శ్రూయతే
దృష్టః కిం ఉలేడ భూతపతినా గౌరీవివాహోత్సవే
ఐసోంస్యాచ్ఛ జ బాల్లు హస్తకటకః కిం దర్పణే నేక్ష్యతే.'

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము. ౨౯. { **విక్రమ** ఆశ్వయుజ - కార్త్తికములు. } సంచిక ౪.





కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

1940 అక్టోబరు-నవంబరు.

# విషయసూచిక.

---



---

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

**సంపుటము. ౨౯.** { **విక్రమ** ఆశ్వయుజ కార్తికములు. } **సంచిక ౪.**


## స్వవిషయము.



శ్రీనాథ విరచితమగు శివరాత్రిమాహాత్మ్య మిదివఱలో రెండు మాఱులు పరిషత్తుచే ముద్రింపఁబడినది. కాని మూలగ్రంథమగు ఈశాన సంహితాభాగము లభింపమింజేసి యాంధ్రగ్రంథమున శ్రీనాథుని మార్పులను, ఆంధ్రీకరణవిశేషములను వివరించుటకు వీలు కలుగలేదు. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వలన నాభాగము మాకు లభించుటచే నీసంచికలోఁ బ్రకటింపఁబడినది. సంస్కృతాంధ్ర గ్రంథములఁ బాఠములు సవిమర్శముగఁ బరికించినచో శ్రీనాథుని యాంధ్రీకరణ విశేషములు మనకు విశదములు కాఁగలవు. రాఁబోవుసంచికనుండి బాలసరస్వతీయమునకు మూలమగు సంస్కృతగ్రంథము ముద్రింపఁబడుచున్నది. బాలసరస్వతియే సంస్కృతవ్యాఖ్యానము రచించి దాని కాంధ్రవివరణమును జేర్చియుండునని తోఁచుచున్నది. ఆంధ్రగ్రంథ మిదివఱలో మాచేఁ బ్రకటింపఁబడినది. వావిళ్లవారును బ్రకటించియున్నారు. సంస్కృత వ్యాఖ్యానమునకు మాతృక లెవరియొద్దనైన నున్నచో దయతోఁ బంపఁ గోరుచున్నాము.

---

కీ॥ శే॥ విమర్శకాగ్రేసర

# కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు.

సనాతనధర్మరక్షణ దీక్షితులును, బాల్యమాదిగ నాంధ్రసారస్వతోపాసకులును, 'విమర్శకాగ్రేసర' బిరుదాంకితులునగు బ్ర. శ్రీ. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు 29-10-40 తేదిని గీర్తిశేషులయిరని తెలుపుటకుఁ బరిష త్తెంతయు వంతసంచుచున్నది.

శ్రీ శాస్త్రిగారాంగ్లగీర్వాణాంధ్రభాషలయందలి పాండిత్యమును దమయసాధారణమేధావిశేషమునగణించి, రాజకీయోద్యోగమున నుండి తమ కార్యములను యథావిధిగఁ జక్కఁబెట్టుకొనుటయేగాక తీఱిక చేకూరినపుడెల్ల సనాతనమతసారస్వతచర్చలఁ బాల్గొనుచుండెడివారు. మతవిషయమునఁగాని, సారస్వతవిషయమునఁగాని శ్రీశాస్త్రిగారు కలము నెత్తినచోఁ బ్రతిపక్షులు తమవాదము నుపసంహరించుకొనవలసినదియే.

సారస్వతరంగమున వీరలు చేసిన విమర్శనములు వ్యాసరూపమునఁ బరిషత్పత్త్రిక మున్నగు పత్త్రికల నలంకరించియున్నవి. అందలి విషయములు నిత్యనూతనములు, ప్రతిపక్షదుర్భేద్యములును. శ్రీ శాస్త్రిగారు సనాతనమతరక్షణమునకై భక్తసమాజము, ఆర్యమతబోధిని యను సభల స్థాపించిరి. రెండవదాని కనుబంధముగ 'నార్యమతబోధిని' అను మాసపత్త్రికనుగూడ స్థాపించిరి. వీరలు విగ్రహారాధనము, హిందూమతధర్మములు, త్రిమతములు, అవతారములు మొదలగు వ్యాసములనెన్నిటినో వ్రాసి ప్రచురించిరి.

సాహిత్యప్రపంచమున వీరు రాజశేఖరచరిత్రవిమర్శనము, భాస్కరోదంతము, కురుపాండవదాయభాగనిర్ణయము, నన్నయభట్టారకచరిత్రము, మనుచరిత్ర విమర్శనము మొదలగువాని నెన్నింటినో ప్రకటించియున్నారు. అట్టివిమర్శనములందుఁ బ్రతిపక్షులను నిర్దాక్షిణ్యముగ విమర్శించుటయే వీరిపద్ధతి. "అల్పదోషమైనా కావ్యమందు సహించక విమ

ర్శచేసేటప్పుడు యమునికన్న ఎక్కువ నిర్ఘృణుడని పేరుపొందిన పండితు”లని శ్రీ. శ్రీ. గిడుగు రామమూర్తిపంతులుగారు వీరిని బ్రశంసించుటయే వీరివిమర్శనతత్త్వమును, తీక్ష్ణతను వ్యక్తీకరించుచున్నవి.

శాస్త్రిగారు కేవలము విమర్శకవ్యాసములను మాత్రమే రచించుటతోఁ దృప్తినొందక స్వతంత్రరచనములఁగూడఁ గావించియున్నారు కొన్ని గ్రంథములింకను ముద్రణము నొందవలసియున్నవి. మంగతాయి, సైంధవవధ మున్నగునాటకములను, జనార్దనశతకము, కోకిలగీతము, గోమహిమసంవాదము, విబుధలోకసందర్శనము మొదలగు ఖండకావ్యములను, కొన్ని హాస్యగ్రంథములను రచించిరి.

వీరలు చిన్నతనమునందే తమకుఁగల నాట్యకళాభిరుచిచే ‘ఆర్యబృందానందసంధాయిని’ అను నాటకసభను నెలకొల్పి, యందు నాటకములఁ బ్రదర్శింపఁజేయుచుండినట్లు తెలియుచున్నది. వీరిమతవిషయికవ్యాసములు మాత్రమే ‘ఉపన్యాసపయోనిధి’ అనుపేరఁ బ్రథమ సంపుటముగఁ బ్రకటింపఁబడినవి. కవిత్వ విషయికములగు వ్యాసములు—శ్లేషకవిత్వము, అలంకారవిషయములు, మొదలగునవిపరిషత్పత్రికయందుఁ బ్రచురింపఁబడినవి. వీరల వ్యాసములను గ్రంథములను నొకచో సమకూర్చి సంపుటములుగఁ బ్రకటించినచో నాంధ్రవాఙ్మయ ప్రపంచమున కెక్కుడగు నుపకారమొనర్చినవా రగుదురు. సర్వతోముఖమయిన పాండిత్యము నార్జించి పెక్కువిషయములఁగూర్చి యమూల్యములగు వ్యాసములను విమర్శనములను నాంధ్రలోకమున కొసఁగి, తమ జీవితమును సారస్వతసేవకై వినియోగించి, మిగిలిన సారస్వతోపాసకులకుఁ బథప్రదర్శకులైన మహనీయులలో శ్రీ శాస్త్రిగారొక్కరు.

శ్రీ శాస్త్రిగారు తమ భౌతికజీవితమును విడనాడినను వారికీర్తి చిరస్థాయిగ నాంధ్రలోకమున జీవింపఁగలదు. వీరియాత్మకు సర్వేశ్వరుఁడు శాంతినొసఁగుఁగాక.

# విచారవీచికాః.

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్లో. శయ్యారూఢ స్స్వమతవిభవం ప్రాహ గాంగేయవద్యః
యశ్చావాదీ చ్ఛలనరహితః స్వీయసాహిత్యసారం
వ్యాధేః పీడా మపరిగణయన్ లేఖయామాస వ్యాసాన్
ఆపంచాబ్దం సదయహృదయం తం కథం విస్మరామః. 1

శ్లో. ఆర్షం ధర్మం నిజవసుసమం పాలయామాస యోఽసౌ
గచ్ఛం స్తిష్ఠ న్నిజహృది సదా చింతయ న్నార్యకీర్తిం
వాక్యం పూతం నిగమగదితం యస్య వాదే ప్రమాణం
యద్వైదుష్యం విబుధవినుతం సర్వతంత్రస్వతంత్రం. 2

శ్లో. లబ్ధ్వాఖ్యాతిం భువి నిరుపమాం స్వీయధర్మప్రచారే
కృత్వా శాంతాన్ నిజమతరిపూన్ హేతువాదై రమోఘైః
భూత్వా వంశే నిగమనిలయే కాశిభట్టాభిధానే
బ్రహ్మణ్యార్యో బిరుదపదభాక్ స్వర్గతో భ్రాతృవర్యః. 3

శ్లో. బ్రహ్మణ్య భ్రాతః కథ ముపరతః స్వచ్ఛవాత్సల్యసింధో!
దీనం త్యక్త్వా నమితశిరసం మాంచ పుత్రంచ భీతం
కాంతాం ఖిన్నాం విమలచరితాం త్వత్సపర్యానురక్తాం
బంధుస్తోమం సహృదయజనం ధర్మసంస్థాం తవాప్తాం. 4

శ్లో. స్వర్యాతస్త్వం త్వరిత మనుజం మాం పరిత్యజ్య ముగ్ధం
లోకా బ్రూయుః స విబుధవరః కీర్తిశేషోఽపి జాతః
గేహే చాస్తే తదనుజపదో జ్ఞానవిజ్ఞానశూన్యః
కిం తేన స్యా చ్ఛ్రుతిమతరిపూన్ కోఽపి ధీరోఽద్య జేతా! 5

శ్లో. కం విద్వాంసం కుమతదళనం యామ చార్యం శరణ్యం
యజ్జిహ్వాగ్రే వసతి విమలా భారతీ భావరమ్యా
భాస్వా న్యాతో రిపుతిమిరహా యేన ధర్మాబ్జకోశం
లక్ష్మీయుక్తం వికసిత మభూత్ దేశకల్యాణశక్తం. 6

శ్లో॥ తత్త్వం వేత్తుం శ్రుతిశిరసిజం మోక్షమార్గానుకూలం
సత్యం జ్ఞాతుం నిగమగదితం యజ్ఞకర్మానురూపం
సారం బోద్ధుం సరసవచసాం సాహితీశోభితానాం
భావం శ్రోతుం మునివరకృతే ధర్మశాస్త్రే నిగూఢం. 7

శ్లో. ఆగచ్ఛన్త స్తవ నివసనం తృప్తచిత్తాః ప్రయాతాః
అద్యాగన్తౄణాం త్వయి తు విరతే ప్రీణయేయం కథం భోః
అల్పజ్ఞోఽహం చకితహృదయ స్తేతు విజ్ఞానదక్షాః
జ్ఞాత్వా సారం మమ తనుతరం స్వర్గతః కోహి హేతుః. 8

శ్లో. ఆత్మా నిత్యో దివి హిస భవాన్ వర్తతే కీర్తికాయః
తస్మాద్ధైర్యం విబుధకృపయా ! దేహి మే తాంచ మేధాం
నోచే దేష్యే తవతు సవిధం నిశ్చయం నాత్ర వర్తే
అత్రస్థం మాం బుధవర ! జనా నీరసం నాద్రియేయుః 9

శ్లో. "దూరం మాగా నివస నికటే మేఽనుజాత్రైవ నిత్యం"
ఇత్యేవం త్వం వదసి సదయం కింతు యాతోఽసి దూరం
కింతే న్యాయ్యం చరణపతితం భ్రాతరం న్యస్య యాతుం
దుర్దైవాన్మే త్వమసి విముఖో నాస్తి తే నిర్దయత్వం. 10

శ్లో. యావజ్జీవం తవఘునగుణాం శ్చింతయన్ ప్రేమరాశేః
ధ్యాయన్నేష్యే పదసరసిజే శ్రీకరే కాల మీడ్యే
స్వర్గాద్భ్రాత్రే బుధవర ! కృపాదృష్టిభాగ్యం ప్రదేయం
గృహ్ణాం స్తూర్ణం మమ నతితతీ రాశిమప్రేమ యాస్త్రై. 11

ఓం తత్సత్.

# బ్రహ్మనిర్యాణాక్రందనమ్.

వైద్యరాజ దంటు సుబ్బావధాని కవిరాజ విరచితమ్.

శ్లో. కాశ్యామపిచయే భట్టాః కాశీభట్టాః ప్రకీర్తితాః
తేషాంకులే సముత్పన్నో, బ్రహ్మార్యో బ్రహ్మవిద్వరః

శ్లో. ఆర్యవిజ్ఞానసంపన్న శ్చార్యవాక్ప్రేష్టమానసః
వీర్యవాన్ ధృతిమాన్ ధీర శ్చార్యాణాం మతబోధకః. 2

శ్లో. ఆభాసబ్రహ్మతత్త్వం యన్నవబ్రహ్మమతాభిధమ్
నామమాత్ర మభూద్యస్య, బ్రహ్మణ స్సద్విమర్శతః. 3

శ్లో. ధర్మసస్యముషాం, నానాపక్షిణాం ప్రతిపక్షిణామ్
వాగురా యస్య వాగాహ్వా శిలాపాతోఽంగభంగకృత్. 4

శ్లో. వీరో భీరు రనీశోఽభూ దీశో గాఢప్రహారతః
అలింగో భూ దహో లింగీ వాగ్వాదే యస్య దారుణే. 5

శ్లో. కాశీభట్టసుధీ ర్బ్రహ్మయార్య స్సత్యపరాక్రమః
త్రిలింగబ్రాహ్మణశ్రేష్ఠః ధర్మసంస్థాపకో మహాన్. 6

శ్లో. నేతా వైదికధర్మస్య భ్రాతా సుబ్బయ్యశాస్త్రిణః
త్రాతా సత్సంప్రదాయస్య విజేతా హ్యార్యతతాయినామ్. 7

శ్లో. బ్రహ్మీభూతస్స్వయం బ్రహ్మ బ్రహ్మతత్త్వప్రకాశకః
బ్రహ్మసూత్రసమవాక్ బ్రాహ్మీవరివస్యా విశారదః. 8

శ్లో. కుర్వంతు భారతా శ్చంద్రాః బ్రహ్మతేజోపబృంహితాః
కుమతధ్వాంతవిధ్వంసం కాశీభట్టసుధీ ర్యథా. 9

శ్లో. వేదా వైదికధర్మాశ్చ కవయః కావ్యసంతతిః
దేవతాయతనా దేహాః శిష్టా స్తత్సమ్మతం మతమ్. 10

శ్లో. రక్షితా బ్రహ్మణా సోఽపి బ్రహ్మీభూతో బతాధునా
కథం సంరక్ష్యతే ధర్మః కాలేఽస్మిన్ కలినాకులే. 11

శ్లో. ఏకో బ్రహ్మ విభు ర్భూత్వా స్వయం సర్వమయోఽభవత్
సర్వం బ్రహ్మమయం విశ్వం నిర్భయం నిరుపద్రవమ్. 12

# శ్రీ॥ శే॥ కూచి నరసింహముపంతులుగారు.

ఆంధ్రభోజుల యాస్థానమున సింహత్రయ మని ప్రశస్తిగాంచిన దివ్యపురుషులలో నొక్కరును, ఆంధ్రాంగ్లభాషలయం దసాధారణమైన పాండితిని గణించినపెద్దలును, శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణమునకై మిక్కిలిఁ దోడ్పడిన ధీశాలురును, ఆదర్శపాత్రచరిత్రులును, విశుద్ధ గ్రాంథికభాషాసేవకులును, కవివతంసులునునగు శ్రీ కూచి నరసింహము పంతులుగారు 7-10-40 తేదిని దివి కేఁగినారని తెలుపుట పరిషత్తున కెంతయు విచారకరమగు విషయము.

శ్రీ నరసింహము పంతులుగారు 1866 వ సంవత్సరము డిసెంబరు 17 వ తేదిని జన్మించిరి. 1888 వ సంవత్సరమున పట్టపరీక్ష (B. A) యందుఁ గృతార్థులైరి. పిమ్మట ఎలమంచిలి, నరసాపురము, నూజివీడు మున్నగు తావులందు ఆంగ్లోన్నతపాఠశాలలలోఁ బ్రధానోపాధ్యాయులుగఁ బనిచేసి, స్కూల్ ఫైనల్ తరగతి విద్యార్థులకు విద్య గఱపుట యం దద్వితీయులను ప్రశస్తిని బడసిరి. పిమ్మట పిఠాపురమున వెలసి యున్న ఆంగ్లపాఠశాలలోఁ బ్రధానోపాధ్యాయులుగ నియమింపఁబడి చిరకాల మచ్చటనే కడుదీక్షతో నధ్యాపకత్వమును నిర్వహించిరి. వీరల బోధనవిధానము కార్యనిర్వహణదక్షతయు నత్యుత్తమములని యానాఁటి యధికారు లందఱును బ్రశంసించియే యున్నారు.

తరువాత నాపదవినుండి విశ్రాంతినొంది శ్రీ పీఠికాపురాధీశ్వరుల యాదరమున గౌరవవేతనము నందుచు శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణమునఁ బాల్గొనిరి. నిఘంటు ప్రథమభాగము, ద్వితీయభాగము కొంతవఱకును వెలువడునంతవఱకు వీరలాకార్యమునకుమిక్కిలిఁజేయూఁత నొసఁగిరి. క్రమముగ దేహమందలి యనారోగ్యతచే నాకార్యస్థానమునఁ బనిచేయకున్నను, తుదివఱకుఁ జర్చలయందుఁ దమ నిర్ణయమును దెలుపుచునే యుండిరి. సూక్ష్మమయిన వాక్యములతో విస్తృతమయిన భావముల వ్యక్తీకరించుటయందును, విమర్శనమున మిక్కిలి నిదానముతోఁ గూడి యుండుటయందును శ్రీ పంతులుగారికి వారేసాటి.

పంతులుగారు చిన్ననాఁటినుండియుఁ గవిత్వమునం దభిరుచి గలవారు. చిన్ననాఁటినుండియు శ్రీరామభక్తులు. వీరి కవిత్వములు చాల వఱకు భక్తిభావభరితములు సరసములును. అట్టివి శ్రీరామకృష్ణపరమహంసచరిత్రము, శ్రీ గౌరాంగచరిత్రము (ప్రథమద్వితీయభాగములు) ఆగ్నేయాశుగము, ఆత్మనివేదనము మున్నగునవి. ఇంతియగాక వీరలు రచియించిన నాటకములు నవలలునుగూడఁ బ్రసిద్ధములే. ఆంగ్ల భాషనలంకరించిన శ్రీవివేకానందుని వాగమృతధారలఁ దొలుత నాంధ్రులకుఁ జాలవఱకుఁ జవిచూపించిన మహాశయులు పంతులుగారే.

ఆంగ్లభాషకుఁ గాళిదాసనఁ బరఁగిన 'షేక్స్పియర్' మహాకవి రచియించిన నాటకములను గథలుగ ననువదించిరి భాషయం దాఱితేఱిన పెద్దలకేగాక బాలురకుఁగూడ నుపకరించువిషయములను బెక్కింటిని బాలవిజ్ఞానతరంగిణిగ్రంథమాలలో వ్యక్తము చేసియున్నారు. 'నానావిషయక విరచనములు' అనుగ్రంథమునఁ బంతులుగారు వేర్వేఱుగఁ బ్రకటించిన రచనలనన్నిటి నొకచోఁ గ్రోడీకరించి, మతసారస్వతవిషయములఁ దమకుఁగల యున్నతాదర్శముల నన్నిటిని స్పష్టముగఁ దెల్పినారు.

ప్రాచీనాంధ్రభాషాసేవయన్నఁ బంతులుగారి కాదరము మెండు. వారు రచియించిన రచనలనన్నిటిని విశుద్ధాంధ్రభాషచేతనే యలంకరించిరి. నేఁటిభాషాసంస్కారములు మనభాష కెంతమాత్రము నుపకరింపఁ జాలవని పెక్కుతావుల నుపన్యసించియు వ్యాసములువ్రాసి ప్రకటించియుఁ దమ సిద్ధాంతములను సుస్పష్టముగఁ దెలిపియున్నారు. వీరల రచనలు, ప్రవర్తనలు, ఆంధ్రభాషకు, నాంధ్రులకును నాదర్శప్రాయములు ఇట్టి కవిసింహుని గోల్పోయిన ఆంధ్రభాషాకాననము సింహములేని కాననముఁ బోలియున్నదని చెప్పుట యతిశయోక్తి కాఁజాలదు. సర్వేశ్వరుఁడు శ్రీ పంతులుగారి యాత్మకు సుస్థిరశాంతిఁ నొడఁగూర్చుఁగాక.

---

# శ్రీ కూచి నరసింహరాయనిర్యాణస్మృతి.

దాసరి లక్ష్మణస్వామి.

సీ. పుణ్యాత్ములైన దేవులపల్లి సోదర
కవివరుల్ సురలోక గాములైరి
మల్లయశాస్త్రి యిమ్మహి వీడి చనియెను
వేమలకవియు విన్వీథి కేఁగె
చర్లాబ్ధిచంద్రుండుఁ జాలించె దేహంబు
నోలేటిగురుఁ డొందె నొకట దివము
పానుగంటికవియుఁ బడసెను త్రిదివంబు
వీరరాట్కవియును వెడలె నటకె
మొక్కపాట్సచివుండు మున్నె నాకముఁజేరె
సుబ్బరాణ్మంత్రియుఁ జొచ్చె నభము

గీ. కాన నీకుఁ బృథ్వి పయి నుండఁగాదటంచుఁ
దలఁచి వారల నెల్లరఁ గలియఁగోరి
స్వర్గమున కేఁగినాఁడవె సంతసమున ?
శిష్టజనగేయ ! కూచి నృసింహరాయ !

మ. నరనాథు ల్గవిపండితు ల్పొగడఁగా నానాసుకావ్యావళుల్
స్థిరమౌ గ్రాంథికభాషవ్రాసి యశమున్ జేకొంటి వీ భూస్థలిన్
సురలోకంబునఁగూడ నీరచనలన్ జూపింపఁగా నేఁగితే
గురువర్యా ! నరసింహరాయసుగుణీ ! కూచ్యన్వయోద్యన్మణీ !

గీ. అభిలషింతువు నీ వనాయాసమరణ
దైన్యరహితజీవనములు మాన్యచరిత !
అట్టి కోరిక లీడేరె నయ్య! నీకు
నీశ్వరునికృప డెబ్బదైదేండ్ల కిపుడు.

క. నీయట్టి సుగుణజన్ముని
నీయట్టి దయాంతరంగు నిర్మలహృదయున్
నీయట్టి నియమశీలుని
నే యనువునఁ బడయనేర్తు మిఁక నీపృథివిన్.

గీ. ప్రేమమున నాస్వకీయచరిత్ర వ్రాయు
విధములెల్ల బోధించి బల్విధుల నాకుఁ
దోడ్పడితివి నిన్ మఱవనేర్తునె మదీయ
భావమునఁ గలనైన నాజీవితమున.

ఆ. గ్రామ్యభాషఁ గాంచి కడుఁ జింతిలుచు మీర
లఖిలబుధగణంబు లభినుతింపఁ
గూర్చినారు కాదె గురుశిష్యసంవాద
మైనభాగములుగ నాంధ్రఫక్కి.

గీ. తెలుఁగుబాసయె చెలియని దేవనాథు
సన్నిధిని గ్రామ్యవాదముల్ సలుపవచ్చు
నేమొ యలగిడుగుమూర్తి నీవెట్టు లతని
కుత్తరం బొసంగెదవో జాగ్రత్తసుమ్ము.

క. శాంతస్వభావుఁడవు సు
స్వాంతుండవుఁ బండితుఁడవు నగునీయశమా
శాంతముల నిండె సతతము
శాంతినిఁ గనుమయ్య! నీవు సర్వేశుదయన్.

# మిత్త్రస్మృతి.

కావ్యకలానిధి పిసుపాటి చిదంబరశాస్త్రి.

చ. ఒకనియమంబునంద తలయొగ్గుట నేర్చిన దాదిగాఁగ నాం
డొకపథమందు వర్తిలక యుండెడివాఁడును గూచివంశనా
ర్ధికి శశియైనవాఁడును గతించె నృసింహుఁడు నాసుతుం డటం
చకట ధరిత్రి వర్షమను నశ్రువు లుప్పతిలంగ నేడ్చెడిన్.

ఉ. కూచి నృసింహుఁ డేఁగె సురకోటులు పిల్చిరొ నీతిబద్ధునిన్
జూచెడివేడ్కతోడ మధుసూదనుఁ డేమయినం దలంచెనో
కాచముఁ జూచినన్ గపివికారము లెత్తెడు నీయుగంబులో
నీచగుణంబు పాల్పడక నిల్చినవానిఁ గవుంగిలింపఁగన్.

# కాశీఖండము.

## సూరిగారి పాఠపు సొగసులు.

వ్యాకరణవిద్యాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రి.

శ్రీనాథుఁడు ప్రౌఢనిర్భరవయఃపరిపాకమున మనసార భీమనాథుని గొలిచియుఁ, దృప్తి నందక, కాశీవిశ్వేశ్వరచరణారవిందసంసక్తమనస్కుఁడై తనకవితాపరిపాకము నంతను నీ కాశీఖండమున వెల్లివిరియఁ జేసినాఁడు. కల్పనవైచిత్రియందును, పదప్రయోగములందును, ధారాపాటవప్రదర్శనమునందును, అద్భుతశక్తి నంగీకరించినాఁడు. ఆతఁడిందు నిరూపించిన శాస్త్రసంప్రదాయములు, భాషా సంప్రదాయములును, ప్రతిభావంతులకుఁగూడ దురూహములుగ నున్నవి.

నేఁటికి ముద్రితములైన కాశీఖండపుఁ బ్రతులలోఁ దాదృశసంప్రదాయవిరుద్ధములగు పాఠము లెన్నియో గానవచ్చుచున్నవి. వ్రాఁత ప్రతులు పెక్కింటితో సరిచూచి, పరిష్కరించి ప్రచురించినచో నట్టి విరోధము లుండుట కవకాశ ముండదనుటలో నావంతయు సందియము లేదు. సూరిగారు నిఘంటునిర్మాణమునకై గడఁగినపుడు, ఎంతయో కష్టించి తాటియాకుఁబ్రతులఁ బెక్కింటిని దడవి చాలవఱకు సంప్రదాయావిరుద్ధములగు పాఠములను సేకరించి తమనిఘంటుపదసూచికలో వ్రాసికొనియున్నారు.

వారు గ్రహించిన పాఠములే వ్రాఁతప్రతులందలి పాఠములకు సరిపడుచు సరసముగఁ గానవచ్చుచున్నవి. అట్టివాని నొక కొన్నిటి నీక్రిందఁ బొందుపఱుచుచున్నాఁడను.

పాఠభేదములను దెలుపునపుడు వ్రాఁతప్రతులను గ్రమముగ క, గ, చ, ట, త, ద, ప సంజ్ఞలతో వ్యవహరించెదను. సంఖ్యలును—118, 1229, 2302, 2884, 4337, 1576, 4377 ను.

౧

ఉ. అట్టిదివో పురాణము మహత్త్వము సూతుఁడు తద్విదుండు గాఁ
బట్టి కనిష్ఠజన్మమునఁ బ్రాకృతుఁ డయ్యును <u>రుద్రభావు</u>లై

నట్టి మహామునీంద్రులకు నంబుజసంభవునంతవారికిన్
దిట్టతనంబుమీఱ నుపదేశము సేయుచునుండు బ్రహ్మమున్.

ప్రథమాశ్వాసము. 76 ప.

ఇయ్యది ముద్రితప్రతులయందలి పాఠము. పై రేఖాంకితస్థలమునఁ జిన్నయసూరిగారు వ్రాసికొనిన నిఘంటుపదసూచికలో మాత్రము "ప్రాకృతుఁడయ్యు నరుద్రభావులై నట్టి" యనుపాఠమే గానవచ్చుచున్నది. పరిషత్పుస్తకభాండాగారమునందలి తాటియాకుఁబ్రతులలో క.త. ల రెండింటను "ప్రాకృతుఁడయ్యు నరుద్రభావులై నట్టి" యనియు, మిగిలిన యైదుప్రతులందును "ప్రాకృతుఁడయ్యు నరుద్రభావుఁడై యట్టి మహామునీంద్రులకు"... అనియును గానవచ్చెడిని. రుద్రభావులై నట్టి యనుపాఠముమాత్ర మెక్కడను గానరాదు.

సూతుఁడు పురాణమాహాత్మ్యవేత్తయగుటచేఁ గనిష్ఠజన్మమునఁ బామరుఁడయ్యును మహాప్రభావోపేతులైనయంబుజసంభవునంతటిమహామునీంద్రులకుఁగూడఁ బరబ్రహ్మస్వరూపమును దెలుపుచుండును.— అనునది సూరిగారిపాఠమునకు భావము. అర్థసారళ్యమున కీపాఠమే మిక్కిలి నుపకరించుచున్నది. రుద్రభావులైన మహాత్ములకు బ్రహ్మోపదేశ మక్కఱ లేదుగావున ముద్రితపాఠమున సారస్యము గానరాదు.

౨

సీ. ఆది మనోమయం బగు నొక్క చక్రంబు
కల్పించె బ్రహ్మ జగద్ధితముగఁ
గల్పించి యాబండికలు డొల్చె సత్యలో
కంబుననుండి యా కమలగర్భుఁ
డది డొల్లి గిరివిష్టపాంతరంబులు దాఁటి
క్రమముతో భూమిచక్రమున వ్రాలె
వ్రాలి రంహస్ఫూర్తి వచ్చివచ్చి ధరిత్రి
నిమ్నోన్నతుల శీర్ణ నేమి యయ్యె

నేమి విరిసినకతన నన్నేలనెలవు
నైమిశం బయ్యె నదియె తా నైమిశంబు
దన్మహాపుణ్యవనమున ద్వాదశాబ్ద
సత్త్రయాగంబు గావించె శౌనకుండు.

ముద్రితప్రతులపాఠ మీతీరున నున్నది. "అది ద్రొల్లి" యను చోట "అది తొల్లి" యని సూరిగారి పాఠము. గ. త. ద. వ. ప్రతుల నాల్గింటను "తొల్లి" అనియేకలదు.

ఇఁక "నైమిశం బయ్యె" ననుచోట "నేమిశంబయ్యె" ననియే సూరిగారి పాఠము ద. వ. ప్రతులరెండింటను నిట్టి పాఠమే గానవచ్చు చున్నయది.

విద్యాధికారియుఁ, దర్క-వ్యాకరణాది శాస్త్రములయందుఁ గూలంకషపాండిత్యముతో నొప్పిన శ్రీనాథుఁ డీపాఠమునే గ్రహించియుం డును. ఇట నీయర్థమే శాస్త్రసమ్మతము. ఏమందురా ?

నైమిశేఽ నిమిషక్షేత్రే మునయ శ్శౌనకాదయః
భాగవతము ప్రథమస్కం. ౧. అ. శ్లో. ४

అనుశ్లోకవ్యాఖ్యానావసరమున శ్రీధరస్వామి నైమిశశబ్దవ్యుత్పత్తి నిట్లు దెలిపియున్నాఁడు.

"నైమిశ ఇతి-బ్రహ్మణా విసృష్టస్య మనోమయస్య చక్రస్య నేమిః శీర్యతే కుంఠీభవతి యత్ర తత్, నేమిశమ్ నేమిశమేవ నైమిశమ్."

అనఁగా బ్రహ్మచే సృజింపఁబడిన మనోమయచక్రముయొక్క-యంచు, ఎక్క-డ శిథిలమగునో యాక్షేత్రము నేమిశము. అదియే నైమిశము. నేమిశశబ్దముకంటె స్వార్థమున అణ్ ప్రత్యయముచేయఁగా నైమిశమను రూపము సిద్ధించును.

ఈయర్థమున కుపబృంహకములగు శ్లోకములు వాయుపురాణమున నిట్లున్నవి.

ఏత న్మనోమయం చక్రం మయా యత్ర విసృజ్యతే
యత్రాస్య శీర్యతే నేమిః సదేశ స్తపస శ్శుభః
ఇత్యుక్త్వా సూర్యసంకాశం చక్రం సృష్ట్వా మనోమయం
ప్రణిపత్య మహాదేవం విససర్జ పితామహః
తేఽపి హృష్టతమా విప్రాః ప్రణమ్య జగతాం ప్రభుం
ప్రయయు స్తస్య చక్రస్య యత్రనేమి ర్వ్యశీర్యత
తద్వనం తేన విఖ్యాతం నైమిశం మునిపూజితమ్.

ఇట్టి పురాణప్రసిద్ధములైన శ్లోకముల భావములను మనమునం దిడికొనియే పైపద్యమును శ్రీనాథకవి రచించియున్నాఁడు. "నేమిశమేవ నైమిశమ్" అను శాస్త్రీయవివరణమునకు 'నేమిశంబయ్యె నది యెతానైమిశంబు' అనునది తెనుఁగువివరణము. కావున నిట సూరిగారు గుర్తించిన పాఠమే సొగసుగా నున్నది.

3

సీ. పూచిన కోరవిపూఁబోదరింటిచందానఁ
గత్తెర యొక్కచోఁ గదలకుండ
నొకచోఁ దగుల్పడ నుపకారికొఱటికిఁ
దరమైన రోహిణీతారకంబు
నొకచోఁ బునర్వసు నూఁగె వృక్షముకొమ్మ
నుడివడ్డ ముత్యాలసోఁగుపోలె
శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు
గుంటిమీఁదటి ప్రత్తికొండపుపోలె
స్వాతిచిత్తలు తోరణస్తంభయుగము
ననుకరించుచు నొక్కచో నత్తమిల్లెఁ
జిఱుతపోయిన మూఁకుటి చెలువుఁ దాల్చి
హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రియందు

ఇదిముద్రితప్రతులందలి పాఠము. ప్ర. ఆ. 138 ప.

వింధ్యావరోధమున నక్షత్రమండలముల సంచలనము కుంఠీభవించె నని తెలుపుటకై కవి యీపద్యమును జమత్కరించినాఁడు.

"సుడివడ్డ ముత్యాల సోఁగువోలె" అనుచోట సూరిగారు "జోగు=నావ" అనునర్థమును వ్రాసికొని "సుడివడ్డముత్యాలజోగువోలె" అని యుదాహరించినారు తాటియాకుఁబ్రతు లేడింటను "ముత్యాలజోగువోలె" అనియే కలదు. ఇట నీపాఠమే రమ్యముగ నున్నది. ఒకచోట వృక్షముకొమ్మను దగుల్కొని పునర్వసునక్షత్రము సుడిలోఁ బడిన ముత్యాలనావవలె నూఁగులాడుచుండె నని భావము. "ముత్యాల సోఁగు" అను పాఠము గ్రహించినచో ముత్యాలసరమునకు సుడిలోఁ బడి యూఁగులాడుట తటస్థింపదు గాన నాపాఠ మంత సమంజసముగ నుండ నేరదు.

జ్యోతిశ్శాస్త్రసంప్రదాయమునననుసరించినను పునర్వసునక్షత్రము నావను బోలియుండునని ప్రసిద్ధి. మఱియు సముద్రమునఁబడిననావతోఁ బోల్చుపరిపాటి యీతనికి హెచ్చు. చూడుఁడు !

"మార్తాండుండు కొండప్రక్కం జిక్క కడలి మొగయక్కలిం దగులువడిన జోగునుంబోలె నెదురునడవ మరలం బఱవనేరక చీకాకు పడియున్నవాఁడు."        కాశీ. ౨ ఆ. ౯౮ ప.

గీ. సుహిళ, లావణ్యవార్ధిలో మదనుఁ డెక్క

కప్పురపు జోగు కంటిమి కంటిమనుచు. ..... నైష ౩ ఆ. ౧౦౧ ప.

శబ్దరత్నాకరకర్తలు మాత్రము సోఁగు=సరము అనునర్థమున "సుడివడ్డముత్యాలసోఁగుఁబోలె" అని యుదాహరించియున్నారు. కాని వ్రాఁతప్రతులన్నిటితో సరిపడుచు శాస్త్రసంప్రదాయమునకును సరిపడిన సూరిగారిపాఠమే సరసమని సహృదయులకుఁ దోఁపకమానదు.

మఱియు నీపద్యమునందే "చిఱుతవోయిన మూఁకుటి చెలువుఁ దాల్చి" యనుచోట "చిఱువవోయిన మూఁకుటి చెలుఁవుదాల్చి" అని కలదు. క. గ. చ. ట. నాల్గింటను నిట్టిపాఠమే కలదు. ద. ప్రతిలో

"చిలువవోయిన"యనియు, ప. ప్రతిలో చిఱుదవోయిన యనియుఁ గలవు. 'చిఱుతవోయిన' అను పాఠము గానరాదు. దీనికిఁ దర్వాతి పద్యమున జిహ్వావివేకంబు చిఱుతవోవ అనుచోటఁగూడ చిఱువవోవ యనియే సూరిగారు వ్రాసికొన్నారు.

చిఱువ=మొత్తి యను నర్థముగూడ నటఁ గాన్పించుచున్నది. మొత్తి పడిన మూఁకుటి చందమున విశాఖనక్షత్రము వింధ్యాద్రియందు హత్తుకొనె నను నర్థమం దెంతో సరసత్వము గాననగును. నైషధమందును నీచిఱువవోయె నని ప్రయోగించినచోట చిన్నవోయె నని ముద్రిత ప్రతులయందుఁ బాఠము గాన వచ్చుచున్నది.

గీ. వగవ నేటికి నేమనవచ్చు నిపుడు
చేతనాహాని కార్యంబు చిన్నఁబోయె నై 3. ఆ. ౯౭ ప॥

సూరిగారి నైషధనిఘంటుపదసూచికయందును బరిషత్పుస్తక భాండాగారమునందలి వ్రాఁతప్రతులు పెక్కింటను కార్యంబు చిఱువవోయె" అనియే గలదు. పెక్కుప్రతులలో నొకే తీరునఁ గానవచ్చు సూరిగారి "చిఱువవోయిన" అను పాఠ మిట గ్రహింపనగును.

౪

సీ. గీ. పయ్యెదయు నిగ్గుఁబాలిండ్లఁ బ్రాఁకనీక
తఱుచు పూయుదు రొడల గంధంబుఁ బసుపు... ...

కాశీ. 3 ఆ. 109 ప.

ఇయ్యది ముద్రితప్రతులందలి పాఠము. సూరిగారు "తఱుచు పూయుదు రోలగందంపుఁబసుపు." అనుపాఠమును వ్రాసికొనినారు. వ్రాఁతప్రతులందును నిట్టిపాఠమే గలదు. శ్రీనాథుఁడు కాశీ. 3. ఆ. 212 వ పద్యమునను, నైషధము 6 ఆ-౯౮ వ పద్యమునను "ఓలగంద ముతో" 'ఓలగందంపుఁబసుపు' అని ప్రయోగించినాఁడు; కావున నిటఁ గూడ "ఓలగందంపుఁ బసుపు" అను పాఠమే సరసమైనదని గ్రహింపనగును.

## 16. ఆంధ్రఛ్ఛందము. 515

ఇందు 28 పత్రములుగలవు. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగ లేవు. గ్రంథపాతము లేదు. వ్రాయసగానిపేరు లేదు. ప్రతి యంత పురాతనము గాదు. పత్రములు బాగుగానేయున్నవి. కవిపేరు తెలియదు. ఇటఁ జర్చింపఁబడిన విషయములు.

గణములు, గణప్రస్తారక్రమము, షట్ప్రత్యయములు, గణదశ ప్రాణములు, పొంతులు, దేవరాక్షసమనుష్యగణములు, రసవిద్వేషములు, యతులు, శకటరేఫములు, వృత్తలక్షణములును. లక్షణములు లక్ష్యములు చాలవఱకు స్వతంత్రము లే. యతుల కుదాహరణములుమాత్రము కావ్యాలంకారచూడామణి, కాశీఖండము, మనుచరిత్రము, జైమినిభారతము, భాస్కరరామాయణము మున్నగు ప్రాచీనగ్రంథములనుండి కైకొనఁబడినవి. కాఁగా నీప్రతి యసమగ్రమై గానవచ్చెడిని.

గ్రంథారంభము:—

క. శ్రీవనితాసముభూతవ
యావక్షోజార్ద్రకుంకుమాంకితవక్షున్
పావనతరచారిత్రున్
సేవింపఁ దలంతువాంఛ శ్రీరఘురామున్.

సంజ్ఞాప్రకరణము:—

క. వృత్తంబులు గణబద్ధము
లుత్తమమగు జాతులెల్ల నొసరఁగ మాత్రా
యత్తంబులు లఘువగు పురు
షోత్తమ యొకమాత్ర గురువు లోలి ద్విమాత్రన్.

గ్రంథాంతభాగము:—

అంద ప్రియకాంత—
నయనయ సల్గ-న్ దశయతి నానొప్రియకాంతన్.

## 17. లక్షణగ్రంథము. 552

ఇది యొక సంకలితలక్షణగ్రంథము. ఇందుఁ దొలుత 22 పత్రములు కేతన ఆంధ్రభాషాభూషణము, పిమ్మట 64 పత్రములు-వేంకటేశాంధ్ర నిఘంటువు, ఆవెనుక 11 పత్రములు పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రభాషారత్నాకరము. అటుమీఁద వారణాసి వేంకటరాయప్రణీతంబైన ఆంధ్రకుసుమాకరము, పిమ్మట 9 పత్రములు లక్షణచంద్రికయు, ఆవెనుక అద్దపూరి రామదాసవిరచితంబైన సకలలక్షణసారమును గలవు. పత్రములు బాగుగనున్నవి. గ్రంథపాతములు లేవు. వ్రాఁత బాగుగనే యున్నది. తప్పులు మెండు.

—లక్షణచంద్రిక—

ఇందలి లక్షణచంద్రికలో, గురులఘువిచారము, గణస్వరూపము, వృత్తలక్షణము, యతిప్రాసప్రకరణములునుగలవు. అసంపూర్ణము. కవిపేరు గానరాదు.

గ్రంథారంభము:—

గీ శ్రీమనోధననుతచర్యశివమహేశ
సర్వనత లసదచలాత్మజాకళత్ర
బాలజనములకెల్ల విస్పష్టముగను
జేతు లక్షణచంద్రిక చిత్తగించు.

గీ. పూర్వకవులకు భక్తితో మ్రొక్కి నూత్న
కవుల వేడ్క నుతించి కాకవుల విడిచి
లఘుతరంబుగ జనులు సులక్షణంబు
తెలియ లక్షణచంద్రిక దెలుపు దీశ.

గ్రంథాంతభాగము:—

ప్రాసలకు ద్విప్రాసము-పెద్దిరాజు అలంకారమున-

క. క్రమముల పాదాదులయం
దమలములై రెండుమూఁడు నక్కరములవే

నమరినయది ద్వంద్వప్రా
సము లనఁగాఁ బరగువానిఁ జనుఁ గృతులందున్.

—సకలలక్షణసారము.—

ఇందు అక్షరగణాదిలక్షణములు, వృత్తలక్షణములు లక్ష్యములు, యతులస్వరూపోదాహరణములును గలవు. లక్ష్యములు చాలవఱకు స్వతంత్రముగ రచించిన పద్యములే. కొన్నిమాత్రము భారతమునుండి కైకొనఁబడినవి.

గ్రంథారంభము:—

క. శ్రీమనుకులాబ్ధిసోమా
సామజవర వరదనీల జలదశ్యామా
కామారివినుతనామా
శ్రీమందిరరామతీర్థ సీతారామా.

అవధరింపుము-అద్దనూరికుల సుధాబ్ధీందుఁడగు శ్రీనివాససుతుఁడ రామదాసనామధేయుఁడను, సుజనవిధేయుండ నీపాదజలజసేవకుఁడను జానకీపతి—ఇందుఁ బేర్కొనిన యతులు.

క. స్వరవర్గాఖండ ప్రా
దుర్యరుబిందు ప్లుతములును బ్రయుక్తాక్షరముల్
పరువడి నెక్కటి పోలిక
సరసయనన్ బదియువిధము లనఁ జను వళ్లుల్.

గ్రంథాంతభాగము:—

గీ. ఎంతదుష్టాత్ముఁడైన నిఁక నృహరి శౌరి
యిందిరానాథ గోవింద కృష్ణ వరద
యినకులాధీశ యన దయావృష్టి నేలె
దా దయాసాంద్ర రామతీర్థాచలేంద్ర.

"నలనామ సం॥ ఆషాఢ శు ౨ శుక్రవారంరోజున శేనాధిపత్యాం శేషాచార్యులు వ్రాసినది అని తలచవలెను" అని కలదు.

## 18. లక్షణగ్రంథము. 1083

ఇందు 50 పత్రములుగలవు. వ్రాత చక్కనిది. తప్పులంతగలేవు. పడిపత్రముల తుదిభాగములు తునిఁగిపోయినవి. కవిపేరు గానరాదు. వ్రాయసగానిపేరును లేదు. గ్రంథపాతములేదు.

తొలుత రెండుపత్రములందు కావ్యప్రకాశికలోని శ్లోకములు కొన్నిగలవు. ఆవెనుక నీలక్షణగ్రంథభాగము.

అక్షరములు-తదధిదేవతలు, గణములు—తత్ఫలములు, గ్రహమైత్రివిరోధములు, ప్రాసరీతులు, యతులగతులుమున్నగునవి నిరూపింపఁబడినవి. యతుల కుదాహరణములు-భారతము, భాస్కరరామాయణము, కాశీఖండము, కావ్యాలంకారచూడామణి, పారిజాతాపహరణము, శ్రీరంగమాహాత్మ్యము, క్షేమేంద్రము, మున్నగువానినుండి కైకొనఁబడినవి.

గ్రంథారంభము:—

శా. శ్రీవాణీగిరిజేశదంతిముఖరాజీవాక్షులం గొల్చి వా
గ్దేవిం జిత్తములోన నిల్పుకొని శక్తింభక్తిఁ గీర్తించి నా
నావిద్వత్సభలం దదిం దెలిపి నూత్నప్రౌఢ కావ్యక్రియా
ప్రావీణ్యంబున నుల్లసిల్లు కవితాప్రాజ్ఞుండనై యొప్పుదున్.

క. వానునకును వంతుంమును
మానునకుసు మంతుఁడుం గ్రమంబున శాఙ్గా
సీనాంతనకారముపై
మానింప విభక్తి లెక్క మఱియొక-చోటన్.

గ్రంథాంతభాగము:—

తభజంబువసస్తరాజాకారవసస్త తిలకంబగు గాయు.

## 19. లక్షణగ్రంథము. 34

ఇందు 100 పత్రములు గలవు. వ్రాత యొక తీరుగ నున్నది. పత్రములు శిథిలములు గాలేదు. తప్పులుహెచ్చు. వ్రాయసగాని పేరు గానరాదు.

క్రమముగ- $3\frac{1}{2}$ పత్రములు కవిజనాశ్రయమునందలి దోషాధికారము, $11\frac{1}{2}$ పత్రములు కవిసర్పగారుడము, 4 పత్రములు చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహమునందలి యతిలక్షణోదాహరణములు, 2 పత్రములు సంస్కృతశబ్దములు, 3 పత్రములు గొరన లక్షణదీపికలోని యారంభభాగము, 23 పత్రములు యతిప్రాసస్వరూపోదాహరణములు, 13 పత్రములు ఆంధ్రభాషాభూషణము, 15 పత్రములు అక్షరగణాది దేవతాస్వరూపము, 14 పత్రములు అంగజవిజయమును గూడియున్నవి, కాఁగా నిందు ఆంధ్రభాషాభూషణము పూర్ణముగను, మిగిలిన గ్రంథ భాగము లసంపూర్ణముగ నున్నవి. ఛందస్సునకు సంబంధించిన వివిధ గ్రంథస్థలక్షణములు మాత్ర మధికముగ నున్నవి.

## 20. లక్షణగ్రంథము. 4154

ఇందు 10 పత్రములుగలవు. వ్రాఁత బాగుగలేదు. తప్పులు మెండు. వృత్తలక్షణములు, గణముల శుభాశుభవిచారములును గలవు. కవిపేరుగాని వ్రాయసగాని పేరుగాని కానరాదు.

## 21. లక్షణగ్రంథము. 2808

ఇందు 11 పత్రములు గలవు. వ్రాఁత తిన్ననిది గాదు. పత్రములు శిథిలములు. లక్షణములు కవిజనాశ్రయమునున్నగు వానినుండి గైకొనఁబడినవి. అక్షరగణముల స్వరూపములు, మాతృకార్చన విధానమును నిందుఁ వ్రాయఁబడినవి. లక్షణములే గాని లక్ష్యములు లేవు.

## 22. ఆంధ్రఛందస్సు. 3817

ఇందు 33 పత్రములుగలవు. వ్రాఁత తిన్ననిదిగాదు, అయినను తప్పు లంతగలేవు. విషయము క్రమబద్ధముగలేదు. పత్రములు మొదటను జివరను దునిఁగి పోయినవి, ..."నరసయ్యగారి ఛందస్సులో చూచి తాడికొండ వీరభద్రప్ప స్వహస్తంగా వ్రాసుకోటమయ్యినది" అని యొక పత్రమునఁ గలదు. కొన్నిలక్షణములు భీమనఛందస్సులోనివి, మఱికొన్ని

యితర ఛందస్సులలోనివిని గలవు. అక్షరగణస్వరూప ఫలవిచారము గలదు.

## 23. లక్షణగ్రంథము. 281

ఇందు 40 పత్రములు గలవు. వ్రాఁత సరిగాలేదు. తప్పులు మెండు. పత్రము లటనటఁ గ్రిమిదష్టములు, శిథిలములును. వ్రాయసగాని పేరు గానరాదు. క్రమముగ 11 పత్రములు యతుల స్వరూపోదాహరణములు, 13 పత్రములు వివిధవిషయములు, 16 పత్రములు ఆంధ్రభాషార్ణవమును గలవు. యతులలక్షణములు కవిసర్వగారుడము మున్నగువానినుండి కైకొనఁ బడినవి.

ఇందుఁ గూర్పఁబడిన భాగములన్నియు నసంపూర్ణములే.

## 24. బాలబోధచ్ఛందస్సు. 909

ఇందు 40 పత్రములు గలవు. వ్రాఁత యొకతీరుగ నున్నది. తప్పులు మెండు "ప్రమాదీచ ఆషాఢ బ. ౧౦. శుక్రవారంరోజున దెందులూరి శ్రీరామలింగమూర్తి భీమన్నగారి ఛందము పూర్ణముగా వ్రాసెను" అని 25 వ పత్రమునఁ గలదు. కాని లక్షణము లొక్క భీమనఛందము నుండియేగాక కవికంఠపాశము, లక్షణదీపిక, సాహిత్యరత్నాకరము, సాహిత్యచంద్రోదయము వాదాంగచూడామణి మున్నగువానినుండి కైకొనఁబడినవి. లక్ష్యములును నారాయణశతకము, భీమనచాటుధార, జైమినిభారతము, మనుచరిత్రము, విజయవిలాసము, కుసుమాయుధకవి కృష్ణవిజయము, శ్రీనాథుని వీధినాటకము, కాశీఖండము, శ్రీరంగమాహాత్మ్యము, కళాపూర్ణోదయము, నీతిభూషణము, రఘుపతిశతకము, విశ్వేశ్వరశతకము, నాచనసోముని వసంతవిలాసము, విష్ణుచిత్తీయము, నన్నెచోడుని కుమారసంభవము, పండితారాధ్యుని శివతత్వసారము మున్నగువానినుండి కైకొనఁ బడినవి.

గ్రంథారంభము :—

క. అందముగ బాలబోధ
   చ్ఛందంబొనరింతు విబుధజనులకుఁ గర్ణా
   నందముగఁ బూర్వసత్కవి
   బృందము వచనానుసరణిఁ బ్రీతి దలిర్పన్.

గ్రంథాంతభాగము :—

వర్గవల్లకు—

ఉ. భానుకులేశుశంపఁ దనబంధురకీర్తులు చంగలింప నా
   జానకి సంతసింప సురశత్రుల గుండెలు నావలింప స
   న్మానముగా నటింప దశమస్తకుఁ గొంప వహింపవే భళీ
   మానిత శౌర్యవంత హనుమంత మరంత పరాక్రమోన్నతా.

ఇందుఁ దొలుత నక్షరగణస్వరూపములు, పిమ్మట ప్రాసములకు యతులకు లక్షణోదాహరణములు, వృత్తలక్షణములు, గణాధిదేవతలు తత్ఫలములు, మున్నగునవిగలవు. ఇంతకుముందు పేర్కొనిన 3488 వ సంఖ్యగల ప్రతియందలి యతిస్వరూపోదాహరణములు, నిందలి యతిస్వరూపోదాహరణములు నొక్కటిగానున్నవి. కాని ప్రకరణములలో మార్పు గానవచ్చుచున్నది. ఆప్రతిలో సంధిశబ్దసమాసాది లక్షణములధికముగనున్నవి.

మచ్చునకిందలి యొకఘట్టము :—

అఖండవడికి లక్షణము :—

ఉ. మానుగ విశ్రమాక్షర సమన్వితమై స్వరమాదినం దదీ
   యానుగుణాక్షరంబె కొనియైనను జెప్పఁగ నొప్పు నీక్రియన్
   భానుసహస్రభాసి వృషభాధిపుఁడన్నటు లర్థయుక్తమై
   పూనినచో నఖండవడి పొల్పగు నాదికవిప్రణీతమై.

ఇందుకు నుదాహరణము :—

ఉ. మానుగ నింద్రచంద్రగణమధ్యమునందు యతిప్రయుక్తమై
కానఁగనైనఁ దత్స్వర వికల్పముసేయక యట్టివర్ణమే
పూన నఖండనామవళి ఫాల్గుగునాదికవి ప్రణీతమై
భానుసహస్రభాసి వృషభాధిపుఁ డన్నటు లర్థయుక్తమై.

ఇందుకు సూత్రము లక్షణవిలాసము.

సీ. వినుమఖండయతికి విశ్రమస్థానంబు
నందర్థయుక్తమౌ నట్టిపదము
విభజించి చూడఁగా విరతి దాపలికడ
యక్షరంబు-లింద్రగణము లగుచు (?)
వలపలిమాత్రలు వలనొప్ప నవి చంద్ర
గణములై యుండె నఖండ మంద్రు
గాక యఖండమై గణములు పొందక
నవి సమాసముతోడ నలరియున్న
నన్యపదమైన నిత్యసమాస మంద్రు
అట్టిసంధులు తెలిసిన యార్యులకును
రంగధాముండు కరుణాంతరంగుఁ డగుచు
నిత్యశుభ మిచ్చుఁ గృతులందు నిలుచునట్లు.

ఆ. వె. ఈ యఖండవడి మహితబుద్ధి తెలియని
వారు చెల్లదనుట గారణముగ
చతురబుద్ధి పెక్కుసమ్మతుల్ వ్రాయుదు
నిచ్చ సుకవివరులు మెచ్చుగాఁగ.

ఇందుకులక్ష్యములు, విరాటపర్వము, రామాయణము, జైమినిభారతము, మహాకవిప్రయోగము, శ్రీనాథుని వీథినాటకము మున్నగువాని నుండి చూపఁబడినవి.

## 25. లక్షణగ్రంథము. 483

ఇందు 24 పత్రములు గలవు. వ్రాఁత యొకతీరుగ నున్నది. తప్పులు మెండు. కవిపేరు తెలియదు. వ్రాయసగానిపేరు గానరాదు. పత్రములు తుదిని శిథిలము లయినవి.

తొలుత సులక్షణసారములోనిపద్యము లొకకొన్నిగలవు. యతిప్రకరణము 909 సంఖ్యగల బాలబోధచ్ఛందమునందలి యతిప్రకరణముతోఁ జాలవఱకు సరిపడుచున్నది. అక్షరములు, గణములు, రాసులు, వృత్తములు, ప్రాసములు, యతులు మున్నగువాని లక్షణోదాహరణములిందుఁగలవు కాఁగా నీప్రతియసమగ్రము.

గ్రంథారంభము.

క. శ్రీవల్లభయతిగణ సం
సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురు నలఘుచ్ఛం
దోవినుతు మురారి భక్తితో వినుతింతున్.

గ్రంథాంతభాగము.

కవిసర్పగారుడే:—

మ. అనలుం డీశుఁడు రాశి మేషము గ్రహంబా భౌముఁ డత్తార సం
ప్రణతిన్ గృత్తిక దైత్యమాగణము వైరాజ్యంబు వంశంబ మే
కనెజిన్ యోనిఫలంబు భీరసము శృంగారంబు సత్కాంతితో
కనదచ్ఛచ్ఛవి మించు నా రగణ మేకాలంబు ధాత్రీస్థలిన్.

వాదాంగచూడామణౌ శ్రీ శ్రీ శ్రీ

---

## 26. కవిజనాశ్రయము. 3

ఈప్రతి 111 పత్రములు కలది ఇందుఁ దొలుత 43 పత్రములు మండ లక్ష్మీనృశింహకవి రచించిన ఆంధ్రకౌముదియు, ఆవెనుక 68 పత్రములు కవిజనాశ్రమును. వ్రాఁత బాగుగనేయున్నది. తప్పు లంతగలేవు.

గ్రంథపాతము లేదు. కవిజనాశ్రయమున షట్ప్రత్యయాధికారాంత భాగము వ్రాయఁబడినది.

27. కవిజనాశ్రయము. 65

ఇందు 25 పత్రములు గలవు. పత్రములు శిథిలములుగా లేవు. వ్రాఁత యొకమాదిరిగ నున్నది. గ్రంథపాతము లేదు.

గ్రంథారంభము:—

క. శ్రీవల్లభు యతిగణసం
సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురు నలఘుచ్ఛం
దోవినుతు మురారి భక్తితో వినుతింతున్.

అక్కలల స్వరూపనిర్ణయముతో నీభాగము ముగిసినది.

28. కవిజనాశ్రయము 164.

ఇందు 114 పత్రములు గలవు. క్రమముగ 94 పత్రములు రంగరాట్ఛందమును, 10 పత్రములు టీకలతోను ప్రస్తారపటములతోను గూడిన కవిజనాశ్రయమునందలి పద్యములును, 10 పత్రములు నానార్థనిఘంటువును గలవు. రంగరాట్ఛందమునఁ దొలిపత్రము లేదు. పిమ్మట గణలక్షణములతో నీగ్రంథ మారంభింపఁబడినది. వ్రాఁత చక్కగ నున్నది. తప్పు లంతగ లేవు, వ్రాయసగాని పేరు గానరాదు.

గ్రంథారంభము:—

క. శ్రీకాంతాది ప్రియవా
క్ళ్రీకాంత జగత్త్రిదైక సేవితనుతవి
ద్యాకాంత దివ్యకావ్యస
దేకాంతనితాంతకాంతి నీవుత మాకున్.

29. కవిజనాశ్రయము 320.

ఇందు 28 పత్రములు గలవు. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగ లేవు. మూఁడాశ్వాసములు గలవు. సంపూర్ణము. ఉన్నంతదనుక గ్రంథ

పాతము లేదు. పత్రము లటనటఁ గ్రిమిదష్టములు. "సముద్రాల నాయన్క సామయ్యకుమారుఁడు కృష్ణుఁడు వ్రాసినది" అని తుదిని గలదు.

19 వ పత్రము వెనుక నీరీతి వ్రాతఁగలదు.

"ఉత్తమగండచ్ఛందం, హనుమచ్ఛందం, అనన్తచ్ఛందం, కవిరాక్షసచ్ఛందం, జయదేవచ్ఛందం, గోకర్ణచ్ఛందం, నీలకంఠచ్ఛందం, ఆదిభీమనచ్ఛందం, అనగా ౮ విధముల ఛందములు. ఈ ౮ ఛందములు గావే లక్షణగ్రంథము లనగాను."

అన్నయభట్టు లక్షణసారం పిన్నకోట పెద్దిరాజు అలంకారశాస్త్రం, రఘునాథయ్య లక్షణదీపిక. భైరవన్న కవిగజాంకుశం, అప్పన్న ఆంధ్రప్రయోగరత్నాకరం, ఎఱ్ఱాప్రగడ కవిసర్పగారుడం తాతంభట్ల కావ్యచింతామణి, మల్లన్న వాదాంగచూడామణి, ఇవి మొదలైన లక్షణకావ్యములు."

గ్రంథారంభము:—

క. శ్రీపతివంద్య విశాలా
శ్రీపతిని భజించి యిష్టసిద్ధులు వడసన్
బ్రాపింపఁగ గణనాథుని
శ్రీపాదములెరఁగ మాకుఁ జెందినవేడ్కన్,

గ్రంథాంతము.

ఇది వాగీంద్రచూడామణి చరణసరసీరుహ మధుకరాయమాణ కవిజనాశ్రయ శ్రావకాభరణ విరచితంబైన మహాప్రబంధంబునందు భీమనఛందము సర్వంబును తృతీయాశ్వాసము.

## 30. కవిజనాశ్రయము. 257

ఇందు 30 పత్రములు గలవు. పత్రములన్నియు శిథిలములు. వ్రాఁత సరిగాలేదు. తప్పులు మెండు. తొలుత 10 ప్రతములు, నరసభూపాలీయములోని నాయకప్రకరణమునందలి పద్యములును, ఆవెనుక నిరువదిపత్రములు కవిజనాశ్రయమును గలవు. వ్రాయసగాని పేరులేదు.

## 31. కవిజనాశ్రయము 31.

ఇందు 188 పత్రములు గలవు. వ్రాఁత బాగుగనేయున్నది. పత్రములు శిథిలములు. తొలుత 181 పత్రములు గణపవరపు వేంకట కవి విరచితమయిన లక్షణశిరోమణియును* ఆవెనుక 7 పత్రములు కవి జనాశ్రయమును గలవు. ఈభాగమున కవిజనాశ్రయమునందు సంజ్ఞాధి కార మొకకొంతగలదు.

## 32. భీమనఛందస్సు 81.

ఇందు 17 పత్రములు గలవు. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగ లేవు. గ్రంథపాతము లేదు.

గ్రంథారంభము.

క. శ్రీవల్లభు యతిగణసం
సేవితపాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురు నలఘుచ్ఛం
దోవినుతు మురారి భక్తితో వినుతింతున్.

షట్ప్రత్యయాధికారనిర్ణయముతో సీప్రతి ముగిసినది.

## 33. భీమనఛందస్సు 1780.

ఇందు 54 పత్రములు గలవు. వ్రాఁత సరియయినది కాదు. తప్పు లంతగ లేవు. ఉన్నంతదనుక గ్రంథపాతము లేదు.

"శ్రీకాంతాది ప్రియవాక్" ఇత్యాదిగా "సుందరవృత"యను వృత్త లక్షణమువఱకుఁగల కవిజనాశ్రయభాగ మిందుఁగలదు. వ్రాయసగాని పేరు గానరాదు.

## 34. భీమనఛందము 391.

ఇందు 130 పత్రములు గలవు. వ్రాఁత బాగుగనే యున్నది. 60 పత్రముల తరువాతి పత్రములు నడుమఁ గ్రిమిదష్టములైనవి. ఇందు 8

---

చూ. సంపుటము 28 సం. 5-6 పరిషత్పుస్తక భాండాగారము పుట 6-9.

గ్రంథములు కూడియున్నవి* వీనిలో 22 పత్రములు కవిజనాశ్రయము. దోషాధికారము తుదివఱకుగల భాగమిందు గలదు. అసంపూర్ణము.

ప్రారంభము :—

"శ్రీకాంతౌతిప్రియవాక్" ఇత్యాది కందపద్యము.

తుదిభాగము :—

క. అన నిట్టివి దశదోషము
లనఁజనుఁ గృతి నివియు వెండి యతిశయకరమై
చనుఁ గొన్నియెడల ధీరుల
మన మలరఁగఁ జెప్పికేని మల్లయరేచా.

క. జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జేయుచు......

... ... ... ... ... ... ... ... ...

## అనంతుని ఛందము.

ఈప్రతిలోనే 8 పత్రములు అనంతుని ఛందము ప్రథమాశ్వాస భాగము మాత్రము గలదు. ఈపత్రములు నడుమ శిథిలములు.

గ్రంథారంభము :—

శా. శ్రీరామా కుచమండలీమిళిత కాశ్మీరార్ద్రవక్షంబుతో
పారావారతరంగసంగతలసత్పర్యంకభాగంబుపై
కారుణ్యామృతపూరపూరితకటాక్షశ్రీలఁ బెంపొందు గం
భీరస్వాంతుఁ డనంతుఁడాశ్రిత జనాభీష్టప్రదుం డెల్లెడన్.

గ్రంథాంతము :—

"ఇది లక్ష్మీవల్లభవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్య సంభవ, సకలకవిజనవిధేయ అనన్తనామధేయ ప్రణీతంబైన ఛందోవర్ణనంబునందు గద్యపద్యాది కావ్యలక్షణంబును, గురులఘునిర్ణయం

* చూ. పరిషత్పుస్తక భాండాగారము మూఁడవ భాగము. సంస్కృతము వీఁ సంచిక. వి-3. పుట 20-22

బును గణనిరూపణంబును, ఉపరిగణసంజ్ఞయుఁ బ్రాసయతుల విశేషంబులన్నవి ప్రథమాశ్వాసము ”

## 35. లక్షణసార సంగ్రహము. 4441

చిత్రకవి పెద్దనార్యునిచే రచింపఁబడినది. 25 పత్రములు కలది. వ్రాఁతమంచిది. అక్కరములు మిక్కిలి సూక్ష్మములు. తప్పులు లేకపోలేదు. 25 వ పత్రము ప్రారంభమున కొలఁదిభాగము తునిఁగిపోయినది. మూఁడాశ్వాసములు సంపూర్ణముగనున్నవి. “ దుర్మిఖి సంవత్సర పుష్య శు ౬ ల్లు శ్రీమత్ఖాదిరీ నృసింహస్వామి సత్కృపను చిత్రకవి బుచ్చయాచార్యుల తమ్ముఁడు రామాచార్యులు వ్రాసిన లక్షణసార సంగ్రహము నకు శుభమస్తు ” అని తుదిపత్రిమునఁ గలదు.

“ ఆమీఁదఁగొంతఱు కవిగ్రామణు లిరువదియు నేడు గావించిరొగిన్ ” అని యప్పకవి తృతీయాశ్వాసాదినిఁ జేర్కొనిన కవిగ్రామణి యీతఁడే.

గ్రంథారంభము :—

శా. శ్రీరామాధిప పాదపద్మయుగసంసేవామనీషాతి భూ
 షారేఖోజ్జ్వలదివ్యమూర్తి వటుకాచారుండు శౌర్యక్రియా
 మారారాతి కుమారవర్యుఁడు హనూమంతుండు మాకిచ్చు గం
 భీర శ్రీకరకావ్యగుంభనవచోఽభీష్టార్థముల్ సత్కృపన్.

అని యిష్టదేవతా స్తుతిభాషణంబును, సుకవీశ్వర భూషణంబునుం జేసి లక్షణసారసంగ్రహంబు నుపక్రమించువాఁడనై ......

సీ. శ్రీ హనుమద్వర స్థిరసత్కవిత్వ ద
  క్షుండ భారద్వాజ గోత్రజుండ
 శుభకర శుక్లయజుశ్శాఖికా ప్రభా
  సురుఁడ కాత్యాయన సూత్రయుతుఁడ
 మహిని పార్శ్వంచాల మంచిరాజేంద్రుని
  కాచధీమణి చన్నఘరుని పౌత్రుఁ

డను సర్వధీరు నందనుఁడ కాశ్యపగోత్ర
కలితుఁడై తగు నల్లగట్టయెల
యార్య దౌహిత్రుఁడను లక్కమాంబి కాత్మ
గర్భ జలధిచంద్రుఁడ చిత్రకావ్యధనుఁడ
ధారుణీశ మాన్యుండ కందాళ యన్న
గారి శిష్యుఁడ పెద్దన కవివరుండ.

... ... ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ... ... ...

క. అతులిత గుణవంతున కా
నతజన తరుతతి వసంతునకు మాణవక
వ్రతజితకంతునకు ధరా
నుత నెలలూరి పురీహనూమంతునకున్.

అని యీరీతిగ నీలక్షణగ్రంథము వెలలూరి హనుమంతునకుఁ గృతియొసఁగఁబడినది. లక్ష్యలక్షణములన్నియు స్వయముగ రచింపఁబడినవే.

గ్రంథాంత భాగము :—

పంచచామరము :—

గృణీ తృణీ కృతారి వీరఘోరపూరగారలం
కిణీ ఘృణీన వంశరాతి కీర్తిమాలికా
మణీ ఘృణీయ కంపనా సుమాతరిస్ఫురద్భుజా
ఫణీ గుహేంద్ర ముఖ్యదేవపంక్తిదత్తసద్వరా.

ఇతి శ్రీ హనుమద్వరప్రసాదలబ్ధసారస్వతపాత్ర, భారద్వాజ గోత్ర పవిత్ర, సర్వయామాత్యపుత్ర, చిత్రకవి పెద్దనార్య ప్రణీతంబైన లక్షణసారసంగ్రహంబున రేఫరకారభేదంబులును, దశరూప నాటకసంజ్ఞలును, షట్ప్రత్యయ విశేషమార్గంబులును గల సర్వంబును తృతీయాశ్వాసము.

## 36. సులక్షణసారము. 2407

ఇందు 34 పత్రములుగలవు. వ్రాఁతతిన్ననిది. పత్రము లటనటఁ ద్రుటితములైనవి. వ్రాయసగాని పేరు గానరాదు. తప్పులంతగాలేవు. తొలుత 23 పత్రములు సులక్షణసారమును, ఆవెనుక 11 పత్రములు ఆతుకూరి మల్లన, అప్పకవీయమునుండి యేర్చి కూర్చిన రేఫశకటరేఫ నిర్ణయమును గలవు. కాఁగా నిందు సులక్షణసారము తుదిపఱకుఁగలదు.

గ్రంథారంభము :—

శా. శ్రీరామా కుచమండలీ మిళిత కాశ్మీరార్ద్రి వక్షంబుతోఁ
  బారావారతరంగ సంగతలసత్పర్యంక నాగంబుపైఁ
  గారుణ్యామృత పూరపూరిత కటాక్షశ్రీలఁ బెంపొందు గం
  భీరస్వాంతుఁడనంతుఁ డాశ్రితజనాభీష్టప్రదుం డెల్లెడన్.

గ్రంథాంతభాగము :—

క. అందంబుగ దశవిధముల
  ఛందంబుల లక్షణములు సకలకృతులలోఁ
  జెందిన ప్రయోగ వితతులఁ
  బొందికగాఁ గూర్చినాఁడ బుధులౌననఁగన్.

రేఫ ఱకారనిర్ణయమునఁ దొలుత సీసమాలికలును, పిమ్మట పదములపట్టికయును గలవు.

## 37. సులక్షణసారము. 1456

ఇందు 41 పత్రములు గలవు. వ్రాఁతతీరు కన్నడమోస్తరునున్నది తప్పులంతగ లేవు. ఉన్నంతవరకు గ్రంథపాఠము చులేదు. తొలిపత్రమొక కొంత త్రుటితమైనది. వ్రాయసగాని పేరు కానరాదు.

ఇందు 27 పత్రములు సులక్షణసారము (అసంపూర్ణము) ను, ఆవెనుక 4 పత్రములు చిల్లరగద్యములును, తుదిని 10 పత్రములు గీతగోవిందములోని కొంతభాగమునుగలవు. సులక్షణసారములోని కృత్యాదిపద్యములు పైప్రతిని బోలియున్నవి.

## 38. సులక్షణసారము. 1980

ఇందు 40 పత్రములు గలవు. క్రమముగ 16 పత్రములు సులక్షణసారము (అసంపూర్ణము) ను, 11 పత్రములు ఆంధ్రనామశేషమును, ఆవెనుక 13 పత్రములు వివిధపద్యములును గలవు. వ్రాతసరియయినదిగాదు. తప్పులుమెండు. పత్రములు క్రిమిదష్టములు శిథిలములును. వ్రాయసగాని పేరు, కవిపేరుగాని కానరావు. వృత్తలక్షణ లక్ష్యనిరూపణముతో నిందలివ్రాత ముగిసినది.

## 39. సులక్షణసారము. 1434

ఇందు 30 పత్రములుగలవు. వ్రాతచక్కనిది. తప్పులంతగలేవు పత్రములు శిథిలములుగాక మంచిస్థితియందున్నవి. ఉన్నంతవరకు గ్రంథపాతము లేదు.

గ్రంథారంభము :—

శ్రీ పద్మశైలనాథుని
పాపధ్వాంతార్కు భక్తపాలను హరి ల
క్ష్మీపతిని భోగిశయనుని
శ్రీ పదపద్మములు మదిని సేవింతు నిలన్.

పిమ్మట " శ్రీవల్లభయతిగణ సంసేవిత " ఇత్యాదిగా మొదలిడి వృత్తలక్షణ నిరూపణము తుదివఱకుఁ వ్రాయఁబడినది. అక్షరగణరాశ్యాది వివేచనము నమమఁ గలదు.

## 40 సులక్షణసారము. 1432

ఇది 200 పత్రములుగలది. వ్రాత మంచిది. తప్పులును గలవు. గ్రంథపాతములు లేవు క్రమముగ 6 పత్రములు సులక్షణసారము, 18 పత్రములు ఆంధ్రనామసంగ్రహము, 164 పత్రములు భాగవతము (తెలుఁగు) తృతీయస్కంధమును, 12 పత్రములు "సాంబశివా మహాప్రభో" అను మకుటముతోఁగూడిన శతకమును నిందుఁగలవు. వీనిలో

సులక్షణసారము "విద్యలలోపల నుత్తమవిద్య కవిత్వంబు" ఇత్యాదిగా నారంభింపఁబడి.

నజభజజ జరాచంపక
మసజ సతతగమననార్థు (?) మత్తేభకుఁడా
సభరతనమయతలీలా
భరనభ భరనగములందు గణములుచెల్లున్. ?;

అనుపద్యమువఱకును గలదు. ఆంధ్రనామసంగ్రహము, భాగవత భాగమును సంపూర్ణములు. మిగిలినవి యసంపూర్ణములు.

ఉ. శ్రీజలధౌతహేమవతి చిత్తసుధారసపాన......
గ్రాజగబంధనస్మర హరాననహాస ధరాధరార్చితా
రాజకిరీట పంచముఖరంజిత శుభ్రశరీరబంధురా
భోజభవాసుతాంఘ్రి పతిభూషణ చంద్రహుతాశనార్కదృగ్
రాజిత కాళహస్తి మణిగోపుర సాంబశివా మహాప్రభో.

ఇట్టి మకుటభూషితములయిన 70 పద్యము లీశతకమునఁగలవు. పద్యములన్నియు నయిదయిదు పాదములు గలవిగఁ గన్పట్టుచున్నవి.

## 41 సులక్షణసారము. 3439

ఇది లింగమకుంట తిమ్మకవి విరచితము. అసంపూర్ణము. ఇందు 27 పత్రములుగలవు. వ్రాఁత మిక్కిలి క్రిక్కిరిసియున్నది. తప్పులంతగ లేవు. తొలుత పదిపత్రముల చివరిభాగములు విరిగిపోయినవి. మిగిలిన పత్రములును నటనటఁ గ్రిమిదష్టములు. ప్రతిమాత్ర మంతగా శిథిలము గాదు.

గ్రంథారంభము:—

క. శ్రీవనితాసమ భూతన
యావక్షోజార్ద్ర కుంకుమాంకిత వక్షున్.
పావనతరచారిత్రున్
సేవించెద చదలువాడ శ్రీరఘురామున్.

సీ. ........................ట్టరు
శిష్యుండ కవితావిశేషతులిత
సర్వార్య పౌత్రుండ సద్గుణ గణలక్ష్మ
ణాయతిమ్మాంబకును సుతుండ(?)
పేరున మాంచ పెదరామ కవివరు
..................ష్టా
మత్స్యపురాణ వామనపురాణాది స
త్కావితలకెల్ల విలేఖకుఁడ వృద్ధ
కుంటి కోతిరలింగము కుంటనామ
పట్టణస్థితుఁడనఁగ సౌభాగ్య
............నమరువాఁడ.

ఇందలి లక్షణములు స్వయముగ రచించినవి కొన్నియు, శ్రీధరచ్ఛందము, గోకర్ణచ్ఛందము, అధర్వణచ్ఛందము, వాదాంగచూడామణి, కవిసర్పగారుడము, కవిగజాంకుశము, మున్నగు ప్రాచీనలక్షణ గ్రంథములనుండి కైకొనినవి కొన్నియును.

గ్రంథాంతభాగము:—

క. సీసమునకు గీతమునకు
ప్రాసవిరామంబు చెప్పఁ బరఁగును గృతులన్ ......

## 42. సులక్షణసారము. 2977

ఇదియు లింగమకుంట తిమ్మన విరచితమైన సులక్షణసారమే. కృత్యాదిపద్యములు రెండుమాత్రమిందుఁ గానరావు. మిగిలిన భాగము చాలవఱకు 3439 సంఖ్యగల పైప్రతిని బోలియేయున్నది. ఇందు 39 పత్రములు గలవు వ్రాఁత చక్కనిది. తప్పులంతగ లేవు. గ్రంథపాతము లేదు.

ప్రారంభము:—

క. శ్రీకాంతాదిప్రియ వా
క్శ్రీకాంత జగత్త్రిమైక సేవిత నుత వి
ద్యాకాంత దివ్యకావ్య స
దేకాంత నితాంతకాంతు లీవుత మాకున్.

క. లక్షణ శాస్త్రము లెల్లను
రక్షించుట కొంతకొంత యెఱిఁగిరవాఁడన్ (?)
లాక్షణికానుగ్రహతను
లక్షణసారం బొనర్తు లక్ష్యము లమరన్.

గ్రంథాంతభాగము:—

దేశీయపదికి లక్ష్యము-నై షధము

సీ. విరహిణీ జనమహాదురిత పంకకళంక
కలుషితాత్మకుఁడైన ఖలుఁడెవీఁడె.

... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ... ... ...

చదరు లుమిసెడికొఱివి దెయ్యంబువీఁడె.

సులక్షణసారంబునందు మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము. "శ్రీమాన్ కొడ్కొండభట్టరు వెంకటకొండయ్య వ్రాసుకొన్న సులక్షణసారము. ప్రభవనామసం॥ భాద్రపద శు 3 ఆదివారంరోజున వ్రాసుకొన్నపుస్తకం" అని తుదిపత్రమునఁగలదు.

43 ఆనందరంగరాట్ఛందము. 22

ఇందు 158 పత్రములుగలవు. వ్రాఁత తీరుబాగుగనేయున్నది. తప్పులంతగలేవు. పత్రములకొనలు కొంచెము విరిగినవి. ఉన్నంతదనుక గ్రంథపాతములులేవు. తొలుత 143 పత్రములు రంగరాట్ఛందమును, ఆవెనుక 15 పత్రములు భారతము ఆదిపర్వము ప్రథమాశ్వాసమును గలవు. వ్రాయసగానిపేరు గానరాదు.

కాఁగా నిందు రంగరాట్ఛందము నాలుగాశ్వాసములు సంపూర్ణముగనున్నవి. పీఠిక పద్యములులేవు.

గ్రంథారంభము:—

క. శ్రీరామారమణ పదాం
భోరుహ పూజావిశేష బుధసత్కవిమం
దారా విపక్షశైలశ
తారా యానందరంగధరణీరమణా.

గ్రంథాంతగద్యము:—

ఇతి శ్రీమదుమామాహేశ్వర కరుణాకటాక్షలబ్ధ సాహితీవిభవ ధర్మ వెచ్చకులజలధికుముదమిత్ర, వేంకటకృష్ణార్యపుత్ర, విద్వజ్జనమిత్ర, కుకవిజనతాలవిత్ర, ఆర్వేల కమ్మనియోగి కులీన లక్షణకవి కస్తూరి రంగయ ప్రణీతంబైనఆనంద రంగచ్ఛందంబను లక్షణచూడామణియందు సర్వంబును చతుర్థాశ్వాసము.

## 43 రంగరాట్ఛందము. 22

ఇందు 150 పత్రములుగలవు. వ్రాఁత చక్కనిది. తప్పులంతగ లేవు. గ్రంథపాతము లేదు. నాలుగాశ్వాసములు పూర్ణముగ నున్నవి. పీఠిక పద్యములు లేవు. "కాళయుక్తిసం॥ పుష్యబ॥ అష్టమిగురువారం వర్కు- అమిరెపు అప్పరాజుకుమారుడు అచ్చిరాజు ఈ ఆనందరంగఛందంబు వ్రాసుకొనెను." అని తుదిని వ్రాయఁబడినది.

## 44 రంగరాట్ఛందము. 553

ఇందు 51 పత్రములుకలవు. వ్రాఁత బాగుగనేయున్నది. తప్పులు లేకపోలేదు. తొలి మూఁడుపత్రములు సగము విరిగిపోయినవి. ద్వితీయాశ్వాసమునందలి 138 వ పద్యము మొదలుగ తృతీయాశ్వాసము తుదివఱకు నిందు వ్రాయఁబడినది. వ్రాయసగాని పేరు లేదు.

## 45 రంగరాట్ఛందము. 165

ఇందు 66 పత్రములు గలవు. వ్రాత చక్కఁగా నున్నది. తప్పు లంతగఁ గానరావు. తొలిపత్రము లేదు. మిగిలిన పత్రము లటనటఁ గ్రిమి దష్టములు. ప్రథమాశ్వాసమునందలి 13 వ పద్యము మొదలుగ చతుర్థాశ్వాసమున షట్ప్రత్యయాధికారాంతము వఱకుఁ గల భాగమిందుఁ గానవచ్చెడిని. వ్రాయసగాని పేరుగానరాదు.

## 46 రంగరాట్ఛందము. 349

ఇందు 35 పత్రములుగలవు. వ్రాఁతతీరు బాగుగలేదు. పత్రములు క్రిమిదష్టములు. తప్పులు మెండు. ప్రథమాశ్వాసాది నారంభించి ద్వితీయాశ్వాసము తుదివఱకు నిందుఁగలదు. ఆరంభమున—

క. శ్రీ వనితా తాండవలసి
తావాసవిలాస మందహాసవదనరా
జీవ తిరువెంకటేంద్రుని
శ్రీ విజయానందరంగనృపసారంగా

అను నీపద్యముగలదు. తుదిని "ఈపుస్తకం ఆత్కూరి శంకన్నాయడి ఆనందరంగచ్ఛందము. విరోధికృత్ నామసంవత్సర వైశాఖ బహుళ షష్ఠీబుధవారం శ్రవణనక్షత్రంనాడు యిరువై ఘడియలకు వ్రాసి ఆయెను" అనికలదు.

## 47. రంగరాట్ఛందము. 882

ఇందు 77 పత్రములు గలవు. వ్రాఁతతీరు బాగుగనే యున్నది. తప్పు లంతగ లేవు. నాలు గాశ్వాసములు సమగ్రముగా నున్నవి. కాని ఆశ్వాసము లంకములని పేర్కొనఁబడినవి. "వక్కలంక పరదేశం తెనుగు ఛందస్సు పుస్తకం" అని ముఖపత్రమునఁ గలదు.

## 48. రంగరాట్ఛందము. 3854

ఇందు 41 పత్రములు గలవు. వ్రాఁత యొకతీరుగ నున్నది. తప్పులు మెండు. వ్రాయసగానిపేరు గానరాదు. ఈప్రతిలోని విషయ

ముపై ప్రతులందువలెఁ గ్రమబద్ధము గాకున్నను యతిప్రకరణము మా
త్రమురంగరాట్ఛందములోనిదే. ఆభాగమే విపులముగ నున్నది. తొలుత
కవిజనాశ్రయమునందలి లక్షణము లొక కొన్ని గలవు.
ప్రారంభము.
క. శ్రీకాంతాతిప్రియవా
క్ఛ్రీకాంత జగత్త్రిమైక సేవితనుత వి
ద్యాకాంత దివ్యకాంత స
దేకాంత నింతాత కాంతి యీాపృత మాకున్.

గ్రంథము తుదిభాగము.

క. కొందఱికిఁ దెనుఁగు గుణమగుఁ
గొందఱికిన్ సంస్కృతంబు గుణమగు రెండున్
గొందఱికి గుణము నగు నే
నందఱ మెప్పింతుఁ గవిజనాశ్రయ కరుణన్.
తుదిని మూఁడు పత్రములలో చిల్లరపద్యములు గలవు.

## 49. అప్పకవీయము.

ఇందు 90 పత్రములు గలవు. వ్రాఁత చక్కనిది. తప్పులంతగ లేవు.
ప్రతి మిక్కిలి శిథిలమైనది. పత్రము లంతటను గ్రిమిదష్టము లైనవి
నాలుగాశ్వాసములు పూర్ణముగ నున్నవి. తుదిపత్రములలో ప్రస్తార
పటములు గలవు. వ్రాయసగానిపేరు గానరాదు.

గ్రంథారంభము.

శా. శ్రీయున్నూభమియు నాఁగఁ బ్రాచినిఁ బ్రతీచిన్ రుక్మిణీదేవి స
త్యాయోషామణియు న్మహోత్సుకతసేయ న్మంగల న్మోద్పుకే
ల్దోయిం దార్క్ష్యమరుత్సుతు ల్గొలువ శ్రీమం దేలు నప్పోలుమో
మై యాకామెపలి న్వసించు హరి నిత్యంబున్ మము న్బ్రోవుత౯.

ఈప్రతిని,అర్ధబిందువులుండఁదగిన తావులనెల్లెడల వేదమందువలె
ననునాసికోచ్చారణ సూచకమగు 'గ్ఁ' అననక్కరము వ్రాయఁబడినది.

## 50. అప్పకవీయము. 2866

ఇందు 11 పత్రములు గలవు. వ్రాత బాగుగలేదు. పత్రములు క్రిమిదష్టములు. ప్రథమాశ్వాసమునందలి 55 వ పద్యము మొదలుగ నాయాశ్వాసాంతభాగ మిందు వ్రాయఁబడినది. వ్రాయసగాని పేరు లేదు.

## 51. అప్పకవీయము. 523

ఇందు 80 పత్రములు గలవు. వ్రాఁత చక్కనిది. తప్పులు లేకపోలేదు. తొలుత 32 పత్రములు అప్పకవీయములోని ప్రథమాశ్వాసము సంపూర్ణముగనున్నది ఆవెనుక 24 పత్రములు సంధితత్సమ పరిచ్ఛేదములకు సంబంధించిన లక్షణములతోను లక్ష్యములతోడను గూడిన భాగము. ఈభాగము నేఁటికి ముద్రితమయిన అప్పకవీయప్రతులలో గానరానట్టిది. రచనాపద్ధతి యంతయు నప్పకవీయమునందలి తృతీయాశ్వాసభాగమును బోలియున్నది. అప్పకవి రచియించిన మిగిలిన గ్రంథభాగము కావచ్చునేమో? సమగ్రము మాత్రము గాదు.

మచ్చునకొకభాగము:—

క. చను ణత్వవిధాయక సూ
 త్రనిమిత్తాగత ణకారరాజి నకారం
 బునకుం బ్రాసముగా నిడఁ
 బ్రణతి యొనర్చెద మురారి పదముల కనఁగన్.

గీ. ఋత్వరషలమీఁది నత్వంబు ణత్వమౌ
 భిన్నపదముగాక యున్న నడుమ
 నట్టు కాబ్జ్వనుమ్ము లడరిన నగునది
 ప్రణతశరణ దనుజహరణయనఁగ.

పిమ్మట 22 పత్రములు ద్వితీయాశ్వాసమునందలి విషయము, రేఫఱకార సీసమాలికతో నారంభింపఁ బడినది. కాఁగా నీప్రతి యసమగ్రము.

శ్రీరస్తు.

# ఈశానసంహితా.

ఋషయః:—

కృతాని పాతకానీహ త్వయోక్తాని మహామతే
యై రచింత్యాశ్చ జాయన్తే క్రిమయః పక్షిణస్తథా. ౧
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రా వా యతినోఽపివా
మూర్ఖోవా పండితో వాపి శ్రీమాన్వా నిర్ధనోఽపి వా. ౨
విలోమజాశ్చ యేకేచి త్తథా చైవానులోమజాః
ఏవంవిధానాం పాపానాం రాశిం మేరూపమం క్షణాత్. ౩
కేనాగ్నినాచ దగ్ధ్వా తం శివలోకం వ్రజన్తి తే
తముపాయం హి నో బ్రూహి లోకానాం హితకామ్యయా. ౪

సూతః:—

వక్ష్యామ్యహం మునిశ్రేష్ఠా స్సర్వపాపప్రణాశనం
ఉపాయం సర్వమర్త్యానా మయత్నేన చ ముక్తిదం ౫
పురా కైలాసశిఖరే సాంబ స్సానుచర శ్శివః
బ్రహ్మాదిభి స్సురగణై స్సేవ్యమాన స్సదైవహి. ౬
ఏకదాతు మహాదేవీ శివ మక్షర మవ్యయం
ప్రణిపత్య త మీశాన మపృచ్ఛ ద్వృషభధ్వజం ౭

శ్రీదేవ్యువాచ:—

సంతి పాపాని దేవేశ బహూని వివిధానిచ
తాని పాపాని దగ్ధ్వాతు త్వత్సాయుజ్యం కథం వ్రజేత్. ౮
దేవదేవ మహాదేవ వద కారుణ్య మస్తిచేత్

సూతః:—

ఉక్తో దేవ్యా మహాదేవః పార్వతీ మభినంద్యచ
శివరాత్రివ్రతం తస్యై ప్రోక్తవాన్ శంకర స్స్వయమ్. ౯

షణ్ముఖాయ పురా ప్రోక్తం పార్వత్యా శివభాషితం
తదేవ కథయిష్యామి ద్వైపాయనముఖా చ్ఛ్రుతం ౧౦
శివరాత్రివ్రతం నామ సర్వపాపతృణానలం
ఆచండాలమనుష్యాణాం భుక్తిముక్తిప్రదాయకం ౧౧

ఋషయః :—

కదా ప్రసిద్ధ మభవ ద్వ్రత మేత న్మహామునే
వ్రతస్యైవచ మాహాత్మ్యం విధాన మఖిలం వద. ౧౨

సూతః :—

ఏవ మేత న్మయా పృష్టః పురా ద్వైపాయనో మునిః
కారణంచైవ మహాత్మ్యం విధానం ప్రోక్తవాన్ మమ ౧౩
శృణుధ్వం మునయ స్సర్వే వ్యాసోక్తం కథయామి వః
చతుర్యుగసహస్రంతు బ్రహ్మణో దివ ముచ్యతే ౧౪
తద్వ ద్యుగసహస్రంతు తథా రాత్రి రితి శ్రుతిః
వరాహరూప మాస్థాయ సశైలవనకాననాం ౧౫
ఉద్ధృత్య స్థాపయామాస యథాపూర్వం గదాధరః
తదాహ జగతాం కర్తా సర్వలోకపితామహః ౧౬
మయా సమధికో వాపి నాస్తి లోకే సురోత్తమః
ఏవం గర్వాన్వితో విష్ణు స్సుష్వాప క్షీరసాగరే ౧౭
నిశాసుప్తోత్థితో బ్రహ్మ సంసృజ్య సకలాః ప్రజాః
భూరాదిసప్తలోకాంశ్చ తథా పాతాళసప్తకం ౧౮
విస్మయే నాన్వితో బ్రహ్మ ఉవాచై వాత్మ నాత్మని
తదాహం జగతాం కర్తా మత్కర్తా స్తీతి నాపరః ౧౯
మయా సమధికో వాపి నాస్తి లోకే సురోత్తమః
ఏవం దృష్ట్వాతు లోకాంస్తు బ్రహ్మాహంకార మాగతః ౨౦
సముద్రాన్ సోత్రో ద్రష్టుం క్షీరోదధి ముపాగమత్
తత్రాపశ్య ద్ధరిం సుప్తం శేషపర్యంకశాయినం ౨౧

నారాయణ మనాద్యంతం యోగనిద్రాపరాయణం
ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే కస్త్వం కథయ మే స్ఫుటం ౨౨
తతః ప్రబోధితో విష్ణు రువాచ చతురాననం
తదాహం జగతాం కర్తా కో భవాన్ చతురానన ౨౩
కిమర్థ మిహ సంప్రాప్తః కస్త్వం కథయ మే స్ఫుటం
తచ్ఛ్రుత్వా మోహతామ్రాక్షో బ్రహ్మా ప్రాహ జనార్దనం ౨౪
మయి స్థితే జగన్నాథే భవాన్ లోకేశ్వరః కథమ్
మాం జిత్వా సమరే శీఘ్రం భవాన్ లోకేశ్వరో భవ ౨౫
బ్రహ్మణో వచనం శ్రుత్వా విష్ణుః కోపసమన్వితః
ఏహి యోధయ దుర్బుద్ధే శిర శ్ఛేద్యామి తే యుధి. ౨౬
ఇత్యుక్త్వా స హృషీకేశో యుద్ధోద్యోగం చకార చ
శార్ఙ్గధన్వా హృషీకేశో ధను రారోప్య వేగవాన్. ౨౭
జ్యాఘోషం తలఘోషంచ చకార మధుహా పునః
జ్యాఘోషతలఘోషాభ్యాం పూరయామాస రోదసీ. ౨౮
శర మారోప్య ధనుషి వికృష్య సశరం ధనుః
బ్రహ్మణే ప్రేరయామాస శరా నాశీవిషోపమాన్. ౨౯
శీఘ్రం చిచ్ఛేద బాణాం స్తాం స్తత్రవిష్ణో శ్చతుర్ముఖః
బ్రహ్మాచ శస్త్రవర్షాణి వవర్ష హరిమూర్ధని. ౩౦
తదస్త్రజాల మఖిలం విష్ణు శ్చిచ్ఛేద సంయుగే
బాణై రాశీవిషాకారై స్సమరే విధి మర్దయన్. ౩౧
హరిణా ప్రేరితాన్ బాణాన్ దృష్ట్వాపి చతురాననః
కుశాగ్రేణైవ చిచ్ఛేద హరిం సమరమూర్ధని. ౩౨
ముసలై రాయసై శ్శూలై శ్ఛాదయామాస సంగరే
తై రర్దితో హరిః క్రుద్ధో బ్రహ్మణో వధకాంక్షయా ౩౩
చక్రం ముమోచ వేగేన హతోఽసీ త్యవద ద్ధరిః
విష్ణునా ప్రేరితం చక్రం దృష్ట్వా తత్ర చతుర్ముఖః ౩౪

అస్త్రం బ్రహ్మశిరోనామ ప్రత్యస్త్ర మసృజ ద్విధిః
తదస్త్రతేజసా చక్రం భగ్నం దృష్ట్వా గదాధరః ౩౫
క్రోధేన మహతా యుక్తో హన్తుం బ్రహ్మాణ మాహవే
అస్త్రం పాశుపతం నామ సస్మార భయవిహ్వలః ౩౬
అస్త్రంపాశుపతం నామ విససర్జ విధి స్తదా
తదస్త్రయుద్ధ మభవ ద్దివ్యాబ్దానాం శతం పురా ౩౭
విష్ణునా ప్రేషితాస్త్రస్య జ్వాలాః పేతు స్సమన్తతః
తదస్త్రజ్వాలయా దగ్ధం త్రైలోక్య మఖిలం తదా. ౩౮
విష్ణునా ప్రేషితం చాస్త్రం బ్రహ్మాణం హన్తు మాగతః
బ్రహ్మణా ప్రేషితం చాస్త్రం విష్ణుం హన్తు ముపాగమత్. ౩౯
జ్వాలామాలాసమాకీర్ణౌ బ్రహ్మవిష్ణూ తదాస్థితౌ
హితాయ సర్వలోకానాం విధే ర్విష్ణోశ్చ యః పితా ౪౦
స శివ స్సర్వలోకానాం కృపాం చక్రే తయోరపి
తద్యుద్ధశమనార్థంతు తయో స్సంరక్షణాయచ ౪౧
మాఘకృష్ణచతుర్దశ్యాం తయో ర్మధ్యే మహానిశి
ఆత్మానం దర్శయామాస లింగరూపం తదాకిల ౪౨
అధోభాగ మహం యాస్యే త్వం చోర్ధ్వం చతురానన
స చోర్ధ్వం భగవాన్ బ్రహ్మ హంసరూపీ తదాకిల. ౪౩
వరాహరూప మాస్థాయ ద్రష్టుం హరి రధోయయౌ
బహువర్ష సహస్రాణి గత్వా దృష్ట్వా గతౌ పునః ౪౪
బ్రహ్మ స్థితో దక్షిణతో వామభాగే హరి స్స్థితః
స్వాత్మనోః కారణం మత్వా శివంతు ప్రీతిసంయుతౌ. ౪౫
కృతాంజలిపుటౌ భూత్వా శివం స్తోతుం సముద్యతౌ
తయో ర్బ్రహ్మ పురా విప్రాః స్తోతుం సముపచక్రమే. ౪౬

బ్రహ్మోవాచ:—

నమస్తే సర్వలోకానా మాదికర్త్రే మహాత్మనే
పురుషాయ పురాణాయ పరంజ్యోతిస్స్వరూపిణే. ౪౭

చక్రభ్రమణకర్తా త్వం సదా శంభో నమోఽస్తు తే
ప్రేరక స్సర్వజగతా మంతర్యామీ హృది స్థితః ౪౮
త్వన్మాయయాపహృతజ్ఞానో నజానే త్వాం మహేశ్వరం
మమ కర్తా త్వమేవాసి కర్తా విష్ణో స్త్వమేవచ. ౪౯
వాచా మగమ్యతాం యాతో విశ్వరూపోఽసి సర్వగః
అతః స్తోతుం న శక్నోమి యోఽసి సోఽసి నమోస్తు తే ౫౦
ఏవంస్తుత్వా పద్మయోని స్తూష్ణీమాస ద్విజోత్తమాః
తత శ్శివం ప్రభుం విష్ణుః స్తోతుం సముపచక్రమే. ౫౧

విష్ణురువాచ:—

సర్గస్థితివినాశానాం కర్తా త్వం సర్వదా శివ
త్వన్మాయామోహితో దేవ నజానే త్వాం మహేశ్వర. ౫౨
పశవో హి వయం సర్వే సదేవాసురమానవాః
పతి స్త్వమేవ సర్వేషాం పశూనాం పరమేశ్వర. ౫౩
హతాని విష్ణుబృందాని గీర్వాణా బ్రహ్మకోటయః
త్వమేకేన సదా శంభో పాహి మాం భక్తవత్సల. ౫౪
అసమర్థో యథా ద్రష్టుం లోకోహి రవిమండలం
తథైవ త్వామహం ద్రష్టు మసమర్థో మహేశ్వర. ౫౫
వికారషట్కరహితనిరుద్యోగీ బృహద్వపుః
చైత్యవర్జితవిద్రూప యోఽసిసోఽసి నమోఽస్తు తే. ౫౬

సూతః :—

ఏవంస్తుత స్తదా తాభ్యాం కృపయా పరమేశ్వరః
లింగమధ్యా ద్వినిష్క్రమ్య శంకర స్స్వాత్మనో వపుః. ౫౭
బభాషే భగవాన్ శంభుః మహాదేవో ఘృణానిధిః
తదా సందర్శయామాస వపుషా చాత్మన స్తయోః. ౫౮
ఆవిర్భూత మజం శంభుం బ్రహ్మ విష్ణుశ్చ సాంప్రతం
ననన్దతు స్తౌ తత్రస్థౌ దృష్ట్వా సాంబం సదాశివం. ౫౯

అర్ధనారీశ్వరం దేవం త్రిణేత్రం నీలలోహితం
వరదాభయహస్తంచ మృగటంకధరం ప్రభుం. ౬౦
సర్వాభరణసంయుక్తం చంద్రకోటిసమప్రభం
కోటిసూర్యప్రతీకాశం బాలచంద్రావతంసకం. ౬౧
దృష్ట్వావిస్మయ మాపన్నౌ భక్త్యా సంపూజ్య శంకరం
నీలరుద్రేణ రుద్రేణ త్వరితేన మహేశ్వరం. ౬౨
శిఖయా ధర్వశిరసా సూక్తై ర్బహువిధైరపి
స్తుత్వా బహువిధై స్స్తోత్రైః కృతాంజలిపుటౌ స్థితౌ. ౬౩
బ్రహ్మవిష్ణుశ్చ దేవేశం సర్వలోకమహేశ్వరం
హరికేశ స్తదా తాభ్యాం భక్త్యా పరమయా స్తుతః. ౬౪
ఉవాచ వచనం చారు పరిపూర్ణార్థ మీశ్వరః
శృణు పద్మజ మద్వాక్యం త్వం విష్ణో గరుడధ్వజ. ౬౫
అహమేవ జగత్కర్తా యువయోః కారణం త్వహం
మత్ప్రసాదా త్పదం లబ్ధం బ్రహ్మన్ విష్ణో త్వయానఘ. ౬౬
ఉభయో రస్త్రతేజోభి ర్దగ్ధం తద్యువయోః పదం
శివరాత్రివ్రతం నామ యువాభ్యాం సుకృతం త్విదం. ౬౭
తస్మాత్త్వితః పదం దాస్యే యువయో ర్లోకపూజితౌ

బ్రహ్మవిష్ణూ ఊచతుః :—

వ్రతస్యాస్య విశేషేణ తిథింబ్రూహిమహేశ్వర.౬౮
యస్మిన్కృత్వావ్రతం సమ్యక్ త్వత్సాయుజ్య మవాప్నుయాం

ఈశ్వరః :—

యువయో ర్దైక్యశాంత్యర్థం శస్త్రాగ్నిశమనాయచ. ౬౯
మాఘకృష్ణచతుర్దశ్యాం మహాదేవో మహానిశి
అభవ ల్లింగరూపేణ భక్తానా మనుకంపయా. ౭౦
లింగమధ్యే సమభవ మర్ధనారీశ్వరోఽప్యహం
తత్కాలవ్యాపినీగ్రాహ్యా శివరాత్రివ్రతే తిథిః. ౭౧

తత్రకృత్వా మహాపుణ్యం భవిష్యతి నసంశయః
ఉదయాద్దిః క్వచి ద్గ్రాహ్యా క్వచి దస్తమయాన్వితా. ౭౨
వ్రతిభి స్తిథయో యత్నా ద్వర్జయిత్వా వ్రతం త్విదం
అర్ధరాత్రా దథ శ్చేర్ధ్వం నాస్తి యత్ర చతుర్దశీ. ౭౩
నైవ తత్ర వ్రతం కుర్యా దాయురైశ్వర్యహాన్యథ
వ్యాప్యార్ధరాత్రం యస్యాం హి లభ్యతే యా చతుర్దశీ. ౭౪
తస్యా మేవ వ్రతం కార్యం మత్ప్రసాదార్థిభి ర్నరైః
పూర్వేద్యురపరేద్యుర్వా మహానిశి చతుర్దశీ. ౭౫
వ్యాప్తా సా దృశ్యతే యస్యాం తస్యాం కుర్యాద్వ్రతం త్విదం
లింగావిర్భావకాలేతు వ్యాప్తా గ్రాహ్యా చతుర్దశీ ౭౬
తదూర్ధ్వాధోన్వితా వాపి సా గ్రాహ్యా వ్రతిభి స్సదా
శివరాత్రివ్రతం కార్యం భూతాన్వితమహానిశి ౭౭
అస్మి న్నేత ద్వ్రతం కృత్వా మమ సాయుజ్య మాప్నుయాత్

బ్రహ్మవిష్ణూ :—

వ్రతస్యాస్య మహాదేవ విధానం సకలం వద ౭౮
తత్ర పూజావిధిం ద్రవ్యం విస్తరేణ మహేశ్వర

ఈశ్వరః :—

శృణు బ్రహ్మన్ వ్రతవిధిం శృణు విష్ణో గదాధర ౭౯
మమ ప్రియకరీ హ్యేషా మాఘకృష్ణచతుర్దశీ
మహానిశ్యన్వితా యత్ర తత్ర కుర్యా ద్వ్రతం త్విదం ౮౦
పూర్వేద్యు రేకదా శ్నీయా ద్దంతధావనపూర్వకం
అద్రోహేణాన్వితః కుర్యా ద్బ్రహ్మచర్యవ్రతం వ్రతీ. ౮౧
బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ కృతశౌచవిధిక్రమః
అభివాద్య గురుం భక్త్యా తదనుజ్ఞా మవాప్య చ ౮౨
శివస్య సన్నిధిం గత్వా ప్రణమ్య వృషకేతనం
శివరాత్రివ్రతం దేవ కరిష్యే తవ సన్నిధౌ ౮౩

నిర్విఘ్నం కురు దేవేశ భక్తిగ్రాహ్య మహేశ్వర
ఏవం సంకల్ప్య విధివ చ్ఛాంతో భూతహితే రతః ౧౪
పూజోపకరణంద్రవ్యం సర్వం సంపాదయే త్తథా.
మధ్యాహ్నకాలే సంప్రాప్తే నదీం గత్వా సముద్రగాం ౧౫
సరిత్కుల్యాదికం గత్వా స్నాయా దేవం విధానతః
నిత్యం దేవార్చనం కుర్యా ద్గృహ మాగత్య భక్తితః ౧౬
శివస్య యజనస్థాన మలంకృత్య సమాహితః
సమ్మార్జనానులేపాద్యై శ్శోధయే త్కుడ్యమేవచ ౧౭
వితానధ్వజమాల్యైశ్చ ఫలపక్వాన్నలంబితైః
అలంకుర్యా చ్చతుర్దిక్షు వస్త్రకాంస్యాదితోరణైః ౧౮
పూజోపకరణం ద్రవ్య మాదాయ సుసమాహితః
పూజాగృహం ప్రవిశ్యాథ ప్రణమ్య శివ మీశ్వరం ౧౯
ఉపవిశ్యాసనే శుద్ధే ప్రాణా నాయమ్య వాగ్యతః
వామహస్తే వినిక్షిప్య భసితం సిత ముత్తమమ్ ౨౦
శివం దేవంచ సంస్మృత్య విమృజ్యాంగాని సంస్పృశేత్
పున ర్భస్మ సమాదాయ వామహస్తే వినిక్షిపేత్ ౨౧
త్రియంబకేన చామంత్ర్య తత స్సమ్మృజ్య వారిణా
త్రిపుండ్రం ధారయే త్తేన లలాటాది ష్వనుక్రమాత్ ౨౨
రుద్రాక్షాన్ ధారయేత్పశ్చాత్ వ్రతీ నియమ మాశ్రితః
మద్భక్తాంశ్చ సమాహూయ దద్యా త్పూజనసాధనం ౨౩
భక్తై స్సంభూయ దేవేశం పూజయేచ్చ సమాహితః
స్వగురూక్తేన మార్గేణ యజే ద్దేవం ప్రయత్నతః ౨౪
ఆసనం పాద్య మర్ఘ్యంచ మధుపర్కాదికం తతః
దత్వాథ స్నాపయే ద్దేవం బ్రాహ్మ్యై (?) స్నానేన భక్తితః ౨౫
పంచామృతేన సంస్నాప్య స్నాపయేచ్చ ఫలోదకైః
పుష్పోదకై ర్గంధతోయై స్స్నాపయే త్కుంకుమాదిభిః ౨౬

రత్నోదకైశ్చ దేవేశం తథా కర్పూరవారిభిః
లేపయే ద్యవచూర్ణైశ్చ ఘర్షయే ద్బిల్వపత్రకైః　　౯౭

పుష్పోదకేన సంస్నాప్య స్నాపయే చ్ఛీతలాంబుభిః
వస్త్రం దద్యాచ్చ దేవాయ సోపవీతంచ భక్తితః　　౯౮
దద్యాదాచమనం భక్త్యా పాద్య మర్ఘ్యాదికం తతః
కర్పూరకుంకుమోపేతం గంధం దద్యా చ్ఛివాయచ　　౯౯
భూషణై ర్భూషయే ద్దేవం హేమరత్నాదినిర్మితం
అఖండై ర్బిల్వపత్రైశ్చ మరుకోమలపత్రకైః　　౧౦౦
పుష్పై స్సంపూజయే ద్దేవం కమలోత్పలపూర్వకైః
మల్లికామాలతీభిశ్చ చంపకై శ్శతపత్రకైః
కుందపున్నాగవకుళశిరీషాశోకకింశుకైః　　౧౦౧
అర్కద్రోణై రపామార్గైః శమీబృహతిపూర్వకైః
అన్యై ర్నానావిధైః పుష్పైఃపూజయే దంబికాపతిం　　౧౦౨
ఘృతాక్తం గుగ్గులుం దద్యా ద్దీప మాజ్యేనయోజితం
గోధూమపిష్టరచితం పరమాన్నాదిసంయుతం　　౧౦౩
లేహ్యచోష్యాదిసంయుక్త మాజ్యే నాన్విత మాదరాత్
నానావిధఫలోపేతం దద్యా న్నైవేద్య ముత్తమం　　౧౦౪
సకర్పూరంచ కస్తూరీయుక్తం తాంబూలమేవచ
దద్యా న్నీరాజనం దీపై ర్భక్త్యా కర్పూరదీపకైః.　　౧౦౫
చామరం వ్యజనం దత్వా దర్పణంచాపి దర్శయేత్.
తతో వాదిత్ర సోట్టేశ్చ (?) గీతస్తోత్రాదిపాఠకైః　　౧౦౬
పురాణవచనైశ్చైవ కుర్యా జ్జాగరణం వ్రతీ
ఏవం ద్వితీయయామేఽపి పూజయే దంబికాపతిం.　　౧౦౭
ఏవమేవ యజే ద్దేవ ముపచారై ర్వ్రతీ నిశి.
జాగరం చోపవాసంచ తస్మిన్ కుర్యా ద్వ్రతీ పుమాన్　　౧౦౮
ఏవమేవ తదా రాత్రిం పూజా జాగరణం నయేత్.
పూజాంతేనజపేత్ స్తోత్ర మభిత శ్చాంజలిం క్షిపేత్.　　౧౦౯

ఋషయః :—

కిం తత్ స్తోత్రం మహాభాగ కాని నామాని సువ్రత
తత్సర్వం కథయాస్మాకం లోకానాం హితకామ్యయా ౧౧౦

సూతః :—

శృణ్వంతు ఋషయ స్సర్వే వ్యాసేనోక్తం వదామ్యహం
యస్యహై పాఠమాత్రేణ వ్రతస్యైవ ఫలం లభేత్. ౧౧౧
నమ స్సకలకల్యాణదాయినే శూలపాణయే
విషయార్ణవమగ్నానాం సముద్ధరణసేతవే ౧౧౨
అఘ్నిహాస్నేహరూపాయ వార్తాతిక్రాంతివర్తినే
స్వభావోదారధీరాయ చిద్రూపాయ నమోనమః ౧౧౩
యత్ర సర్వం యత స్సర్వం సర్వం యత్ర స సర్వతః
లోకకల్లోలసలిలం దేవం శంభుం మహోదధిం ౧౧౪
దిశి రక్షణ మారుహ్య ధీసద్మాని వికాసయన్
ఉదితో భాతి యోఽభ్యంత స్తం దేవం శంభుభాస్కరం ౧౧౫
హృదయాకాశసంక్రాంత మహామోహాభ్రమాలికం
బాధయే ద్యస్తు తరసా వందే శంభుం మహానిలం ౧౧౬
వామదక్షిణపార్శ్వేతు సాజాతాది విమర్దికా
యస్య దేవస్య తం వందే సర్వకారణకారణం ౧౧౭
భవామయపరిక్రాంతమర్త్యానాం స్మృతిమాత్రతః
భవం హరతి యో నిత్యం వందే భవభిషక్తకం (?) ౧౧౮
యస్మిన్ సూర్యో నభాతీశే చంద్రమా నానిలోఽపివా
యస్య భాసా విభాతీదం తం వందే శివ మవ్యయం ౧౧౯
ఆత్మారామం మహాత్మానం సర్వభూతహృదిస్థితం
చేతస్యేవం శివం దేవం మహాదేవం నమామ్యహం ౧౨౦
ఏకోఽపి బహుధా భాతి ప్రతిదేహసముద్రకే
హృది స్థితోఽపి యో దూర స్తం నమస్యే సదాశివం ౧౨౧

బ్రహ్మావిష్ణ్వాదిదేవేషు నృపక్షిమృగయోనిషు
యత్పాదపద్మనమ్రాణా మల్పం విష్ణ్వాదికంపదం ౧౨౨
త్రసరేణూపమం ప్రాహు స్తం వందే శివ మవ్యయం
స్రష్టా త్వమేవ లోకానాం పాలకో జగతామపి ౧౨౩
ఆత్మకోఽసి త్వమే వేశ నమామి త్వాం మహేశ్వర
అపరాధసహస్రాణి క్రియ న్తేఽహర్నిశం మయా ౧౨౪
పాహి మా మపరాధేభ్యః పితా పుత్రమివ ప్రియం
ఏతత్స్తోత్రం పఠే ద్యస్తు భక్త్యా యస్తు శృణోతివా ౧౨౫
శివరాత్రివ్రతఫలం తయో ర్దాస్యతి శంకరః
కథయామి మునిశ్రేష్ఠా శ్శివనామాని భక్తితః ౧౨౬
వ్రతస్య పరిపూర్ణార్థం శివప్రియకరాణిచ
శివో రుద్రః పశుపతిః నీలకంఠో మహేశ్వరః ౧౨౭
హరికేశో విరూపాక్షః పినాకీ త్రిపురాంతకః
శంభు శ్శూలీ మహాదేవః నామా న్యేతా న్యనుక్రమాత్ ౧౨౮
చతుర్థ్యంతం సముచ్చార్య దద్యా త్పుష్పాంజలిం వ్రతీ
ఏవమేవ సముచ్చార్య యామే యామే గతే నిశి
స్తోత్రై స్తుత్వాంజలిం దత్వా నమస్కుర్యాచ్చ నామభిః ౧౨౯
సుకృతాం శివపూజాంచ శివాయ వినివేదయేత్
ప్రభాతే సమనుప్రాప్తే శివపూజాం సమాప్య చ ౧౩౦
ప్రాతఃపూజాం విధాయైవం శివాయ వినివేదయేత్
యద్వ్రితం మంత్రహీనంచ యచ్చభక్త్యా వినా కృతం ౧౩౧
యచ్చ దక్షిణయా హీనం పూర్ణం కురు మహేశ్వర
ఏవమేవ వ్రతం కుర్యా త్ప్రితి సంవత్సరం వ్రతీ ౧౩౨
సర్వాన్కామా నవాప్నోతి ప్రీత్యా దేవేషు మానవః

---

ఓమిత్యాదిమహాపురాణే శ్రీస్కాందే ఈశానసంహితాయాం
శివరాత్రి ప్రాదుర్భావ తద్వ్రితపూజావిధానం
నామ సప్తతితమోఽధ్యాయః ౧౩౪

శరచ్చంద్రప్రకాశేన వపుషా శీతలద్యుతిం
వందే సింహాసనాసీన ముమయా సహితం శివం ౧౩౫

ఋషయః:—

ఏవ ముక్తప్రకారేణ శివరాత్రివ్రతం త్విదం ౧౩౬
కృత్వా యత్ఫల మాప్నోతి తన్నో వద మహామతే.

సూతః:— ౧౩౭

ఏవం కృత్వా మునిశ్రేష్ఠాశ్శివరాత్రివ్రతం త్విదం
విధినానేన సహితం యత్ఫలం సమవాప్యతే ౧౩౮
రాజసూయాయుతం కృత్వా యత్ఫలం లభతే నరః
శివరాత్రివ్రతం కృత్వా తత్ఫలం సమవాప్నుయాత్ ౧౩౯
కపిలాదానకోటీనాం కర్తా య ల్లభతే ఫలం
శివరాత్రివ్రతం కృత్వా తత్ఫలం లభతే నరః ౧౪౦
సప్తసాగరపర్యంతాం మహీం దృష్ట్వాతు యత్ఫలం
బ్రహ్మహత్యాయుతం కృత్వా స్త్రీయానా మయుతం తథా
శివరాత్రివ్రతం కృత్వా సద్యో ముచ్యేత బంధనాత్ ౧౪౧
సురాపానసహస్రాణి భ్రూణహత్యాయుతానిచ
వీరహత్యాసహస్రాణి నశ్యంతి వ్రతదర్శనాత్ ౧౪౨
గవాం హత్వా సహస్రాణి చండాలగమనాయుతం
శివరాత్రివ్రతం కృత్వా తాని నశ్యంతి తత్క్షణాత్ ౧౪౩
శ్రూయతే హి పురా కశ్చిత్ బ్రాహ్మణః పాపకృత్తమః
మహాపాతకలక్షైశ్చ ఉపపాతకకోటిభిః ౧౪౪
శివరాత్రివ్రతం దృష్ట్వా ముక్త శ్శివపురం యయౌ

ఋషయః:— ౧౪౫

శివరాత్రివ్రతం దృష్ట్వా కథం పాతకకోటిభిః
ముక్త శ్శివపురం ప్రాప్త స్తన్నో విస్తరతో వద ౧౪౬

సూతః:—

అస్త్యస్మిన్ వసుధాపీఠే దేశో విపులకోటిశః ౧౪౭

వింధ్యా దుత్తరదిగ్భాగే నానాజనపదావృతే
ఇరావతీ నామ నదీ శతద్రూశ్చ విపాట్తథా ౧౪౮
సింధు రిత్యపి విఖ్యాతా వితస్తా చేతి నామతః
వహంతి సరితోఽయత్ర నానాశ్చర్యమనోహరాః ౧౪౯
తాసాం సింధునదీతటే నగరం కుబ్జకాభిధం
తస్మి న్నివసతి శ్రీమాన్ రాజా పరపురంజయః ౧౫౦
కల్పద్రుమసమోఽర్థినాం స్త్రీణాం కామ ఇ వాపరః
వ్యవహారవిచారార్థం సర్వశాస్త్రవిశారదం ౧౫౧
స్థాపయామాస భూపాలో బ్రాహ్మణం నయకోవిదం
సుకుమార ఇతి ఖ్యాతో బ్రాహ్మణ స్యాభవ త్సుతః ౧౫౨
సతు కామకళాశాస్త్రం సర్వ మభ్యస్య రాగవాన్
షిడ్గో భూత్వాతు తత్రైవ నాగరాణాం ప్రియో వసన్ ౧౫౩
సర్వా నార్య స్త మాహూయ తేనైవసహ రేమిరే
బ్రాహ్మణక్షత్రవైశ్యానాం శూద్రాదీనాం స్త్రియ స్తథా ౧౫౪
సర్వాన్ త్యజన్తి భార్యాశ్చ భర్తౄను త్సృజ్య రేమిరే
తతోఽథ నాగరా స్సర్వే స్వభార్యా వినివారణే ౧౫౫
అశక్తా స్సర్వ ఏవాథ రాజపార్శ్వ ముపాగమన్

నాగరాః :—

ఆకర్ణయ మహీపాల వృత్తాంత మయశస్కరం ౧౫౬
ధర్మస్య యశసశ్చైవ కశ్చి చ్ఛత్రురిహాస్తినః
కామశాస్త్రకళాభిజ్ఞ ష్షిడ్గః కశ్చిన్మహీపతే ౧౫౭
జారో భూత్వాతు న స్త్రీణాం ధర్మస్యయశసోఽన్తకః
చతుర్ణాం బ్రాహ్మణాదీనాం సంకరాణాం తథైవచ ౧౫౮
సర్వాసా మంత్యనారీణాం షిడ్గో భర్తృత్వ మాగతః
న సమర్థా వయం సర్వే నారీణాం శిక్షణే నృప ౧౫౯
న భర్తౄన్ ప్రతిగచ్ఛన్తి తస్మిన్ సతి దురాత్మని

అన్యాయసదృశం దండం తస్య శీఘ్రం నిపాతయ ౧౬౦
నోచే దపయశో యుక్తో నరకం చైవ గచ్ఛతి. (?)

సూతః :—

ఏత చ్ఛ్రుత్వా మహీపాల స్తమాహూయాథ సత్వరం ౧౬౧
వాగ్దండై ర్దండయిత్వా తం స్వదేశా న్నిరవాసయత్
రాజ్ఞావమానితః పాపీ కంచి ద్దేశ మథాగమత్ ౧౬౨
తస్మా ద్దేశా దథాక్రమ్య హూణమండల మావిశత్
స కదాచి ద్వనోద్దేశే సరసం దృష్టవా న్నరః ౧౬౩
హంసకారండవాకీర్ణం చక్రవాకోపశోభితం
కమలోత్పల కల్హారైః పుష్పై రన్యై స్సమావృతం ౧౬౪
తస్మి న్నథజలక్రీడాం కర్తు మాగత్య సంస్థితః
తస్మిన్నేవ తదాకాలే స్నానార్థం కాచి దంగనా ౧౬౫
చంద్రబింబాభవదనా బింబోష్ఠీచ కృశోదరీ
రూపయావనసంపన్నా చండాలీ చ రజస్వలా ౧౬౬
స్నానార్థ మాగతం షిద్గం రూపయావనసంయుతం
నారీచిత్తప్రమథనే దక్షం కామ మివాపరం ౧౬౭
తం దృష్ట్వా కామసంతుష్టా తస్య పార్శ్వ ముపాగతా
తాం దృష్ట్వా రూపసంపన్నాం కామస్య దయితామివ ౧౬౮
కామసంతప్తహృదయః గృహీత్వా తాం రహో యయౌ
తదా సురతసంయోగం యథేష్టం కృతవాం స్తదా ౧౬౯
సా తేన సురతం కృత్వా మనసా తోష మాగతా
ప్రణయేనాపి తం షిద్గం యావద్దేహ మిదం మమ ౧౭౦
తవ భార్యా భవిష్యామి మామేవ భజ సుందర
ఏవము క్త స్తయా సోఽథ తథా చక్రే హి పాపకృత్ ౧౭౧
తతః ప్రభృతి షిగ్గోఽసౌ చండాల్యా సహ సంగతః
నానావిధాని మాంసాని బుభుజే చ తయా సహ ౧౭౨

మృగా న్నానావిధాన్ హత్వా పక్షిణోఽథ జలేచరాన్
గవాంశతసహస్రాణాం కపిలానాం సహస్రకం ౧౭౩
తేషాంమాంసాని పాపాత్మా బుభుజే చ తయా సహ
అశ్వమాంసాదికం సర్వం బుభుజే కామమోహితః ౧౭౪
వనోద్దేశేషు మార్గేషు హత్వా విప్రాన్ సహస్రశః
తేషాం విత్తం సమాదాయ బుభుజేచ తయా సహ ౧౭౫
ఏవంవిధా న్యనేకాని కుర్వన్ పాపాని భూరిశః
బుభుజే విషయాన్సర్వాన్ చండాల్యా సహ పాపకృత్ ౧౭౬
ఏవం స ప్తతివర్షాణి చండాల్యాసహ సంయుతః
తయాసహైవ పాపాని కృతవాన్ బహుశః పురా ౧౭౭
పుత్రా నుత్పాదయామాస పంచపాతకసన్నిభాన్
యాని యానిహ పాపాని శాస్త్రేషూక్తాని సూరిభిః ౧౭౮
తాని సర్వాణి కృతవాన్ చండాల్యాసహ పాపకృత్
సాతు కాలేన చండాలీ తత్రపాప సహాపర(?) ౧౭౯
ద్వే కన్యే రూపవత్యౌచ చండాలీ సుషువే పురా
రేమే తాభ్యాం స పాపాత్మా కామభోగా ననేకశః ౧౮౦
తత్రా ప్యుత్పాదయామాస పాపీ పుత్రద్వయం తథా
రాజ్ఞ స్సకాశా దాదాయ విప్రా బహువిధం ధనం ౧౮౧
స్వదేశం ప్రస్థితా గంతుం శతం బ్రాహ్మణపుంగవాః
తాన్ విదిత్వాతు పాపాత్మా పుత్రై రన్యైశ్చ సంయుతః ౧౮౨
మార్గ మారుధ్య తాన్ హత్వా తద్విత్తం హృతవాన్ బహు
చోరైశ్చని హతాన్ విప్రాన్ శ్రుత్వా తద్దేశభూపతిః ౧౮౩
వధార్థం ప్రేషయామాస చోరాణాం స్వబలం మహత్
జ్ఞాత్వా సపాపీ వృత్తాంతం సర్వాన్ బంధూన్ విసృజ్యచ ౧౮౪
సకార్యం (?) గతవాన్ శీఘ్రం సుతా మాదాయ పాపకృత్
కిరాతదేశం సంప్రాప్య స తత్ర విచచారహ ౧౮౫

వణీకృదమితి ఖ్యాతం పట్టణం సుశ్రుతం భువి
తత్రత్యాశ్చ నరా స్సర్వే సంపన్నా ధనదోపమాః ౧౮౬
పట్టణ స్యాతిదూరేతు లింగం గవ్యూతిమాత్రతః
నాగేశ్వర మితి ఖ్యాత మస్తి త్రైలోక్యపూజితం ౧౮౭
మాఘకృష్ణచతుర్దశ్యాం సర్వే పట్టణవాసినః
రాత్రౌ జాగరణం కర్తుం భార్యాపుత్త్రాదిసంయుతాః ౧౮౮
అలంకృతాశ్చ తే సర్వే నాగేశ్వర ముపాగతాః
సర్వే సంపూజ్య తం లింగం జాగరం తత్ర చక్రిరే ౧౮౯
ఖాదిత్వా బహువిధం మాంసం సురాపానం ముహు ర్ముహుః
సురతేన సుతాం రంతుం పుష్పా ణ్యాహర్తు మాగతః ౧౯౦
గీతవాదిత్రఘోషేణ రాత్రౌ జాగరణం తథా
వ్రతిభిః క్రియమాణంతు తన్మహానిశి దృష్టవాన్ ౧౯౧
దూరా ద్దేశాత్ స్థిత స్సర్వం మహానిశి కృతార్చనం
దృష్ట్వా భిసంధ్య దేవేశం గతవాన్ శ్వపచాలయం ౧౮౨
ఏవం హి వసత స్తస్య చాయుః క్షీణ మభూ త్తదా
తథాపి మృత్యునా సర్వే యమదూతా యమాజ్ఞయా ౧౯౩
పాశముద్గరసన్నద్ధాః ఖడ్గతోమరపాణయః
శీఘ్రం పాశేన తం పాపం గృహీత్వా గంతు ముద్యతాః ౧౯౪
ఏతస్మిన్నేవ కాలేతు శివదూతా శ్శివాజ్ఞయా
తం నేతు మాగతా శ్శీఘ్రం శతశో౽థ సహస్రశః ౧౯౫
శుద్ధస్ఫటికసంకాశాః సునేత్రా స్సుశిఖ్పినః
చతుర్భుజా మహాకాయా శూలముద్గరధారిణః ౧౯౬
కేచి దంకుశహస్తాశ్చ గదాహస్తా స్తథా పరే
ధనుర్ధరా స్తథా చాన్యే శక్తిహస్తా స్తథాపరే ౧౯౭
భిండివాలై స్తథా చాన్యే కేచి త్పరిఘపాణయః
వ్యాఘ్రచర్మపరీధానా నాగాభరణభూషితాః ౧౯౮

భస్మోద్ధూళితసర్వాంగా స్త్రిపుండ్రాంకితమస్తకాః
తే సమేత్య తదా సర్వే దదృశు ర్యమకింకరాన్		౧౯౯
బద్ధ్వా పాశేన తం పాపం గ్రహీతుం గంతు ముద్యతాన్

శివదూతాః :—

యస్య ప్రసాదలేశేన బ్రహ్మా। బ్రహ్మత్వ మాగతః		౨౦౦
విష్ణు ర్విష్ణుత్వ మాపన్న స్తస్య దూతా వయం భటాః

యమకింకరాః :—

శివదూతా భవంతో హి కిమర్థ మిహ చాగతాః		౨౦౧
యే యజంతి మహాదేవ మనన్యమనసోఽమలాః
తేషా మానయనార్థాయ భవదాగమనం యతః		౨౦౨
అయం త్వతీవ పాపిష్ఠ స్సర్వలోకవిగర్హితః
అనేన యాతనాః కష్టా భోక్తవ్యా బహుకాలికాః		౨౦౩
యస్యాజ్ఞయా వయం ప్రాప్తా కర్తుం శాసన మస్యతు
వయమేవ న ముంచామో భవంతో గంతు మర్హథ		౨౦౪

సూతః :—

ఏతచ్ఛ్రుత్వాతివేగేన శివదూతా మహాబలాః
ఊచుః క్రోధాన్వితా స్సర్వే కల్పాన్తానిలసన్నిభాః		౨౦౫

శివదూతాః :—

హరికేశాజ్ఞయా ప్రాప్తా నేతు మేన మకల్మషం
ముంచ త్వైనం మహాభాగం యది జీవితు మిచ్ఛథ		౨౦౬

సూతః :—

గణేశ్వరవచ శ్శ్రుత్వా భటా దర్పసమన్వితాః.
అత్ర గ్రంథపాతః.

ఏవం విధోఽపి పాపాత్మా గత శ్శివపురం కథం
స్వబలంచ హతం దృష్ట్వా పాపిష్ఠ స్యోత్తమాం గతిం ౧
భీతాత్మా విస్మయావిష్టో లోకనాథం దిదృక్షయా
చిత్రగుప్తాదిభి స్సార్థం శివలోకం యయౌ యమః ౨
త్రయోవింశతిసంఖ్యాకాన్ స్వర్గలోకా నతీత్యచ
మునిమండల మాక్రమ్య మహర్లోక మతీత్యచ ౩
సత్యలోకం దదర్శాథ బ్రహ్మైశ్వర్యమనోహరమ్
తస్మా దూర్ధ్వ మథాక్రమ్య విష్ణులోకం దదర్శహ ౪
బ్రహ్మైశ్వర్యసమాయుక్తం పశ్య న్నూర్ధ్వం యయౌ యమః
శివలోకం దదర్శాథ సర్వలోకోత్తమోత్తమం ౫
ద్వాత్రింశత్కోటిసంస్థానం యోజనై రతివిస్తరం
జాంబూనదవిమానైశ్చ సౌవర్ణై రప్యలంకృతం ౬
మణిరత్నమయై ర్యానై ర్వజ్రై ర్వైడూర్యనిర్మితైః
కల్పవృక్షాసనై ర్యుక్తై రపరాజనసంయుతైః ౭
బహ్వైశ్వర్యగణై ర్యుక్తం శివలోక మనుత్తమం
ప్రవిశ్యచ దదర్శాథ శివస్య మహతీం సభాం ౮
కోటియోజనవిస్తీర్ణాం చతుర్ద్వారసమన్వితాం
చతుస్తోరణసంయుక్తాం హేమరత్నోపశోభితాం ౯
దివ్యరత్నవితానాఢ్యాం దివ్యచ్ఛత్రోపశోభితాం
హేమరత్నమయై స్తంభైః స్ఫటికై రుపశోభితాం ౧౦
అనంతాశ్చర్యసంయుక్తాం ప్రవివేశ తతో యమః
దదర్శ నందినం తత్ర పూర్వద్వారస్థితం ప్రభుం ౧౧
భస్మోద్ధూళితసర్వాంగం త్రిపుండ్రాంకితమస్తకం
సుయశోదయితం శాంతం శూలవేత్రధరం ప్రభుం ౧౨
తస్మై ప్రణామం కృత్వాతు ధర్మః కార్యం వ్యజిజ్ఞపత్
ద్రష్టు మభ్యాగతో దేవం సర్వలోకమహేశ్వరం ౧౩

తవ ప్రసాదా త్ప్రక్ష్యామి భృత్యభూతోఽప్యహం తవ
ధర్మేణ భాషితం శ్రుత్వా గత్వాచైవ శివాంతికం ౧౪
కృత్వా ప్రణామం దేవస్య కృతాంజలి రువాచహ
ప్రసీద మే జగన్నాథ యమ స్త్వాం ద్రష్టు మాగతః ౧౫
చిత్రగుప్తాదిభి స్సార్థం కి మాగచ్ఛతు గచ్ఛతు
శివ స్త్వింగిత మాజ్ఞాయ నందీశ్వర ఉపాగమత్ ౧౬
యమం ప్రావేశయామాస చిత్రగుప్తాదిభిస్సహ
దేవస్య పూర్వదిగ్భాగే దివ్యమానవపుర్ధరాన్ ౧౭
గణేశ్వరాన్ దదర్శాథ ధర్మరాజో మహాయశాః
తత్ర పాశుపతాశ్చైవ శైవాః కేచి త్తథాపరే ౧౮
కాలాముఖా స్తథా చాన్యే కేచి న్మాహేశ్వరా జనాః
దివ్యాభరణసంయుక్తా దివ్యస్రగనులేపనాః ౧౯
చతుర్భుజా స్త్రినేత్రాశ్చ శైవసిద్ధాంతకోవిదాః
శుద్ధస్ఫటికసంకాశజటాచంద్రార్ధధారిణః ౨౦
అనేకకోటిసంఖ్యాతా శ్శివతుల్యపరాక్రమాః
బ్రహ్మాండమాలాభరణాన్ మహాదేవపరాయణాన్ ౨౧
యమో దృష్ట్వాతిహృష్టాత్మా తదా విస్మయ మాగతః
దేవస్య దక్షిణే పార్శ్వే యే స్థితా స్తా న్దదర్శహ ౨౨
చరాచర మిదం సర్వం జగజ్జాలం యదిచ్ఛయా
చతుర్వేదా ముఖం యస్య స దేవః కమలాసనః ౨౩
అష్టాదశప్రభేదేన లోకం వ్యాప్య తు యా స్థితా
సరస్వత్యా తయా సార్థం బ్రహ్మా దక్షిణ మాస్థితః ౨౪
అంగిరో వామదేవశ్చ వసిష్ఠాద్యా మునీశ్వరాః
కపిలాద్యా మహాసిద్ధా స్సనకాద్యాశ్చ యోగినః ౨౫
ఏతే చాన్యేచ బహవ శ్శివదక్షిణత స్స్థితాః
యమ స్తా నఖిలాన్ దృష్ట్వా పశ్చిమాం దిశ మాగతః ౨౬

తత్ర స్థితాన్ మహాకాయాన్ శివతుల్యపరాక్రమాన్
భూతేశాన్ ప్రమథాధీశాన్ బలప్రమథనాదికాన్ ౨౭
బ్రాహ్మ్యాదిమాతర స్సర్వాః కుమారస్యాపి మాతరః
సుమాలీ మాలతీముఖ్యాః పార్వత్యా మాతర స్స్థితాః ౨౮
కరాళీ వికరాళీ చ బలప్రమథనీ తథా
కాళరాత్రీ ప్రచండాఖ్యా మాతర స్తత్ర సంస్థితాః ౨౯
ప్రచండ శ్చండకోపశ్చ కాలభైరవసంజ్ఞికాః
చండోదరప్రచండోఽర్చి రస్త్రం పాశుపతం తథా ౩౦
ఏతే చాన్యేచ బహవ స్సిద్ధా స్సంహారకర్మణి
తాన్ దృష్ట్వా విస్మితో భూత్వా యమోఽభ్యంతర మావిశత్ ౩౧
తత్ర స్థితాన్ మహాభాగాన్ యమ స్సర్వాన్ దదర్శహ
శంఖచక్రధరం దేవం పీతవాసస మచ్యుతం ౩౨
చతుర్భుజ ముదారాంగం కౌస్తుభోద్భాసితోరసం
కిరీటకటకోపేతం రత్నమాళివిరాజితం ౩౩
ఏకవింశతిభేదేన లోక మాపూర్య యా స్థితా
లక్ష్మ్యా తయా సమాసీనం దదర్శ చ హరిం యమః ౩౪
వసవోఽష్టౌ స్థితా స్తత్ర రుద్రా ఏకాదశ స్థితాః
సర్వేశద్వాదశాదిత్యా స్సిద్ధవిద్యాధరాదయః ౩౫
గంధర్వాప్సరసో యక్షా భుజంగా గుహ్యకా స్తథా
సర్వా నేవాథ తాన్ దృష్ట్వా శివ స్యోత్తరత స్స్థితాన్ ౩౬
హృషితాత్మా యమ స్తూర్ణం శివపార్శ్వ ముపాగమత్
తత్ర స్థితాన్ మహాభాగాన్ శివసారూప్య మాగతాన్ ౩౭
వేదోక్తేన విధానేన కృత్వా పాశుపతం శుభం
విచ్ఛిన్నపాశాన్ నిర్ద్వంద్వాన్ జితమాయా నకల్మషాన్ ౩౮
పరమాద్వైతతత్త్వజ్ఞా నాత్మారామాన్ శివాత్మకాన్
దృష్ట్వా యమః ప్రహృష్టాత్మా మహాదేవం దదర్శ హ ౩౯

దివ్యసింహాసనాసీనం సర్వదేవై స్సమన్వితం
సంసారసాగరం ఘోరం యయా సంతార్య మానవాః ౪౦
కైవల్యం ప్రతిపద్యన్తే తయా దేవ్యా సమన్వితం
యయా సంజాయతే విశ్వం యయాచ స్థీయతే జగత్ ౪౧
యయా విశ్వ మిదం నశ్యే త్తయా దేవ్యా సమన్వితం
కోటిసూర్యప్రతీకాశం సర్వాభరణభూషితం ౪౨
నీలగ్రీవం త్రినేత్రంచ చంద్రార్ధకృతశేఖరం
దృష్ట్వా యమ స్తదా దేవం దండముద్రాం నివేద్యచ ౪౩
పపాత పాదయో ర్భక్త్యా సాంబస్య జగతీపతేః
యమ స్తత స్సముత్థాయ భక్త్యా పరమయా యుతః ౪౪
కరాభ్యా మంజలిం కృత్వా స్తోతు మే వోపచక్రమే.

యమః:—

నమ స్సకలలోకానాం సర్గస్థిత్యంతహేతవే ౪౫
సర్వజ్ఞాయ వరేణ్యాయ భక్తిగమ్యాయ శంభవే
యత్పాదం సకృ దభ్యర్చ్య పాపినోఽపి గతైనసః ౪౬
శివలోకం ప్రపద్యన్తే తం నమామి సదాశివం
యత్పాదపంకజం నత్వా పాపిష్ఠాఅపి మానవాః ౪౭
తీర్త్వా తే నరకం ఘోరం ప్రయాంతి శివమందిరం
యన్నామ సకృ దుచ్చార్య మహాపాతకినో నరాః ౪౮
నిష్కల్మషా భవిష్యన్తి తం ప్రపద్యే మహేశ్వరం
మణిలింగే య మభ్యర్చ్య మోహిన్యాం విద్యయా సహ ౪౯
ఇంద్రనీలే య మభ్యర్చ్య ధ్రువేణ శతతారకే
విష్ణుత్వం ప్రాప్తవాన్ విష్ణుః తం నమామి మహేశ్వరం ౫౦
పద్మరాగే య మభ్యర్చ్య కృత్తికాయాం తు భద్రయా
అగ్నిత్వం ప్రాప్తవా నగ్నిః తం నమామి మహేశ్వరం ౫౧

నీలలింగే య మభ్యర్చ్య జ్యేష్ఠాయాం వజ్రభృ ద్యయా
శక్రత్వం ప్రాప్తవా౯ శక్ర స్త న్నమామి మహేశ్వరం   ౫౨

మణిలింగే య మభ్యర్చ్య మఘాయాం వసువిద్యయా
అహం యమత్వ మాపన్న స్త న్నమామి మహేశ్వరం   ౫౩

యస్య ప్రసాదలేశేన సర్వేషాం ప్రాణినా మహం
శాస్తా ప్రఖ్యాపితో లోకే త న్నమామి మహేశ్వరం   ౫౪

అయోలింగే య మభ్యర్చ్య దైత్యదానవరాక్షసాః
అసంఖ్యా బల మాపన్నా స్త న్నమామి మహేశ్వరం   ౫౫

కాయేన మనసా వాచా యేఽ ర్చయంతి మహేశ్వరం
ధర్మార్థకామమోక్షాఖ్యా౯ పురుషార్థా౯ భజన్తి తే   ౫౬

యస్మి౯ స్థిత మిదం విశ్వం వీచిమాలా యథాంభసి
సర్వదేవమయం శంభుం ప్రణమామి మహేశ్వరం   ౫౭

ఏకోఽస్తి సర్వభూతేషు తరంగేషు యథా పయః
సర్వాత్మకం మహాదేవం తం సదా ప్రణమా మ్యహం   ౫౮

ఏకఏవ హి యో దేవ స్సర్వభూతహృది స్థితః
ఆకాశవ దమేయాత్మా తం నమామి మహేశ్వరం   ౫౯

ఏకోఽపి బహుధా దేవో దృశ్యతే రవిచంద్రవత్
అజ్ఞానావృతచిత్తానాం తం నమామి మహేశ్వరం   ౬౦

య మాహుః ప్రాప్య విజ్ఞానాః విజ్ఞాన మితి యం ప్రభుం
తం నమామి మహాదేవం సదై వాలంఘ్యశాసనం   ౬౧

య మాహుః పురుషం సాంఖ్యా స్సదా తత్త్వార్థచిన్తకాః
త న్నమామి మహేశానం సర్వలోకైకనాయకం   ౬౨

య మాహు ర్బ్రహ్మశబ్దేన సర్వవేదాన్తవేదినః
వేదాన్తవేద్య మీశానం ప్రణమామి మహేశ్వరం   ౬౩

విష్ణుం సర్వజ్ఞ ముత్పత్తిస్థితిసంహారకారణం
తం నమామి మహేశానం సర్వలోకైకనాయకం   ౬౪

పుష్కలాగమతత్త్వజ్ఞా యమాహు శ్చతురాననం
జగత్స్రష్టార మీశానం తం నమామి సదాశివం ౬౫
యే కేచ నాగ్ని రిత్యాహు స్సూర్య ఇత్యేవ కేచన
అన్యే వాయు రితి ప్రాహు స్త న్నమామి మహేశ్వరం ౬౬
అన్యే పశుపతిం ప్రాహు స్త మీశం ప్రణమామ్యహం
నానావిధఘటే ష్వంతః ఖం విలీనం యథా నభః ౬౭
భూతే ష్వంత స్తథైకస్వాంతం ప్రపద్యే సదాశివం
స్రష్టా త్వమేవ జగతాం రక్షక స్త్వం మహేశ్వర ౬౮
సంహర్తా జగతాం దేవ త్వ మే వైకో మహేశ్వర
శాసనార్థం తు పాపానాం త్వయై వాహం నియోజితః ౬౯
తతః ప్రభృతి దేవేశ సర్వే పాపసమన్వితాః
పాపానురూపదండేన నరకే శిక్షితా మయా ౭౦
త్వదాజ్ఞయా హం దేవేశ సర్వ త్రాలంఘ్యశాసనః
ఇదానీం భంజితాజ్ఞో౽ హం సుకుమారకృతే ప్రభో ౭౧
కి మేతదితి సంచింత్య త్వాం ద్రష్టు మహ మాగతః
అనేన హింసితా దేవ ప్రాణినో లక్షసంఖ్యయా ౭౨
పాపాశ్చ విప్రా బహవః (?) సుకుమారేణ పాపినా
సహస్రశః కృతం స్తేయ మన్యైనై వచ పాపినా ౭౩
అనేన తాసా చాండాలీం సమానాం షష్టిసంఖ్యయా
పుత్రా నుత్పాదయామాస పంచ పాతకసన్నిభాన్ ౭౪
తస్యా మపత్యం పాపిష్ఠో జనయామాస వైధురే
చండాల్యా పీతశేషం తు తావత్కాలం పపౌ సురాం ౭౫
మేఘచ్యుతా యథా ధారా నగణ్యంతే న మానవైః
గగనే తారకా యద్వ ద్గంగాయాం సికతా యథా ౭౬
లోకే గణయితుం శక్యం న మనుష్యై స్సురాసురైః
కృతా న్యనేన పాపాని పాపినా కోటిసంఖ్యయా ౭౭

కల్పకాలేతి తచ్ఛక్యం (?) యథా వక్తుం కథంచన
ఏకేన హి కృత స్యాస్య పాపస్య పరమేశ్వర   ౭౮
ప్రాయశ్చిత్తం నపశ్యన్తి సర్వశాస్త్రేషు సూరయః
ఏవంవిధో ఽసౌ పాపాత్మా కథం ప్రాప్త స్తవాంతికం   ౭౯
యోగినా మప్యలభ్యం య త్తత్త్వాపీ ప్రాప్తవాన్ కథం
స్వతంత్రోఽపి మహాదేవ స్సర్వదేవేషు కీర్తితః   ౮౦
సుకుమార ప్రసంగేణ స్వతంత్రత్వం ప్రకాశితం

సూతః :—

ఇత్యుక్త్వా దండముద్రాం తాం శివాయ వినివేద్యచ   ౮౧
పపాత దండవ ద్భూమౌ ప్రసీదేతి వద న్ముహుః
త మువాచ మహాదేవః ప్రహసన్ కరుణానిధిః   ౮౨
కరాభ్యాంచ సముత్థాప్య పాదయోః పతితం యమం

ఈశ్వరః :—

ఆశ్చర్య మత్ర మా కర్షీ స్సుకుమారకృతే యమ   ౮౩
వైషమ్య మత్ర మే నాస్తి శృణు వక్ష్యామి కారణం
అనేన సుకుమారేణ యదిదం దుష్కృతం కృతం   ౮౪
సంఖ్యా మయా ప్యశక్యం య ద్వ్యేకస్మి త్తారకమంకవత్
న తస్య దుష్కృతి ర్దృష్టా సర్వశాస్త్రేషు సాంప్రతం   ౮౫
తథావిధం మహాపాపం దగ్ధ్వా సర్వం క్షణేనతు
శివరాత్రివ్రతం దృష్ట్వా మత్సమీప ముపాగమత్   ౮౬

యమః :—

ఏవంవిధో ఽసౌ పాపాత్మా శుద్ధో ఽభూ ద్వ్రతదర్శనాత్
తద్వ్రతం బ్రూహి మే దేవ కథా కార్యం మనీషిభిః   ౮౭

ఈశ్వరః :—

మాఘకృష్ణచతుర్దస్యాం రాత్రౌ జాగరణాన్వితః
వ్రతం కార్యం మహాప్రాజ్ఞ ప్రాజాపత్యఫలప్రదం   ౮౮

వేదసారేణ సంపూజ్య శివరాత్రౌ మహేశ్వరం
శివరాత్రివ్రతం కృత్వా బ్రహ్మా బ్రహ్మత్వ మాగతః ౮౯
విద్యాసారేణ మంత్రేణ శివరాత్రౌ మహేశ్వర
శివరాత్రివ్రతం కృత్వా విష్ణు ర్విష్ణుత్వ మాగతః ౯౦
శివరాత్రౌ శివం పూజ్య మృత్యుమోచనవిద్యయా
కల్పాయు రభవ త్పూర్వం మార్కండేయో మహామునిః ౯౧
అష్టౌచ వసవ స్సూర్యా రుద్రా ఏకాదశ స్మృతాః
వేదసారేణ సంపూజ్య సర్వదేవత్వ మాగతాః ౯౨
బహునాత్ర కి ముక్తేన సారభూతం వచ శ్శృణు
ఆచండాలమనుష్యాణాం పాపానాం దహనక్షమం ౯౩
మేరుమందరతుల్యస్య రాశిః పాపస్య కర్మణః
సంచిత స్సుకుమారేణ సర్వలోకస్య పశ్యతః ౯౪
మాఘకృష్ణచతుర్దశ్యాం మహానిశి మహేశ్వరం
చండాలీ మాత్మజాం రంతుం పుష్పా ణ్యాహర్తు మాగతః ౯౫
సంపూజ్యమానం వ్రతిభిః తస్మిన్ కాలే దదర్శ సః
నానాసుగంధికుసుమై శ్చందనాదివిలేపనైః ౯౬
భక్ష్యభోజ్యాన్నపానైశ్చ తాంబూలై శ్చంద్రసంయుతైః
గీతవాద్యనినాదైశ్చ పురాణై స్తోత్రపాఠకైః ౯౭
సంపూజ్యమానం వ్రతిభి శ్శివలింగం మహానిశి
దదర్శ సుకుమారోఽసౌ యుక్తః పాతకకోటిభిః ౯౮
వ్యాజేనాపి తదా ప్రాప్తి స్తత్క్షణాత్ దగ్ధకల్మషః
సర్వయజ్ఞతపోదానవ్రతానా మాప్తవాన్ ఫలం ౯౯
సర్వసారేణ ధర్మేణ యుక్తో వా సుకుమారకః
స మాంతిక మనుప్రాప్య గాణాపత్యం చ లబ్ధవాన్ ౧౦౦
యథా ప్రజ్వలితో వహ్ని శ్శుష్కమాత్రం చ నిర్దహేత్
జ్ఞానాజ్ఞానకృతం పాపం వ్రతం దహతి దర్శనాత్ ౧౦౧

సందేహం మా కృథా కించిత్ సుకుమారకృతే యమ
మహాపాతకలక్షాణి పాతకాని కృతానిచ ౧౦౨
శివరాత్రివ్రతం దృష్ట్వా యత్పుణ్యం ప్రాప్తవాన్ ద్విజః
తత్పుణ్యేన ప్రదగ్ధాశ్చ మహాపాతకకోటయః ౧౦౩
రాజసూయసహస్రస్య అశ్వమేధాయుతస్యచ
కపిలాకోటిదానస్య భూమేః కృత్స్నస్య యత్ఫలం ౧౦౪
శతవర్షసహస్రాణి తపస్తప్త్వా తు యత్ఫలం
పుణ్యక్షేత్రనివాసాచ్చ సర్వతీర్థావగాహనాత్ ౧౦౫
ఏతేషాం యత్ఫలం ప్రోక్తం శాస్త్రేషు వివిధేష్వపి
తత్పుణ్యం కోటిగుణితం సుకుమారోఽపి లబ్ధవాన్ ౧౦౬
శివరాత్రివ్రతం దృష్ట్వా పుష్పవ్యాజేనచాగతః
తపస్విభ్యోఽధికో హ్యేషః యజ్వభ్యో హ్యధికో మతః ౧౦౭
సర్వేభ్యః పుణ్యకృద్భ్యశ్చ సుకుమారోఽధికో మతః
తేన పుణ్యేన మహతా గణేశ్వరపదం గతః ౧౦౮
భోగాన్భుక్త్వా నువిపులాన్ కల్పాంతం మమ సన్నిధౌ
తతశ్చాపి చ్యుతః కాలా దదికాఖ్యో భవిష్యతి ౧౦౯
తత్ర మాహేశ్వరో భూత్వా జ్ఞానం లబ్ధ్వా మదాత్మకం
మహిమ్నా విష్ణునా క్షేమో మమ సాయుజ్య మేష్యతి ౧౧౦
మద్భక్తాస్తు విశేషేణ పూజనీయా స్సదా యమ.

యమః :—

త్వద్భక్తాః కీదృశా దేవ కిం నిష్ఠాః కేన లక్షితాః ౧౧౧
కిం తేషాం లక్షణం బాహ్య మాంతరం లక్షణం వద

ఈశ్వరః :—

శ్రుణు ధర్మ ప్రవక్ష్యామి భక్తానాం లక్షణం మమ ౧౧౨
భస్మోద్ధూళితసర్వాంగాః త్రిపుండ్రాంకితమస్తకాః
రుద్రాక్షమాలాభరణా శ్శివపూజాపరాయణాః ౧౧౩

బాహ్యలక్షణసంయుక్తాః పూజ్యా స్సర్వే త్వయా మమ
ప్రణవాభ్యాసనిరతా స్త్రియాపాఠపరాయణాః ౧౧౪
శివసూక్తజపాసక్తా శ్శతరుద్రీయపాఠకాః
ఆథర్వణీం శిఖాం యే చ పఠంతి శిరస శ్శ్రుతిం ౧౧౫
పౌరుషం యః పఠే త్సూక్తం పవమానం చ యః పఠేత్
త్వరితం నీలరుద్రంచ శివసంకల్పమేవచ ౧౧౬
మహాదేవాదినామాని జిహ్వాగ్రే యస్య వర్తతే
మమ ప్రియతరా హ్యేతే పూజ్యా స్సర్వే త్వయా మమ ౧౧౭
త్రికాల మేకకాలం వా యే వా ధ్యాయన్తి శంకరం
నృత్యమానం త్రయీనేత్రం చంద్రార్ధకృతశేఖరం ౧౧౮
ఉమామహేశ్వరం రూపం దక్షిణామూర్తి మేవవా
మృగటంకధరం దేవం నీలకంఠ మథాపి వా ౧౧౯
పంచాననమయీం మూర్తిం హృది ధ్యాయన్తి యే నరాః
మమ పూజ్యతమా హ్యేతే యది పాపాన్వితా అపి ౧౨౦
పూజ నైతా స్సదా భక్త్యా మమ చేదిచ్ఛసి ప్రియం
యథా పృష్టం తథా ప్రోక్తం కిం భూయశ్శ్రోతు మిచ్ఛసి ౧౨౧

యమః :—

శ్రుతం దేవ మయా సర్వం కథ్యమానం త్వయా శివ
శివరాత్రివ్రత స్యాస్య విధిం మాహాత్మ్య మేవచ ౧౨౨
ఉద్ధూళనస్య మాహాత్మ్యం త్రిపుండ్రస్య క్రమం మయా
రుద్రాక్షాణాం చ మాహాత్మ్యం లింగపూజావిధేః ఫలం ౧౨౩
త్వద్భక్తానాంచ మాహాత్మ్యం మంత్రాణాంచ శ్రుతం మయా
త్వన్నామకీర్తనా త్సద్యః పతితోఽపి విముచ్యతే ౧౨౪
కిం పున ర్యే మహాత్మానః త్వయి భక్తిసమన్వితాః
యజ్ఞేషు హూయమానో ఽగ్ని శ్శ్మశానస్థోఽపి వా శిఖీ ౧౨౫

సర్వైవ సంపూజ్యతే విప్రైరనిందోల్యోహి యథానలః
దుర్వృత్తో వా సువృత్తో వా శ్వపచో వా ద్విజో యది ౧౨౬

మమ పూజ్యతమో భక్త్యా మహాదేవ తవాజ్ఞయా
సుకుమారప్రసంగేన జిజ్ఞాసార్థ మిహాగతః ౧౨౭
సర్వసారతమాన్ ధర్మాన్ శ్రుతవాన్ త్వత్ప్రసాదతః
ఇదానీం గతసందేహః కృతార్థోఽస్మి మహేశ్వర ౧౨౮

ఈశ్వరః :—

యమ సంయమనీం గచ్ఛ దండముద్రాసమన్వితః
పాపిష్ఠానాం చ సర్వేషాం శాసనం కురు యత్నతః ౧౨౯

సూతః :—

ఏత చ్ఛ్రుత్వా వచ స్సత్యం మహాదేవేన భాషితం
ప్రణిపత్య మహాదేవం స్తుత్వా చ వివిధై స్స్తవైః
దండముద్రాం సమాదాయ స్వాంపురీం ప్రయయౌ యమః ౧౩౦

ఓమిత్యాది మహాపురాణే శ్రీస్కాందే

ఈశానసంహితాయాం శివరాత్రి

మాహాత్మ్యే శంకరయమ

సంవాదో నామ

త్రిసప్తతి తమో

౽ధ్యాయః

శ్రీరస్తు.

---

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము. ౨౯. { విక్రమ మార్గశిరఫాల్గునమాసములు. } సంచిక ౫-౬



కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

1940 డిశంబరు-1941 మార్చి.

# విషయసూచిక.

పుట.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

సంపుటము ౨౮. { విక్రమ మార్గశిరఫాల్గునమాసములు. } సంచిక ౫-౬.

## కీ. శే. కళాప్రపూర్ణ జయంతి రామయ్యపంతులుగారు.

### శ్రీ పిఠాపురం మహారాజాగారి సందేశము.

శ్రీ జయంతి రామయ్యపంతులుగారు మాకు చిరకాలమిత్రులు. నిరుపమానపాండితీసంపన్నులు. ఆంధ్రసాహిత్యపరిషత్తు సంస్థాపనకు మూలపురుషులు వారే. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువునకు గౌరవసంపాదకులుగనుండి శ్లాఘనీయముగ సేవఁజేసిరి. ఆంధ్రసారస్వతమునకు వీరాచరించిన సేవ యమూల్యము.

### శ్రీ పిఠాపురం యువరాజాగారి విచారము.

శ్రీ జయంతి రామయ్యపంతులుగారి మరణవార్త నాకత్యంత విచారము గొల్పుచున్నది. మాకుటుంబమునకు వారెంతయో సన్నిహిత స్నేహితులగుటచే వారిమరణమువలన మాకు తీరనినష్టము వాటిల్లినది. శ్రీ పంతులుగారు గొప్పవిద్వాంసులు. సాహిత్యపరులు. వారిమరణము వలన సాహితీప్రపంచమునకు గొప్ప లోటుకలిగినది. ఇది యెన్నటికిని భర్తీచేయుట కష్టతరము. (ఆంధ్రపత్రికనుండి.)

## కీ. శే. జ. రామయ్యపంతులుగారు.

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రతిష్ఠాపకులలో నొకరును, నిరంతరవాఙ్మయసేవాధురంధరులును, వివిధగ్రంథనిర్మాతలును, కళాప్రపూర్ణ బిరుదాంకితులునగు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు 9-2-41 తేదిని దివంగతులగుట మిక్కిలి సంతాపకరమగు విషయము. ఆంధ్రదేశచరిత్రమునందును, వాఙ్మయమునందును, వీరి యద్వితీయసేవనుగూర్చి తెలియని యాంధ్రులుండు టరుదనియే మానమ్మకము. కీ. శే. గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యావహారికభాషావాదమును నిరసించుచు, గ్రాంథికభాషోద్ధరణమునకై వీరు తమజీవితసర్వస్వమును ధారవోసియున్నారు. ఆ సందర్భమున వీరిపేరు ఆంధ్రదేశమునందంతటను మాఱుమ్రోఁగియుండుట సర్వజనైకవేద్యము.

వీరు అమలాపురముతాలూకా ముక్తీశ్వరగ్రామమున 18-7-60 ని జన్మించిరి. జననంబాదిగఁ బదునాల్గు వత్సరములవఱకు వీ రచ్చటనే యారాధ్యబ్రాహ్మణులగు చాగంటి వీరభద్రయ్యగారియొద్ద విద్యనునేర్చి, తరువాత నాంగ్లవిద్యాభ్యాసమునకై వీరి యన్నయగు వేరయ్యశాస్త్రిగారి ప్రోత్సాహమున రాజమహేంద్రవరమునకుఁ జనిరి. అట 1882 న పట్టపరీక్షయం దుత్తీర్ణులై, పీఠికాపురమున మహారాజావారిపాఠశాలయందు 1884 వఱకుఁ బ్రధానోపాధ్యాయులుగ నుండి, న్యాయవాదిపరీక్షకుఁ జదువుటకై మదరాసునకు వెళ్లిరి. న్యాయవాదిపరీక్షయం దుత్తీర్ణులై, మదరాసు ప్రభుత్వమువారి రివిన్యూశాఖయందుఁ బ్రవేశించి యచిరకాలముననే 'డిప్యూటీకలెక్టరు' ఉద్యోగమును బడసి, 1911 వ సంవత్సరప్రాంతమున మూఁడు సంవత్సరములు ప్రెసిడెన్సీమేజస్ట్రేటుపదవియందుండి, 1917 సంవత్సరమున నుపకారవేతనమును బొందిరి.

వీరు మండలాధికారిగ వేర్వేఱు జిల్లాలయందుండుకాలమున వీరాంధ్రదేశమునఁగల పెక్కుశాసనములకుఁ బ్రతిబింబములఁ దీయించి "ఎపిగ్రాఫియా యిండికా" మున్నగు పత్త్రికలయందుఁ బ్రకటించియుండిరి ప్రథమమున 1891 సంవత్సరమున కాటయవేముని తొత్తరమూడి శాస

నమును ప్రకటించి, తరువాత యిమ్మడి నరసింహరాయల దేవులపల్లి శాసనము, యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము, మల్లాపురశాసనము, నందంపూడి శాసనము మొదలగువానిని చారిత్రకవిషయపరిశోధనలతోఁ బ్రకటించియుండిరి. మఱియుఁ బ్రాచీనాంధ్రశాసనములఁగల పద్యములసమకూర్చి యాంధ్రమునఁ శాసనపద్యమంజరి యను గ్రంథమును రెండుభాగములుగఁ బ్రకటించియుండిరి. ఇది భాషాస్వరూపమెఱుంగఁగోరువారికి మిక్కిలి నుపయోగకరము. మఱియు నిటీవల గవర్నమెంటు శాసనపరిశోధకశాఖవారి కోరికపైన దక్షిణదేశపుటాంధ్రశాసనములఁ బదియవసంపుటముగఁ బ్రకటించుటకు మొదలుపెట్టిరి. అది యిప్పుడు ముద్రణము నందుచున్నది. శ్రీ పంతులుగారాగ్రంథమునకు విపులమగు పీఠికను వ్రాయు ప్రయత్నములోనుండఁగనే కీర్తిశేషులగుట యాంధ్రుల దురదృష్టమని చెప్పనగును. ఆంధ్రదేశచరిత్రరచనమున కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు, శ్రీ రామయ్యపంతులుగారు, కీ శే. చరిత్రచతురానన చిలుకూరి వీరభద్రరావుగారును ముఖ్యులు. వీరి చారిత్రకపరిశోధనలను, పద్ధతులను గైకొనియే నేఁటి యువకులు పరిశోధనల జరుపుచున్నట్లు మనకందఱకును దెలిసినవిషయమే. వీరు తాము సంపాదించిన శాసనప్రతిబింబములలోఁ గొన్నిటిని ఆంధ్రవిశ్వవిద్యాలయమునకుఁ, గొన్నింటిని సాహిత్యపరిషత్తునకును, మఱికొన్నింటిని ఆంధ్రేతిహాసమండలివారికి నొసంగియున్నారు.

వీరు మదరాసున ప్రెసిడెన్సీమేజస్ట్రేటు పదవియం దున్నప్పుడు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురము మహారాజావారిని, బొబ్బిలి, వేంకటగిరి సంస్థానాధీశ్వరులను బ్రోత్సహించి, వంగీయసాహిత్యపరిషత్తురీతి నాంధ్రదేశమున నొకసాహిత్యపరిషత్తు నేర్పఱిచి యమూల్యమగుముద్రితాముద్రిత గ్రంథసంచయమును సంపాదించిరి. మఱియు నాంధ్రభాషకు సమగ్రమగు నిఘంటు వెద్దియును లేకుండుటచే, నద్దానిని రచింపఁజేసి ప్రచురించుటకై శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరుల యుదారమగు ధనసాహాయ్య

మున నిఘంటు రచనా సంఘము నేర్పఱచిరి. వీరి కార్యదీక్షవలనను, శ్రీరాజావారి యౌదార్యమువలనను శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు ముద్రణభాగ్యము నందుటయేగాక యందు రెండు సంపుటములు వెడలి యున్నవి. మూఁడవది ముద్రణము నొందుచున్నది. నిఘంటురచనావిషయమై వీరు ముఖ్యసంపాదకులుగ నుండి కిట్టెలు, గండర్టు మొదలగు సుప్రసిద్ధనిఘంటుకారులయత్నమును దృక్పథమున నునిచికొని యద్వితీయమగు శ్రద్ధతో విషయపరిశోధనము గావించుచు నిఘంటునిర్మాణమును సాగించియున్నారు. నిఘంటునిర్మాణపద్ధతినిగూర్చి Dravidian Lexicography అను గ్రంథమునుగూడ రచించియున్నారు. ఆమహాద్యమము పూర్తికాకుండఁగనే శ్రీ పంతులుగారు కీర్తిశేషులగుట యాంధ్రులకు సంతాపకరమగు రెండవ విషయము.

మఱియు నాంధ్రసాహిత్య పరిషత్ప్రతిష్ఠాపనము మొదలు వీరు కార్యనిర్వాహకసభాధ్యక్షులుగానుండి పరిషత్కార్యముల నతిదీక్షతో నిర్వహించుచు, వివిధామూల్యగ్రంథప్రకటన మొనర్చుచు, సాంవత్సరిక సభల జరుపుచు, సారస్వతచర్చలఁ బాల్గొనుచు తమజీవితమును గడపియున్నారు. నన్నెచోడుని కాలనిర్ణయము, అఱవమునఁగల వింతవ్యాకరణము, బమ్మెరపోతన, భీమకవి జన్మస్థానము, కాకతీయులు క్షత్రియులా ? మున్నగు విషయములను గూర్చి పరిషత్పత్త్రికయం దమూల్యములగు వ్యాసరాజములఁ బ్రకటించుటయేగాక యాంధ్రభాషాచరిత్రమున కుపయోగకరములగు రాయవాచకము, ప్రతాపచరిత్రము,తొండమానువంశావళి మున్నగుచారిత్రకగ్రంథములను, కవిజనాశ్రయము, ధాతుమాల, బాలసరస్వతీయము, లక్షణసారసంగ్రహము మొదలగు లక్షణగ్రంథములను, చంద్రభానుచరిత్రము, విప్రనారాయణచరిత్రము మొదలగు ప్రబంధములను బత్త్రికలోఁ బ్రకటింపఁజేసిరి. వీరి ప్రోత్సాహమువలనను, నిరంతరకార్యదీక్షవలనను ఆంధ్రసాహిత్యపరిషత్తు, ఆంధ్రవాఙ్మయప్రపంచమునకుఁ దనశక్తికొలఁది భాషాసేవనుజేసియున్నది. పరిషత్తున కొకవిపు

లమగు భవనమును నిర్మాణ మొనర్చి, యితోఽధికభాషాసేవకై ధనము సంపాదించి యీసంస్థ నద్వితీయముగ నొనర్పవలెనని పలుమాఱు స్మరించుచు వీరు భౌతికదేహమును విడనాడిరి. ఆంధ్రులు తమదేశమునందును భాషయందును నభిమానమును వహించి శ్రీ పంతులుగారి యాశయములఁ గొనసాగింతురని యాశించుచున్నాము.

శ్రీ రామయ్యపంతులుగారు కేవలము విమర్శకవ్యాసములు వ్రాయుటయేగాక యాంధ్రభాషాకవిత్వమును జక్కఁగ నలవఱచుకొని పెక్కు గ్రంథములను రచించియున్నారు. అందు, ఉత్తరరామచరితము, చంపూరామాయణము, అమరుకమును జక్కని పద్యగద్యముల వీరాంధ్రీకరించియున్నారు. మఱియు ముక్తీశ్వరశతకము, బాలరామాయణమును రచించియుండిరి. కవిపోషకులై, శ్రీ అల్లంరాజు సుబ్రహ్మణ్యకవిగారిచే సమకూర్పఁబడిన చాటుధారాచమత్కారసార మను గ్రంథమును ముద్రింపించిరి. సుప్రసిద్ధకవీశ్వరులును కింకవీంద్రఘటాపంచాననులునగు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు తాము 'జయంతి'యను గ్రంథమును రచించి వీరి కంకిత మొనర్చిరి. మఱియు నాధునికాంధ్రభాషనుగూర్చి ఆధునికాంధ్రవాఙ్మయవికాసమై ఖిఁయను గ్రంథమును రచించి, యాధునికరచయితలను విమర్శించియున్నారు.

క్రీ. శ. 1911 సంవత్సరమునుండియు కీ శే. శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారిచే వ్యావహారికభాషావాదము ప్రోత్సహింపఁబడినది. వారియనుచరులు వారివాదముతోఁ దృప్తినొందక గ్రామ్యవాదమును లేవఁదీసిరి. ఆయావాదములను సవిమర్శముగ ఖండించుచుఁ బండితప్రకాండు లందఱును పెక్కు విమర్శనవ్యాసములను గ్రంథములను వ్రాసి యట్టివ్యావహారికభాషను బాఠశాలలలోఁ బ్రవేశపెట్టకుండఁగ దొరతనమువారి యుత్తరువును బొందఁగలిగిరి. ఆవాదోపవాదముల శ్రీపంతులుగారు తమ యావచ్ఛక్తిని వినియోగించుటయేగాక Defence of Literary Telugu అను నొక గొప్పవ్యాసమును వ్రాసి ప్రకటించియుం

డిరి. వ్యావహారికభాషావాదులగు శ్రీగిడుగురామమూర్తిపంతులుగారి సిద్ధాంతములఁ వారియనుచరులుసైత మంగీకరింపక, గ్రామ్యభాషను స్వేచ్ఛారచనమును జేయఁదొడఁగిరి. అట్టు లల్లకల్లోలముగనున్న కాలమున శ్రీపంతులుగారిప్రోత్సాహముచే నీయాంధ్రసాహిత్యపరిషత్తు గ్రాంథికభాషకై యథాశక్తి కృషిసలిపియున్నది.

మఱియు శ్రీపంతులుగారు శాస్త్రపారిభాషికపదములపట్టికను గొంతవఱకు సిద్ధముచేసి పరిషత్పత్రికయందుఁ బ్రకటించి యుండిరి. ఆంధ్రమహాభారతమునందలి పదముల యనుక్రమణికను గూడ వ్రాయించియుండిరి. పూనా భండార్కరు ఇన్‌స్టిట్యూటువారి మహాభారతప్రకటనమువలెనే యాంధ్రమహాభారతమును బరిశోధించి, పాఠభేదములతో నచ్చొత్తించుటకు ఉద్యోగపర్వమును సిద్ధమొనర్చిరి. ధనాభావముచేత నాప్రయత్నమునుండి విరమింపవలసివచ్చినది. పైమూఁడు విషయములనుగూర్చి యాంధ్రభాషాభిమానులు శ్రీరామయ్యపంతులుగారి యాశయములను గొనసాగించుటకై తీవ్రమగు యత్నము సలుపవలసియున్నది. పరిషద్భాండాగారమున ఆంధ్రమహాభారతమునకుఁ బెక్కువందలప్రతులు గలవు. ఆయాప్రతుల సవిమర్శముగఁ బరిశోధించి మహాభారతమును బ్రకటించినచో, నాంధ్రులు తమకర్తవ్యమును నిర్వహించినవారగుదురు. అందులకు ధనసహాయము, పండితసహాయముఁ గావలసియున్నది. పూనావారివలె మహాభారతప్రకటననిధి నేర్పఱచి దానితోఁ గార్యనిర్వహణ మొనర్పవలసియున్నది. కేవలము ఆంధ్రసాహిత్యపరిషత్తుగాక, యాంధ్రులందఱును భాషావిషయమున నేయే పనులఁ గృషిసలుపవలసియున్నదో బాగుగ నిర్వచించి యుపాయములను నాయా పరికరముల సమకూర్చి శ్రీరామయ్యపంతులుగారు కృతకృత్యులైరి. వారి ప్రయత్నముల మనసునం దుంచుకొని, వానిని నిర్వహించుట యాంధ్రభాషాభిమానులముఖ్యకర్తవ్యము. ఆయావిషయముల మాకందఱకును మార్గదర్శకులై తమజీవితము నాదర్శప్రాయముగ భాషాసేవఁ జే

గడపిన శ్రీరామయ్యపంతులుగారిధన్యజీవితము మనకుఁ జిరస్మరణీయమై యున్నది. వారియుద్దేశానుసార మాంధ్రభాషాభిమానులు కృషిసల్పి కృతకృత్యులగుదురుగాక. శ్రీవారియాత్మకు పరమేశ్వరుఁడు శాంతినొసఁగును గాక—

---

జయంతి రామార్య స్మృతిః.

శ్లో. జయన్తి వంశాంబుధి పూర్ణచంద్రో
రామాహ్వయో హ్యాంధ్రకలాప్రపూర్ణః
కర్తా కృతీనా మపహాయ ధాత్రీం
దివం గతో హంత విధేర్బలేన॥

శ్లో. అనన్యసాధారణమస్తి యస్య
పాండిత్య మాంధ్ర్యాం విబుధైకవేద్యం
ప్రవర్తనం యస్య కలంకహీనం
రామాహ్వయో హంత దివం గతోఽసౌ॥

శ్లో. శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్య
భారం వహన్ మూర్ధని వార్ధకేఽపి
స్వీయాంధ్రభాషోద్ధరణాభిమానం
ప్రాదర్శయ ద్రామమిమం వినా కః॥

శ్లో. పుత్రీమి వాంధ్రసాహిత్య సభాం యః పర్యపాలయత్
స హంత త్రిదివం ప్రాప్తో రామ స్సంత్యజ్య తామపి॥

శ్లో. ఆంగ్లేయభాషా మధిగమ్య పూర్ణం
ప్రాప్యాధికారం ఖలశాసనార్హం
ధర్మేణ భూఖండ మపాలయ ద్యో
దివం గతో హంత స రామయార్యః॥

శ్లో. కుశాగ్రవ త్సూక్ష్మమతి ర్యదీయా
శక్తా గ్రహీతుం క్షణతోఽన్యశక్తిం
స హంత యాతో దివ మగ్రజన్మా
రామాక్షరద్వంద్వపవిత్రనామా।

శ్లో. జ్ఞాత్వా స్వయం కుశలబుద్ధితయా యథార్థ
భావం సమాదృతసనాతనధర్మమార్గః
ఆదర్శతా ముపగతస్సకలప్రజానాం
రామాహ్వయో విజయతే భువి కీర్తికాయః॥

మ. రమణీయాంధ్రనిఘంటురూపమున సూర్యారాయభూమీంద్రుకీ
ర్తి మహీమండలమందు నిల్పితివి నాదివ్యప్రబంధంబు స్వ
ర్గమునందున్ నెలకొల్పఁగా వలయు వే రమ్మంచు నింద్రుండు ప
త్రముఁ బంపన్ దివికేఁగినాఁడవొకొ విద్వత్సంశ్రయా రామయా!

చిదంబరశాస్త్రి
కావ్యకలానిధిః, శతావధానీ
శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటుకార్యస్థాన ప్రధానపండితః.
పిఠాపురము.

---

## స్మృతి.

శ్లో. జయంతివంశోద్భవ ఆర్యసమ్మత
స్సనాతనో రామయనామకో మణిః
అలభ్య ఆసీద్భువిమద్విలాసతో
విధే, రిదంక్లేశకరం మహాత్మనామ్॥

శ్లో. జయన్తి రామాఖ్యసుధీన్ద్రచన్ద్రిను
స్త్వదీయకీర్త్యాహ్వయ చన్ద్రికేయమ్
దివాపి రాత్రావపి దివ్యరోచిషా
ప్రకాశతే చిత్రమిదం ధరాతలే॥

శ్లో. శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటురాంధ్ర
సాహిత్య సంసచ్చ భవత్సమజ్ఞామ్
అపారమేధావిభవంచ నూన
మాచంద్రతారం ప్రకటీకరోతు॥

కం. పరిషత్తు నిఘంటువునా
కరయఁగఁగొమరితయుఁ గొడుకు నను నీమాటల్
మఱువనరావు; తావక
సరసతకుఁ మేర కలదె చర్చింపంగఁ.

సీ. ఆంధ్రదేశమునందు నావిర్భవించిన
మనుజమాత్రుఁడు నిన్ను మఱవఁగలఁడె
ఆంధ్రసరస్వతియడుగుల నంటిన
మనుజమాత్రుఁడునిన్ను మఱవఁగలఁడె
ఆంధ్రశాసనములం దభిరుచి గలిగిన
మనుజమాత్రుఁడునిన్ను మఱవఁగలఁడె
ఆంధ్రశబ్దార్థమ్ములం దిచ్ఛగలిగిన
మనుజమాత్రుఁడు నిన్ను మఱవఁగలఁడె

గీ. ఈవు మము వీడినంతనే యేమునిన్ను
మఱతుమే, యాంధ్రుఁడొకఁడైనఁ బరఁగునేని
నినుఁదలఁచి యింటదీపంబునిలుపు; నిక్క;
మేమి నీపుణ్యము జయంతిరామయార్య !

పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి.

---

# స్మరణము.

సీ. కంట వత్తిడుకొని కనుపెట్టితినిగదా
 సూర్యరాయనిఘంటుకార్యములను
చిదిమిపెట్టినబంట్లఁ జేర్పించితినిగదా
 పండిత మండలీపదవులందు
పట్టుఁగొమ్మనుగాఁగఁ బాటించితినిగదా
 పీఠికాపుర మహీభృద్విరాజు
కోటానఁగోటులఁ జాటించితినిగదా
 సంస్కృతాంధ్ర విమర్శనమయములను
గీ. ఇంక నేనున్న లేకున్న నేమియనుచు
నాత్మఁదలపోసి యరిగితో యమరపురికి
నాంధ్రసాహిత్యతనుజ దుఃఖాబ్ధిమునుఁగ
రమ్యగుణభూషణ! జయంతి రామయార్య!
సీ. నీపేరువిని గుండెనీరయి వ్యవహార
 వాదులు దుఃఖాబ్ధినీఁదలేదె
నీజాడఁగని గుండెనీరయి గ్రామ్యవా
 దులు సందుగొందులఁ దూఱలేదె
నీమాటవిని గుండెనీరయి చిక్కుచ
 దువులవారు మదిని సమయలేదె
నీచూపుఁగని గుండెనీరయి బాబుల
 రాయులు నోఘులు మాయలేదె
గీ. నిన్నుఁబోలిన దక్షుండు నీవదక్క
నరుఁడు లేఁడని విబుధులు పలుకుచుండ్రు
అట్టి నినుఁగోలుపోయిన యట్టియాంధ్ర
భూమి దురదృష్టమేమందు? రామయార్య!

సీ. ప్రాచీనశాసన పరిశీలనవిభూతిఁ
　　　　జూపినా వజ్ఞతఁ బాపినావు
ఆంధ్రమహాభారతాన్వయ నైపుణిఁ
　　　　జూపినా వజ్ఞతఁ బాపినావు
సరసాంధ్రసాహిత్య పరిషదాస్థానంబుఁ
　　　　జూపినా వజ్ఞతఁ బాపినావు
సూర్యరాయనిఘంటు సూక్తిరత్నాద్రిని
　　　　జూపినావజ్ఞతఁ బాపినావు
గీ. చెప్పలేనంత యుపకృతిచేసినాఁడ
వాంధ్రసాహిత్య సామ్రాజ్యమలరుకొఱకు
పలుకులిఁకనేల నీకింక బ్రహ్మపదము
ధామమగునుగాత జయంతిరామయార్య!

విద్వాన్, శతావధాని.
పిసుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

# జయంతి రామయ్యపంతులుగారినిర్యాణము.



సీ. స్వర్గంబునకుఁజనె సంస్కృతాంధ్రాంగ్లభా
　　　　షాతత్త్వసార విచక్షణుండు
పరమపదించె నుత్తరరామచరితాది
　　　　సద్గ్రంథరచనావిశారదుండు
సురలోకమునకేఁగె సూర్యరాయాంధ్ర ని
　　　　ఘంటు నిర్మాణైక కార్యదక్షు
నిర్యాణమొందెను నిఖిలభాషాశాస
　　　　నోద్ధరణ గుణమహోదయుండు

గీ. అమరపురము నధిగమించె నమలయశుఁడు
తరలినాఁడాంధ్ర భాషాపితామహుండు
కీర్తిశేషుఁడయ్యెను బుధకీర్తనీయుఁ
డస్తమించె జయంతి రామయ్యాభిధుఁడు.

గీ. ఉన్నతోద్యోగపదవిఁ బెంపూనినాఁడు
చేయఁదగిన భాషాసేవఁ జేసినాఁడు
రాజసన్మానితుండయి క్రాలినాఁడు
పరమధన్యుండు రామయపండితుండు.

గీ. విత్తముండినఁ బొసఁగదు వితరణంబు
వితరణముగల్గెనేని సద్విద్యసున్న
యన్నిటఁ బ్రసిద్ధుఁడైన జయంతి రామ
యార్యుఁడక్కట! స్మరణీయుఁడయ్యె నేఁడు.

ఉ. పండిత పక్షపాతివని, పండిత ముఖ్యుఁడ వీవటంచు, ను
ద్దండ కళాప్రపూర్ణబిరుదంబున కుందగుదంచుఁ, బండితా
ఖండలు లెల్ల నిన్నుఁ గడుగౌరవమొప్ప నుతించుచుండ, నీ
వుండెడ బాపెనయ్యొ కృపఁజూపఁగ నెంచక రామయాభిధా.

గీ. ఎట్టులైనను ధన్యుండవీవు, ముక్తి
మార్గముంజూటఁగొంటివి మాన్యచరిత!
వేదవేద్యుఁడౌ పరమేశు విమలచరణ
సన్నిధిని శాంతిఁబొందుము శాశ్వతముగ.

దాసరి లక్ష్మణస్వామి.

---

# రామయపంతుల నిర్యాణము.

---

చ. అయయొ! గతించిపోయెనె జయంతికులాబ్ధిసుధామరీచి రా
మయబుధుఁడింతలోనె కఱవాయెనెయక్కట! యాంధ్రవాణికిం
బ్రియతనయుండొకండుఁ గను బెంపడిపోయెనె! గ్రాంథికాంధ్రవా
జ్మయమున కాశ్రయం బవుర! కాలునకుం గసితీఱిపోయెనే!

క. విక్రమసంవత్సరమా!
యక్రమముగఁ బేరపార్థమైచనఁగా నీ
విక్రమవిశేషమును నీ
ప్రక్రియ నుత్తములమీఁదఁ బఱుపందగునా!

చ. పదచలనంబొనర్చుటకె భారముగాఁ గనుపట్టి పైపయిం
గదిసినవార్ధకస్థితిని గాసనుజందను బాటవంబు ప్ర
క్కదలినరామయార్యుఁడు నిఘంటువిమర్శనకార్యభారముం
వదలఁడొకప్డు నీతనికి భాషపయింగల తీపదెట్టిదో! న్.

సీ. సముదాత్తమతినాంధ్ర సాహిత్యపరిషత్తుఁ
గన్నబిడ్డంబోలెఁ గాచినాఁడు
సంస్కృతాంధ్రాంగ్లభాషల లెస్స శోధించి
పలువిశేషంబులు దెలిపినాఁడు
దేశమందున ప్రాఁతవడిన శిలాశాస
నమ్ములఁ బ్రకటమ్మొనర్చినాఁడు
గుప్తదానముల సంతృప్తులఁగావించి
విద్వత్కవుల గౌరవించినాఁడు
భాషకై జీవితము ధారపోసినాఁడు
ప్రభులచేఁ బ్రజలచే మెప్పు వడసినాఁడు ర
చిరము మనినాఁడు త్రిదివంబు చేరినాఁడు
భవ్యశీలుండు రామయపంతులుండు. ల్లకా.

చ. బ్రతికినయంతకాలమును వ్రాయనిదీక్షఁ ద్రిలింగ భాషకు
న్నతిఁగలిగింపఁ బాటుపడినాఁడు, విమర్శకతాకళాప్రవీ
ణత నుతిఁగొన్నవాఁడు చనెనాఁ డజరామరకీర్తి మూర్తియై
కృతమతి రామయార్యుని గుణించి యిఁకన్వగవంగనేటికిఁ .

పండితారాధ్యుల నాగభూషణకవి.
మ: విన్నడిపాఱము.

---

# సంస్మరణము.

---

చ. తనువుల్ చేష్టలుదక్కె నీమరణవార్తన్ విన్న మాబోంట్లకో
యనఘా! తావక పాండితీబలసముద్యత్సంస్థ లేకీతి, నె
ట్టన వాపోవునొ? వాని భావిగతి కట్టా! యెట్టులో నీవిఁకం
బునరావృత్తి నివర్తకంబగు పదంబుం జేరి భోగింపఁగన్.

సీ. కాలగర్భమున దుర్గతిఁ బ్రుంగిపడియున్న
ప్రాచీనశాసనప్రతతి రక్ష
పల్లెటూరుల బూజుపట్టి యట్టుకలపై
నల్లాడు తెల్గుకావ్యముల రక్ష
భయవిహ్వలత నిరాశ్రయత దిక్కులుచూచు
నతిపవిత్ర సలక్షణాంధ్రి రక్ష
ప్రాక్తనవిజ్ఞానరాశిబీజము నిల్పు
నకలుహామ్నాయపాఠకుల రక్ష
యిన్నిరక్షలుకూడియు నిట్టిమొకల
దావకనిఘంటు సంపూర్తిదనుక నీకుఁ
బ్రాణభిక్షమొసంగి నిల్పంగనేర
వక్కటా! దైవగతి యనాహతముగాదె?.

ఉ. ధన్యుఁడవీవు; తెల్గుకవితాసతిమెచ్చిన సత్కవీంద్రమూ
ర్ధన్యుఁడవీవు; గ్రాంథికవిధాననిధానమునిల్పి చన్న స
మ్మాన్యుఁడవీవు; వాఙ్మయవిమర్శక ! నిన్ను నుతింప సాహితీ
స్తన్యములాను మాదృశుల శక్తి యిదెంత? జయంతిరామయా !

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

---

(శ్రీ కళాప్రపూర్ణ)

## శ్రీ జయంతి రామయ్యపంతులు స్మృతి.



గీ. ఎల్లకాలము బ్రదుకలేఁ డేనరుండు,
గాని రామయపంతులు పూనినది, ని
ఘంటు వొకకొంతమాత్రము కడమయుండ
స్పష్టగా కీర్తికాయుఁడై యరిగె దివికి.

సీ. అవతరించెను జయంత్యభిధానవెలనాఁటి
వైదిక బ్రాహ్మణాన్వయమునందుఁ
బఠియించె నాంధ్రాది భాషలతో హూణ
భాష బియ్యేబియల్ పట్టమొదవఁ
జేసెఁ బ్రై యధికారుఁడౌ నెబాసనఁ గలె
క్టరుగ నుండి జనోపకారవితతి
సలిపెఁ దెలుంగు భాషకుసేవ ముఖ్యాన
నావిమాత్రముగల్గు నంతవట్టు
చేసెను జమీందార్లతో స్నేహ, మెనుబ
దేండ్లపైదాఁటి జీవించెనెపుడు కవుల
పండితుల గోష్ఠి మెలఁగె డబ్బాటుస్వర్గ
పురికి రామయపంతులు పోయె నకట.

సీ. పలుకఁడు మితిమీఱి, పలికినన్ దల కొట్టు
కొనిపోవుఁగాక పల్కును నిజంబు
నీయఁ జెల్లరకు నట్టిచ్చిన దేమాత్ర
మేనిఁ బాత్రతమున్న మెంచియిచ్చు
గాంచఁడన్యం బెదిగాంచిన నేవ్యావ
హారమందేని న్యాయంబె తీర్చు
వ్రాయఁడెయ్యదివృథా, వ్రాసినతీర్పు ము
ల్లోకమ్ము లేకమై సోఁకఁజాల
వనెడు శాశ్వతకీర్తి మిన్నంది వెలుఁగ
లెక్క సేయకెవ్వరిని కలెక్టరీ నొ
నర్చె ముప్పదియేండ్లు పెన్షనుగ్రహించెఁ
బలుక సౌనె రామయ్యపంతులు చరిత్ర.

చ. ఎనుబదిరెండువత్సరము లేకవిధంబగు రాజభోగముల్
గనియెఁ ద్రిలింగభాష కుపకారము దానయి చేయఁగల్గినం
తనుమటిచేసిచూపెఁ గవితాసుత రామునకిచ్చెఁగాని య
న్యునకొసఁగండు రామయబుధోత్తముఁ డెట్టి మహానుభావుఁడో.

సీ. గ్రాంథికాంధ్రమ్మురక్షణమెంచి నెలకొల్పె
సాహిత్యపరిషత్తు శ్రమము నెంచ
కాంధ్రభాషకు నద్దమటు సూర్యరాయాని
ఘంటువొనర్పఁ గంకణముగట్టెఁ
విశ్వవిద్యాలయ వివిధసభ్యపదంబు
లొందెఁ బల్మఱు విసువొదవుదాఁక
ననఘు "కళాప్రపూర్ణ" ర్హాంకమ్ముఁబూనెఁ "గ
విత్వవిశారద" బిరుదుతోడ
అమరుకావ్యంబు, బాలరామాయణంబు
భోజరామాయణము భవభూతి రామ

చరిత తెలిఁగించి యాంధ్రభాషాలతాంగి
భూషితనుజేసె రామయబుధవరుండు.

శా. కాసవ్యాధి చిరంబు రక్కసివలెన్ గాయంబునన్ గల్గు మాం
సాసృజ్జ్నాడులఁ బీల్చుచున్నను, జరావ్యాధిగ్రస్తుఁడయ్యున్, నిరా
యాసప్రక్రియ నాంధ్రవాఙ్మయరహస్యంబుల్ గనంజాలు మే
ధాసారంబున రామయార్యునకు భేదం బబ్బ దొక్కింతయున్.

ఉ. తిట్టిరి పెల్చ నోరి కసిదీఱఁగ రామయపంతులిల్లు వా
కట్టయి గ్రామ్యభాష కపకార మొనర్చెనెయంచుఁ గాని యె
ప్పట్టున రామయార్యుఁడటు భాషకు శాశ్వతసేవ చేసి యం
దిట్టివిభేదమున్నదని యించుక కార్యము చేసి చూపిరే.

మ ఎవరేమన్నసహించి మానసము తా నేకాగ్రతన్ నిల్పి సూ
ర్యవిభూత్తంసుకరావలంబనమునన్ రంజిల్లఁగా నాంధ్రభా
ష వరిష్ఠంబగు కోశమున్ బడయఁదీక్షన్ బూని రేయుంబవల్
స్థవిరుండయ్యుఁ దపంబుసేసెఁగద యాశ్వాసాంత మేకాకృతిన్.

చ కలుగఁగవచ్చు నంతయధికార మొనర్చినవారు; భాషకున్
గలుగఁగవచ్చు రక్షణ మొనర్చెడి యంతటివారు, వేదవే
త్తలఁదగుమన్ననన్ దనుపుదాతలు గల్గఁగవచ్చుఁగాని యి
ట్టులఖిలసద్గుణాప్తిఁబొగడ్కఁ గన రామయకే తగున్ గదా.

ఉ. భారతమాంధ్రమందు వనపర్వములో నొకకొంత చెప్పి భ
ట్టారకుడస్తమించె ననుటన్ దలపించె; నిఘంటుభాగముల్
దీరిచి రెండు; మూఁడవది తీర్చుచు స్వఃపురిఁ జేరురామయో
దారు స్మరించినన్, దలప నాంధ్రకవిత్వ విశారదాంకముల్.

చ. ద్రవిడము కన్నడంబెఱిఁగి దైవతభాషఁగలట్టి మర్మముల్
వివిధము లాకళించి, కబళించి తెలుంగును హూణభాషయున్
బ్రవిమలరీతి నన్నిట నిరామయసాహితిగన్న మేటి నేఁ
డెవఁడుగలండు రామయబుధేంద్రుఁడు దక్కఁ మఱొక్కఁడెయ్యెడన్.

ఉ. పుట్టినవారలెల్లఁ జనిపోవకమానరుగాని భాషకుం
బట్టముగట్ట సూర్యనరపాలసమాఖ్యనిఘంటుసృష్టికై
పట్టినపట్టు పూర్ణమయి పండఁగనుండ ధరిత్రిఁ బాసి యి
ప్పట్టున రామయార్యుఁడు దివంబునకేఁగుట యెంతఘోరమో.

సీ. తనచేతిమీఁద నిల్పిన యాంధ్రసాహిత్య
పరిషత్తు భువినెంతవఱకుఁ దనరు
సూర్యరాయనిఘంటువర్యమర్యముఁ బోల్కి
నాంధ్రంబు నెందాక నలరఁజేయు
స్వయముగా శోధించు శాసనంబులు దేశ
చరిత కెందాఁకఁ బోషకములగును
తనతెనిగించు నుత్తరరామచరితాది
కృతులెందనుక బుధస్తుతిఁ జెలంగు
నంతదాఁక జయంతి రామయ్యపంతు
లుర్విలేఁడనుటెట్లు ? మృత్యువుతదీయ
పాంచభౌతికతను వాహరించుఁగాక
తదచలితకీర్తిగాత్రమ్ముఁ దాఁకఁగలదె ?

ఉ. ఆతఁడనాప్తకాముఁడు చిరాయువు పూర్ణధనుండు గౌరవో
పేతుఁడు, పుత్రవంతుఁ డొకయించుకలోపములేనివాఁడె, కా
నీ తనయంతవాని నొకనిన్ మన కీయకపోయె సాహితీ
మాతకు నేఁడు దిక్కనుచుమాత్రము చింతనుగాంతు మెంతయున్.

ఆ. వె. ముందు నీవొ నేనొ పందెమన్నట్లు, ల
క్ష్మాంగలక్ష్మిపోయి యకట ! నాల్గు
నెలలు గాకమున్నె యిలఁబాసిచనె రామ
యార్యుఁడెట్టి ధార్మికాగ్రసరుఁడొ.

గీ. శాంతి గల్గుత రామయపంతు లంత
రాత్మ కేలోకమునను న్న న ష్టదయశ
యంబున నటంచుఁ బల్కు మాత్రంబె కాని
యన్మహాత్మున కేమి సేయంగఁగలము.

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

# ఆర్యనిర్వాణమ్.

౧. వాణీ యస్య శ్రవణసుఖదా సాంప్రదాయాభిరామా
జ్ఞానం యస్య ప్రకటిత మభూత్ తత్త్వనిర్ణేయవాదే
యత్రాప్రావీణ్యం నిరుపమ మహో సర్వతస్త్రస్వతన్త్రం
విద్వాన్ సోఽయం దివ ముపగతో రామయార్యో వదాన్యః.

౨. సాకల్యం యోఽపర దసదృశీ మాంధ్రసాహిత్యవిద్యాం
యః ప్రఖ్యాతః సునిశితమతి ర్వ్యాకృతిద్యాప్రసక్తే
యో వ్యాక్షేపాన్ పరజనకృతాన్ వారయామాస తూర్ణం
విద్వాన్ సోఽయం దివ ముపగతో రామయార్యో దయాళుః.

3. య స్సంజాతో మహతి విమలే శ్రోత్రియాణాం కుటుమ్బే
సూత్రీర్ణో యః ప్రథమగణితో న్యాయశాస్త్రే ప్రశస్తే
వ్యజ్ఞాసీ ద్యో ద్రవిడవిషయాం భారతీం జాగరూకః
యోగైర్వాణీ మవిద దనఘః కన్నడీం వాచ మిాడ్యాం.

౪. తేజోరాశి ర్నభసి లసతే సారసాప్తస్తు సూర్యః
ఆంధ్రే దేశే విబుధవినుతో రామయార్య స్సుకీర్తిః
ద్వా వేవైతౌ నిరుపమరుచీ దర్శయన్తౌ పదార్థాన్
నాస్త్యే వాన్యో దివి భువి సమ స్తత్ప్రభావానుకారీ.

౫ యస్యార్యస్య ప్రథిత మభవ జ్జీవితం శీలపూతం
యోఽంబా మాంధ్రీం సుమసమపదాం పూజయామాస భక్త్యా
యే నార్యేణ వ్యరచి మధురం పావనం కావ్యజాతం
తం విద్వాంసం కథ మిన వయం విస్మరామో వరేణ్యం.

౬. ఆత్మాభిమానతేజస్వీ స్వీయధర్మపరాయణః
అసమానయశోరాశీ రాజరాజప్రపూజితః.

౭. గ్రాంథికాంధ్రసముద్ధర్తా కుభాషాతిమిరార్యమా
ప్రాచీనశాసనానాం చః సంపాదనపరాయణః

౮. విమర్శకవరో ధీరో పండితారాధనే రతః
సంస్థాపకశ్చ సంరక్షీ శ్ర్యాన్ధ్రసాహిత్యసంసదః.

౯. సూర్యరాయాంధ్ర కోశస్య నిర్మాణ నిపుణస్సుధీః
రాజతాం దివ్యభోగై స్సో జ్ఞానానన్దమయోఽవ్యయః.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

## కీ॥ శే॥ జయంతి రామయ్యపంతులుగారు.



కట- కటా- 1941 సంవత్సరము ప్రారంభమునందే మనదురదృష్ట ముచేత నాంధ్రమహాపురుషులలో నిద్దఱిని దనపొట్టఁ బెట్టుకొనినది. ఆ సేతుహిమాచలపర్యంతమైనభరతఖండమునందంతట రాజకీయవిషయములలో మిక్కిలి పేరుపడిన న్యాయపతి సుబ్బారావుపంతులుగారిని గడచిన జనవరి 5 వ తేదీని కబళించినది. ఆంధ్రమహాజనులా దుఃఖము నుండి పూర్తిగా బయటబడి తేఱుకొనకమునుపే, యాఫిబ్రవరి 9 వ తేదీని శ్రీ జయంతి రామయ్యపంతులుగారిని మ్రింగివేసినది. రామయ్యపంతులుగారికిని, నాకును రమారమి 40 సంవత్సరములనుండి పరిచయము కలదు. అందుచేత నామహాపురుషునిగూర్చి నేనెఱింగిన విషయములఁ

గొన్ని యిందు వ్రాయుట విధియని యీచిన్నివ్యాసము వ్రాయుచున్నా ను. రామయ్యపంతులుగారు తూర్పుగోదావరిమండలియందలి ముక్తీ శ్వరనివాసులు, కౌశికగోత్రుడు. వెలనాటివైదికబ్రాహ్మణుడు. కృష్ణ యజుర్వేది ఆపస్తంబసూత్రుడు. ముక్తీశ్వరగ్రామము గోదావరికి పడ మటియొడ్డున, కోటిపల్లిగ్రామమునకు నెదురుగానున్నది. అక్కడి దేవుని పేరు ముక్తీశ్వరస్వామి.

వీరితల్లిదండ్రుల సంతానములో రామయ్యగారు మూడవవారు. కొమాళ్లలో రెండవవారు, తండ్రిగారిపేరు రామయ్యగారు, తల్లిగారి పేరు సోమమ్మగారు, ఈయన అన్నగారిపేరు పేరయ్యశాస్త్రిగారు. వీరు జన్మించిన 21వ దినమున తండ్రిగారు ఈయనను దనపినతండ్రిగారికి దత్తపుత్రునిగా నిచ్చిరి. ఈయన వెనుకటి రౌద్రినామసంవత్సరము, ఆషాఢబహుళఅమావాస్యనాడు అనగా 1860 సం॥ జూలై 18వ తేది బుధవారమునాడు సూర్యోదయకాలమున జన్మించిరి. కాబట్టి యీ మృతినొందినకాలమునాటికి 81 సంవత్సరములు.

ఈయనకు రమారమి 6 సం॥న అక్షరాభ్యాసము ఉపనయనము కూడ నయినవి. బాల్యమున రామయ్యగారు ముక్తీశ్వరములోనున్న తెలుగుబడిలోనే విద్యాభ్యాసము చేసిరి. వీరి ప్రారంభగురువు గుత్తిం దీవి గ్రామనివాసియైన చాగంటి వీరభద్రయ్యగా రను నొక యారాధ్య బ్రాహ్మణుడు. ఆదినములలో వీరు బాలరామాయణము, నమరకోశ మును వల్లించిరి. ఆదినములలో పలకలుగాని, పలకపుల్లలుగాని లేవు. వ్రాత తాటియాకులమీద నినుపగంటములతో వ్రాయుచుండెడి వారు. 1870 సం॥న నాపాఠశాల సర్కారువారి గ్రాంటుసహాయము పుచ్చుకొను పాఠశాలగా మార్పబడినది. అందు రెండు తరగతు లుం డినవి. వానిలో నెక్కువ తరగతిలోనే రామయ్యగారిని వేసిరి. ఆయన యాపాఠశాలలో కొంచెమే నేర్చుకొనిరి. 1874 సం॥వఱకు విద్యయనె డిది నేమియు లేకయే స్వగ్రామమున కాలము గడపిరి. ఆసం॥న నొక

మార్పు జరిగెను. ఈమార్పే రామయ్యగారి భవిష్యజ్జీవితమునకు ముఖ్యాధారము. ఈయన అన్నగారగు పేరయ్యశాస్త్రిగా రప్పటికి రాజమహేంద్రవరపు కళాశాలలోఁ జదువుకొనుచు, వేసవికాలపు సెలవులలో ముక్తేశ్వరము వెళ్లిరి. ఆసెలవుదినములలో పేరయ్యశాస్త్రిగారు తమ్మునకు నింగ్లీషు నేర్పిరి. ఆస్వల్పకాలములోనే రామయ్యగారు కుశాగ్రబుద్ధియగుటచే నింగ్లీషులోఁ గొంతజ్ఞానము సంపాదించిరి. సెలవులతరువాత వీరిని రాజమహేంద్రవరము తీసికొనివెళ్లి, టవున్ మిడిల్ స్కూలులో అప్పర్ ఫోర్తుతరగతి, బి. డివిజనులోఁ జేర్పించిరి. ఇది 1874 సం॥ జూలై నెలలో జరిగెను. ఆకాలమున రామయ్యగారికి మంత్రిప్రెగడ వెంకటరత్నముగారు గురువులు. ఈయన మనదేశమున జిల్లాకలెక్టరు మొదలైన గొప్పపదవుల నధిష్టించిన మంత్రిప్రెగడ నరసింహాముపంతులుగారి పినతండ్రి.

అక్కడ నొకసంవత్సరము చదివినతరువాత రాజమహేంద్రవరములో కళాశాలలోఁ జేరిరి. ఆకాలములో ఎడ్వర్డు పార్ మెట్ కాఫ్ దొరగారు ఆకళాశాలప్రధానోపాధ్యాయులుగా నుండిరి. ఆకళాశాలలో చదివి, రామయ్యగారు 1877 సం॥ర మెట్రిక్యులేషను పరీక్షకు వెళ్లి మొదటితరగతియం దుత్తీర్ణులైరి. అంతతో చదువుమానక రామయ్యగారు నేటియింటరుమీడియటుకు సరియైన ఎఫ్ యేకు చదివి యీపరీక్షలోకూడ మొదటితరగతిలో 1879 లో నుత్తీర్ణులైరి. ఆకాలమున ఎఫ్ యే పరీక్షలో నుత్తీర్ణులైనవారికి నుపాధ్యాయపదవులు సులభముగ దొరకెడివి. రామయ్యగారుకూడ నుపాధ్యాయపదవిలో బ్రవేశింపవలెనని ప్రయత్నించిరి, కాని మెట్ కాఫ్ దొరగారు వీరి తెలివితేటలకు మెచ్చి బి. ఏ. కూడ ప్యాసుచేయించవలెనని యుద్యోగప్రయత్నముమానిపించి బి. ఏ. తరగతిలోఁ జేర్చుకొనిరి. బి. ఏ. తరగతిలోఁ జదువుచున్న 2 వ సం॥న రామయ్యగారి బుద్ధివిశేషము వ్యక్తీకరించునట్టి యొక్క విశేషము జరిగెను. బ్రహ్మసమాజమతప్రబోధకుఁడైన పండిట్ శివనాథశాస్త్రి

గారు బ్రహ్మమతప్రచారము నిమిత్తమై 1881 సం॥న రాజమహేంద్రవరము విజయముచేసి యాంగ్లేయభాషలో జనులు సమ్మోహకమగునట్లు అతిగంభీరోపన్యాసము లొసఁగిరి. ఆకాలమున షార్టుహేండు రైటింగు అను క్లుప్తలేఖనము లేదు అందుచేత నట్టిమహోపన్యాసములైనను స్థిరముగా నుండుటకు వీలు లేకపోయెడిది రామయ్యగారు విద్యార్థిగా నుండి యాయుపన్యాసములకుఁబోయి, క్లుప్త లేఖనము రాకపోయినను, రూళ్ల పెనిసిలు కాగితము పుచ్చుకొని వారియుపన్యాసము లన్నిటిని సరిగా, వ్రాసి చెన్నపురము యింగ్లీషుపత్రికలకుఁ పంపిరి. పత్రికలలో వానిని జదివినవారు శివనాథశాస్త్రిగారి యుపన్యాసములు సంపూర్తిగా, నే కొఱంతయు లేక సంపూర్ణముగఁ బ్రకటింపఁబడినవని మెచ్చి సరిగా ప్రకటింపఁబడినవని, యవి యెవ్వరు వ్రాసిరని వాకబుచేసిరి. బి. ఏ. తరగతి విద్యార్థి జయంతి రామయ్యగారు వ్రాసిరని తెలిసినతరువాత నీచికిలి కన్నుల చిన్నవాడే నా యింత బుద్ధివిశేషములతో నింత గంగాప్రవాహమువంటి యీమహోపన్యాసము వ్రాసెనాయనియాశ్చర్యముపొందిరి. రామయ్యపంతులుగారు చిన్నతనమునఁ గన్నులు చికిలించెడివారని యెఱిఁగినవారు చెప్పుదురు రామయ్యగారు 1880-81 సం॥లో బి. ఏ. కుఁ జదివి 82 సం॥లో బి. ఏ. 2 వ తరగతిలోఁ కృతార్థులైరి. ఆకాలమున రాజమండ్రి కళాశాలలో యింగ్లీషు, తెలుఁగుగాక, గణితశాస్త్రమును, తర్కశాస్త్రము (లాజిక్కు) మాత్రమే నేర్పెడువారు. రామయ్యగారు తర్కశాస్త్రము తీసికొని కృతార్థులైరి. రాజమండ్రి కళాశాలలో బి. ఏ. పరీక్షలో నుత్తీర్ణులైనజట్టులో వీరిది మూఁడవది. మొదటి జట్టులోనివారు జయంతి పేరయ్యశాస్త్రిగారు, బసవరాజు గవర్రాజుగారు, గరికపాటి సుబ్బారాయుఁడుగారు, మంతపూడి కామేశ్వరరావుగారు. 1882 సం॥రం జూలైలో రామయ్యగారు పిఠాపుర సంస్థానములో స్కూలునకుఁ బ్రధానోపాధ్యాయులుగా వెళ్లిరి. ఆయన వెళ్లునప్పటి కది మిడిల్ స్కూలుగా నుండెను.

1883 సం॥లో ఆస్కూలులో మెట్రిక్యులేషనుక్లాసు స్థాపించి ముగ్గురినో, నలుగురినో పరీక్షకుఁ బంపిరి. వారిలో నిద్దఱు కృతార్థులైరి. ఆకాలమున మెట్రిక్యులేషను పరీక్షకు విద్యార్థులను బంపుటకిప్పటివలె హిరణ్యాక్షవరములవంటి కఠిననిబంధనలు లేవు.

1883 సం॥ న రామయ్యపంతులుగారికి వివాహమైనది. నరసాపురము నివాసులైన నుదురుపాటి లక్ష్మీనరసయ్యగారి జ్యేష్ఠపుత్త్రిక, లక్ష్మీదేవమ్మగారిని వివాహమాడిరి. ఈమె మిక్కిలి అదృష్టవంతురాలై రామయ్యగారి చెట్టఁబట్టినది మొదలు, మిక్కిలి సుఖపడి పంతులుగారు పోవుటకు ముందుగా నే యామె 3 మాసములక్రిందటఁ కాలధర్మము నొందెను.

1884 సం॥రం ఆరంభమున రామయ్యగారు తన యుపాధ్యాయపదవిని వదలిపెట్టి, బి. ఎల్. పరీక్షకుఁ జదువుకొనుటకు చెన్నపట్టణము వెళ్లిరి. 1884-85 సం॥లో బి. ఎల్ చదువుకొని 1886 సం॥ లో బి. ఎల్ పరీక్షలో నుత్తీర్ణులైరి. ఆకాలమున చెన్నపురమునకు రైలుమార్గము లేకపోవుటచేత మదరాసునకు వెళ్లఁదలచినవా రందరుకూడ, కాకినాడలో స్టీమరుమీఁద నెక్కి వెళ్ళవలసినదే. ఆపొగయోడ 3 వ నాఁడు చెన్నపురముఁ జేరెడిది. రామయ్యగారీపొగయోడపయనములో నొకసారి ఓడమీఁదనుండి జారి సముద్రములోఁ బడిపోయిరఁట. ఓడకప్తాను పైనుండిచూచి చప్పుచప్పున మెట్లు దిగి వచ్చి జుట్టుపట్టుకొని మునిఁగి తేలుచున్న రామయ్యగారిని బ్రతికించెనఁట. ఇప్పటివలె విద్యార్థులకు బోడితలలేయున్న పక్షమున రామయ్యపంతులుగారు నాఁడు జలగండముపాలైయుందురు. ఆయనజుట్టే మహోపకారముచేసి ప్రాణము రక్షించినది. గొప్పపరీక్షలలో నుత్తీర్ణులై మహాపదవుల నాక్రమించి యాంధ్రసారస్వతమునకు, నందుమూలమున మాతృదేశమునకు, మహోపకారముఁ జేయుటకు నుద్దేశింపఁబడిన యామహాపురుషుఁడు జలగండముపాలైపోవునా? భగవంతుఁడు తనసంకల్పము నెరవేర్చుకొనక మానునా?

ఈ బి. ఎల్ తరగతిలోఁ జదువునప్పుడు శ్రీ మరుశేటి శేషగిరిరావు
పంతులుగారు, యిటీవల హైకోర్టుజడ్జీపని చేసిన పి. ఆర్. సుందరయ్యరు
గారు, హైకోర్టుజడ్జీగానుండిన సదాశివయ్యరుగారి తమ్ముఁడైన పరమే
శ్వరయ్యగారును, రామయ్యగారికి సహాధ్యాయులుగా నుండిరి. రామ
య్యగారికి మొదటినుండియు యావజ్జీవము న్యాయవాదిగా నుండవలెన
నియు, శేషగిరిరావుపంతులుగారికి గవర్న్మెంటు ఉద్యోగము చేయవలె
ననియుఁ గోరికలుండెడివఁట, కాని యా కోరికలు తారుమారైనవి. రామ
య్యగారు గవర్న్మెంటుకొలువులోఁ జేరిరి. మరుశేటి శేషగిరిరావుపంతు
లుగారు న్యాయవాదిగా నుండిరి. 1886 సం॥న గోదావరిజిల్లాకు థామ్సన్
దొరగారు కలక్టరుగా నుండిరి. ఆయనదగ్గర జంధ్యాల పార్వతీశ్వరశాస్త్రి
గారు హుజూరు శిరస్తదారుగా నుండిరి. అదివఱకు ఆంగ్లేయభాషలో గొప్ప
పరీక్షలయందు త్తీర్ణులుకాని సామాన్యజనులు గవర్న్మెంటుకొలువులోఁ
జేరి మెజిస్ట్రేటులు, తహసిల్దారులై, లంచగొండులై జనులను బాధించు
చుండెడివారు. ఇంగ్లీషువిద్యాపారంగతులైన విద్యార్థులను జేరఁదీసి
యుద్యోగము లిచ్చి బాగుచేసినయెడల లంచగొండితనము తగ్గిపోవునని
థామ్సన్దొరగారికిని, వారి శిరస్తదారువారికిని, నేకాభిప్రాయము కలి
గెను. తదనుసారముగా థామ్సన్దొరగారు రామయ్యపంతులుగారిని
బిలిపించి, ఒక్కమారుగా రు 60- లు ఉద్యోగము నిచ్చిరి. ఆలాగుననే
పెద్దిభొట్ల వెంకటప్పయ్యగారికిని, కల్లూరి జగన్నాథముగారికిని దొరగారు
తగిన యుద్యోగముల నిచ్చిరి.

శ్రీ రామయ్యపంతులుగారు త్వరలోనే యింగ్లీషు హెడ్క్లర్
కై 1890 సం॥న శిరస్తదారై 1891 సం॥న నరసాపురము డిప్యూటీ
కలెక్టరుగా వెళ్లిరి. ఇంత త్వరలో గొప్పపదవి నాక్రమించినవారు నరు
దుగా నున్నారు. థామ్సన్దొరగారిచేత మొట్టమొదటఁ గొలువులోఁ
జేర్చుకొనఁబడిన బి. ఏ. లు, న్యాయమార్గముగానె వ్యవహరించిరిగాని

తరువాతతరువాతఁ జేరిన బి. ఏ. లు కొందఱు తాము చదివిన కళాశాలకును తమకు పట్టా లిచ్చిన విశ్వవిద్యాపీఠమునకును, స్వప్రతిష్ఠ కలుగునట్లు లంచగొండులై నీతిఁదప్పి వర్తించిరని వ్రాయుటకు విచారకరముగానున్నది. పండితరాయలువారు చెప్పిన యొక శ్లోకమునకుఁ దాత్పర్య మిప్పుడు స్ఫురణకు వచ్చుచున్నది. దుర్జనుఁడు యెంత చదువుకొన్నను సాధువు కానేరఁడు. ఎట్లన నీటిలోఁ బడవేసిన వస్తువు క్రమముగా మెత్తపడును. మైనాకపర్వతము అనేకవేలలక్షల సంవత్సరములు నీటిలో నున్నను మెత్తపడుటకు మాఱుగా గట్టిపడినది ఇదియే పండితరాయలువారు వ్రాసిన శ్లోకమునకుఁ దాత్పర్యము. ఆలాగువనే దుర్జనుఁడు సజ్జనుఁడు కాఁడు. మఱింతయెక్కువ దుర్జనుఁ డగును. రామయ్యపంతులుగారు నరసాపురము డిప్యూటీకలక్టరైనది మొదలుకొని యే కొన్నిదినములలో తప్ప, డిప్యూటీకలక్టరు పదవియందే యుండిరి. కాకినాఁడ, రసులుకొండ, విశాఖపట్టణము, నరసారావుపేట,బళ్లారి, అనంతపురము, కడప మండలములోని జమ్మలమడుగు, చిత్తూరిమండలములోని చంద్రగిరి మొదలగు తావులలో డిప్యూటీకలక్టరు పదవి చేసి, ఎక్కడ పనిచేసినను నగ్నిహోత్రమున నొకకాలు, మంచిగంధమున నొకకాలు బెట్టినట్లు న్యాయపథమును దప్పకుండ వ్యవహరించి గవర్నమెంటువారి మెప్పును, ప్రజల మెప్పును బడసిరి. 1911 సం॥న రామయ్యపంతులుగారిని గవర్నమెంటువారు చెన్నపురములో ప్రెసిడెన్సీ మెజస్ట్రేటుగా నియమించిరి. అక్కడకూడ వారు గొప్పపేరు సంపాదించిరి. అక్కడ నున్నప్పుడే బంగాళములో వంగీయసాహిత్యపరిషత్తువంటి ఆంధ్రసాహిత్యపరిషత్తును స్థాపించి మాతృభాషాసేవ చేయవలెనని సంకల్పము కలిగెను. ఆసంకల్పము త్వరలోనే కార్యరూపమును వహించెను.

1911 సం॥లో పరిషత్తు స్థాపింపఁబడెను. శ్రీ పిఠాపురము మహారాజావారు, శ్రీ వెంకటగిరి మహారాజావారును, శ్రీ బొబ్బిలి

మహారాజావారును గొప్పగొప్ప విరాళము లిచ్చి పరిషత్తునకు స్థాపకు లైరి. వారందఱు నిచ్చిన విరాళములచేతనే పరిషత్తున కిప్పుడు రమా రమి రు 20,000/- రూపాయలు మూలధనముగా నున్నది. ఇది యంతయు రామయ్యపంతులుగారి కృషివలనను మహారాజుల యౌదార్య దేశాభిమానములవలనను నేర్పడినది.

ఈ పరిషత్పక్షమున పత్త్రిక నొకటి రామయ్యగారు ప్రకటించు చున్నారు. అది యిప్పటికిని సాగుచున్నది. పరిషత్తుయొక్క కార్యనిర్వాహకవర్గమునకు రామయ్యపంతులుగారు మొదటినుండియు, ఆమరణాంతము అధ్యక్షులుగా నుండిరి. ఈ పరిషత్తు నేటేట నాంధ్రదేశమున నొక ముఖ్యపట్టణమున సమావేశపఱచి, భాషావిషయమునను, సారస్వత విషయమునను సుప్రసిద్ధపండితులచేత మహోపన్యాసము లిప్పించి రామయ్యపంతులుగారు ఆయాప్రదేశములకు వెళ్లి, సభలను జయప్రదముగా జరిపించుచుండెడివారు. సభలు జరిగెడుగ్రామములలో సన్మానసంఘ మేర్పడి వచ్చిన పండితులకు భోజనసౌకర్యములు చేయుచుండినను రామయ్యగారు తాము వేరే బసచేసి, తమ సొంతడబ్బు ఖర్చుపెట్టి పండితులను తమ బసకు రావించి, తమ పంక్తిని భోజనము పెట్టి సరదాగా కాలము గడపుచుండెడివారు. పండితగోష్ఠి వారికి మిక్కిలి నిష్టము. పరిషత్తు వారికి నిజమైన పుత్త్రికగా నుండినది. దాని యభ్యుదయము, తమయభ్యుదయమువలె వారు భావించుకొనుచుండెడివారు. ఒక సంవత్సరము పరిషత్తు నెవరు పిలుకపోవుటచే వారిస్వగ్రామమైన ముక్తీశ్వరములోనే వారి స్వంతడబ్బు ఖర్చుపెట్టి పరిషత్సభ జరిపిరి.

1933 సం॥న పరిషత్తును వారు రాజమహేంద్రవరములో జరుప నిశ్చయించిరి. అప్పుడు మొదట నుత్సాహముతో జరుపుదుమన్నవారు కొంచెము వెనుదీయుటచే రామయ్యపంతులుగారు తమస్వంతడబ్బు ఖర్చుపెట్టి రాజమహేంద్రవరములో సభ జరిపెదనని నాపేర వ్రాసిరి. అది న్యాయము కాదని నాకుఁ దోఁచినందున రాజమహేంద్రవరములోనే

సభ జరుపఁబడునని నేను వారిపేర వ్రాసితిని. రాజమహేంద్రపురనివాసులైన మద్దాల వెంకటచలముగారు, డాక్టరు పాలకోడేటి గురుమూర్తిగారు పూనుకొని ఆసంవత్సరము సభ జయప్రదముగా జరిపించిరి. రాజమహేంద్రపురనివాసులకు భాషాభిమానము కలదని రామయ్యపంతులుగారు సంతోషించిరి. రామయ్యగారికి మొదటినుండియు నాంగ్లేయభాషలో ఆక్సుఫోర్డు డిక్షనరీ వంటి సంపూర్ణనిఘంటువు తెలుఁగులోఁగూడ నుండవలెనని సంకల్పము కలదు. ఆసంకల్పమును వారు శ్రీ పిఠాపురము మహారాజావారితో మనవి చేయఁగా నాంధ్రభోజులు, అభినవకృష్ణదేవరాయలు అను సార్థకబిరుదములు వడసిన శ్రీ పిఠాపురము మహారాజావారు నిఘంటువును నిర్మింపవలసిదనియు దానికిఁ గావలసిన ధన మంతయుఁ దామొక్కరే భరింతుమనియు, వాగ్దానముచేసి, ప్రోత్సాహపఱచిరి. ఆవాగ్దానము ప్రకార మిప్పటికి రమారమి లక్షరూపాయలు దానికొఱకు వినియోగపఱచిరి. ఇప్పటికి నిఘంటు 2 సంపుటములుగా నచ్చుపడి వెలువడినది. మూఁడవ సంపుటము అచ్చుపడుచున్నది. మఱి రెండు సంపుటములగునేమో యని యూహించుచున్నాము. నిఘంటునిర్మాణకార్యమున మొట్టమొదట వేదము వెంకటరాయశాస్త్రిగారు నియమింపఁబడిరి; నిఘంటుకార్యాలయము మొట్టమొదట చెన్నపురమునన్నను పిఠాపురము మార్పబడినది. తరువాత బ్ర॥శ్రీ॥ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, కూచి నరసింహము పంతులుగారు, పురాణపండా మల్లయ్యశాస్త్రిగారు. చర్ల నారాయణశాస్త్రిగారు మొదలగు మహాపండితులు నిఘంటువు నిర్మించిరి.

పరిషత్కార్యస్థానము మొదట చెన్నపురమున నున్నను ఇటీవల 1925 సం॥న కాకినాఁడకు మార్చఁబడి, శ్రీ మహారాజావారి ప్రాతతాణాకచేరిలో నెలకొల్పఁబడియున్నది. ఈ పరిషత్కార్యాలయములో గొప్ప పుస్తకభాండాగారము నున్నది తాటియాకుల గ్రంథములే

రమారమి 5 వేలున్నవి. ముద్రితగ్రంథములకూడ నించుమించుగా 5 వేలున్నవి. ఇటువంటి గ్రంథభాండాగారము తెలుఁగుదేశమందెచ్చటను లేదని చెప్పుట యతిశయోక్తిగాదు. పరిషత్తునకు శ్రీమాన్ కిడాంబి రాఘవాచార్యులు ఎం. ఏ. బి. ఎల్. గారును; విజయూరి వెంకన్నపంతులు ఎం. ఏ. గారును కార్యదర్శులుగా నుండి యెక్కువ శ్రద్ధతో బనిచేయుచున్నారు. ఇది స్థాపించిన కొలఁదికాలమునకే పరిషత్తునకు, శ్రీకొత్తపల్లి సూర్యారావుగారు మేనేజరుగా నుండి దీని యభ్యుదయము కొఱకు నిరంతరాయముగా పాటుపడిరి. వారు మూఁడు సంవత్సరముల క్రిందట కాలధర్మము నొందిరి.

వారిమరణమువలనఁ బరిషత్తునకుఁదీరని లోటువాటిల్లినదని చెప్పుట సత్యమునకు దూరముగాదు. ఇటువంటి గొప్పపరిషత్తు స్థాపింపఁబడి ముప్పదిసంవత్సరములైనను నేఁటికిని స్వంతగృహము లేకపోవుట మిక్కిలి శోచనీయము. ఆంధ్రమహాజనులు ధనము ప్రోగుచేసి పరిషత్తునకు స్వగృహము కలుగఁజేయుటయే రామయ్యపంతులుగారి యెడల వారికృతజ్ఞత జూపుటకు ముఖ్యాధారము. రామయ్యపంతులుగారి దేశసేవ పరిషత్ స్థాపనతో ముగియలేదు. చిన్ననాఁటనుండియు పూర్వరాజుల తామ్రశిలాశాసనములు తెప్పించి ప్రకటించుట వారికిఁగుతూహలము. వారుసెలవుమీఁద స్వగ్రామములో నున్నపుడు రెడ్డిరాజైన కాటయవేమభూపాలుని తొత్తరమూడి శాసనము వారికి లభించినది. శాసనములలోని విషయములు పూర్వకాలపువి యగుటచే నాలిపి తెలియుట కష్టము. వానికి మసివేసి శ్రమ పడినగాని యవి పఠనయోగ్యములు కావు రామయ్యపంతులుగారిట్టి శాసనములు రమారమి 1200లు శోధించివానిలోని విషయములు వ్రాసిరి. అందులో 400లు ఆంధ్రవిశ్వవిద్యాపీఠమునకుఁ బ్రకటనార్థమిచ్చిరి. రామయ్యపంతులుగారు శాసనపరిశోధనములో మిక్కిలి నిపుణులని తెలిసికొని యిండియాగవర్నమెంటువారు యాంధ్రదేశపుశాసనములు 800లు పరిష్కారమునిమిత్తము

వారియొద్దకుఁ బంపిరి. పంతులుగారు వానినన్నిటిని శోధించి, యుపోద్ఘాతములు, లఘువ్యాఖ్యానములు వ్రాసి గవర్నమెంటువారికిఁబంపించిరి. అవి ముద్రితములై సంపుటములుగా స్వల్పకాలములో రావచ్చును. రామయ్యపంతులుగారికి మొదటినుండియు గ్రాంథికభాషయే గ్రంథములలో నుండవలెనేగాని, వ్యావహారికభాష యుండఁగూడదని యభిప్రాయము. 1912-13 సం॥లో విద్యార్థులు పరీక్షలలో ప్రశ్నపత్త్రముల కుత్తరములు వ్రాయునప్పుడు వ్యావహారికభాష నుపయోగించునట్లు తగునేర్పాటు చేయించవలసినదని గవర్నమెంటువారిని వేఁడుచు గిడుగురామమూర్తిపంతులుగారు మొదలగు కొందఱు ప్రయత్నము చేసిరి. రామయ్యపంతులుగారు వారిప్రయత్నములను ప్రతిఘటించి వ్యావహారికభాష యుండఁగూడదనియు, గ్రాంథికభాష యుండవలయుననియు, తీర్మానము చేయించి కృతకృత్యులయిరి. ఆసందర్భమున గ్రాంథికభాషాసంరక్షణ మనుపేర డిఫెన్సు ఆఫ్ లిటరరి తెలుఁగు అన్న గ్రంథమును యింగ్లీషులో వ్రాసిప్రకటించిరి.

రామయ్యపంతులుగారు తొత్తరమూడి శాసనముగాక మఱికొన్ని శాసనములను గూడ వెలిబుచ్చిరి. అందు నందంపూడిశాసన మొకటి. ఈశాసనము రాజమహేంద్రవరము పాలించిన రాజరాజమహారాజు నారాయణభట్టునకు నందంపూడిగ్రామ మగ్రహారముగా నిచ్చిన సంగతి తెలియఁజేయుచున్నది. ఈ నారాయణభట్టు మహాభారతము తెనిగించినప్పుడు నన్నయభట్టునకు యీశాసనము సంస్కృతములో రచియించినవాడు నన్నయభట్టు. సహాయపడి తోడ్పడినమహాకవి పండితుఁడు. నందంపూడి తూర్పుగోదావరీమండలిలో ముంగండకు మిక్కిలిదగ్గరగా నున్నది

మఱియొక ముఖ్యమైనశాసనము దేవులపల్లి శాసనము. ఈశాసనముఁ ప్రకటించి రామయ్యపంతులుగారు చరిత్రశోధకులకు గొప్ప సంశయముఁ దీర్చిరి. ఎట్లనఁగా విజయనగరసామ్రాజ్యమును మొదట

సంగమవంశపురాజులగు బుక్కరాయ-హరిహరరాయలు మొదలగు వారు-శతాబ్దముకంటె నధికముగాఁ బాలించిరి. వారితరువాత మఱి యొక వంశపురాజులు రాజ్యమాక్రమించిరి. కాని వారెవరో తెలియ లేదు. వారితరువాత తుళువవంశపురాజులు దేశమాక్రమించిరి. అందు మొదటివారు కృష్ణదేవరాయలతండ్రియగు నరసింహదేవరాయలు. సంగ మవంశమునకు తుళువవంశమునకు నడుమనున్న వంశమేదో తెలియక చరిత్రకారులు కొంతకాలము సంశయావస్థలో నుండిరి. రామయ్యగారు ప్రకటించిన దేవులపల్లిశాసనము వల్ల నీసంగమతుళువ, వంశముల నడుమ సాళువ వంశరాజులు విజయనగరసామ్రాజ్యము పరిపాలించినట్లు తేల్చి నది. ఈవంశమునకు నిద్దరురాజులే పరిపాలించిరి. అందు ముఖ్యుఁడు సాళువగుండ నరసింహరాజు, ఈతఁడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవివలన జైమినిభారతమును నంకితముగాఁ బడసెను.

తుళువవంశపు నరసింహదేవరాయలు సాళువనరసింహరాజు నొద్ద సేనాపతిగా నుండి యాతనియనంతరము రాజ్యమాక్రమించినట్లు తేలు చున్నది. మఱియొకటి మల్కాపురశాసనము. ఇదికాకతీయనృపులలో నగ్రగణ్యుఁడైన గణపతిదేవుని శాసనము. దీనివలన కాకతీయులచరిత్రయే కాక, ఆనాఁటిజనుల యాచారవ్యవహారములుకూడఁ దెలియుచున్నవి. మఱియొకటి యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనము. ఈశాసనమువలన గొప్ప విషయ మొకటి తేలినది. తెలుఁగుకవిత్వమును నన్నయభట్టార కుఁడే ప్రారంభించెననియును, నంతకుఁబూర్వము తెలుఁగుపద్యములే లేవనియు గొప్పప్రవాదము కలదు. ఈశాసనమువలన నావాదము కేవలప్రమాదజనితమని తేలుచున్నది. ఏలయన నీశాసనములోఁగొన్ని తెలుఁగుపద్యము లున్నవి. యుద్ధమల్లుఁడు చాళుక్యవంశస్థుఁడు. రాజ రాజునకు నన్నయభట్టునకు మిక్కిలిఁ బూర్వుఁడు, అతఁడు వ్రాయించిన శాసనములో పద్యములుండుటచేత నన్నపార్యునికంటెను, నాంధ్రభార తముకంటెను ముందు తెలుఁగుకవిత్వ మున్నదని స్పష్టపడుచున్నది.

ఈవిధముగా రామయ్యపంతులుగారు చారిత్రశోధకులకు, వాఙ్మయశోధకులకు తమశాసనప్రకటనములవలన సంశయవిచ్ఛేదము చేసి మహోపకారము చేసిరి. ఇవిగాక రామయ్యపంతులుగారు పెక్కువిషయములను గుఱించి వ్యాసములు వ్రాసి పరిషత్పత్త్రికలోఁ బ్రకటించిరి. అందొకటి కడపమండలములో జమ్మలమడుగుతాలూకాలోని పెదముడియము గ్రామముఁ గుఱించి. ఈగ్రామమును రామయ్యపంతులుగారు ముదివేము గ్రామమని నిర్ణయించిరి. ఈముదివేముగ్రామము తెనుఁగునాఁడున చాళుక్యవంశముస్థాపించిన విష్ణువర్ధనుని జన్మస్థానము. ఈవిష్ణువర్ధనునిబట్టియే చాళుక్యవంశపు రాజులకు విష్ణువర్ధనులని బిరుదుకలుగుచుండెను.

మఱియొకవ్యాసము నన్నిచోడునికాలముఁగుఱించి. ఇతఁడుకుమారసంభవమను మహాప్రబంధమును తెనుఁగులో వ్రాసెను. ఇతఁడొక రాజు. ఈరాజు నన్నయభట్టునికన్నఁ బూర్వుఁడని కొందఱు వాదించిరి. రామయ్యపంతులుగారు బహుపరిశోధనలు చేసి నన్నిచోడుఁడు నన్నయభట్టునకుఁదరువాతివాఁడని సహేతుకముగా నిర్ణయించిరి. వీరితోపాటు, వీరేశలింగముపంతులుగారును కొమర్రాజు లక్ష్మణరావుగారును అదే నిర్ణయమునకు వచ్చిరి. మఱియు బమ్మెరపోతరాజుయొక్కయు, వేములవాడభీమకవియొక్కయు నివాసస్థానములగూర్చియు రెండు వేరువేరు వ్యాసములు వ్రాసిరి. బమ్మెరపోతరాజు కడపమండలములోని ఒంటిమెట్ట గ్రామనివాసియని కీ॥ శే॥ వావిలకొలను సుబ్బారావుగారు హోరాహోరీగా వాదించి, తమవాదము నిలుపఁదలచి కొన్నిగ్రంథములు వ్రాసిరి. ఆవాదము సరియైనది కాదనియు బమ్మెరపోతరాజకవి, ఏక శిలానగరమను సంస్కృతనామముగల ఓరుగల్లు పురవాసియని, బహు హేతువులుచూపి సిద్ధాంతీకరించిరి.

ఇట్లే వేములవాడ భీమకవి నివాసస్థానము, తూర్పుగోదావరి మండలములోని దాక్షారామసమీపముననున్న వేములవాడయని లోకులు చెప్పుకొనుచుండిరి. అది నిజము కాదని, నిజాము రాజ్యములోని

మఱియొక వేములవాడ భీమకవి నివాసస్థానమని బహుకారణములు చూపి నిర్ణయించిరి. ఈనిర్ణయము బహుయుక్తియుక్తముగా నున్నది. పంతులుగారు పరిషత్పత్రికకు నిటువంటి వ్యాసములు చాల వ్రాసిరి. ఇవన్నియు నచ్చువేయించినపక్షమున నొక సంపుట మగును. అది వాఙ్మయసేవకులకు మిక్కిలి నుపయోగించును. పంతులుగారు పరిషత్తు భాండారమందున్న కొన్నిగ్రంథములకు సంపాదకులుగా నుండి ప్రకటించిరి. అందు మొదటిది కవిజనాశ్రయము ఇది యాంధ్రఛ్ఛందోగ్రంథములలో మిక్కిలిఁ బురాతనమైనది. దీనిని వేములవాడభీమకవి రచించెనని జనానువాదము కలదు. దీనికి పంతులుగారు విపులమైన పీఠికకూడ వ్రాసిరి.

మఱియొకటి రాయవాచకము. ఇది కృష్ణదేవరాయలకాలములో విజయనగరసామ్రాజ్య వ్యవహార మెట్లు జరిగెనో యావిషయమును తెలియఁజేయును. మూఁడవది శాసనపద్యమంజరి. ఇది రెండుభాగములు కలది. ఆంధ్రదేశమునందు దొరకిన శాసనములలోని పద్యములు తీసి వానిని సందర్భానుసారముగా వ్యాఖ్యానములు వ్రాసి పంతులుగారు ప్రకటించిరి. ఈవిధముగాఁ దెలుగు భాషకు వాఙ్మయమునకుఁ జేసినసేవ యపారము. ఉద్యోగవశమున వారెక్కడికి వెళ్ళినను నక్కడ నున్న శాసనములకొఱకు వెదకుకొనుచు వానిని సంపాదించి లోకమునకు వెల్లడిచేయుచుండిరి. తన వ్యవహారధర్మమునం దెంతమాత్రము పాలుమాలక, ప్రజానురంజనముగాఁ బరిపాలనచేయుచు నవకాశము కల్గినప్పు డెల్ల గ్రంథములను శాసనములను పరిశోధించుచు వారు భాషాసేవ చేసిరి. పంతులుగారికి పుత్ర, పుత్రికాసంతానము లేదు. అన్నబిడ్డలే కన్నబిడ్డలుగా వారు భావించిరి. అన్నగారైన పేరయ్యశాస్త్రిగారికి నలుగురు కొమాళ్లు. అందు జ్యేష్ఠుఁడు జయంతి శ్రీరామమూర్తిపంతులుగారు. ఈయన బి. ఎల్ పరీక్ష యందుఁ గృతార్థులై డిస్ట్రిక్టుమునసఫ్ గా కొంతకాలము పనిచేసి తరువాత సబుజడ్జిగా

నుండి నాలుగైదుసంవత్సరములక్రిందట పింఛను పుచ్చుకొనిరి. ఈయన గవర్నరుజనరల్‌గారి కార్యనిర్వాహకవర్గములోఁ గొంతకాలము సభ్యుఁడుగా నుండిన బయ్యా నరసింహేశ్వరశర్మగారి యల్లుఁడు, పేరయ్యశాస్త్రిగారి రెండవకుమారుఁడు రంగనాయకులుగారు, యీయన రామచంద్రపురములో న్యాయవాదిగానుండి బాల్యమునందే మృతినొందిరి. ఆయన ప్రథమభార్యకుమార్తెను రామయ్యపంతులుగారు భార్యయును దగ్గరకుఁదీసి మిక్కిలిప్రేమతో పెంచి, గంజాంమండలములోని ఆస్కాగ్రామనివాసులైన అప్పికట్ల తుంబునాథరావుగారి కుమారుఁడైన అప్పికట్ల సీతారాఘవరావుగారి కిచ్చి వివాహ మొనర్చిరి. వారు బి.ఎల్. పరీక్ష ప్యాసై చెన్నపురమునందు హైకోర్టులో న్యాయవాదిగా నున్నారు పేరయ్యశాస్త్రిగారి మూఁడవకుమారుఁడు బాలకృష్ణమూర్తిగారు. ఈయన నరసాపురములో న్యాయవాదిగా నున్నారు. నాలుగవ కుమారుఁడు జయంతి సోమశేఖరరావుగారు. ఈయనకూడ బి.ఎల్. పరీక్షయందు కృతార్థులై రాజమహేంద్రవరములో న్యాయవాదులుగా నున్నారు. అన్నకొడుకులకు, చిన్నతనమునందే పితృవియోగ మగుటచే రామయ్యపంతులుగారు వారి కందఱకు విద్యాబుద్ధులు చెప్పించి, గొప్ప పరీక్షలలో నుత్తీర్ణులఁజేసి కుటుంబమునకు మహోపకారముఁజేసిరి. పంతులుగారు కడపటి దినములలో అనఁగా 1940 సంవత్సరములో నొక కుమారుని పెంచుకొనిరి. ఆపిల్లవాఁడు, పంతులుగారిభార్యకు దగ్గిరబంధువుఁడు. ఆయనపేరుబుచ్చిరామశర్మ. పంతులుగారి కన్నతండ్రిపేరు తన పెంపుడు తండ్రిపేరు వచ్చునట్లు నామకరణము చేసిరి. ఆదత్తునకుఁ దన అన్నమునిమనుమరాలు అనగా, అప్పికట్ల సీతారాఘవరావుగారి కుమార్తె నిచ్చి వివాహము చేసిరి. 1920 సంవత్సరమున మన దేశమునకు వచ్చిన రాజకీయసంస్కరణములనుబట్టి గోదావరి, కృష్ణా మండలములపక్షమున పంతులుగారు ఢిల్లీశాసనసభకు సభ్యులుగా నిలిచి ప్రజలచేత నెన్నకొనఁబడి, మూఁడు సంవత్సరము లాశాసనసభలోఁ

ప్రజలపక్షమున పనిచేసిరి. ఆంధ్రవిశ్వవిద్యాపీఠము స్థాపించగానే సెనేటులో పంతులుగారు సభ్యులైరి. ఈ ఆంధ్రవిశ్వవిద్యాపీఠమునను, చెన్నపుర విశ్వవిద్యాపీఠమునను తెనుఁగు పాఠకపుస్తకములను పరీక్షలకు నిర్ణయించునట్టి యుపసంఘములలోను సభ్యులుగా నుండుటయేగాక, బహుపరీక్షలకుఁ దెనుఁగులో పరీక్షాధికారిగా నుండిరి.

ముప్పదియొక్క సంవత్సరములు దొరతనమువారి కొలువుచేసి 1917 సం॥ జూలై నెలలో మొదటితరగతి డిప్యూటీకలక్టరుగా పింఛను పుచ్చుకొని యిరువదినాలుగు సంవత్సరములు పింఛను పుచ్చుకొని పంతులుగారు యీఫిబ్రవరిలో పరమపదవి నొందిరి. పింఛను పుచ్చుకొన్నతరువాత గొప్ప యుద్యోగస్థులకు మఱియొక జమీందారుని యొద్దనో, మఱియొకచోటనో యుద్యోగము చేయవలయునని తలంపు కలుగుచుండును. అందుకై వారు పాటుపడుదురు. పంతులుగారు మఱియొకచోటఁ గొలువుచేసినచో స్వాతంత్ర్యమునకు భంగమనియో, తన భాషాసేవకు నది యంతరాయము కలిగించుననియో న్యాయముగా నిదివఱకు సంపాదించినది చాలునన్నసంతుష్టి కలిగియో మఱియొక కొలువునకు వా రాశపడలేదు. వారు పింఛను పుచ్చుకొన్నతరువాత నెందఱు జమీందారులయొద్దనో మంత్రిపదవులు ఖాళీవచ్చినవి. కాని వాని విషయమై పంతులుగా రెప్పుడును ప్రయత్నము చేయలేదు. గ్రంథపఠనమునందును, గ్రంథరచనమునందును, కోశసంశోధనమందును, వారు కాలము గడపిరి. గవర్నమెంటువారు నిరర్థకజీవులై స్వప్రయోజనపరులైన జనుల కెందఱకో బిరుదము లిచ్చిరి కాని, నిరంతరదేశసేవాపరాయణుఁడైన యీ మహనీయునకు నొక బిరుదమునైన నిచ్చినారుకారు. బిరుదము నియ్యకపోవుటయే మంచిది. బిరుదము లేకయే వారు మిక్కిలి శోభించుచున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాపీఠమువారు వీరికిని కళాప్రపూర్ణ బిరుద మిచ్చి వారే కృతార్థులైరి. పంతులుగారి జీవిత మెల్లవిధముల ధన్యమైనది. ఏలయన సంపూర్ణముగా విద్యాభ్యాసము చేసిరి. గొప్ప

పదవుల నాక్రమించి, సుఖ్యాతులైరి. అల్పాయుష్యులు కాక చిరకాల ము జీవించిరి. అనాయాసముగా మరణించిరి. అనాయాసముగా మరణమును దైన్యములేనిజీవనమును, హరిభక్తులుకానివారికి యోగులకైనను దుర్లభమని పెద్దలు చెప్పుదురు. ఈయన కిష్టదైవము "రాముఁడు" అందుచేత రామయ్యపంతులుగారు హరిభక్తులు. దైన్యములేని జీవనము చిరకాలము చేసి యనాయాసముగా స్వర్గస్థులైరి. ఇంతకంటె మనుష్యునకు గావలసిన దేమి? పంతులుగారు సంస్కృతము, కన్నడము, తెలుఁగు, యింగ్లీషు, అఱవము భాషలలోఁ బ్రవీణులు. తెనుఁగులో రసవంతమైన కవిత్వము చెప్పఁగలవారు. చాలకాలముక్రిందట ముక్తీశ్వరశతకము చెప్పిరి. తరువాత భవభూతి విరచితమైన ఉత్తరరామచరితము, భోజరాజ విరచితమైన రామాయణచంపువును, అమరుకకావ్యము నాంధ్రీకరించిరి. ఈనడుమ వాల్మీకిరామాయణములోని సంక్షేపసర్గయను మొదటిసర్గను కూడ నాంధ్రీకరించిరి. వీరికవిత్వము సులభమై, రసవంతమై, పాఠకుల కానందముఁ గలుగఁ జేయుచుండును.

శ్లో. పరివర్తిని సంసారే మృతః కోవా న జాయతే
స జాతో యేన జాతేన యాతి వంశ స్సమున్నతిం.

సంసారచక్రము తిరుగుచుండఁగాఁ జచ్చినవాఁడెవ్వఁడుమఱలఁ పుట్టకుండును. ఎవ్వరివలన వంశ మున్నతి పొందునో, వాఁడే పుట్టినవాఁడు. తక్కినవారు పుట్టినను, బుట్టినవారు కారు. పేరుప్రతిష్ఠలులేనివారు పుట్టనట్లేయని దీనిభావము.

శ్రీ రామయ్యపంతులుగారు యీ శ్లోకార్థమునకు సరిగానే దేశప్రఖ్యాతిఁగాంచి వంశమునకు వన్నె తెచ్చిరి. ఈయన యాత్మకు భగవంతుఁడు శాంతినొసఁగుఁగాక. ఇటువంటి దేశోపకారపరాయణులు పలువురు మనతెలుఁగుదేశమున జన్మింతురు గాక.

చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులు.

---

# కీ॥ శే॥ జయంతి రామయ్యపంతులుగారు

రచించిన గ్రంథములు, వ్యాసములు.

---

గ్రంథములు.

(1) ముక్తీశ్వరశతకము.
(2) ఉత్తరరామచరితము.
(3) ఆంధ్రచంపూరామాయణము. } ఆంధ్రీకరణములు
(4) అమరుకము.
(5) ఆంధ్రవాఙ్మయవికాసవైఖరి.
(6) Defence of Literary Telugu.
(7) Dravidian Lexicography.
(8) శాసన పద్యమంజరి (రెండుభాగములు).
(9) బాలరామాయణము.

వ్యాసములు.

(క) పరిషత్పత్రికలో వ్రాయఁబడినవి.

(1) దేశచరిత్ర స్వరూపప్రయోజనములు- సంపు. 1.
(2) రాజరాజు నందంపూడి శాసనము. ,,
(3) గుణగవిజయాదిత్యుని ఉరుటూరుశాసనము. ,,
(4) ఆంధ్రనిఘంటు నిర్మాణపద్ధతి. ,,
(5) అనితల్లి కలువచేఱు శాసనము. 2
(6) మాతృభాషాసేవ ,,
(7) శాస్త్రపరిభాష 1 ,,
(8) సర్వలోకాశ్రయుని శాసనము. ,,
(9) శక్తివర్మప్రభుబజ్జుశాసనము. ,,
(10) శ్రీకృష్ణదేవరాయల ప్రతిమ. 3
(11) శాస్త్రపరిభాష II ,,

(34) విజయరంగచొక్కనాథుని తామ్రశాసనము. 17
(35) త్యాగరాయవంశము. ,,
(39) ఁడు 18
(40) అక్కన్న మాదన్నలు. ,,
(41) మల్కాపురశాసనము ,,
(42) ఉత్తరరామచరిత నాటకరసవిచారము. 19
(43) రెండు కాకతీయశాసనములు. 22
(44) గ్రామ్యవాదవిమర్శనము. 24
(45) రెడ్డి. ,,
(46) నన్నిచోడకుమారసంభవవిమర్శనము. 27
(47) రాజరాజేంద్రపట్టాభిషేకసంచిక-చాళుక్యరాజప్రశంస. ,,
(48) రజతోత్సవ సంపుటము - Historical Research (ఆంగ్లము)
(49) ఆంధ్రభాషాసేవ-రజతోత్సవసంపుటము.

(చ) ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారి పత్రికయందు (Andhra Historical Research Society)

(1) Judicial Procedure in ancient India. Vol. II
(2) ,, Vol. IV
(3) The Southern School of Telugu Literature. Vol. II
(4) Krishnaraya ,,
(5) Malkapuram Pillar Inscription of Rudramba. Vol. IV

(ట) Epigraphia Indica (ఎపిగ్రాఫియా ఇండికా)

(1) Tottaramudi plates of Kata yavema Vol.IV
(2) Devulapally plates of Immidi Narasimha. VII

(3) Madras Museum plates of Vema. VIII
(4) Three Inscriptions of Reddi kings. XI
(5) Bezwada Pillar Inscription of Yuddhamalla. XV
(6) Do a further note. XIX
(7) Addanki Inscription of Pandaranga. ,,

(త) ఉపోద్ఘాతములు.

(1) రామనాటకము.
(2) సర్వేశ్వరశతకము.
(3) కవిజనాశ్రయము.
(4) విప్రనారాయణచరిత్రము.
(5) మన్నారు దాసవిలాసము మొదలగునవి.

(ప) Annual progress reports of the Archaelogical Survey of Madras & Coorg.

(1) Antiquities of Pedamudiyam in Cuddapah district. 1904—5
(2) ,, Chilankuru ,, 1903—4
(3) ,, Devagudi ,, ,,
(4) ,, Danavalapadu ,, ,,

# పరిషత్పుస్తకభాండాగారము.

## మూఁడవ భాగము.

### ౨

## ఆంధ్రవ్యాకరణ గ్రంథములు.

### 1. ఆంధ్రశబ్దచింతామణి—గ్రం. సం. 4183

ఈప్రతి 20 పత్రములు గలది. వ్రాఁత బాగుగనే యున్నది. పత్రములు క్రిమిదష్టములు. తొలుత పదిపత్రములు నన్నయభట్టారక విరచితమయిన ఆంధ్రశబ్దచింతామణి కారికలు (మూలముమాత్రము) ఆ వెనుక పది పత్రములు సూత్రవిభాగము-అనఁగా శ్లోకములు సూత్రములుగ విభజింపఁబడి వ్రాయఁబడియున్నవి. వ్రాయసగానిపేరు గానరాదు. తప్పు లంతగ లేవు.

ప్రారంభము:—

విశ్వశ్రేయః కావ్యం తదదోషా పరిష్కృతౌచ వాగర్థౌ

సా వా గ్వ్యాకరణవ్యుత్పత్త్యా సాధ్యా హి రసో యథాతథం కవిభిః

తుదిభాగము:—

అత్వాది తత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాంచ. ౭౮

వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు. ౭౯

ఇతిశ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణౌ పంచమః క్రియాపరిచ్ఛేదః. ఆంధ్రశబ్దచింతామణిస్సమాప్తః.

### 2. ఆంధ్రశబ్దచింతామణి. 16.

ఇందు 139 పత్రములు గలవు. వ్రాఁత బాగుగనే యున్నది. తప్పు లంతగ లేవు. "శార్వరినామ సంవత్సర ఆదినెల ౭ తేది రాచవెల్లు

క్రిష్ణమరాజు వ్రాసిన ఆంధ్రవ్యాకరణమున్ను వ్యాఖ్యానమున్ను సంపూర్ణము." అని తుదిపత్రమునఁ గలదు.

క్రమముగ —27 పత్రములు ప్రాచీనపక్షి ననుసరించినసంస్కృత శబ్దమంజరి-ధాతురూపములు-సమాసచక్రములును, 17 పత్రములు పైడిపాటి లక్ష్మణకవిప్రణీతమయిన ఆంధ్రనామసంగ్రహమును, 10 పత్రములు రేఫరకారపదముల పట్టికయును, 25 పత్రములు గణపవరపు వేంకటకవివిరచితమయిన లక్షణశిరోమణియందలి-రెండవ యాశ్వాసము (వేంకటేశాంధ్రనిఘంటువు)ను, 31 పత్రములు, మూఁడవయాశ్వాసము (ఆంధ్రకౌముది)ను, 5 పత్రములు నన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణి కారికలును, 24 పత్రములు చింతామణికిఁ దెలుఁగుటీకయును గలవు.

ఈటీకను రచియించినవా రెవరో తెలియవచ్చుటలేదు. మూలమునందు మొదటిశ్లోకము విశ్వశ్రేయః" ఇత్యాదిగ నున్నది. వ్యాఖ్యానారంభము "ఆద్యాయాః పంచాశద్వర్ణాః" ఇత్యాదిగ నున్నది.

మచ్చునకొక శ్లోకమునకు వ్యాఖ్యానము:—

"నిరమో మహతాం లుక్చ స్యాత్"- మహత్తులయిన పదముల యొక్క, అమః-ద్వితీయైకవచనానకు, నిః-నివర్ణము వచ్చును-ఇటనుట చేతను అమహత్తులకైతేనో-అమ్మకు నువర్ణము వచ్చుననుట. లుక్చ స్యాత్-ఆ ని-ను-వర్ణములకు వికల్పాన లోపము వచ్చును. రాముని సీతను దలఁచెద, శ్యామాంగు నగణ్యపుణ్యు సన్నుతిసేతున్.

కర్మప్రవచనీయకే కూర్చిః — కర్మప్రవచనీయార్థమందు కూర్చి అనే విభక్తి వచ్చును. ద్వితీయకు-శ్రీరాముం గూర్చి తపములు, శ్రీరాజులఁ జేయవలయు సేవము కొఱకై.

మహతో నిలౌ విభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణ స్తః,టాదౌ-తృతీయ మొదలయిన విభక్తౌ-విభక్తిపరమైనపుడు, వచనద్వయే-వచనద్వయమందును, మహతః-మహత్తైన పదానకు, నిలౌ-ని,ల,అనువర్ణములు క్రమేణ-వరుసచేతను, స్తః-అవును.

మహాత: అని ఏకవచనగ్రహణసామర్థ్యముచేతను, ఏకవచనమందున్నవచ్చె నివర్ణకము మహాత్మునకే కాని అమహాత్మునకు రాదు; అని తెలియవలెను బహువచనమందు వచ్చే లవర్ణము ఉభయత్ర రానే రావచ్చునని తెలిసెడి.

క. రామునిచేతను బడిమెను
భీమంబై నట్టి జన్యభూమిస్థలిలో
ధీమంతులు దైత్యేశులు
రాములచే రాముకొఱకు రాములకొఱకున్."

## 3. ఆంధ్రశబ్దచింతామణి—4257.

ఇందు 37 పత్రములు గలవు. వ్రాంత చక్కనిది. తప్పు లంతగ లేవు. "పరిధావి సంవత్సర ఆషాఢ శు॥ ౩లు నేలటూరి వెంకయ్య త్మకు వ్రాసుకున్న ఆంధ్రశబ్దచింతామణి-సంపూర్ణము"-అని తుదిని గలదు. ఉన్నంతవఱకు పత్రములు బాగుగనే యున్నవి.

తొలుత 35 పత్రములు తెలుఁగుటీకతోఁ గూడిన చింతామణి. టీక రచియించినవారిపేరు తెలియరాదు. చింతామణి శ్లోకములు వివరణముతోఁగూడఁ జదివదగు నున్నవి. ఆవెనుక 2 పత్రములు నైషధ శ్లోకములకు మల్లినాథుని వ్యాఖ్యానము.
చింతామణిలోని యొకశ్లోకము-తద్వివరణమును:—

పరుషా ద్రుతప్రకృతికాత్సరళాః స్యుఃతద్గ్రితం చ బిందుః స్యాత్.
ద్రుతప్రకృతికాత్-ద్రుతప్రకృతికముకంటెఁ బరములయిన పరుషాః-క చ ట త ప లు, సరళాః-గ జ డ ద బ లు, స్యుః-అగును. తద్గ్రితం-దానినకారము, బిందుః-సున్నయును, స్యాత్-అగును. అనఁగా ద్రుతప్రకృతికము మీఁది కచటతపలు గజడదబలగు, నా ద్రుతప్రకృతికముయొక్క నకారము సున్నయునగు. చకారమువలన స్వత్వమగునని తాత్పర్యము-స్వత్వమనఁగా ని ను వర్ణములు వక్ష్యమాణసూత్రమువలన బిందుస్వత్వములు వైకల్పికములు గావున నాలుగు రూపంబులు. వచ్చెం గమలాక్షుఁడు. వచ్చెఁ గమలాక్షుఁడు. వచ్చెను గమలాక్షుఁడు. వచ్చె న్గమలాక్షుఁడు-ఇత్యాదు లూహ్యంబులు.

చింతామణితుదిభాగము:—

వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు.

ప్రథమపురుష మొదలగు పురుషములయందును, వర్తమానార్థము మొదలగు అర్థములయందును, ఏకవచనము మున్నగు వచనములందును, వర్ణాగమంబు విశేషముగా వచ్చునని తాత్పర్యము.

ఇతి శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచి తాంధ్రశబ్దచింతామణౌ క్రియాపరిచ్ఛేదః.

## 4. ఆంధ్రశబ్దచింతామణి. 875

ఇది 20 పత్రములు గలది. వ్రాత మంచిది గాదు. తప్పు లంతగ లేవు. అర్ధానుస్వారములు కొన్నితావుల నుంపఁబడినవి. పత్రములు మంచిస్థితిలో నున్నవి. వ్రాయసగానిపేరు గానరాదు.

సంజ్ఞాసంధిపరిచ్ఛేదములు తెలుఁగుటీకతోఁ గూడి పూర్ణముగ నున్నవి. టీక రచియించినవా రెవరో తెలియరాదు.

ప్రారంభము :—

శ్రీ వేంకటరమణసహాయము- సటీకాంధ్రశబ్దచింతామణిప్రారంభము- సంజ్ఞాపరిచ్ఛేదము-మూలము:—

విశ్వశ్రేయః కావ్యం-టీక:— కావ్యం-కావ్యము, విశ్వశ్రేయః-విశ్వ-ప్రపంచకమునకు, శ్రేయః-శ్రేయస్కరము. తాత్పర్యము:— అనఁగా కావ్యము నిఖిలలోకములకున్ ధర్మాద్యఖిలపురుషార్థప్రదంబు.

## 5. ఆంధ్రశబ్దచింతామణి. 971.

ఇందు 45 పత్రములు గలవు-వ్రాఁత చక్కఁగ నున్నది. తప్పులు తక్కువ. అటనట నర్ధానుస్వారములు వ్రాయఁబడినవి. పత్రములు మంచిస్థితిలో నున్నవి. కారికలకు సూత్రవిభాగముచేసి టీక వ్రాయఁబడినది.

ఇందు సంజ్ఞా-సంధి-అజంత పరిచ్ఛేదములు గలవు. పిమ్మటిభాగము లేదు. టీకాకర్త యెవరో తెలియదు.

గ్రంథారంభము :—

శ్లో. వాచా మంత్రమయీనాం యః ప్రవక్తా ప్రథమో౽భవత్
ఆచార్యం తం కవీంద్రాణాం వందే వాగనుశాసనం.

సటీకాంధ్రశబ్దచింతామణి ప్రారంభము :—

సంజ్ఞాపరిచ్ఛేదము-సూత్రము:—విశ్వశ్రేయః కావ్యం. టీక-కావ్యం కావ్యము, విశ్వశ్రేయః-విశ్వ-ప్రపంచకమునకు. శ్రేయః-శ్రేయస్కరము. తాత్పర్యము-అనఁగా కావ్యము, నిఖిలలోకములకున్ ధర్మాద్యఖిల పురుషార్థప్రదం బనుట. కాఁగాఁ బై ప్రతియు నిదియు నొకేవిషయమును బోధించునవిగాఁ గన్పట్టుచున్నవి.

6. ఆంధ్రశబ్దచింతామణి- బాలసరస్వతీయోపేతము. 4598.

ఇందు 33 పత్రములు గలవు. వ్రాఁత బాగుగనే యున్నది. తప్పులు మెండు. 14,15వ పత్రములలో నజంతపరిచ్ఛేదమునందలి తుది భాగము వ్రాయఁబడలేదు. వ్రాయసగాని పేరు గానరాదు. పత్రము లట నటఁ గ్రిమిదష్టములయినను మంచిస్థితిలోనే యున్నవి.

గ్రంథారంభము :—

విశ్వశ్రేయః కావ్యం తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ
సా వా గ్యా రసవృత్తిః సాధ్యో హి రసో యథాతథం కవిభిః

ఈ ఆర్య ర సూ॥ విశ్వశ్రేయః కావ్యం-అట్టి కావ్యము, సర్వ ధర్మములలో శ్రేష్ఠము. 'నానృషిః కురుతే కావ్యం' అన్నాఁడు గనుకను, 'యతే ర్దృష్టిః కవే ర్వచః' అన్నాఁడు గనుకనున్ను పవిత్రము.

సంజ్ఞాదిపరిచ్ఛేదములతుది పద్యము లున్నవి. కృత్యాదిపద్యములు మాత్రము గాదు. కాఁగా నీప్రతిలో నైదుపరిచ్ఛేదములును గలవు.

గ్రంథాంతభాగము :—

శా. పర్వేందు ప్రతిమాననసుందరముఖీ పద్మోదరాంచద్ద్విధా
....................................హార్యక్షురాడ్గామినీ

శర్వాంభోమహాలోచనాప్రవిలసచ్చామీకరాగారయుత్
సర్వైశ్వర్యకరీ నగాధిపతనూజాతా జగన్మాతృకా.

ఇది శ్రీసకలకవితాస్వతంత్రభట్టారక...కూచి బాలసరస్వతికవి మహోపాధ్యాయప్రణీతంబైన యాంధ్రశబ్దచింతామణి టీకాగ్రంథంబునందు, క్రియాపరిచ్ఛేదము పరిపూర్ణము.

7. ఆంధ్రశబ్దచింతామణి — బాలసరస్వతీయము. 537

ఇందు 34 పత్రములు గలవు. వ్రాఁత చక్కనిది. తప్పులు మెండు. పత్రము లటనటఁ గ్రిమిదష్టములు. ఉన్నంతదనుక గ్రంథపాతములు లేవు. వ్రాయసగాని పేరు గానరాదు.

సంజ్ఞాసంధిపరిచ్ఛేదములు పూర్ణముగను, అజంతపరిచ్ఛేదముః 'స్వంతాన్నామ్నః కు జ్సోర్బహువచనే' ఇత్యాది యార్యతుదివఱకుఁ గలభాగ మిందు వ్రాయఁబడినది. ఆరంభమునఁ గృత్యాదిపద్యములు లేవు. సంజ్ఞాసంధిప్రకరణములతుదిని పద్యగద్యములు గలవు. వ్రాఁతయందలి మార్పులు తప్ప మిగిలిన విషయమంతయుఁ బైప్రతిని బోలియున్నది.

సంధిప్రకరణము తుదిని:—

శా. క్లీంకారాక్షరరూపిణీ నతజనక్లేశౌఘపంకావనీ
పంకేజాతసుహృద్ఘనాసహనవృక్త్వాదాబ్జశశ్వన్నిరా
తంకాత్యూర్జిత భోగమోక్షజనకోదంచన్మహామాయకా
హ్రీంకారాక్షర హేతుసాధచరబ్రహ్మేంద్రాదిదేవార్చితా.

ఇది శ్రీసకలభాషావాగనుశాసన నన్నయభట్టవిరచితాంధ్రశబ్దచింతామణియందు, యలకూచి బాలసరస్వతిమహోపాధ్యాయప్రణీతాంధ్రశబ్దచింతామణిటీకాగ్రంథంబునందు సంధిపరిచ్ఛేదము తృతీయము.

8. ఆంధ్రశబ్దచింతామణి — బాలసరస్వతీయము. 4597.

ఇది 34 పత్రములు కలది. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగ లేవు. పత్రములున్నంతదనుక మంచిస్థితిలో నున్నవి. తొలుత నెనిమిదిపత్రములకొనలు మాత్రము త్రుటితము లయినవి. వ్రాయసగాని పేరు లేదు.

కృత్యాదిపద్యములు, 'నిశ్శ్రేయసకావ్యం' ఇత్యాదిశ్లోకవ్యాఖ్యానముతోఁ గూడినభాగమును నిండు లేవు. 'స్వస్థానే' త్యాదిశ్లోకవ్యాఖ్యానములోఁ గొంతభాగము గడచినపిమ్మటఁ బ్రారంభము. అది మొదలుగ హలంతపరిచ్ఛేదమునందలి "సంస్కృతపదేన పరిమిత మాంధ్రపదం కర్మధారయో భవతి" ఇత్యాదిశ్లోకవ్యాఖ్యానము తుదివఱకుఁ గలదు. సంజ్ఞ సంధి అజంతపరిచ్ఛేదముల తుదిపద్యములు గలవు. అజంతపరిచ్ఛేదాంతభాగము.

శా. కర్ణాంతాయత చారునేత్రకమలా కర్పూరచూర్ణప్రభా
వర్ణశ్రీకరయంత్ర శోభిత విభాస్వద్రూపచిద్రూపసా
వర్ణోదంచిత మంగళాంగమగు దక్షద్విట్సింహాసనాం
తర్ణిష్పాద నిరంతరాదికలితోద్యత్కాంతికాభూషణా.

గద్య. ఇతి శ్రీసకలభాషాస్వతంత్రభట్టారక యలమూచి బాల
సరస్వతి కవిమహోపాధ్యాయప్రణీతంబైన శబ్దశాసనటీకా
గ్రంథంబునందు అజంతపరిచ్ఛేదము సంపూర్ణము.

## 9. <u>ఆంధ్రశబ్దచింతామణి</u>—<u>బాలసరస్వతీయము.</u>

ఇందు 113 పత్రములు గలవు. వ్రాఁత బాగుగ లేదు. తప్పులంతగఁ గానరావు. పత్రములటనటఁ గొలఁదిగఁ గ్రిమిదష్టములు. ఉన్నంతదనుక గ్రంథపాతము లేదు.

తొలుత 45 పత్రములు చింతామణి బాలసరస్వతీయమును, ఆవెనుక 6 పత్రములు చింతామణి కారికలును, పిమ్మట 62 పత్రములు అహోబలపండితీయ వ్యాఖ్యయును గలవు. అహోబలపండితీయమున సంజ్ఞాప్రకరణము ఆరంభమునుండి తుదివఱకుఁ గలదు. కృత్యాదిశ్లోకములు మాత్రము లేవు.

బాలసరస్వతీయటీక ప్రారంభము :—

ఉ. శ్రీకరశాఖమై ద్విజనిషేవితమై సుమనఃప్రజీవనం
బై కలధౌతసుందరమహాచ్ఛదమై సుమసారవద్ద్యుతి

ప్రాకటమై ప్రశస్తపదపల్లవమై యలరారు నాశ్రితా
నీకఫలప్రదంబు హరినిర్జరశాఖి సమాశ్రయించెదన్.

సీ. చిన్ని చెందొవవిందు కన్నె గేదఁగిరేకు
దోఁపిన యందంపుఁ దురుముతోడ
సరసదూర్వాదళాంకురగుచ్ఛకచ్ఛాయ
లీను నిద్దంపు నెమ్మేనితోడఁ
గరుణారసమరంద భరసంభృతములై
తనరు నేత్రారవిందములతోడఁ
గాలాహిక్రియ సభక్తజనంబులకు భయో
త్పాదియౌ సభయహస్తంబుతోడ

గీ. హృదయమునఁ గానుపించి యభీప్సితప్ర
బంధశబ్దార్థ విజ్ఞాన భవ్యభక్తి
యొసఁగుఁ గాతఁ దల్లి భక్తాఘహరిత
లావి దక్షిణకాళికాదేవి నాకు.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి మున్నొక్కనాఁడు విద్యానగరిలో నచింత్యకాపణోపాగమ స్నేహసాహచర్యుండగు శివయోగివర్యుచే దేవచోదనం బరిప్రాప్తమైన యంధ్రశబ్దచింతామణి గ్రంథంబు లోకోపకారార్థంబుగాఁ డీక గావింపంగోరి నెమ్మనంబున.

ఉ. ఏమి మహాద్భుతం బిది హరీ హరి యెక్కడి యంధ్రశబ్దచిం
తామణిపక్కి యెక్కడి మతంగనగంబు యుగాదిసంభవుం
డై మని చన్న నన్నయమహాకవి యెవ్వఁడు, సిద్ధుఁ డెవ్వఁడా
హా మదగణ్యపుణ్యసముదగ్రతఁ జేకుఱెఁ గాదె యిన్నియున్.

మ. ఇలఁ బ్రజ్ఞాధికులౌ కవుల్ మునుపు లేరే వారు వ్యాఖ్యానక
ర్తలు గానోపరె, పెక్కు వత్సరము లంతర్భూతమైయున్న యీ
తెలుఁగువ్యాకరణంబు నాకొసఁగెఁ బ్రీతిం డీక గావింపు మం
చల సిద్ధుండు మదిష్టదేవత విహాసాఖ్యుండు నిక్కంబుగన్.

వ. అని గణించి లోకోపకారసుకృతకీర్తిలాభవితర్కంబునం బ్రహర్షించి యాంధ్రవ్యాకరణభాష్యనిబంధనోత్సుకుండనై యందాది నస్మచ్చరిత్ర మభివర్ణించెద.

సీ. స్థిరకీర్తి యెలకూచి తిప్పనార్యుఁడు గాంచె
శుచిశీలు వల్లభసోమయాజి
సతనికిఁ దిప్పన్న యజ్ఞన్నయు ననంగ
సుచరిత్రు లిద్దఱు సుతులు పుట్టి
రాతిప్పనకు భైరవన్న సన్నయ నాఁగ
నలఘు లిద్దఱు తనూజులు జనించి
రాభైరవునకు నోజ్జర తిర్మలయ్య రా
మనయుఁ జిట్టపయు సూరనయుఁ గల్గి

గీ. రాతిరుమలేంద్రుఁ డళియరామావనీశ
దత్త యెడవిల్లి ముఖ్యసద్గ్రామ హేమ
చామరచ్ఛత్రపల్యంకికామణీవి
భూషుఁడై వైదుషీస్ఫూర్తిఁ బొలుపు మించె.

ఉ. అత్యనఘుండు రామఘనుఁ డాత్మజులం గనియెన్ శుచిత్వసం
తత్యగభీరు భైరవుని నాగన నప్పన రామధీమణిన్
ధృత్యమరాద్రిభైరవమనీషికిఁ గల్గిరి సత్కుమారు లా
దిత్యుఁడు కృష్ణసత్కవి సుధీజనవందితుఁ డబ్బనార్యుఁడున్.

గీ. పాకనాటి సకలపండిత కవిజనా
చార్యుఁడైన కృష్ణయార్యవర్యు
నకును లక్ష్మమాంబికకు నేను నాదిత్య
కవియుఁ గల్గితిమి జగన్నుతులము.

సీ. భాష్యాదిబహుశాస్త్రపరిచయోదాత్తుఁడ
కౌముదీనాటకకావ్యకవిని
భాషావివరణాఖ్యభవ్యశాస్త్రకరుండ
బాహటస్థాననిబంధనుండ

జంద్రాపరిణయాదిసత్కృతిస్రష్టను
దీప్రవామనపురాణప్రబంధ
భ్రామకీగీతప్రబంధాధికర్తను
దక్షిణకాళికాతంత్రచణుఁడఁ

గీ. ప్రకటరాఘవయాదవపాండవీయ
నామకశ్లేషకవితాప్రణాయకుఁడ
ననఘకౌండిన్యగోత్రుండ నఖిలసుకవి
తాస్వతంత్రుండ బహుకళాధరుఁడ నేను.

వ. ఆంధ్రశబ్దచింతామణి వెలిఁగించెద, ఇది తొల్లి సకలకవితాప్రవర్తకుండగు శబ్దశాసనుండు సకలకవిహితంబుగా యథోచితసూత్రగర్భితంబులగు నార్యావృత్తంబులఁ బంచపరిచ్ఛేదకంబుగా సమకట్టె, నేను నానేర్చుకొలందిఁ దత్సూత్రవిభాగంబును దత్ప్రమేయవివరణంబును దదుదాహరణస్వరూపంబులును, సంధ్రమయగద్యపద్యంబుల నేర్పఱించి, నాయాత్మదేవతయగు నంబాదేవి కర్పించువాఁడ నదుపక్రమం బెట్టిదనిన "విశ్వశ్రేయః కావ్య" మిత్యాది.

గ్రంథాంతభాగము:—

శ్లో. అత్వాది తత్సమానా మివ దేశ్యానాం క్రియాపదానాం స్యాత్
వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు.

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

"దీని తాత్పర్యము:—దేశీయ తెలుఁగులకు ఎత్వాత్వాదులు సమాతే అవును. స్థానస్థానాల వర్ణవిశేషాలు వింత. అ దెట్లనంటె-వచ్చెననే క్రియకు తద్ధర్మమధ్యమపురుషకు వత్తు-లృడర్థమందు రాఁగలఁడు, ప్రోచు అనే క్రియకు బహువచనమందు-ప్రోతురు - ప్రార్థనమందు ప్రోవుము - చనియె, వినియె - ఇత్యాది. క్రియలకు భూతార్థమందు వచ్చే ఎత్వము పరమై యుండగా ఇకారము - ఇవి మొదలయిన వర్ణాగమాలు బహువిధాలు ప్రయోగవేద్యాలు - ప్రయోగము ఆవశ్యకము ఇత్యాది."ఇతి

సకలభాషానాగనుశాసన శ్రీనన్నయభట్ట విరచితాంధ్రశబ్దచింతామణౌ క్రియాపరిచ్ఛేదః.

—: అహోబలపండితీయము :—

గ్రంథారంభము :—

విశ్వశ్రేయః కావ్యం ఇత్యాది- సమస్తశ్రేయస్సాధనం కావ్యం. శబ్దసారోపలక్షణయా అవ్యభిచారేణ కావ్యవిషయాదకత్వం ధ్వన్యతే. కవతి - కూయతీతి కవి స్వచ సత్కులీన శ్శుచి ర్దక్ష శ్ఛందోవ్యాకరణాదివిత్ -ప్రశాంతస్సుభగాకారో వైదగ్ధ్యే కవిర్భవే దిత్యాది... ...

సంజ్ఞాప్రకరణము తుదిభాగము :—

ఇతి శ్రీమత్సీతారామచరణారవిందమిళిందాంతఃకరణేన శ్రీమత్పోలూరిమాధవయజ్వ సముజ్వ... ... ...క్షుసాదిత సామ్రాజ్యపండితాభరణేన ప్రభంజనవంశాబ్ధిరాకాశశాంకేన అభినవ నన్నయభట్టాచార్యేణ విరచితాయాం కవిశిరో... ... ...చింతామణివ్యాఖ్యాయాం ప్రథమ స్సంజ్ఞాపరిచ్ఛేదః. శ్రీకృష్ణార్పణమస్తు.

10. అహోబలపండితీయము. గ్రం. సం. 3826.

ఇది నన్నయభట్టవిరచితమయిన ఆంధ్రశబ్దచింతామణికి విపులమయిన సంస్కృతవ్యాఖ్యానము. సంపూర్ణము. ఇందలి పత్రములు 142. వ్రాఁత చక్కఁగ నున్నది. తప్పులు సాధారణముగ లేవు. గ్రంథపాతము లేదు. పత్రము లటనటఁ గ్రిమిదష్టములయినను విషయ మంతయు సమగ్రముగనేయున్నది. ఏనుగ తిమ్మనార్యుని పౌత్రుఁడగు పేరాజకవివర్యుఁడీప్రతివ్రాసికొనినట్లు గ్రంథముతుదిని గద్య యొక్కటి వ్రాయఁబడినది.

"శ్రీమదుమారమణకరుణాకటాక్షవీక్షాపాత్రేణ యేనుగతిమ్మనార్యపౌత్రేణ వీరభద్రామాత్యపుత్రేణ, శ్రీపేరమాంబాగర్భశుక్తిముక్తామణినా, కుకవిగర్వాంధకారదినమణినా పేరాజకవిమణినా లిఖితోఽయం-శ్రీమన్నన్నయభట్టారకప్రణీతాంధ్రశబ్దచింతామణివ్యాకరణవ్యాఖ్యాయాం కవిశిరోభూషణాఖ్యాయాం పంచమః క్రియాపరిచ్ఛేదః."

వ్రాఁత ముగిసిన శుభదిన మెద్దియో తెలియరాదు. ఈశ్లో
కసంస్కారవిశిష్టుఁడయిన కవివరుఁడనుటకు నిర్దుష్టమయిన గ్రంథలేఖ
నము కొంత సాక్ష్య మిచ్చుచున్నది. వ్రాఁతయెల్లెడలను నిర్దుష్టముగనే
యున్నది. అక్షరములు సుస్పష్టముగ నున్నవి.

గ్రంథారంభము :—

శ్లో. శ్రీమద్భూమితలోదరీ తనుభవావక్షోజసత్పంజర
స్థాయత్కీరమణి ర్గిరిప్రవరజాచిత్తాబ్జభృంగాగ్రణీః
భక్తవ్రాతమనోవ్యథాదవశిఖాప్రోద్భూతవర్షాంబుదో
రామ స్సర్వజగంతి పాతు సతతం కారుణ్యపాథోనిధిః.
తాపం నోపరతా ద్ధరోజ్జ్వలశిరోలంకార పాదాంచితో
గాధోన్నిద్రకలావిలాసవసతిః పద్మాసుహృద్ద్యోశకః
జీవాతుః సతతం సమస్తసుమనోబృందస్య మాద్యత్తమో
భేదీ శీతలగో విభాతి రమలః శ్రీరామచంద్రో విభుః

... ... ... ...

... ... ... ...

జ్ఞాత్వార్థం హ్యుభయత్ర వాక్యరచనావ్యుత్పత్తి రాకర్ణనే
నేత్యాణాంచ పురాదివర్ణనమపి శ్రేయఃప్రదత్వం తథా
శ్లాఘ్యత్వం భగవద్గుణాదికథనే తద్వర్జనే శ్లాఘ్యతా
తద్భేదో న పురాణవక్తృకవిరా డ్జల్పాంధ్రసత్కావ్యయోః

పై రీతినిఁ గృత్యాదిశ్లోకము లన్నియు నిందుఁగలవు.

ఇఁక వ్యాఖ్యానారంభము.

శ్లో విశ్వశ్రేయః కావ్యం తదదోషా పరిష్కృతా చ వాగర్థా
సా వా గ్యా రసవృత్తిః సాధ్యో హి రసో యథాతథం కవిభిః.

సర్వాణి గ్రంథే ఽస్మిన్ పథ్యార్యాగీతివృత్తాని "లక్ష్మైస్సప్త
గణాగోపేతా నేహ భవతి విషమే జః" ఇత్యాది సామాన్యలక్షణాత్,
"త్రిష్వంశకేషు పాదో దళయో రాద్యేషు దృశ్యతే యస్యాః-పథ్యేతి

నామ తస్యాశ్ఛందోవిద్భి స్స్ఫుటం సమామ్నాత” మితి విశేషలక్ష
ణాచ్చ, “అర్ధసమా గీతి రితి” పైంగలసూత్రాచ్చ. గురులఘుప్ర
మాణనిశ్చయాది తత్ప్రపంచనంతు వృత్తరత్నాకరే తద్వ్యాఖ్యానే
లలితే చ ద్రష్టవ్యం.
విశ్వశ్రేయః కావ్యం - కీర్త్యాదిసమస్తశ్రేయస్సాధనం కావ్యం. శుద్ధ
సాకోపలక్షణయా అవ్యభిచారేణ కార్యనిష్పాదకత్వం ధ్వన్యతే.
కవయతే వర్ణయతీతి కవిః సచ సత్కులీనః శుచి ర్దక్ష శ్ఛందోవ్యా
కరణాదివిత్, ప్రశాంతఃసుభగాకారో దైవజ్ఞశ్చ కవిర్భవే” దిత్యాది
వచనోక్తగుణసంపన్నః స చ వివేకి వాచిక రుచి కార్థిక శిల్పక
భూషాక్తి మార్గానుగతాఖ్యాభి స్సప్తవిధః ... ... ...

వ్యాఖ్యానాంత్యభాగము :—

శ్లో. హంసీవ హంసతా దంతర్వాణిహంససుమానసే
సేయం కవిశిరోభూషా దూషణారేః ప్రసాదతః

శ్లో. తుష్టో భవే ద్రఘుపతి ర్మయి సత్కృపావా
నేత న్మదీయవచనై రపి దుష్టభావైః
హృష్టో భవే త్కిల సుతలాలనలాలసావాన్
లోకే పితా నిజశిశో ర్వచనై రపార్థైః.

శ్లో. మత్పాణిబంధా సుగుణైకసింధా
శ్రీరామచంద్రే పుషితార్యచంద్రే
లగ్నాకృతి స్సేయ మశేషకాలం
లోకే వరిష్ఠాం లభతాం ప్రతిష్ఠాం.

శ్లో. శ్రీరామాయ సమస్తదైవతశిఖారత్నాయ తే మంగళం
ఘోరాఘౌఘభిదాపటిష్ఠ మధురాఖ్యానాయ తే మంగళం
పారాతీత సమస్త సద్గుణగణాధారాయ తే మంగళం
వీరా యోద్ధృతచంద్రశేఖర ధనుస్సారాయ తే మంగళం.

శ్లో. దుష్టేంద్రాదిసమూహనీరదమహావాతాయ తే మంగళం
పుష్పారాత్యనుజన్మ పంకజసుహృజ్జాతాయ తే మంగళం
ఇష్టార్థప్రదచాతురీయుతకృపాశీతాయ తే మంగళం
శిష్టానుగ్రహకారిసద్గుణమణివ్రాతాయ తే మంగళం

ఉ. మంగళ మంగజాతరిపుమంజులమానసమధ్యవర్తికిన్
మంగళ మబ్జజప్రముఖ మానితదైవతచక్రవర్తికిన్
మంగళ మానతార్తికృదమంగళభంగదసాంద్రకీర్తికిన్
మంగళ మాదిమూర్తికి ఘనప్రభమూర్తికి రామమూర్తికిన్.

సీ. ఏశక్తిచే నట్టి దిట్టిది యనరాని
తేజంబు రూపమై తేజరిల్లె
నేమాయలానిచే నిది యసత్తయ్యును
సద్రీతి దృష్టిగోచరతఁ గాంచె
నేశక్తిచే జగం బిది పరిణామమై
నిగమాంతముల కెల్ల నెఱపనయ్యె
నేశక్తిమంతుచే నిజ్జగం బంతయుఁ
దలఁప వివర్తమై తెలియనయ్యె

గీ. నట్టి దంపతు లగసుతాహరహ్లాదంబు
జాతభావితు లీమత్ప్రణీతభక్తి
నాత్మశరణంబు గావున నధికకరుణ
నెంతయుఁ బ్రసిద్ధ మవనిఁ గావింతు రెపుడు.

సీ. పంటతామరకంటిదంటకూఁతురికెమోవి
పంటి తీయని తేనె జంటతేఁటి
భూధరాపత్యంపుఁ బుణ్యంపు హృదయంపు
చారు కాసారంపు సరసహంస
బుడుతచందురు మామ పువ్వుఁదాల్చు శిరంబు
నెడమని మదిలోని బెడఁగుమాటు
ప్రాచీనశాస్త్రంపు బహుళ్లోక్తిమర్మంబు
మహిమంపు బలుపెంపు మాయలాఁడు

గీ. గాలిబిడ్డని పాలింటి గగనతరుప్రు
వేవెలుంగుల దొరమూలి వేల్పుగిడ్డి
నిడుద కురువర్ణములు రెండు నుదుప్రువాఁడు
పురుషుఁ డొక్కండు మత్కృతిఁ బొడలఁజేయు.

చ. అగతనయాగిరీశ హృదయాంబుజహంస లఖండచిన్మయుల్
జగదవనక్రియాధిక విచక్షణ మానుషవేషసుందరుల్
నిగమశిఖావచోనిచయ నిశ్చితవైభవులైన దంపతుల్
మిగిలినకూర్మి మత్కృతి రచింతురుగాత సతిప్రసిద్ధిగన్.

గీ. కవిశిరోభూషణం బన్న కేడు భయమున
జిహ్మగులు గొందు లింగుట చిత్రమేమి ?
కవిశిరోభూషణం బన్న కేడు భయమున
జిహ్మగులు గొందులింగుట సిద మరయ.

సీ. కర్కశతర్కవాక్తర్కనాకుంఠిత
విశదమేధావిభావిలసనంబు
ఫణిరాజభక్కికాప్రముఖశబ్దగ్రంథ
సారసర్వస్వవిజ్ఞానపటిమ
యుభయమీమాంసార్థ విభవానుసంధాన
బంధురమేధాధురంధరతయు
వల్మీకసంభవ వ్యాకృత్యలంక్రియా
కోశాదిపరిచిత కౌశలంబు

గీ. సరసకవితామహామార్గ సతతగమన
చతురిమయుఁ గల్గుపండిత జనులకెలమి
నెలవు కానఁజేయు జగతిలో లలితసూక్తి
భూషణంబైన కవిశిరోభూషణంబు

కం. పోషించి మాధవార్యమ
నీషి ననున్ సంస్కృతాది నిర్మలభాషా

భాషి నొనర్చి త్రిలిఙ్గజ
భాషాసామ్రాజ్య పట్టభద్రునిఁ జేసెన్॥

ఉ. ఆదిమభాషనన్ను ముదమందఁగఁజేసి మదీయమైత్రి సం
పాదనచేసి మత్కృపకుఁ బాత్రతఁడాసి జనుల్ మెలంగఁగా
రాదె త్రిలిఙ్గభాష కథ రాఁగ మదీయదయానిరీక్షణా
సాధనదక్షులందఱు విచారణ నన్యులు లేరుగా కిలన్.

చం. అకుటిలకీర్తి నిర్మలత సంచితుఁ డౌభళపండితుండు వే
ఱొకఁడగు శబ్దశాసనుఁ డహోయని నన్నున నీడుసేయఁగాఁ
బ్రకటము సాహసంబు కవిరాజులకెల్లనదెట్టు లన్నఁదా
వికృతికి మూలమై యతఁడు విశ్రుతవక్రసమాఖ్యఁ గాంచఁడే.

ఉ. గాదిలి నన్నభట్టన వికారపుఁబేరిడి కూడదంచు లో
నాదరణంబు మానక మహామహులార! గుణాగ్రహైకద
త్తాదరులార! యాదర సహాయులరౌ మఁ గనుంగొనుండు స
మ్మోదవిధానసాధన మపూర్వము మద్రచితంపుఫక్కికన్.

ఉ. వేరనలేదు ధారుణికవీనతరాంధ్ర కవిత్వసంపదా
ధారరసజ్ఞులైన కవితల్లజులైన వినుండు; పాండితీ
పారగులార! యోపరమబాంధవులార! తదీయశబ్ద సం
భారము పారముం దెలియఁబాల్పడనేన సుఁజీ జగంబునన్.

కం. గట్టిగ నభినవనన్నయ
భట్టాచార్యాభిధాన పటుబిరుదాంకం
బిట్టిట్టనక వహించిన
దిట్టను ననుఁబోలఁగల సుధీమణు లేరే ?

శా. దాక్షీపుత్త్రిఫణీశముఖ్య కృతులందప్పంచు నొక్కొక్కచో
నాక్షేపింపఁగఁ జాలువారలకు మీ కస్మత్కృతిం జూడఁగా
నాక్షేపంబులు పుట్టనేరవె? సుధీహార్యక్షులారా! వినుం
డాక్షేపంబును దన్నిరాకృతియు నీయంచన్మనీషాగతుల్.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీమహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు, పరిషదాద్యవజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు

కీ. శే. శ్రీ బొబ్బిలిమహారాజావారు

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు–ఉయ్యూరు జమీందారువారు

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

## కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ, బి. ఎల్.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు (కోశాధ్యక్షులు).

పెద్దాడ రామస్వామిగారు, ఎం ఏ. ,,

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామిగారు ఎం. ఏ,. ఎల్. టి.

దర్భా వేంకటశివరామరాజుగారు బి. ఏ., బి. ఎల్.

అళక్కి వేంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

కోటా వేంకటసుబ్బారావునాయుఁడుగారు.

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.

పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారు.

పిళ్ళారిసెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

మంచితరుణము !!

మంచితరుణము !

# అన్నియు సగము వెలలకే.

---

ఆంధ్ర సాహిత్యపరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడిన గ్రంథములు (శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువుతప్ప) వెనుకటి పరిషత్పత్రికలసంపుటములును 1 జూలైనుండి 31-10-39 వఱకు **సగము వెలలకే** యిచ్చుచున్నాము. ఈ పత్రికలసంపుటములందు 1 వ సంపుటము మొదలు 8 వ సంపుటమువఱకు కొన్ని సంచికలుమాత్రము లభించును. నందంపూడిశాసనము, పెదచెఱకూరిశాసనము మున్నగు ప్రధానవిషయములతోఁ గూడిన వ్యాసములుగల సంచికలు దొరకును. 9 మొదలు 27 వ సంపుటమువఱకుఁ బూర్తిగ నున్నవి. విమర్శకులకు, విద్వాన్ శిరోమణి పరీక్షార్థులకు నుపయోగించెడి వ్యాసరాజము లిందుఁ బెక్కులు గలవు.

గ్రంథములపట్టిక నీసంచిక చివరిపుటలలోఁ జూచునది.
వలయువారీ క్రిందిచిరునామాకు వ్రాయవలెను.

కార్యదర్శులు:
ఆంధ్రసాహిత్యపరిషత్తు,
సూర్యారావుపేట, కాకినాడ.

---

Printed by N. Achutaramiah at the Cocanada Printing works Cocanada and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.

# విషయసూచిక.



శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ.

రెండునెలలకొకసారి ప్రకటింపఁబడును.

సంపుటము ౩౦. { వృష. చైత్ర—వైశాఖములు. } సంచిక ౧.


## స్వవిషయము.

శ్రీ వృషనామసంవత్సరముతోఁ బరిషత్తునకు ముప్పదియవయేఁడు ప్రారంభమైనది. స్థాపించినది మొదలు నేఁటివఱకు నాంధ్రసాహిత్యమునకును గ్రాంథికాంధ్రభాషకును దనశక్తికొలఁది పాటుపడుచున్నది. ఆంధ్రభాషకమూల్యములగు ముద్రితాముద్రితగ్రంథములు పరిషద్భాండాగారమున సమకూర్పఁబడినవి. పెక్కుగ్రంథములు పరిషత్ప్రకటితములై విలసిల్లుచున్నవి. పరిషత్పుస్తకభాండాగారమను శీర్షికక్రిందఁ గార్యాలయమునందలి తాటియాకుగ్రంథములఁగల విశేషవిషయములు వివరింపఁబడుచున్నవి. భాషాభిమానులును, పండితులును దాళపత్రగ్రంథముల నితోధికముగఁ బరిశీలించి యాంధ్రవాఙ్మయసేవ నొనర్తురుగాక

కడచిన విక్రమసంవత్సరమున సాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభాధ్యక్షులును, నిరంతరవాఙ్మయసేవాధురంధరులును, గ్రాంథికాంధ్రభాషాభిమానులునగు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు దివంగతులైరి. వారి మరణమువలన సాహిత్యపరిషత్తునకును ఆంధ్రవాఙ్మయప్రపంచమునకును దీఱనిలోటు వాటిల్లినది. వ్యావహారిక భాషావాదులగు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారితో వాదోపవాదముల సలుపుచు గ్రాంథికాంధ్రమే భాషాభివృద్ధికి శ్రేయోదాయకమనియు, విద్యాలయములందట్టిభాషయే విద్యార్థులకు నేర్పవలయుననియు నిరూపించి,

తమధన్యజీవితమును వారువాఙ్మయసేవకై వినియోగించి కీర్తికాయులైరి. వారిజీవితము నాదర్శముగఁగైకొని భాషాభిమాను లాంధ్రభాషకుఁ దమజీవితముల ధారవోసి ధన్యులగుదురని యాశించుచున్నాము.

శ్రీ రామయ్యపంతులుగారి స్థానమున సాహిత్యపరిషత్కార్య నిర్వాహకవర్గమువారు బ్రహ్మశ్రీ సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రిగారి నధ్యక్షులుగ నెన్నుకొనియున్నారు. వీ రాంధ్రులకుఁ జిరపరి చితులు. రామచరితము, సాహిత్యకల, శ్రావణవిజయము మున్నగు నాంధ్రగ్రంథముల రచించియున్నారు. వీరిని శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురా ధీశ్వరులు తమ యాస్థానపండితులుగఁ జేయుటయేగాక సుప్రసిద్ధ సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణకార్యమున సంపాదకులుగ నియ మించిరి. విమర్శకాగ్రేసర బిరుదాంకితులు విఖ్యాతాంధ్రపండితులునగు కీ. శే. శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు వీరి యగ్రజులే. శ్రీసుబ్బయ్యశాస్త్రి గారి యధ్యక్షతను బరిషత్కార్యములును, నిఘంటురచనాకార్యమును నితోధికాభివృద్ధి నందఁగలవని యూహించి వచింపఁగలము.

ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునకుఁ బ్రత్యేకముగనొక భవనమును నిర్మించుటకై తీవ్రమగు ప్రయత్నములు సలుపఁబడుచున్నవి. ఉదారులగు భాషాభిమానుల ధనసహాయమున నది యచిరకాలమున నెఱవేఱఁగలదని పాఠకులకు విన్నవించుచున్నాము.

పరిషత్పత్త్రికయందు ముద్రితమగుచున్న మంత్రిప్రగడ సూర్య ప్రకాశకవి విరచితమగు సీతారామచరిత్రమునఁ బ్రథమాశ్వాసము ముగిసినది. అందు బాలకాండము పూర్తియగుటచే నాయాశ్వాసము నొక భాగముగఁదీయించి ప్రచురించియున్నాము. మిగిలినభాగములును త్వరలో ముద్రింపఁబడును. బద్దెన నీతిశాస్త్రముక్తావళి యను గ్రంథము నకుఁ బరిషద్భాండాగారముననున్న ప్రతికిని శ్రీయుత మానవిల్లి రామ కృష్ణకవిగారును, కీ. శే. చెలికాని లచ్చారావుగారును బ్రకటించిన ప్రతు లకును కేవలము పాఠభేదములుండుటయేగాక పద్యములును, వాని

వరుసయు భిన్నములుగ నున్నవి. ఆయా ప్రతులను సరిచూచి యాగ్రంథ ముద్రణమును ముందు సంచికలోఁ బ్రారంభింతుము.

ఈ శతాబ్దమున, పాశ్చాత్య భావప్రపంచ మల్లకల్లోలముగ నున్నది. దాని ననుసరించియే మన దేశీయ వాఙ్మయములును నూతనమార్గములఁ ద్రొక్కుచున్నవి. కాని కేవలము పాశ్చాత్యరచనముల కనుకరణములగుటచే గ్రంథకర్తలు భాషాభివృద్ధి నొనర్పఁజాలకున్నారు. దేశకాలములు, ఆచారవ్యవహారములు, భారతదేశనాగరికత, ఆదర్శములను, సంఘమునకును దమకును గల పరస్పరసంబంధమును బాగుగఁ దెలిసికొని గ్రంథకర్తలు నూతనవాఙ్మయమును నిర్మింప యత్నింపవలసియున్నది. మఱియు నిప్పుడు ప్రకటింపఁబడుచున్న గ్రంథములలోఁ గొన్ని వ్యావహారికభాషయందు రచింపఁబడి సహృదయాహ్లాద మొనర్చుటలేదు. ఆయా రచనల నొకసారి చూచినచో వ్యావహారికభాష వాఙ్మయరచనమున కెట్లుపకరింపదో స్పష్టము కాఁగలదు. దానికొక మార్గముగాని పద్ధతిగాని గన్పడుటలేదు. నియమరహితమై కవులిట్లు వేర్వేఱుమార్గముల నడచినచో భాష కపాయమును ననర్థమును గలుగఁ జేసినవారగుదురు. అందలి పదజాలము, శబ్దభావముల విశృంఖలత్వమును గ్రాంథికభాషపైనను, ప్రాచీనగ్రంథములపైనను వారికిఁగల యాగ్రహమును వ్యక్తపఱచుచున్నవిగాని భాషాభిమానమును సూచించుటలేదు. ఉత్తమరచనములఁ గవులుపయోగించెడి భాషయును సామాన్యజనుల వాడుకభాషయు నెప్పుడును భిన్నముగ నుండునని వీరుగ్రహింపవలసి యున్నది. భాష కావ్యరచనమున నప్రధాన మనువాదము గ్రాహ్యముగాదు. శబ్దార్థములకుఁగల యవినాభావసంబంధము మన ప్రాచీనులచే బాగుగ నిరూపింపఁబడినది. భాషకుఁదగిన భావములు, భావములకుఁదగిన భాషయు నుండినఁగాని యే కావ్యమును శోభింపఁజాలదు. కావ్యప్రయోజనము, నీతి, కావ్యభాష మొదలగువానిని గూర్చి మన యాలంకారికుల యభిప్రాయములు పాశ్చాత్యప్రపంచమునఁగల యభిప్రాయములకు భిన్నములుగనున్నవి. పాశ్చాత్యవాఙ్మయప్రపంచము

సంఘమును జనసామాన్య ముపయోగించెడి భాషకును, కవుల భాషకును హస్తిమశకాంతరము గలదని సహృదయు లెఱుంగకమానరు. అందును గద్యములఁగలభాషకును, పద్యరచనమున నుపయోగింపఁబడు భాషకును విశేషవ్యత్యాసముకలదు. గద్యవాఙ్మయమునఁగూడ నవలలు, నాటకములు, కథలలో నుపయోగింపఁబడు పాత్రోచితభాషయును, వ్యాసముల నుపయోగింపఁబడు భాషయును భిన్నముగనుండును. మాట్లాడు భాషయే పాశ్చాత్యవాఙ్మయరచనమున నుపయోగింపఁబడు చున్నదనుకొనుట గొప్పపొరపాటు. కావునఁ గవులును గ్రంథకర్తలును భాషాభివృద్ధిని మనమునం దిడుకొని, వ్యక్తి, దేశవిభాగము, కాలము, సాంఘికజీవనము మొదలగువానిపై నాధారపడి నియమరహితమై వేఱువేఱుమార్గములఁ ద్రొక్కెడి వ్యావహారికభాష సత్కావ్యరచనమున కుపకరింపదని గ్రహించి, గ్రాంథికభాషయందే తమతమకావ్యముల రచింపవలసియున్నది. వీరిని నూతనమార్గముల నవలంబింపవలదని యెవ్వరును శాసించుటలేదు. వాఙ్మయము నూతనమార్గముల (నవలలు, నాటకములు, కథలు మొదలగునవి) వికసనమును గాంచవలయును. కాని కేవల మనుకరణములై పాశ్చాత్యభావములను వెదచల్లుచు, నియమరహితమై పలుత్రోవలఁజనెడి భాషయందు రచింపరాదనియే మాయుద్దేశము. గ్రాంథికభాషయనిన దీర్ఘసంస్కృత సమాసజటిలంబగు భాషయని కొందఱు తలంచుటగలదు. అది సత్యదూరము. దుర్గమములగు సంస్కృతసమాసములను, పదములను గైకొని తమరచనలనొనర్చుట యాధునికకవులకుఁ బరిపాటిగనున్నది. నియమబద్ధమైనను గవిత్వము సలక్షణముగను, సులభముగ నొనర్పవచ్చును. సంస్కృతభాషాశృంఖలములు దమకు నచ్చనిచోఁ దేటతెనుఁగు మాటలనే యుపయోగింపవచ్చును. కాని పదిశతాబ్దములకుఁ బైకాలమునుండియుఁ గలసి మెలసియుండిన సంస్కృతాంధ్రభాషలకలయికను విడఁగొట్టుట భాష కనర్థదాయకమనియు వానిని సరిగ మేళవించి గ్రంథరచన మొనర్చుటయే భాషాభివృద్ధికి మార్గమనియు భాషాభిమానులు గ్రహింతురుగాక.

---

# సాహిత్యవిశారదుల సన్మానము.

---

శ్రీ శ్రీ శ్రీ పిఠాపుర మహారాజావారు సాహిత్యవిశారద, బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిని దమ యాస్థానవిద్వాంసులుగను నిఘంటుకార్యసంపాదకులుగను నియమించినయవసరమున కాకినాడ పౌరులపక్షమున నీశ్వరపుస్తకభాండాగారమువా రొకసభఁ గావించి శ్రీశాస్త్రిగారిని సన్మానించిరి ఆసభకు కాకినాడలో న్యాయవాదులగు బులుసు వేంకటసుబ్బారావు B. A. B. L. గా రధ్యక్షత వహించిరి. సభకుఁ బౌరులలోఁ బ్రముఖులయినవా రందఱు విచ్చేసియుండిరి. పిమ్మట భాండాగారము కార్యదర్శులు శ్రీ నిఘంటుకార్యనిర్వాహకులయిన శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరులను శ్రీ శాస్త్రిగారిని బ్రశంసించుచు సన్మానపత్రము నొసఁగిరి. నిఘంటుకార్యస్థానమునఁ బనిచేయుచున్న బ్రహ్మశ్రీ వ్యాకరణశిరోమణి విద్వాన్ దర్భా సర్వేశ్వరశాస్త్రిగారును, నిడుదవోలు వెంకటరావు M. A. గారును నిఘంటునిర్మాణమును గూర్చిన విశేషములఁ దెలుపుచు శ్రీ శాస్త్రిగారు సంపాదకులుగా నియమింపఁబడుటవలనఁ గలిగిన యానందమును వెలిఁబుచ్చిరి. వ్యాకరణ విద్యాప్రవీణ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు, తొలుత నిఘంటునిర్మాణారంభమును గూర్చియు, నాపట్టున శ్రీపీఠికాపురాధీశ్వరులు ప్రకటించిన యౌదార్యాతిశయమును గూర్చియుఁ దెలిపి శ్రీ శాస్త్రిగారి కార్యనిర్వహణదీక్ష నుగ్గడించిరి. బ్రహ్మశ్రీ విద్వాన్ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు ఇతర నిఘంటువులకంటె శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువునఁ గల విశేషములనుగూర్చి యుపన్యసించి శ్రీశాస్త్రిగారి సంపాదకత్వమున నిఘంటు వచిరకాలమున ముగియఁగలదని తెలిపిరి. న్యాయవాదులును శ్రీశాస్త్రిగారి శిష్యులునగు ప్రతివాది భయంకరం పార్థసారథిగారు శాస్త్రిగారి సాహిత్యవిశారదత్వమును బాగుగ వ్యక్తపఱచి శ్రీ శాస్త్రిగారిని పీఠికాపురాధీశ్వరులను బ్రశంసిం

చిరి. ఆంధ్రపత్త్రికాసంపాదకులును, ప్రకృతమున నిఘంటుకార్యాలయమునఁ బండితులునగు శ్రీయుత మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు 'విజయవాదము' అను శీర్షికతోఁ బ్రశంసాపద్యములను శ్రీ శాస్త్రిగారి కర్పించిరి. ఇంకను పలువురు శ్రీ ప్రభువర్యులయొక్కయు, శ్రీ శాస్త్రిగారియొక్కయు గుణగుణములఁ బ్రశంసించి వారి యెడలఁగల గౌరవాదరములఁ బ్రకటించిరి. తుదిని దమకృతజ్ఞతను దెలుపుచు శ్రీశాస్త్రిగారు ప్రభువర్యులు తమ్ము నియోగించుటకుఁగల కారణములు, నిఘంటునిర్మాణప్రారంభము మొదలుగ నాఁటివఱకు జరిగిన కార్యక్రమమును, జరుగనున్న కార్యక్రమమును విపులముగఁ దెలిపి భవదనుగ్రహమును బురస్కరించుకొని నిఘంటునిర్మాణము పూర్తియగుగాక యని యాసించినారు. అధ్యక్షుల గౌరవభాషణములతోడను, గార్యదర్శుల యభినందనములతోడను సభ జయప్రదముగ ముగిసినది.

---

సాహిత్యవిశారద, పీఠికాపురసంస్థానాస్థానవిద్వాన్, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటుసంపాదక,

## బ్రహ్మశ్రీ శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారికి ఈశ్వరపుస్తకభాండాగారము

సమర్పించిన

# సన్మాన పత్రిక.

ఆర్యధర్మప్రవర్తకాగ్రణీ !

ఉత్తమశ్రోత్రియ వైదికకులాలంకారులై, సంస్కృతాంధ్రసాహిత్యపారంగతులై, దిగంతవిశ్రాంతకీర్తిశేషులగు మీ అగ్రసోదరులు శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారును, దాము నేఁటికి రమారమి ఏఁబదేండ్లనుండి, స్వచ్ఛము సనాతనము నగు ఆర్యధర్మసాహిత్యప్రచారముచే యావదాంధ్రదేశమునకు స్థిరపరిచితులై, వెలయుచున్నసంగతి జగద్విదితము. పరమపావనమగు భారతసేవకై జీవితార్పణ మొనర్చిన మీబోఁటి పుణ్యపురుషుల నాహ్వానించి, కొనియాడు భాగ్య మబ్బిన మా భాండాగారము ధన్యమైనదని విశ్వసించుచున్నాము.

విద్వల్లోకపూజ్యచరితా !

తాము చిరకాలమునుండి చేయుచున్న ధర్మసాహిత్యప్రచారమునకుఁ గాకినాడపుర మధివాసమైయుండ నోచుకొనుటచే, ప్రత్యేకముగా నీ కాకినాడపౌరలోకము తమకుఁ బెక్కువిధముల ఋణపడియున్నది. ముప్పదియేండ్లు పీఠికాపురరాజకళాశాలాధ్యాపకసమయమునఁ దమయొద్ద నుత్తీర్ణులైన శిష్యబృందములు, మీ యమోఘపాండితీగరిమను, అకళంకవక్తృతాచాతుర్యమును వేనోళ్ళఁ నేఁటికిని గొనియాడుచున్నారు.

సంస్కృతాంధ్రసాహిత్యజగద్భరణమహాకార్యమున, శ్రీపీఠికాపురమహారాజవర్యు "లాంధ్రభోజ" బిరుదమును శాశ్వతముగా నార్జించియున్నారు. దాక్షిణాత్యప్రపంచమున, సంస్కృతాంధ్రసాహిత్యసా

త్రమూజ్యము నింత మహోదారదయూరసముతో బరిపాలించిన ఆంధ్రభోజులు విద్వల్లోకపాలకసామ్రాట్టు లన నతిశయోక్తి కాజాలదు. ఈ మహాప్రభువు జయంతికులశేఖర రామయాఖ్యవిశ్వవిఖ్యాతపండితప్రకాండుని సాయమున, శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణయజ్ఞదీక్షాబద్ధకంకణులై, అధ్వర్యులైన పంతులుగారు దివంగతులు కాగా నీ పుణ్యసవనమును పూర్తిచేయు దివ్యసంకల్పముతో, నీ యాధ్వర్యమును తమ భుజస్కంధములపై నిడి, ఆస్థానవిద్వాంసునిగా నాహ్వానించినవార్త వినినంతనే, కాకినాడపౌరలోకము, ధన్యోత్సాహముతో నానందించినది. యావదాంధ్రదేశమునకు యుగాంతమువఱకు స్థిరోపకారియగు నీ యాంధ్రనిఘంటురాజము, అవిచ్ఛిన్నముగా సాగి, సంపూర్ణవిజయ మందుననుటలో మా సంశయములన్నియు విచ్ఛిన్నములైనవి. గ్రాంథికవాదసంరక్షణసంరంభములో మీకున్న ధైర్యసాహసములు, సనాతనాధునాతనసాహిత్యసామగ్రిసమన్వయములో దాము చూపిన వివేకచాతుర్యములు, సర్వజనమనోరంజకసంభాషణోపన్యాసధోరణిలో దమకు గల నవరసాంచితచాతుర్యమును శ్రీమహారాజావారు గుర్తించి యీ మహాకార్యభారము తమపై నుంచుటచే, శ్రీ మహారాజావారి విజ్ఞానౌదార్యమును తమ యర్హతమగుణభూషితమగు నుత్తమపాత్రతను మే మభినందించుచు, భగవానుడు శ్రీ పీఠికాపురసంస్థానమును నిరంతరవిజయప్రదముగా సంరక్షించి, తమ కనవరతాయురారోగ్యైశ్వర్యముల నొసంగి మనుపుఁ గాక యని ప్రార్థించుచున్నాము.

విధేయులు,

ఈశ్వరపుస్తకభాండాగారము
రామారావుపేట
11—6—'41.

గొర్తి సుబ్బారావు (అధ్యక్షులు)
సమయమంత్రి అచ్చన్న పంతులు
ఉపాధ్యక్షులు,

బులుసు వేంకటేశ్వర్లు
కాళ్ళూరి రామచంద్ర సత్యనారాయణ రావు
(కార్యదర్శులు.)

# నాటకరస విమర్శన పర్యాలోచనము.

**ఉభయ భాషాప్రవీణ—మల్లాది సత్యనారాయణశాస్త్రి.**

---

బ్రహ్మశ్రీ విద్వాన్ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు శ్రీయాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందు సంఖ్య "నాటకములు-రసములు" అని మకుటముతో నుత్తరరామచరితములోని రసమును విమర్శించు నుపన్యాసమును వెల్లడించి మమ్మ మిగుల సంతసింపఁ జేసినారు. శ్రీవారి యుపన్యాసము నిష్పాక్షికముగ వ్రాయఁబడినదని చెప్పుటకు నేమియు సందేహము లేదు. రెండుపక్షముల వాదములను జూపి రెండింటికి వ్యాఖ్యాతల వ్రాఁత లాధారములని వానిపేరులతోఁ గూడ నుగ్గడించి చివరఁ దమయుద్దేశ్యము కరుణరసము నవగాహించుచున్నదని సరళహృదయముతోఁ దెలియఁబఱచినారు. నేనుగూడ శ్రీవారివలెఁ బెద్దల యాశయముల నుల్లంఘింప నుద్దేశ్యము గలవాఁడను గానుగాని "భిన్నరుచిర్హిలోకః" అన్నట్లు వేఱుతాత్పర్యము గల్గియున్నాను. అయినను శ్రీయీపత్రికాముఖమున శ్రీవారితో నాకు శాశ్వతము, నిదంప్రథమమునగు సాప్తపదీనము లభించినందులకు నెంతయు మురియుచుఁ జాలమంది పండితులను మిత్రులుగఁ జేయుటకు నుపకరించిన యీపత్రిక, యిత్తోధికాభివృద్ధి నొందుచుఁ జిరంజీవినియై వెలయుఁగాతమని యాసించుచున్నాను. మఱియుఁ బైయభిప్రాయభేదమాత్రమున నన్నవినీతమిత్రునిఁగ గ్రహింపకుందురుగాక యని మిగుల శ్రీవారు ప్రార్థింపఁబడుచున్నారు. ప్రకృతమునకు వత్తము. "నాటకేతు భవేదంగీ శృంగారో వీర ఏవవా" యనుకారిక, నాటకలక్షణముగలిగిన ప్రతాపరుద్రీయాద్యలంకారగ్రంథములలోఁ గాని దశరూపకములోఁ గాని యుండవచ్చును. అవి శ్రీవారనినయట్లు యర్వాచీనములగుట స్పష్టమైన విషయమే. "ప్రసిద్ధేఽపి ప్రబంధానాం నానారసనిబంధనే। ఏకోరసాంగీకర్తవ్యస్తేషాముత్కర్షమిచ్ఛతా॥ యనిమూలము వ్రాసె" ప్రబంధేషు మహాకావ్యేషు

వా, నాటకాదిషు వా, విప్రకీర్ణతయా అంగాంగిభావేన బహవోరసా ఉపనిబధ్యంతే ఇత్యత్ర ప్రసిద్ధౌ సత్యామపి యః ప్రబంధానాంఛాయాతిశయ మిచ్ఛతి తేన తేషాంరసానా మన్యతమః కశ్చిద్వివక్షితో రసోంగిత్వేన వినివేశయితవ్య ఇత్యయం యుక్తతరోమార్గః" అని వ్యాఖ్యవ్రాసిన ధ్వన్యాలోకకర్తను ప్రాచీనతముఁడని నిర్ణయించుచు నిట్లు ప్రాచీనుల లక్షణము నాటకాదిరసనిబంధన విషయమై విశాలముగ నుండఁగ నర్వాచీనులు కాళిదాసాదిమహాకవుల నాటకాదులనుబట్టి సంకోచపఱచుట సంభవించినదని శ్రీవారు పూర్వాపరగ్రంథతాత్పర్యభేద కారణములను విమర్శించి, నిర్ణయించియున్నారు. ఈయభిప్రాయముతో నేను ననుసరించువాఁడనే కాని సంపూర్ణముగ నేకాభిప్రాయుఁడనుగాను.

సాధారణముగఁ బ్రాచీనాలంకారాది శాస్త్రములనే యర్వాచీనులు ననుసరించి పోవుచు నధికముగ నభిప్రాయభేదము గలిగినచోటుల భిన్నమార్గములఁ ద్రొక్కుట కనుచున్నారము. ధ్వన్యాలోకకర్త, కావ్యప్రకాశకర్తకంటెఁ బ్రాచీనుఁడైన విషయము సర్వపండితారూఢము. లలితసారస్వతవిషయకచర్చల సర్వాంశములు నీకావ్యప్రకాశ గ్రంథమునందే మొదట విమర్శింపఁబడినవనియు దీనికంటెఁ బూర్వగ్రంథము లొక్కొక్కయంశమును విమర్శింప నుత్పన్నములైనవనియు నా యూహ. ధ్వన్యాలోకము నాలంకారికులందఱు నెఱిఁగిన గ్రంథమే కాని క్రొత్తదియు మూలమూలల దాఁగినదియుఁ గాదు. దానియందుఁ గొంత భాగము కొంతకాల మగపడనిదియు లేదు.

మమ్మటభట్టు ధ్వన్యాలోకమునందు మిక్కుటమగు మక్కువ గలిగినట్లు ప్రసక్తిగలిగినచోట్ల వ్యక్తము చేయుచున్నాఁడు. అతఁడు నాటకప్రకరణము వ్రాయకున్నను ధ్వన్యాలోక మూలవ్యాఖ్యలకు నర్వాచీన లాక్షణికులు గ్రహించినయర్థమునే గ్రహించినట్లు కొంచెము సూచించినాఁడు. సాహిత్యదర్పణము, రసగంగాధరము మున్నగు నర్వాచీనగ్రంథములు కొన్నిస్థలములయందుఁ గావ్యప్రకాశముతో వివదించు

చున్నను జాలస్థలములయందు సంవదించుచునే యున్నవి. ధ్వన్యాలోక
మతో మాత్రము నేదియు గూఢముగ వివరించుచున్నట్లు నేను దెలిసి
కొనలేను. పోనీ యాయంశమును ఖండించి వేఱుత్రోవఁజూపెనో వేమో
యనిన నదియును జెప్పశక్యముగాదు. ఇట్లుండఁగఁ బ్రాచీనుల విశాల
లక్షణమును అర్వాచీనులు సంకోచించుటలో నేదియో హేతువుండి
యుండవచ్చును. అందు నందఱును మాఱుత్రోవఁద్రొక్కుటకుఁ గార
ణము పెద్దదై యుండును. అది యేదనఁగా సంప్రదాయాగతాశయము
లను వెలిబుచ్చఁదలఁచుటయే. అది యట్లు వారుచేయకయుండు రేని ధ్వ
న్యాలోకములోని యాకారికకు నాటకములలో నీరసమే ప్రధానముగ
ఈరసము లప్రధానములుగ నుండవలెనని నిర్ణయరూపముతో నర్థము
చెప్పుటకు శక్యముగాకపోవును. పోని దాని వ్యాఖ్యానదర్శనమువలన
నదిసులభమేమోయనిన నద్దానిమూలముునను శక్యముగాదు. కాన సం
ప్రదాయాగతాశయముల ననుసరించి యర్వాచీనులు తమలక్షణ
ములలో "శృంగారో వీరఏవవా" యని సందేహనివృత్తికై నిర్ధారణతో
నర్థము చెప్పియుందు రేమోయని యూహపుట్టుచున్నది. అర్వాచీను లంద
ఱొక యభిప్రాయము గలిగియుంట కారణమును బట్టికూడ ధ్వన్యా
లోకకర్తకు నదియే యభిప్రాయముండుననె కార్యమువలనఁ గారణాను
మానమువలె నిష్కృష్టార్థము దోఁచుచున్నది. కాని యాధ్వన్యాలోక
మూలవ్యాఖ్యానములవలన నిదమిత్థమను నిర్ణయముతో నాటకాములలో
నీయీరసములు ప్రధానములుగ నీయీరసములంగములుగ నుండవలె
నని విశదాభిప్రాయము తెలియఁబడకున్నది. ఉన్నట్టి కారికావ్యా
ఖ్యలను బట్టి మనము కనివినియెఱుఁగనియు, మనసంప్రదాయములో
లేనియు "బీభత్సాదిరసములు నాటకములోఁ బ్రధానములై శృంగారా
దులంగములై వఱలవలయుననెడి" విపరీతపద్ధతికూడఁ బ్రచారమునకు
వచ్చునేమోయని వారట్లు లక్షణమును సంకోచించియుందురని యూ
హించుచున్నాను. ఇట్టి యభిప్రాయమే వారికి లేనియెడల సంకోచించు

టలో నేమిఫలము వాంఛింపఁబడును? కేవలకాళిదాసాదుల నాటకము
లను గుఱిగాఁజేసి యనునది న్యాయమైన సమాధానముగాఁ దోఁపదు.
కనుక ధ్వన్యాలోకమూలవ్యాఖ్యలకు నర్వాచీన గ్రంథములు వివరణ
రూపములనిననే బాగుగనుండును. ఇట్లుచెప్పనిచోఁ గొంచెము భేద
మున్నిశాస్త్రములలోను బ్రాచీనతార్వాచీనతాభావభేదములను బుర
స్కరించుకొని యుండునుగాన నర్వాచీనగ్రంథములన్నియుఁ బ్రాచీన
గ్రంథములన్నింటికి విరుద్ధములై పోవలసివచ్చును. దీనికొక యుదాహర
ణమును గనుఁడు. భట్టోజీదీక్షితులవారు సిద్ధాంతకౌముదిలో శబ్దాధి
కారమునందు "పద్దన్నోమాస్" అనుసూత్రమును వివరించుచు నందలి
"శస్ప్రభృతిషు" అను నిమిత్త లక్షణాంశమందున్న ప్రభృతిశబ్దమునకుఁ
బ్రకారార్థమును జెప్పి విభక్తిప్రత్యయసామాన్యము నిమిత్తముగఁ
బ్రయోగములనుబట్టి పదాదులు ప్రయోగింపఁ బడునని నుడివియున్నారు.
సూత్రమును బట్టియైనచో ద్వితీయా బహువచనము మొదలు పదాదు
లాదేశింపఁదగియున్నవి. ఇందలి సంకోచవికోచములు సంప్రదాయాగ
తములేయని మనము గ్రహింపవలసియుండును. కానిచో దీక్షితులవా
రైనఁ దప్పుత్రోవను బోయిరని యనవలసియుండును. లేదా పాణిన్యా
చార్యులవారైన లక్ష్యములను గమనింపలేదని యనవలసియుండును.
ఈయంశము వైయాకరణులందఱకు సమ్మతముగాని విరుద్ధముగాదు.
కనుక సంప్రదాయార్థములను నర్వాచీనులు వెలువఱించి యుందురనిన
బాగుగనుండును. ధ్వన్యాలోకకర్త ప్రౌఢపద్ధతిలోనట్లు నిర్వచించియుం
డును. అంతియేకాని శ్రీవారు వ్రాసినట్లు కాళిదాసాదుల నాటకము
లనుబట్టి ప్రాచీనవిపులలక్షణమును నవీనముగ వారు సంకోచింపలేదు.
మఱియు నాధ్వన్యాలోకకర్త కాళిదాసునికంటె నర్వాచీనుఁడుగాని
ప్రాచీనుఁడుగాఁడు. ఈసంగతి ధ్వనికర్త 'తు' శబ్దమునకుఁ బశ్చాత్తాప
రూపార్థము వ్రాయుచు నుదాహరణముగనిచ్చిన "ముహురంగుళిసంవృ
తాధరోష్ఠం ప్రతిషేధాక్షర విక్లబాభిరామమ్, ముఖమంస వివర్తిపక్ష్మ

లాక్ష్యాః కథమ ప్యున్నమితం నచుంబితంతు" అను శకుంతలములోని
శ్లోకము ధృఢపఱచుచున్నది. అట్లు కాళిదాసునికంటె నర్వాచీనుఁడగు
ధ్వన్యాలోకకర్తమాత్రము శ్రీవారు వ్రాసినట్లుగ నర్వాచీనులతో
పాటుగఁ గాళిదాసనాటకములనుబట్టి లక్షణము వ్రాయవలసి యుం
డఁగఁ దనకంటె నర్వాచీనులగు నాలంకారికుల కందఱకు విరుద్ధముగ నేల
లక్షణము చేయవలసియుండునని మరల శ్రీవారే ప్రశ్నింపఁదగిన
వారు. నాయభిప్రాయముమాత్రము ధ్వన్యాలోకకర్త వేఱుతాత్పర్యము
కలిగియున్నవాఁడు కాఁడనియే. మొదటివాఁడు సంపూర్ణము నొక యా
కృతితో నిర్మించుచుండ రెండవవాఁడు దాని హెచ్చుతగ్గులు సవరించుచు
సరిచేయుటవంటిదే యీశాస్త్రనిర్మాణపద్ధతియునని మనవిచేయుచు
న్నాను. మఱియు నీయంశమును మధ్యవర్తులగు పండితులమధ్యఁ బడ
వేసి వారి యుత్తరమునకెదురుచూతమనికూడ నాయభిప్రాయము.

మఱియుఁ గొన్ని ప్రసిద్ధవిషయములు చెప్పఁబడకున్నను మఱుఁగు
బడవను నుద్దేశ్యముతోనే కాఁబోలు గృహ్యసూత్రకర్తలలోఁదల మిన్న
యగు నాపస్తంబమహర్షి తనగృహ్యసూత్రమునందు బ్రాహ్మణత్వమునకుఁ
బ్రధానచిహ్నయగు యజ్ఞోపవీతధారణవిధిని జెప్పకుండెను. అయ్యది
యిపుడు బోధాయనసూత్రమునుండి యాపస్తంబీయులచే గ్రహింపఁ
బడుచున్నది. వారిద్దఱిలో నాపస్తంబుఁడు ప్రాచీనుఁడని చరిత్రజ్ఞులకుఁ
గ్రొత్తగఁ జెప్పఁబనిలేదు. ఇంతమాత్రమున బోధాయనుఁడే యుప
వీతధారణము నిదంప్రథమముగఁ దీసికొనివచ్చెనని యన వీలుకలుగునా?
కనుక నేకవిధప్రవృత్తియందు నొకచోట సంప్రదాయాగతార్థము
లుల్లేఖింపఁబడక మఱియొకచోటఁ జెప్పఁబడినను బరస్పరము ప్రతిబధ్య
ప్రతిబంధకభావముల నొందవనియు నొకదాని కొకటి సహకారము
నొనర్చుకొనుచు నావిషయమును దృఢముచేయఁ గలవనియు మనము
గ్రహింపవలెను. కనుక ధ్వన్యాలోకకర్తకు విరుద్ధముగ నర్వాచీనులు
లక్షణమును సవరించియుండలేదని యార్యమిశ్రులు గ్రహింతురుగాక.

ఆవిషయమట్లుండనిండు. ప్రబోధచంద్రోదయమున శాంతరసము ప్రధానమని కవియు వ్యాఖ్యాతయు వివరించి యున్నారనియు, నుత్తరరామ చరితమునఁ గవిధ్వనిగా రసనిర్ణయము చేసెను గాని పై దానియందువలె వాచ్యముగఁ జెప్పియుండలేదనియు, నీవిషయము ముందుఁ జర్చింపఁ బడునని శ్రీవారు సెలవిచ్చి యున్నారు. ఇఁక నావిషయమును బరిశీలింతము. పెద్దల ననుటగాదు గాని ప్రాచీనాలంకారికులలో శ్రవ్యకావ్య ములందును శాంతమును రసముగ నుద్దేశింపఁ జనదను వాడుక కలిగియుండఁగ నాప్రబోధచంద్రోదయకర్త నాటకములోఁ గూడ నెట్లు శాంతము రసమని నిర్వచించి సమన్వయించెనో యూహింపరాకున్నది. చూడుఁడు. “శాంతోఽపినవమోరస” యను మమ్మటభట్టు తనకంటెఁ బ్రాచీనులగు నాలంకారికు లొప్పని శాంతమునకు రసత్వమును బ్రథమమున నొప్పుకొని కారికలో దానినమఱించినాఁడు. దీనిని బట్టి పై విషయము సత్యమైనదిగదా ! కనుకనే యందున్న “అపి” శబ్దము సార్థకమగుచున్నది. ఈకారికకుఁబూర్వము “శృంగారహాస్యకరుణ రౌద్రవీరభయానకాః । బీభత్సాద్భుత సంజ్ఞౌచేత్యష్టౌనాట్యేరసాః స్మృతాః”అని రసములకు నాదృశ్యములం దష్టవిధత్వమును జెప్పి పిదప “సర్వేదస్థాయి భావోఽస్తిశాంతోఽపినవమోరసః” అని చెప్పుటచేతఁ బ్రాచీనకాలమునుండియుఁ బరంపరాగతమగు సంప్రదాయమొకటి యాతనిమనస్సునందుఁ బరివర్తించుచున్నదనియు దానికి విరుద్ధముగఁ బోవఁ దనకు సమ్మతి లేకున్న నభినవోత్ఫుల్లయుక్తి సముద్భిన్న శాంతరస నవమత్వ మనివార్యమగుటచేత నాదృశ్యములందొప్పిన నొప్పకున్నఁ బ్రబంధములందైన నిబంధింపవచ్చునని యాతని యభిప్రాయము వ్యక్తమగుచున్నది. ఈయభిప్రాయముచేతఁ బ్రాచీనకాలములోని యాశయములకు భిన్నముగఁ జంద్రోదయకర్త వేసినత్రోవ సరియైనదిగాదని సందేహింపక చెప్పవచ్చునుగదా. మఱియు నాచంద్రోదయకర్తకుఁ గూడ శాంతము తొమ్మిదవరసముగ సమర్థింపనుద్దేశ్యముగలిగి యూర

కలక్షణప్రదర్శనమువలన లాభము లేదని దానిప్రయోగమును కావ్యముఖమునఁ జూపఁదలంపేమో యనిన నది సమంజసమే కాని ప్రాచీనాభిప్రాయముతో విరోధించినట్లు కాలేదా యని నామనవి. కనుకఁ బ్రాచీన కాలమందు శాంతము రసముగాదని నిశ్చయించుకొనినట్లు స్పష్టమగుచున్నదిగదా. లేనిచో నెందును లేని పద్ధతితో నాటకములో మొదట "తదద్యయం శాంతరసప్రయోగేణ ఆత్మానం వినోదయితు మిచ్ఛామః" అని యీ వాక్యమునం దుండులోఁ గలిగిన తాత్పర్యమేమి? అది తన క్రొత్త త్రోవయని నిర్ధరించుట లేదా? పోనీ తననాటకములో శాంతమును ప్రధానరసముగ నిబంధించెను గానఁ జూచువారు వినువారు తమంతఁ దాము రసమును నిర్ణయించికొని యాస్వాదింపఁజాలరని యీవాక్యము నిందు సమకూర్చెనందురా? అట్లయినచో నదియొక నిర్మితినై పుణ్యమా? యని యాక్షేపించువారికి సమాధానమెట్లు? కనుకఁ బ్రాచీనులొప్పని శాంతమును రసముగ నొప్పుటయు, నాటకములో దానికిఁ బ్రాధాన్య మిచ్చుటయు ననువిషయములు క్రమముగా వచ్చినవేయని మన మొప్పవలెను! ఈవిషయమును దఱువాతి యాలంకారికులు పెదవి కదల్పక యొప్పుకొనిరని మనమును శిరసావహింతము. కాని యీకవి రసపదముతో రసమును వెలిబుచ్చుటయేమి పురుషార్థమని నా మఱియొకమనవి. కనుకఁ జంద్రోదయకర్త ప్రాచీనాలంకారికవిశాలలక్షణము ననుసరించి యర్వాచీనులకు విరుద్ధముగ శాంతము ప్రధానముగఁ గల నాటకమును నిర్మించెనుగాన నట్లందఱు వేఱువేఱు రసములు ప్రధానములుగఁ గల నాటకములను వ్రాయవచ్చునను శ్రీవారి తలంపు మార్పఁబడవలెనని నామూఁడవమనవి. ప్రాచీనులు బహ్వాశయముగల పద్ధతితో వ్రాసిన లక్షణమును రానురాను నవీనులు తెలియుటకయి విపులపఱచిరని గ్రహించుట యుక్తతరము. పిదపఁ గొంతకాలమునకు "నటే శమాభావాత్" అను మొదలు గ్రంథముచేతఁ బూర్వోక్తాభిప్రాయము ననువదించి ఖండించి నాటకములోఁగూడ శాంతము ప్రధానరస

ముగ నిబంధింపవచ్చునని నిర్ణయించుచు నీయభిప్రాయమును బండితరాయలు స్ఫురింపఁజేయుచున్నాఁడు. కనుక నావిషయము పెద్దలనడుమఁ జర్చింపఁబడినదే గాన మనము సందేహింపఁబనిలేదు. కాని ప్రాచీనుల విపులలక్షణమును నవీనులు సంకోచించిరనుటదగ్గఱనే, మీకును నాకు నభిప్రాయభేదము. మఱియుఁ బైన వర్ణించినచొప్పున నాటకములలోఁ దొమ్మిదిరసములయందే రసమునైనఁ బ్రధానముగ నమర్పవచ్చుననెడి శ్రీవారి మొదటియభిప్రాయముదగ్గఱఁగూడ నేను భిన్నాభిప్రాయుఁడను. ఇఁక నుత్తరరామచరితములోని రసములనుగుఱించి కొంచెము విచారింతము. ఇందు శ్రీవారి యభిప్రాయము సప్రమాణముగాని, యప్రమాణముగాదు. అయినను నేను శృంగారరసవాదిని గానఁ దానివిషయముఁ గొంచెముచెప్పి శ్రీవారి కరతలస్పర్శము భావించి యూరకుందును.

పదవాక్యప్రమాణజ్ఞుఁడును వశ్యవాక్కునగు భవభూతిమహాకవి మమ్మటభట్టుకంటెఁ బ్రాచీనుఁడనుటకుఁ గావ్యప్రకాశము నందుదాహృత శ్లోకములు నిదర్శనములు. అట్టి యీమమ్మటభట్టు శ్రీవారు మొదటఁ జెప్పినట్లు కాళిదాసాదుల నాటకాదులనుబట్టి లక్షణము వ్రాయవలసి యున్నచో మొదల దోషప్రకరణములో "వ్యభిచారి రసస్థాయిభావానాం శబ్దవాచ్యతా." యని యుపక్రమించిన రసాదిదోషలక్షణమునకుఁ గ్రమముగ "తామనంగజయమంగళశ్రియం కించిదుచ్చభుజమూలలోకితాం। నేత్రయోః కృతవతోస్యగోచరే కోప్యజాయతరసోనిరంతరః." అని యుదాహరణముగ నిచ్చిన శ్లోకమునందు రసశబ్దముచే రసముదెలుపఁబడినదని దోషోదాహరణముగ సమన్వయించెనుగదా! యది యెట్లు మీయభిప్రాయముచొప్పున సంగతమగును? ఏమన, ఉత్తరరామచరితములోనన్నిచోటుల నెట్లున్నను "ఏకోరసః కరుణ ఏవనిమిత్తభేదాద్భిన్నః పృథక్పృథగివాశ్రయతే వివర్తాన్, ఆవర్తబుద్బుదతరంగమయాన్వికారానంభోయథాసలిలమేవ హి తత్సమస్తమ్" అను శ్రీవారి కరుణరసవాదమునకుఁ బ్రధానమగు శ్లోకమును పైలక్షణకర్తయొక్క దోషోదాహరణ

ము నతిక్రమించినదా ? పోనీ మమ్మటభట్టయిన నీ నాటకమునకవిరుద్ధ
ముగఁ జెప్పవలదా ? కనుకఁ గాళిదాసాదులనాటకాదులనుబట్టి యర్వా
చీనాలంకారికులు లక్షణమును వ్రాయలేదని మనము గ్రహింపవలెను.
ఈగ్రంథము కరుణరసప్రధానమగునేని యీ శ్లోకమే పై దోషలక్షణము
నకు సరిపడినదని యీమహాకవి యజ్ఞులసమాజములోఁ జేర్పఁబడియే
యుండును.

ఈ విషయమును శ్రీవారు "నాటకమునఁ గరుణ మనిన తావుల
నెల్ల విప్రలంభశృంగారాంతర్గతకరుణ మని శృంగారరసవాదులు చెప్పి
నారు; కాని, 'ఏకోరసః కరుణ ఏవ' మున్నగు తావులం దయ్యది
పొసఁగదు గదా !" యని వ్రాసిన వ్రాఁతకూడ సమర్థించుచున్నది.
ఎట్లనఁగా, పొసఁగకుండుటకుఁ గారణము శబ్దవాచ్యతగదా! "పొసఁగదు"
యని వ్రాసిన తమయభిప్రాయము చొప్పున నుత్తరరామచరితమునందుఁ
గరుణరసము ప్రధానముగాని శృంగారరసము ప్రధానముగాదుగదా !
అయినప్పుడు శృంగారరసవాదికి నందలి కరుణరసపదములకు నేవిధముగ
నైన దోషలక్షణము దగులకుండ నర్థాంతరమును జెప్పి శృంగారరసలక్ష
ణమును లగింపఁ జేయవచ్చునుగాని, కరుణరసవాదికిఁ బై దోషలక్ష
ణము తగులకుండఁ గరుణరస లక్షణమును లగింపశక్యము కాఁగలదా ?
యని నా సమర్థనము. కనుకఁ బిరుదచతువరులలో మిన్నయగు నాభవ
భూతిమహాకవిని ననుచితరసప్రబంధనిర్మాత యను నపశయశస్సులను
మనము పొందింపఁగూడదు. మిగిలినయంశములు భావార్థదీపికయందుఁ
జర్చింపఁబడును గాన, మనకు నావిషయమునఁ జొరఁబడఁబనిలేదు.

శృంగారరసవాదినగు నాయభిప్రాయము "పరిపాండుదుర్బలకపో
లసుందరం దధతీ విలోలకబరీక మాననమ్ । కరుణస్య మూర్తి రథవా
శరీరిణీ విరహవ్యథేవ వన మేతి జానకీ" అను శ్లోకముపైఁ గొంతవఱకు
నాధారపడియున్నది. ఇందుఁ "గరుణస్యమూర్తి రథవాశరీరిణీ విరహవ్య
థేవ" యను వాక్యైకదేశమునందలి "సీత శరీరధారిణి యగు విరహవేదనా

యనున ట్లున్నదను నభేదాధ్యవసిత విరహవేదనాత్యోత్ప్రేక్షు"యుత్కట
కోటికమై వఱలుచుండుట కారణము. "కరుణస్యమూర్తిః" యనునది
మూర్తీభవించిన దుఃఖమను నభిప్రాయము గలదని నిర్వచింపవలెను
గాని, మూర్తీభవించిన కరుణరసమని నిర్వచింప నైతిగాదు. అట్లయినచోఁ
బూర్వోక్తదోషలక్షణ మనుధావించుచు నేయుండును. మూర్తీభవించిన
దుఃఖమునకు మూర్తీభవించిన విరహవేదనకు రూపభేదము లేకున్నను
సామాన్యాకారముతో దుఃఖమును, విశేషాకారముతో విరహవేదనయుఁ
దెలుఁపఁబడినవని పౌనరుక్త్యప్రసక్తి లేదు. ఆరెండింటికిఁ దారతమ్యమును
జూపుటకే "అథవా" యనునది మధ్య నమర్పఁబడినది. విరహవ్యథ, రతి
ఫలితాంశము గాని రతి కాదని "వ్యభిచారి రసస్థాయిభావానాం శబ్ద
వాచ్యతా" యను దోషలక్షణములోఁగూడదని చెప్పిన స్థాయిభావము
చెప్పఁబడినట్లు కాదు. విరహవ్యథను వ్యభిచారిభావముగ గ్రహించి
యున్నయెడలఁ బూర్వోక్తదోషము తప్పనేతప్పదు. కనుకనే యిది
"వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణిః । అతి
నిష్కరుణస్య శుద్ధశీలా మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి." అను శకుం
తలములోని శ్లోకమునకుఁ గొంచెము తీసిపోవుచున్నదని విమర్శకులు.
వీరి ప్రతిపాదనమునకుఁ గారణము "విరహవ్యథేవ" యను దానిలోని
'వ్యథా' శబ్దముయి యుండవలెను. అట్లుకానిచో మిగిలిన యంశ
ములలో భేదములేదుగాన న్యూనతాప్రతిపాదనము వృథయైపోవును.
శకుంతలమునందుశృంగారప్రాధాన్యమువలెను త్తరరామచరితమునందును
శృంగారప్రాధాన్యము నంగీకరింపవలెనని నాభావము. మఱియు శ్రీ
వారు శ్రీరామునకు సీతాసమాగమ ప్రత్యాశ లేదుగానఁ గరుణరస
మేయని యనియున్నారు. అట్లు సమాగమప్రత్యాశ లేనిచోటులఁ గరుణ
రసమైనయెడలఁగాళిదాసుని కుమారసంభవకావ్యమునందు రతివిలపనము
కూడఁ గరుణరసమని యనవలసియుండును. ధూర్జటిఫాలనేత్రాగ్ని
నిర్దగ్ధదేహునియందు సమాగమాశకుఁ దావుగలదా ? బాణుని కాదం

బరిలో మహాశ్వేతావిలపనముకూడఁ గరుణరసమని యనవలసియుండును. చంద్రలోకమునకుఁ గొంపోఁబడిన శరీరముతో సమాగమాశ యెక్కడిది? ఈ రెండుదాహరణములయందు నాప్రకరణము చివర దివ్యవాక్యమాశ్వాసము చెప్పఁబడినదిగాన నవి కరుణములు గావని సమర్థించినయెడల నీనాటకమునందును "ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే । వందేమహి చ తాం వాణీ మమృతా మాత్మనః కలామ్." అను మొదలగుతావులందుఁ జెప్పఁబడిన యమృతాదిశబ్దములచేతను, అమోఘమైన వాక్కుగల శ్రీరామునిచేతనే యనిపించిన "సాత్వ మంబ స్నుషాయాం సీతాయా మరుంధతీవ శివానుధ్యానా భవ" యనియు "హా దేవి కథమేవంవిధా గమిష్యసి । హా భగవతి వసుంధరే శ్లాఘ్యాం దుహితర మవేక్షస్వ జానకీమ్. (ప) జనకానాం రఘూణాం చ యత్కృత్స్నం గోత్రమంగళమ్ । యాం దేవయజనే పుణ్యే పుణ్యశీలా మజీజనః" అను వాక్యములచేతను సమాశ్వాసము సూచింపఁబడలేదా యని నామనవి. మఱియు రసగంగాధరములోఁ గరుణవిప్రలంభమని పేరిడినరసమునకు రతివిలపనము మహాశ్వేతావిలపనము నుదాహరింపఁబడినవి. అవి యట్లుదాహరింపఁబడుటకుఁ గారణము వానికి నాలంబనలగు నాయికలు తమ నాయకులతో సమాగమము నొందుటయే. అట్లయినప్పుడు దీనియందు మాత్రము వేఱుత్రోవను బోనేల? పురాణములోఁ బునస్సమాగమము చెప్పలేదని నాటకములో నట్లే యుండవలెనని నియమము లేదు. కవికి రసానుగుణముగఁ గథను మార్చుకొనుటకు స్వాతంత్ర్యము గలదు. ప్రసిద్ధికి బొత్తుగ వ్యతిరేకముగఁ జెప్పఁగూడకపోయినను గొంచెముచమత్కృతికై కవి కథనుమార్చుకొనవచ్చునని యాలంకారికులందఱొప్పుకొనియున్నందున నట్లే కవి, తనవాఙ్నిర్మాణవైచిత్ర్యమును జూపినాఁడు. మఱియుఁ జదువరులు చూపరులు పరిపూర్ణపుణ్యకథాశ్రవణదర్శనములవలన నానందశుభములను బొందవలెనని మన సంప్రదాయము గానఁ గథకుఁ బరిపూర్ణత నాయికానాయకుల పునస్సమావేశము

గాక మఱి యేమిగలదు ? దానిని బురస్కరించుకొని రసనిర్ణయముగాని పురాణకథనుబట్టి కాదుగదా. మఱియు నీరస మనునది పాఠకసామాజికులకుఁ గాక నాయకాభినేతలకుఁ గాదుకదా. కనుక శ్రీరామునకు సీతాసమాగమప్రత్యాశ యుండనక్కఱలేదు. పాఠకసామాజికులకో కావ్యభావనాపరిపక్వబుద్ధిత్వముమూలమునఁ బ్రథమపతనదర్శనముల యందును గ్రమముగ మనస్సునకు సమాగమప్రత్యాశ గలుగుటకు నమృతమంగళాదిశబ్దములు వినంబడుచుండుటచే గొంతంత యుండును. కనుక నీనాటకమునందు శృంగారము గాని కరుణము గాదు ఇట్లు నా యభిప్రాయము వెల్లడించితిని గాని రాగద్వేషాదులవలనఁ గాదని మనవిచేయుచు శ్రీవారిని నాయందు దయగలిగియుండుటకు మిక్కిలి ప్రార్థించుచున్నాను.

పాప్మభ్యశ్చ పునాతి వర్ధయతి చ శ్రేయాంసి సేయం కథా
మంగల్యాచ మనోహరాచ జగతో మాతేవ గంగేవ చ
తామేనాం పరిభావయ న్త్వభినయై ర్విన్య స్తరూపాం బుధా
శ్శబ్దబ్రహ్మవిదః కవేః పరిణతాం ప్రాజ్ఞస్య వాణీ మిమామ్

శుభమ్.

---

# వక్రోక్తిజీవితము.

జమ్ములమడక మాధవరామశర్మ.

---

౧

వందే కవీంద్రవక్త్రేందులాస్యమందిరనర్తకీం
దేవీం సూక్తిపరిస్పందసుందరాభినయోజ్జ్వలాం.

శ్రీశక్తిపరిస్పందమాత్రమె యుపకరణముగాఁగల పరశివునకు నమస్కృతులు. ఈ మూఁడులోకముల వైచిత్ర్యమంతయు నొకచిత్రకర్త, శివుఁడు తద్విధాత. త్రైలోక్యభావములు యథాతథముగ వివేచితముల గును. అం దద్భుతము లేదు. కింశుకములు రక్తములుగా నుండుట లేదా? అది వానిస్వభావము. శ్వేతమైనశుకములు దేవరక్తములు కావచ్చును. అచటఁగూడ నాశ్చర్యపడనక్కఱ లేదు. విదగ్ధభావకులు తమమనీషికలఁ బట్టి భావతత్త్వముల నిరూపించినారు. అదంను వారివారియభిరుచులై స్థాపితములయినవి. తాదృశుల యాస్థాపన కేవలము ప్రౌఢి. త్రైలోక్యవర్తిభావపరమార్థ మట్లెయుండునని తలఁపరాదు. పరమార్థ మదికాదు. ఊహాలప్రసృతి కంతము లేదు. తర్కసందర్భము లసత్కల్పములు. అట్టి తర్కముల స్వతంత్రత లేకపోలేదు. కాని వానియం దాదరమిడము. సాహిత్యార్థసుధాసింధువునుండి సారమును సమున్మీలింపఁజేయుటయ మాకృత్యము. నిర్మాణరసికతతోఁ దత్త్వమున్మిషింపఁజేయుదుము. తత్త్వమునిర్మితి యనెడి యీద్వితయము సహృదయుల కద్భుతామోదచమత్కారమును సంధానించునుగదా? రెండిటిసమరసత నిట నాస్వాదింపుఁడు.

గ్రంథారంభమున నిష్టసముచితదేవతానమస్కార మొనరించుట సముదాచారము. అందువలన నదియె యిట మొదట నుపక్రాంతము. కవీంద్రవక్త్రేందులాస్యమందిరనర్తకి, సూక్తిపరిస్పంద సుందరాభినయోజ్జ్వల, యగు శ్రీదేవి కభివాదన మొనరింతునని పద్యభావము. కవిప్రవ

రులముఖ మొకనాట్యభవనము. సుకుమారమగునాట్యము లాస్య మనఁబడును. అట్టి లాస్యమందిరమైన కవిముఖమున శ్రీదేవి లాసిక. ఆదివ్యలాసికయగు నాదేవియొక్క సాత్త్వికాదిసుందరసుకుమారాభినయములు, సుభాషితవిలసితములు. అవియె సూక్తిపరిస్పందము లనఁబడును. ఆదేవి, సత్కవిముఖాంబుజము లను లాస్యవేశ్మయందు నర్తకివలె సవిలాసాభినయములఁ గలిగి నర్తనము చేయుచు విరాజిల్లును. ఇచటితాత్పర్యము నిట్లు తెలియవలయును. ప్రస్తుతవస్తువు విశిష్టమగు కావ్యాలంకారము. వాగ్రూపిణియగు సరస్వతి తదధిదైవతము. ఆదేవి యిట్టిరామణీయకహృదయహారిణి. ఆమె నభివందింతును. అభిదానముఅభిదేయముఁ ప్రయోజనము నను నీమూఁడును వక్తవ్యవస్తువిషయములు. వాని నిప్పు డాసూత్రింపవలయును. మొదటివాక్యమున నభిధానాదుల నిరూపించుటవలన వాక్ప్రవృత్తికి విషయనియతి యుత్పాదించినట్లగును. ఏదియేని శబ్దమును ప్రయోగింతుమేని యది స్వవిషయమున నియతమై యుండవలయును. ఆ నైయత్యము గ్రంథాదియందే యుత్పాదింపఁబడవలయును భవననిర్మాణమునకు మాన సూత్ర మవసరముగదా ?

౨

“లోకోత్తరచమత్కారకారి వైచిత్ర్యసిద్ధయే,
కావ్య స్యాయ మలంకారః కో౽ప్యపూర్వో విధీయతే.”

కావ్యమున లోకోత్తరచమత్కారము నాపాదించు విచిత్రతాసిద్ధికై యొకయపూర్వమగు నలంకారము కావ్యమునకు విహితమగుచున్నది యని తాత్పర్యము. కవికర్మ కావ్యము. అట్టికావ్యమున కలంకరణ మొనరింపఁబడుచున్నది. చిరంతను లనేకులు కావ్యాలంకారముల నిబంధించినారు అవి ప్రసిద్ధముగనే యున్నవిగదా ? మరల నీప్రయాస మేల? యని యన నక్కఱలేదు. ఇది యపూర్వము. చిరంతనోక్తివ్యతిరిక్తార్థము నిదిచెప్పఁగలదు. తదచుంబితార్థ మిందున్నది. ప్రాచీనవిధానము కన్న నుత్కృష్టమైన నపూర్వతము సిద్ధింపవచ్చును కాని

దియె కాదు. ఇది యలౌకికము, సాతిశయము. ఆయలౌకికతయు లోకోత్తర చమత్కారకారియై చిత్ర్యసిద్ధికి సమర్థము. అసామాన్యమగు నాహ్లాదమును విచిత్రభావసంపద సంపాదించును. అట్టి చిత్రవిచిత్రభావసంపత్తి నిది విధానించుటను సాతిశయముగాఁగలదు. శతాధికముగాఁ గావ్యాలంకారములు గలవు. కాని వానిలో నేయొక్కదానివలనఁగూడ నేవంవిధమైన చిత్ర్యసిద్ధిలేదు.........లోకమున నలంకారము శరీరమునకు శోభాతిశయకారిగా నున్నది. కావునఁ గటకకేయూరాద్యలంకారముల నలంకారశబ్దము ముఖ్యముగాఁ జెప్పును. కావ్యమందలి యుపమాదులు గూడ శోభాతిశయకారకములే. శోభ నాపాదించుట యిచటఁగూడ సమానము. కావున నుపమాదులు నలంకారములే కాని యలంకారశబ్దముపమాదులఁ జెప్పుట నుపచారము. ఇచట ముఖ్యవృత్తి లేదుగదా ? గుణాదులుగూడ నుపమాదిసదృశములు. అందుచే నవియు నలంకారములు. అట్లైన వానిని జెప్పుగ్రంథము నలంకారము కావచ్చును. గ్రంథము, గ్రంథమునఁ జెప్పఁబడు నుపమాదులు, గుణాదులు, నొకేయలంకారశబ్దమునఁ జెప్పఁబడవచ్చునని పర్యవసిత మగుచున్నది. ప్రతిపాద్యమునఁ బ్రతిపాదకమునఁగూడ నొకే వ్యవహారమున్నది. శబ్దార్థము లేకయోగక్షేమములు కావున నిది యుపపన్నము కావచ్చును. ఇట్లై లోకప్రయోగమునుగలదు. ఘటశబ్దమునకు ఘటమె యర్థము. ఘటమనుపద మొకటియె శబ్దార్థములపరముగాఁ బ్రయుక్తమగుచున్నది. కాఁగా గ్రంథమున కలంకారమని యభిధానము. ఉపమాది ప్రమెయజాత మభిధేయము. పైఁ జెప్పిన వైచిత్ర్యసిద్ధి ప్రయోజనమని తేలినది.

అలంకారమున కిట్లు ప్రయోజనము గలదని స్థాపితమైనది, కావ్యమలంకార్యము. అలంకార్యమునకుఁ బ్రయోజనములేకున్న నలంకారప్రయోజన మెట్టిదైనను వ్యర్థమేకదా ! కావునఁ గావ్యప్రయోజనము నిఁకఁ జెప్పవలయును.

3

"ధర్మాదిసాధనోపాయః సుకుమారక్రమోదితః,
కావ్యబంధోఽభిజాతానాం హృదయాహ్లాదకారకః."

ధర్మార్థకామమోక్షముల సంపాదనమున నుపాయమును, సుకుమారక్రమోదితము నగు కావ్యబంధ మభిజాతులగు లలితమనస్కులకు హృదయాహ్లాదకారకమగునని సామాన్యముగా భావార్థము. అభిజాతులగు రాజపుత్త్రాదులు సుకుమారాశయులు. ధర్మాద్యుపేయముల వారర్థింతురు. విజిగీషువులై యుందురు. భోగలాలసులుకానఁ గ్లేశభీరువులై యుందురు. కావ్యబంధ మట్టివారల కాహ్లాదకము. లలితమతుల వినోదపెట్టునదియైనను క్రీడనకాదిప్రఖ్యము కాదు. ధర్మాదిసాధనోపాయమాటవస్తువు కాదుకదా? సాధకునియందలి యుపాయములచే ధర్మాదిచతుర్వర్గము పొందఁదగియున్నది. కావునఁ జతుర్వర్గ ముపేయము, కావ్యబంధము ధర్మాదుల నుపదేశవిధమున బోధించును. కావున ధర్మాదిసంపాదనమునఁ గావ్య ముపాయము. అందుచే వానిప్రాప్తినిమిత్త మన వచ్చును. ఇతరశాస్త్రములును పురుషార్థోపదేశనపరములే. అయినను గావ్యముతో సాటిగావు. అవి సుకుమారక్రమోదితములు గావు. అట్లు కాకపోవుటయే వానియపరాధము, సుందరము సహృదయహృదయహారియైన పరిపాటీవిన్యాసము కావ్యముననున్నది. కావ్యబంధ మభిజాతుల కాహ్లాదకమైనను బ్రవర్తకమగుచున్నది. ధర్మాదిప్రాప్త్యుపాయత్వమును బొందుచున్నది. ధర్మాద్యుపదేశము శాస్త్రములందుఁ గఠోరక్రమమున నుండుటచే దురవగాహము. కష్టబంధముగల శాస్త్రములందు ధర్మాద్యుపదేశమున్న నకించిత్కరము. రాజపుత్త్రులు స్వవిభవసముపేతులై సమస్తజగతీవ్యవస్థాకారిత్వమును బొంది సముచితసకలవ్యవహారసముచ్ఛేదమునఁ బ్రవర్తించుటయందె ప్రభువులగుచున్నారు. వారలకుఁ దగిన శ్లాఘ్యోపాయోపదేశము లేకపోవుటయె హేతువు తాదృశులకుఁ దగిన వ్యుత్పత్తిని సంధానింపవలయునని కవులు గడచిపోయినను సచ్చరితరాజ

చరితమును నిదర్శించుటకు నిబంధింతురు. ఇట్లు కావ్యబంధమునకు శాస్త్రాతిరిక్తమగు ప్రగుణప్రయోజనము గలదని తెలియవలయును.

పురుషార్థసిద్ధిరూపమగు ముఖ్యప్రయోజన మిట్లుండఁ గావుత. లోకయాత్రాప్రవర్తన నిమిత్తమగు నన్యప్రయోజనమును లేకపోయినచో సమ్యక్సంభూతిని సంభావింపఁజాలము. భృత్యసుహృత్స్వామ్యాది సమావర్జనముగూడఁ గావ్యమునఁ గలుగవలయును. కావున నితరప్రయోజకవర్తియుఁ గావ్యబంధమునకుఁ బ్రతిపాదింపవలసి యున్నది.

౪

వ్యవహారపరిస్పందసౌందర్యం వ్యవహారిభిః
సత్కావ్యాధిగమాదేవ నూతనౌచిత్య మాప్యతే.

నూతనౌచిత్యశోభితమైన వ్యవహారపరిస్పందసౌందర్యమును వ్యవహర్తలు సత్కావ్యాధిగమమువలననే పొందఁగలరు. లోకవృత్తము యొక్క క్రియాక్రమాత్మకమగు వ్యాపారము వ్యవహారపరిస్పంద మనఁబడును. అలౌకికమగు నుచితభావ (ఔచిత్య)ముగల రామణీయకము కమనీయకావ్యపరిజ్ఞానముననేకలుగును. ఇతరములవలన లభ్యముగాదుమహాత్ములగు రాజాదులవ్యవహారము వర్ణింపఁబడునప్పుడు తదంగభూతములైన ముఖ్యసచివాదు లందఱు ప్రాతిస్వికములగుతమతమసముచితకర్తవ్యవ్యవహారములందు నిపుణులుగా నిబంధింపఁబడుదురు. అట్టి యీ నిబంధనము నిఖిలవ్యవహారులకు లోకవృత్తోపదేశకమగును. కమనీయకావ్యమున శ్రమించువారు వ్యవహారపరిస్పంద సౌందర్యాతిశయసంపత్సముపేతు లగుదురు. శ్లాఘనీయఫలభాజనులగుదురు. ఇది యిచటి భావము.

చతుర్వర్గలక్షణమగుపురుషార్థము కావ్యప్రయోజనముగా సమామ్నాతమైనది. అది పరంపరాప్రయోజనము. పురుషార్థసముపార్జనకుఁ గొన్నివిషయములు గావలయును. కావ్య మావిషయవ్యుత్పత్తికారణము. కావ్యమున ముందుగా నావిషయవ్యుత్పత్తి యనంతరము పురుషార్థసిద్ధి యగుట పురుషార్థముసాక్షాత్ప్రయోజనము కాదు. అదియుఁగాక యీఫ

లము సమయాంతరభావి. పురుషార్థోపభోగ ఫలమగు నాహ్లాదమును సమయాంతరముననే సంప్రాప్తమగును. కావునఁ దదతిరిక్తము సహృదయహృదయ సంవాదసుభగము తదాత్వరమణీయమునగు ప్రయోజనాంతరమును జెప్పుటకే కారిక యుపక్రాంతమగుచున్నది.

౫

చతుర్వర్గఫలాస్వాద మప్యతిక్రమ్య తద్విదాం
కావ్యామృతరసే నాంత శ్చమత్కారో వితన్యతే.

కావ్యహృదయవిదుల చేతముఁ గావ్యామృతానుభవమునఁ జమత్కార ముద్వేలమగును. చతుర్వర్గఫలాస్వాదము నతిశయించిన హ్లాద ముద్భూతమగును. ధర్మాదిచతుర్వర్గఫలాస్వాదమునకుఁ బ్రసిద్ధాతిశయము గలదు ఆయతిశయమునుగూడ నిచటిచమత్కారము నిర్జించును. దానిని బస్వశప్రాయము చేయును. ఇది యిచటి యభిప్రాయము:— చతుర్వర్గఫలాస్వాదము ప్రకృష్టపురుషార్థము. అది సర్వశాస్త్రప్రయోజనముగాఁ బ్రసిద్ధము. అదియు నీ కావ్యామృతచర్వణచమత్కారకళాలేశసామ్యకలన నేమాత్రము బొందఁజాలదు. శాస్త్రసందర్భము దుశ్శ్రవదుర్భణదురధిగమత్వాది దోషదుష్టము. తదధ్యయనము దుఃసహదుఃఖదాయి. కావ్యము తత్కాలకల్పిత కమనీయ చమత్కృతిసహితము. ఆ శాస్త్ర మీకావ్యముతో నెట్లును స్పర్ధ నధిరోహింపఁ జాలదను నర్థమర్థసిద్ధము.

కటుకౌషధమువలె శాస్త్ర మవిద్యావ్యాధుల నాశ మొనరించును ఆహ్లాదపెట్టు నమృతమువలెఁ గావ్య మవివేకగదాపహము. తత్కాలమున నాయతియందును గావ్యము రసనిష్యందసుందరమగుచున్నది. ఆకావ్యము విచార్యము.

౬

అలంకృతి రలంకార్య మపోద్ధృత్య వివిచ్యతే
తదుపాయతయా తత్త్వం సాలంకారస్య కావ్యతా.

కావ్యోపాయమగుట నలంకృతి నలంకార్యమును వేఱువేఱుగా వివేచింతుము. సాలంకారమునకే కావ్యత్వమనుట యిట(ద త్త్వము. "అలంక్రియతే౽నయా ఇత్యలంకృతిః" అని యలంకృతిపదవ్యుత్పత్తి. అలంకరించునది యలంకృతియగును. అలంకృతియే యలంకరణము. అది యిచట విచారింప(బడును. అలంకరింప(దగునది యలంకారము. వాచకము. వాచ్యము నలంకరణీయము. అదియు వివేచితమగును. సముదాయరూపమున అలంకృతి యలంకార్యము లంతర్భావము పొందియుండును. వానిని విభజించి ప్రదర్శింతుము. ఇవి కావ్యోపాయములు గావున వాని యిట్టివివేకము కావ్యవ్యుత్పత్తి నాపాదించును. సముదాయాంతఃపాతు లసత్యభూతములైనను వేఱువేఱుగా నపోద్ధరణము చేసి వివేచన మొనరించుట వ్యుత్పత్తినిమిత్తమగును. ఈవిషయ మితరశాస్త్రములందు( బ్రసిద్ధము. వైయాకరణులు వాక్యాన్తర్భూతములైన పదము లసత్యము లందురు. అట్లే పదాంతర్భూతములైన ప్రకృతి ప్రత్యయములుగూడ నసత్యప్రాయములు. అయినను వాని వివేచనమును వారొనరించినారు. అది వ్యుత్పత్తి నాపాదించుచున్నదిగదా! కావ్యోపాయమగుట వాని యపోద్ధార మసత్యభూతమైనను నాచరింప(బడుచున్నది. సాలంకారమునకే కావ్యత్వమనుట యిట(ద త్త్వము. అదియె సత్యము. కా(గా నిచట నిది పరమార్థము. కావ్యము కవికర్మ అలంకరణసహితమునకే కావ్యత్వమున్నది. నిరస్తావయవమైన సకలసముదాయమునకే కవికర్మత్వము గలదనుటసమ్మతము. కా(గా నలంకృతమునకే కావ్యత్వము నిషిద్ధము. కాని కావ్యము నలంకారయోగ మనుటకాదు. అలంకారశోభితత్వమున్ననే కావ్యస్థితి యున్నది.

అలంకారసహితమె కావ్యమగునని కావ్యస్వరూపము కొంచెము సమున్మగ్నముగా నాసూత్రితమైనది. కాని నిపుణముగా నిశ్చితము కాలేదు. కావ్యవ్యపదేశము( బొంద(గల్గునది యెట్టివస్తువుతో నుండునో నిరూపింపవలయును. కావున( గావ్యలక్షణము చెప్ప(బడుచున్నది.

౭

శబ్దార్థౌ సహితౌ వక్రకవివ్యాపారశాలిని
బంధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాదకారిణి.

వాచకము వాచ్యమును శబ్దార్థములు. వక్రకవివ్యాపారమున శోభించు తద్విదాహ్లాదకారకమగు బంధమున సహితములగు శబ్దార్థములు కావ్యముగా వ్యవస్థితములని మూలసూత్రము. వాచ్యవాచకములు రెండును-సమ్మిళితములై కావ్యమగును. రెండు నొకటియనుట విచిత్రోక్తియె కాని కొందఱు కవికౌశలకల్పితకమనీయతాతిశయముగల కేవలము శబ్దమే కావ్యమని యందురు. కొందఱు రచనావైచిత్ర్యచమత్కారకారియగు వాచ్యమే కావ్యమనియందురు. ఆపక్షద్వయ మిచట నిరస్తమగుచున్నది. ప్రతితిలమునఁ దైలముండునట్లు రెండిటియందును దద్విదాహ్లాదకారిత్వ మున్నది. ఒకదానియందే యది యుండుననుట కాదు ప్రతిభాదారిద్ర్యదైన్యమున నతిస్వల్పభాషితములు గల కవులు కొందఱు వర్ణసావర్ణ్యరమ్యతనే నిరూపింతురు. అచట వాచ్యవైచిత్ర్య కణికయు నుండదు. అట్లేయట్ల మునిప్రణీతస్తోత్రామంత్రణ కల్పములగు సంబోధన లుండును అవి తద్విదుల కాహ్లాదకారిత్వము నేమియుఁ బోషింపఁజాలవు. శోభాతిశయశూన్యమగు వస్తుమాత్రమును గావ్యవ్యపదేశార్హము కాదు. శుష్కతర్కవాక్యవాసనాధివాసితచేతస్కులగు కవులు కొందఱు ప్రతిభాప్రతిభాతవస్తుమాత్రమును వ్యసనితతో నిబంధింతురు. అట్టియెడ వాచకవక్రతావిచ్ఛిత్తిలవముగూడ నుపలక్షితము కాదు. అలంకారరహితమైనను వస్తుమాత్రమునఁ దద్విదాహ్లాదకారిత్వము గల్గకపోదు. కవిచేతమునఁ దొలుత ప్రతిభాసమానమగు వస్తువు స్ఫురించును. అది యప్పు డఘటితపాషాణశకలకల్పమణిప్రఖ్యమె కావచ్చును. అదియె విదగ్ధకవివిరచితవక్రవాక్యోపారూఢమైనపుడు శాణోల్లీఢమణిమనోహర మగును. అప్పు డదియె తద్విదాహ్లాదకారి కావ్యత్వము నధిరోహించును. కావున రమణీయతావిశిష్టమయినను

శబ్ద మొక్కటి కావ్యము కాదు. కేవల మర్థము కావ్యము కాదని పర్యవ
సితము. ప్రాచీనులు కొంద ఱర్థమునకే కావ్యత్వము నంగీకరించినారు.
కావుననే వారు కావ్యమునకు రూపకాద్యర్థాలంకారములె కావలయు
ననిరి. అనుప్రాసాదిశబ్దాలంకారము లలంకారములే కావని వారితలంపు.
అనేకవిధముల రూపకాదులనే వారు నిరూపించినారు. మనోహరమైనను
వనితావదనము నిరలంకారమైనచో విభాసింపదుగదా! అట్లు నిరలం
కారకావ్య మేమాత్రమును శోభింపను కొందఱు శబ్దమె కావ్యమనిన
వారు కలరు. వారు రూపకాదులు కావ్యమునకు బాహ్యాలంకారము
లందురు. సుబన్తతిజన్తముల చక్కని సన్నివేశమునే కావ్యాలంకార
ములుగా నెన్నుదురు. వారల కనుప్రాసాదిశబ్దాలంకారములే యభిమత
ములు. అదియె వారిమతమున సౌశబ్ద్యము. రూపకాద్యర్థాలంకారనివే
శనమే తాదృశము కాదని వారియూహ. ఈ మతములు రెండును
సమ్మతములు కావు. శబ్దార్థాలంకారభేదమున నా రెండు నభిమతములు.
కాఁగా సమ్మిళితములగు శబ్దార్థములు రెండును గావ్యమని సిద్ధము.

సహితభావము సాహిత్యము. సాహిత్యముననున్న శబ్దార్థములె
కావ్యమనుటవలన రెండిటిలో నొకప్పుడొకదానికిఁ గొంచెము న్యూనత
కలిగినను గావ్యవ్యవహారము వర్తించునా? యను శంకలేదు. శబ్దార్థ
ముల రెంటికిని వాచ్యవాచకసంబంధ మున్నది. వాని కెపుడును సాహి
త్యవిరహము లేదనుట సత్యమె. అయిన నిచటి విశిష్టమగు సాహిత్యమె
యభిప్రేతము. వక్రతచే విచిత్రములైన గుణాలంకారసంపదల పరస్పర
స్పర్ధాధిరోహమె యిచటి విశిష్టసాహిత్యము. సంగతులైన సత్సుహృదు
లిద్దఱు సమసర్వగుణులై పరస్పరశోభాహేతువులగునను శబ్దార్థములు
నట్లె యన్యోన్యశోభాసమర్థము లగును. శబ్దార్థములు రెండు నను ద్వివ
చనమున వాచ్యవాచకజాతిద్విత్వము చెప్పఁబడును. కేవలవ్యక్తిద్విత్వా
భిధాన మభిమతముగాదు. శబ్దత్వ మర్థత్వమనునది వ్యక్తిద్విత్వము. కేవల
మొకపదమునఁగూడ శబ్దత్వమర్థత్వ ముండును. అంతమాత్రమున నచటఁ

గావ్యత్వ మంగీకరింపవలసివచ్చును. కావుననే బంధము లవ్యవస్థితములై యుండవలయునని మూలవచనము. బంధ మనునది వాక్యవిన్యాసము. అచట సవిశేషముగా లావణ్యాదిగుణాలంకారశోభగల సన్నివేశమున నవస్థితములై యుండవలయుట యభీష్టము. సహితములను స్థలమున స్వజాతీయములకన్న శబ్దమునకు శబ్దాంతరముతో, వాచ్యమునకు వాచ్యాన్తరముతోడను యథాయోగముగాఁ బరస్పరస్పర్ధిత్వరూపమగు సాహిత్య ముండవలయుట వివక్షితము. కాకపోయినచోఁ దద్విదాహ్లాదకారిత్వమునకు హాని ప్రసక్తమగును. శబ్దార్థముల రెంటిలో నొకదాని సాహిత్యవిరహ మన్యతరమునకును బర్యవసన్నమగును. శోభించు నర్థమైనను సమర్థవాచకము లేకపోయినచో మృతకల్పమగును. వాక్యోపయోగివాచ్యము లేనపుడు శబ్దమును వాచ్యాంతరవాచకమై వాక్యమునకు వ్యాధిభూతమగును. కావునఁ బరస్పరసాహిత్య ముండవలయుట నావశ్యకము.

కవి క్రియాక్రమము షట్ప్రకారవక్రతావిశిష్టమై యుండవలయును. సామాన్యముగాఁ గవివ్యాపారము శాస్త్రాదులందుఁ బ్రసిద్ధమైన శబ్దార్థముల నిబంధముకన్న వ్యతిరిక్తమై యుండును. అట్టి వక్రకవివ్యాపారముచే బంధము శోభించునది కావలయుట యావశ్యకము. కష్టకల్పనోపహతమైన బంధమును నొకప్పుడు ప్రసిద్ధవ్యతిరేకిత్వము గలిగి యుండవచ్చును, గాని యది తద్విదాహ్లాదకారి కాదు. తద్విదు లనఁ గావ్యవిదులు. తద్జ్ఞుల కానందమును గూర్చు బంధమున శబ్దార్థములు వక్రతాసుందరములై వ్యవస్థితములు కావలయునని పరమార్థము. వక్రతాప్రకారములు తద్విదాహ్లాదకారిత్వమును బ్రత్యేకముగా వాని వాని యవసరమున ముమ్ముందు విస్పష్టము చేయఁబడును.

కావ్యసామాన్యలక్షణము విహితమైనది. ఇఁక విశేషలక్షణము చెప్పవలయును. ముందుగా శబ్దార్థముల స్వరూపము నిరూపింపఁబడును.

౮

వాచ్యోఽర్థో వాచకశ్శబ్దః ప్రసిద్ధ మితి యద్యపి
తథాపి కావ్యమార్గేఽస్మిన్ పరమార్థోఽయ మేతయోః.

వాచ్యమగు నభిధేయ మర్థము. వాచకమగునది శబ్దము. అర్థశబ్దముల కీలక్షణము ప్రసిద్ధమే. అయిన నీ యలౌకిక కావ్యమార్గమున నీ యర్థశబ్దములకుఁ జెప్పఁబోవునదియే పరమార్థము. అదియే యపూర్వతత్త్వము. శబ్దముల కుద్యోతకములని వ్యంజకములని భేదములు గలవు. అట్లే ద్యోత్యములు వ్యంగ్యములు నని యర్థము లున్నవి. వానినిట సంగ్రహింపకపోయినను హాని లేదు. అర్థప్రతీతికారిత్వ మనునది వాచకమునందువలె ద్యోతక వ్యంజకములందును గలదు. ప్రత్యేయత్వమనఁగాఁ దెలియఁబడుట యనునది వాచ్యమునం దున్నట్లు ద్యోత్యవ్యంగ్యములందును గలదు. కావున నన్ని శబ్దములు వాచకములని, అన్నియర్థములు వాచ్యములని నిరుక్తమైనది.

ఆ యపూర్వతత్త్వమేమి ?

శబ్దో వివక్షితార్థైక వాచకాన్యేషు సత్స్వపి

అర్థః సహృదయాహ్లాదకారిస్వస్పందసుందరః.

ఇతరశబ్దము లనేకములున్నను వివక్షితార్థమునకే వాచకమగునదియే శబ్దము. సహృదయుల కాహ్లాద మొనరించు స్వపరిస్పందసుందరమగునదియే అర్థము. కావ్యమున సముచితసమస్తసామగ్రికల శబ్దమే యుండవలయును. కవి చెప్పఁదలఁచిన యర్థము వివక్షితము. ఆయర్థమునకు వాచకపదము లనేకము లున్నను కేవల మదియే వాచకము కావలయును. అట్టి వాచకమే కావ్యశబ్దమని యనఁబడును. ఒక్కొక యర్థము సామాన్యరూపమునఁ జెప్పఁబడుట కభిప్రేతమగును. అట్టి యర్థమునకు విశేషాభిధాయకమగు శబ్దము చక్కని వాచకత్వమును బొందఁజాలదు. రత్నసామాన్యమును సామాన్యవాచకమగు రత్నపదముచేఁ జెప్పవలసియున్నపుడు విశేషవాచకమగు కౌస్తుభపదముచేఁ జెప్పుట శోభాతిశయమును సంపాదింపదు. అప్పటి ప్రక్రమోపసంహారవైషమ్యమువైరస్యదాయి యగును. కావున నట్టియెడల సామాన్యాభిధాయియగు శబ్దమే

సహృదయహృదయహారి కాఁగలదు. విశేషరూపమున వస్తువు ప్రతిపాదింపఁబడవలసియున్నప్పుడు విశేషాభిదాయకాభిధాననిబంధనమునే కవులాచరింతురు. జిగుప్సనీయార్థ మభిమతమైనచోఁ బరమేశ్వరవాచక శబ్దసహస్రమున్నను కపాలిశబ్దప్రయోగము వాచకవక్రత నాపాదించును. కపాలిపదము జుగుప్సాస్పదము ఇచటియర్థము శబ్దాంతరాభిధేయమగుటకుత్సహింపదు. వాచకము కవి తలంచిన విశేషము నభిదానించుటకు క్షమమై యుండవలయును. తత్సమయసముల్లిఖితమగు నొకానొక పరిస్పందమునఁ బదార్థములు ప్రతిభలోఁ బరిస్ఫురించును. అవి ప్రకృతప్రస్తావమునకుఁ దగిన యేదేని యుత్కర్షతో సమాచ్ఛన్నస్వభావములగును. అవి వివక్షితములై యభిధేయమార్గమున నవతరించునపుడు తథావిధవిశేషాభిధానసమర్థమగు శబ్దముచే నభిధీయమానములైనచోఁ జేతనచేతశ్చమత్కారిత్వమును బడయఁగలవు. విశేషాభిధానము నాకాంక్షించు పదార్థమున కావిశేషప్రతిపాదనపరవిశేషణము లేకున్నచో శోభాహాని కల్గును. ఈవిషయవివేకము వాచకవక్రతాప్రకారస్వరూపనిరూపణావసరమున సవిశేషముగాఁ బ్రకటము కాఁగలదు. కావ్యమున నర్థము సహృదయాహ్లాదకారిస్వస్పందసుందరము కావలయును. కావ్యార్థవిదులు సహృదయులు. ఆత్మీయస్వభావమున సుకుమారమగు నర్థము వారలకాహ్లాద మీయవలయును. పదార్థము సామాన్యముగా నానావిధధర్మఖచితమగును. అయినను సహృదయహృదయాహ్లాద మాధానించుటకు సమర్థమగు ధర్మసంబంధమే యిచట నభిమతము. స్వభావమహత్త్వ కల్గి రసపరిపోషాంగత్వము పొంది వ్యక్తిత్వమును సంపాదించునర్థమె తదాహ్లాదసామర్థ్యముకలది యగును. శబ్దార్థముల కిట్టి విశిష్టలక్షణమే యుపాదేయము. అప్పుడపార్థము నేయార్థము మొదలగు దోషములు దూరోత్సారితము లగును. కావున వానిని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఇంతవఱకు శబ్దార్థముల ప్రసిద్ధరూపాతిరిక్తమగు రూపాంతరము చెప్పఁబడినది. అంతమాత్రమె కావ్యోపయోగికాదు. అచట వైచిత్ర్యాంతరవిశిష్టత యున్నది.

# గ్రంథస్వీకారము.

(1) కర్మయోగము (2) భక్తియోగము (3) సర్వం విష్ణుమయం జగత్.

శ్రీ వివేకానందస్వామి మహోపన్యాసముల కివి యాంధ్రీకరణములు. క్రీ. శ. 19 వ శతాబ్దమున శ్రీరామకృష్ణపరమహంసకు ముఖ్యశిష్యుఁడగు శ్రీ వివేకానందస్వామి హిందూ మతమునుగూర్చియు, నందలి ముఖ్యసిద్ధాంతములనుగూర్చియు నమెరికా మొదలగు పాశ్చాత్యదేశముల గంభీరోపన్యాసముల నొసంగియున్నారు. ఆయా యుపన్యాసములు, గ్రంథములు నాంగ్లభాషను రచింపఁబడి యున్నవి. వానిని ఆంధ్రులయుపయోగార్థము మదరాసునందలి శ్రీరామకృష్ణ మతమువారు సులభమగు శైలి నాంధ్రీకరింపఁజేసి ప్రచురణ మొనర్చి యున్నారు. అనువాదకులు శ్రీ మాధవచైతన్యబ్రహ్మచారిగారు. వీరిదివఱలో వివేకానందుల జీవితచరిత్రమును బ్రకటించియున్నారు. వీరి భాషాంతరీకరణము సులభమై పాఠకులు శ్రమలేకుండఁగ వేదాంతవిషయముల గ్రహించుటకు వీలుగనున్నది. మూలగ్రంథమునందలి భావోద్రేకమును వ్యక్తపఱచుచు హిందూమతసిద్ధాంతములను దర్పణమునందువలెఁ బ్రతిబింబితమొనర్చుచున్నది. కేవలము అనువాదము మాత్రమే గాక, వివేకానందులవారు గ్రహించిన మూలగ్రంథములగు భగవద్గీత, ఉపనిషత్తులు మొదలగు గ్రంథములనుండి ప్రమాణము లీయఁబడినవి. భాషాంతరీకరణము మక్కికిమక్కిగఁ జేయఁబడక పాఠకులకు సుబోధమగునట్లు చేయఁబడినది. మూలగ్రంథమునుగూర్చి విశేషముగ వ్రాయవలసిన ప్రసక్తి యేమియులేదు. శ్రీవివేకానందుల యుపన్యాసములు గ్రంథములు ప్రాచ్యపాశ్చాత్యదేశముల మెప్పువడసియున్నవి. ఆంగ్లభాషయం దట్టిసులభలలితశైలిని వేదాంతవిషయముల నుపన్యసించిన మహనీయుఁడు మఱియొకఁడు లేఁడని చెప్పవచ్చును. అట్టి యుపన్యాసముల

నాంధ్రీకరణ మొనర్పఁ జేసి ప్రకటించిన శ్రీరామకృష్ణమఠమువారి కాం ధ్రులు తమకృతజ్ఞతాభివందనముల నొనర్పవలసియున్నారు. గ్రంథ ములువలయువారు మేనేజరు శ్రీరామకృష్ణమఠమునకు వ్రాయ వలయును.

---

## 4. రుక్మవతీపరిణయము.

రేకపల్లి సోమనాథకవి ప్రణీతము వెల రు 1-0-0.

ఈప్రబంధము విజయనగరమున శ్రీ వేపకొమ్మ గురువేంకట సుబ్బయ్యగారి యధ్యక్షతను ఆంధ్రవిజ్ఞానమండలివారిచేఁ బ్రకటింపఁబడిన మొదవకుసుమము గ్రంథకర్త క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దియందు అడిదము సూరకవికి సమకాలికుఁడై శ్రీ కాకర్లపూడి గోపాలరాయ పాయకరావుగారి యాస్థానకవియై యుండెను. గ్రంథమునందలి యితివృ త్తము పురాణప్రసిద్ధము భాగవతదశమస్కంధమునందలిది. ప్రద్యు మ్నుఁడు రుక్మిణీగర్భమున జనించి, శంబరాసురునిమాయచే సముద్ర మున మత్స్యోదరముఁ బడి, రతీదేవిసహాయమున శంబరునిజంపి, మేన మామయగు రుక్మికుమార్తెయగు రుక్మవతిని స్వయంవరమున వివాహ మాడుట యను కథ యిందు వర్ణితము. కవిత్వమును బ్రాచీనప్రబంధ ములరీతి ననుకరించుచు, సంస్కృతాంధ్రముల కలయికచే శోభిల్లుచు, హృదయాహ్లాద మొసఁగుచున్నది. ఈ రేకపల్లి సోమనాథుని కవితను బ్రశంసించెడి పద్యము పీఠికయందీయఁబడినది. ఈకవి కవిత్వము రుచుల వెన్నప్పములకు సరిగునుగునఁట. పాఠకులు దాని జవిచూచి యానందిం తురుగాక. శ్రీ ఆంధ్రవిజ్ఞానమండలివారు ప్రాచీనకవివరుల కావ్యములఁ బ్రకటించుచు నాంధ్రభాషకు మహోపకార మొనర్చుచున్నారు. వారి ప్రయత్నమున కాంధ్రభాషాభిమానులు చేయూఁత యొసఁగుదురని యాశించుచున్నాము.

---

## 5. శృంగారరసతరంగిణి.

ఇది ప్రాచీనప్రబంధములనుండి శృంగారరసప్రధానములగు పద్యముల సేకరించి శ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిగారిచేఁ బ్రకటింపఁబడినది. గద్యతరంగము ముందుఁ బ్రకటింపఁబడును. గ్రంథకర్తలు విజయనగరమున నుండి శృంగారగ్రంథమాలయందుఁ బెక్కుగ్రంథములఁ బ్రకటించియుండిరి. వీరిప్పుడు ఆంధ్రవిజ్ఞానమండలియందుఁ బ్రాచీన ప్రబంధములఁ బ్రకటింపఁజేయుచున్నారు. వీరియాంధ్రభాషాభిమాన మామూ గ్రంథములప్రకటనముచేతనే సువ్యక్తమగుచున్నది. ఈగ్రంథప్రకటనమున వారియాశయము మున్నుడియందుఁ దెలుపఁబడినది. 'కామోద్వృత్తికిఁగాక ప్రాజ్ఞులకు సత్కావ్యార్థభావప్రసూనామోదార్థమునేర్చికూర్చియిడితి న్నానందముం జెందరే' యని వారందు వ్రాసియున్నారు. ఆంధ్రభాషాభిమానులాయాప్రాచీన ప్రబంధములలో శృంగారపద్యములఁ బఠించి యానందమునుగాంతురుగాక. పదునాలుగ్రంథములనుండి పద్యము లిందు సమకూర్పఁబడినవి, వెల రు ! —0—0.

---

## 6. హిందూమతము. (Hinduism)

కొవ్వూరు సంస్కృతకళాశాలాధ్యక్షులగు శ్రీ జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ. గారిచే రచింపఁబడినది. గ్రంథకర్త లిదివఱలో వేదకాలపుస్త్రీలు, స్మృతికాలపుస్త్రీ లను గ్రంథములను రచించి ప్రకటించియున్నారు. వీరికి హిందూమతమునందును, యామతసిద్ధాంతములందును యభినివేశ మెక్కువ. శ్రుతిస్మృతిసదాచారములచే నిర్ణయింపఁబడిన హిందూమతధర్మములెల్లరకు సుబోధకముగ నుండునట్లు సులభశైలి నీగ్రంథము రచియింపఁబడినది. పీఠికయందలి పండితాగ్రేసరుల సదభిప్రాయములవలననే దీనియుత్కృష్టత తెలియఁగలదు. పాశ్చాత్యప్రపంచవిజ్ఞానసంఘర్షణముచే క్షీణించుచున్న హిందూమతమునకు నేఁటిదినములలో నిట్టిగ్రంథము లత్యావశ్యకములు. ప్రతిబాలుఁడును

జదివి గ్రహింపఁదగిన విషయము లిందెన్నేనిగలవు. గ్రంథమున నాయా ప్రమాణముల యర్థమును మాత్రము నిర్వచించి గ్రంథకర్త లాప్రమాణముల నర్థోజ్ఞాపికలయం దిచ్చినచో గ్రంథమింకను పఠనీయానుకూల మైయుండును. 'హిందూ'శబ్దమును గూర్చి యుపోద్ఘాతమునఁ దెలుపఁ బడినది. హిందూమతమనిన శ్రుతిస్మృతిపురాణేతిహాసనిబద్ధమగు మత మని వీరియాశయము. బౌద్ధాదిమతములు హిందూమతమునందలి విష యములఁ గొన్నిటిని గ్రహించినను, యవి హిందూమతాంతర్భూతములు గావని వీరు తెలుపుచున్నారు, బౌద్ధులు, జైనులు, సిక్కులు, ఆర్యబ్రహ్మ సామాజికులును హిందువులైనను ప్రాచీన మతసంప్రదాయములలోఁ గొన్నిటిని ద్యజించి భిన్నసంస్థలుగ నేర్పడియున్నారు. ఆయాసంస్థల సిద్ధాంతములనుదెలుపుట గ్రంథకర్తలయుద్దేశము కాదు. ఈగ్రంథమునఁ గొన్నిభాగము లిదివఱలో త్రిలిఙ్గ, దివ్యవాణి, మోక్షసాధని మున్నగు పత్త్రికలఁ బ్రకటింపఁబడియున్నవి. ప్రథమాధ్యాయమున వేదాదిగ్రంథ ములప్రామాణ్యమును, ద్వితీయమున గ్రంథప్రయోజనమును, సనాతన ధర్మపునరుద్ధరణావశ్యకతయుఁ దెలుపఁబడినవి. మూఁడవయధ్యాయమున వర్ణవ్యవస్థయు, ప్రత్యేకధర్మములును, నిరూపింపఁబడి, యిదిజాతీయతకు విరుద్ధముకాదని సిద్ధాంతీకరింపఁబడినది. (nationalism) నాల్గవయధ్యా యమున జతురాశ్రమములు వానిధర్మములును, పంచమమున నిత్యనై మిత్తిక కర్మములును, వానియాచరణవిధానమును, నాఱవ యధ్యాయ మున దయా శాంతి శౌచము మొదలగు నష్టగుణముల స్వరూపప్రాధా న్యమును వర్ణితములు; సప్తమాధ్యాయమున స్త్రీస్వాతంత్ర్యము, దాంప త్యము మొదలగువిషయములు ప్రాచీనదృక్పథమున విమర్శింపఁబడినవి. అష్టమాధ్యాయమున భగవంతునిగూర్చియు, నేకేశ్వరోపాసనము, శివ విష్ణు బ్రహ్మాదిదేవతలయర్చనములఁ గల సామరస్యమును, ఉపాసనాపద్ధతి ప్రయోజనమును గలవు. ఈగ్రంథమునఁ దెలుపబడినవిషయములలోఁ గొన్నిసంఘసంస్కారకులకును, స్త్రీ సమాజములకును వెగటుగఁ దోఁప

వచ్చును. కాని ప్రాచీనదృక్పథము ననుసరించి రచింపఁబడుటచే నట్టిది తప్పదు. ప్రాచీనసంప్రదాయముల ననుసరించి రచింపఁబడిన యీగ్రంథముహిందూమతసిద్ధాంతములనుసులభమగు తెలుఁగుభాషనుదెలుపుచు జిజ్ఞాసువుల కత్యంతోపకారకముగ నున్నది. గ్రంథకర్త లాయాతావుల జైనబౌద్ధాదియవాంతరమతసిద్ధాంతములను దిఙ్మాత్రముగ సూచించిన బాగుండునని తోఁచును.

వెల 0-12-0

---

## 7. భారతీయనాగరికత.

అహింసాతత్త్వము (మొదటి భాగము). ఈ గ్రంథము మహాత్మాగాంధి, నెహ్రు, బోసు, టాటా, అబ్దుల్‌కలాంఆజాద్ మున్నగు సుప్రసిద్ధనాయకుల చరిత్రములను, వెల్సుగారి జగత్కథ కనువాదమును రచించిన శ్రీ కొమాండూరి శఠకోపాచార్యులు. ఎం. ఏ. బి. ఎల్ గారిచే రచింపఁబడినది. ఇందలి విషయ మపూర్వమైనది. ప్రాచ్యపాశ్చాత్యదేశముల నవ్యనాగరికతా విజృంభణమును, పరస్పరయుద్ధములును విస్తరిల్లుచున్న దినములలో గాంధిమహాత్ముని యహింసాప్రచారమున కనుబంధముగ వేదస్మృతిపురాణేతిహాసయుగముల జరిగిన వృత్తాంతములఁబట్టి యహింసాతత్త్వప్రాధాన్య మిందు నిరూపింపఁబడినది. వేదములు, ఉపనిషత్తులు, స్మృతులు, జైన బౌద్ధవాఙ్మయములనుండియుఁ బెక్కు ప్రమాణము లాయాతావుల నీయఁబడినవి. రామాయణ మహాభారతములు, కావ్యనాటకాదిగ్రంథములును అహింసాతత్త్వమునకెట్టి ప్రాధాన్యమిచ్చుచున్నవో తెలుపుటకై యాయాకథలు విమర్శింపఁబడినవి. తరువాత మతప్రచారకులగు రామానందు, కబీరు, తులసీదాసు, వల్లభాచార్యులు, నానక్ మొదలగు సుప్రసిద్ధ మహాపురుషుల చరిత్రములు, వారివారిసిద్ధాంతములు, అహింసాతత్త్వ పరిణామములును దెలుపఁబడినవి. మహమ్మదీయ మతసంఘర్షణముచే నేర్పడిన పరిణామము నిరూ

పింపఁబడినది. పాశ్చాత్యనాగరికతను విడచి, యహింసాతత్త్వ మవలంబించి, నూతనశకారంభ మొనర్పవలయునను గాంధిమహాత్ముని యాశయముల ననుసరించి యహింసాతత్త్వపరిణామమునుగూర్చి యొకగ్రంథమును రచింపవలసినదని ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుసంఘమువారు కోరినందున గ్రంథకర్త లీగ్రంథమును రచించి ప్రకటించియున్నారు. నేఁటి నాగరికత యనర్థదాయకమనియు, నహింసాతత్త్వమే ప్రశస్త మనియు, నదియే మనభారతీయ సంస్కృతియందు నిరూపితమనియు వీరు సిద్ధాంతీకరించియున్నారు. ఇందలి విషయములు పాశ్చాత్యనాగరికతావ్యామోహితు లగువారికిఁ గటువుగ నుండవచ్చును. కొంద అహింస యనునది గ్రంథములందును, మహాత్ములయందును గన నగునుగాని సామాన్యజనదుర్లభమని తలంతురు. అదియు నేఁటి యాంత్రికయుగమున దుస్సాధ్యమని యందురు. గ్రంథకర్తలకును వీనికిని నేకాభిప్రాయమెన్నటికి నుండఁజాలదు. అహింసయే మానవజాతి కభ్యుదయకారణమను మహాత్ముని యాశయమును నమ్మి గ్రంథకర్త లీగ్రంథమును రచించియున్నారు. మానవుఁ డరిషడ్వర్గములకులోనై తాత్కాలికముగ హింసావిధానము నవలంబించినను, పరధనపరరాజ్యాపహరణాదికముల నొనర్చినను, అహింసయే యతని పరమావధియని యంగీకరింపక తప్పదు. అదియే యతని మహదాశయముగ నుండవలయుననుట నిర్వివాదాంశము. పెక్కుగ్రంథములను, ఉపాఖ్యానాదులను బరిశోధించి యహింసాతత్త్వప్రాధాన్యము నిరూపింప యత్నించిన గ్రంథకర్తల పరిశ్రమ మత్యంతప్రశంసనీయము. దీనిద్వితీయభాగమునుగూడ రచించి గ్రంథకర్తలు తమయుద్దేశమును సఫలీకృత మొనర్తురుగాక.

---

## 8. శ్రీహనుమద్భగవద్గీత.

ఇది అవధాని కవిశేఖర అబ్బరాజు హనుమంతరాయశర్మపాకయాజిగారిచే రచింపఁబడిన యాంధ్రానువాదసహితమగు గీతాప్రబ

థము. తిక్కనాదు లీభారతభాగము ననువదింపకపోయినను, సామాన్య జనుల యుపయోగార్థము భగవద్గీతల కిటీవలఁ బెక్కుభాషలయందుం బెక్కురీతుల ననువాదములు, వ్యాఖ్యానములు, బయలుదేఱినవి. ఇంకను బయలుదేఱుచున్నవి. అవియన్నియు గ్రంథప్రాశస్త్యసూచకములు. ఈ యుద్గ్రంథమును భక్తితో నెంద ఱెన్నివిధముల రచించినను శ్లాఘ్యమే. హనుమంతరాయకవిశేఖరులచే రచింపఁబడుటచే నిది హనుమద్భగవద్గీత యైనది. గ్రంథము తేటగీతముల సులభముగ నర్థమగునట్లు వ్రాయఁ బడినది. గ్రంథాలయోద్యమప్రచారకులగు శ్రీ అయ్యంకి వేంకటరమ ణయ్యగారి ప్రోత్సాహమున రచింపఁబడి వారికంకిత మొనర్పఁబడినది. బెజవాడ హనుమద్గ్రంథమండలి వారిచేఁ బ్రకటితము. మచ్చునకు రెండు పద్యములు.

తే. గీ. కలుగుఁ బ్రాణులు నన్నంబువలన, నద్ది
వర్షపతియగు పర్జన్యువలన, వాఁడు
యజ్ఞములచేత, నయ్యవి యఖిలకర్మ
జాతమున భూతలమ్మున జాతమౌను.

తే. గీ. కర్మ వేదంబువలనను గలుగు, బ్రహ్మ
మక్షరునివలనను గల్గునట్టుగాన
నెల్లెడల వ్యాప్తమగు బ్రహ్మ మెల్లయపుడు
యజ్ఞమునయందు వెల్గెడునం చెఱుంగు. (3–14, 15)

---

### 9. సహజలింగాష్టోత్తర సప్తశతకము.

శ్రీ విద్యారణ్యమహాగురుకృత వేదాంతపంచదశీసారసంగ్రహ స్వరూపమగు నీ గ్రంథము 708 గీతముల శ్రీ ఓలేటి సుబ్బరాయఁడు గారిచే రచింపఁబడినది. ఇందలి గీతములు 'సమరతిసుఖరంగ సహజలింగ' యను మకుటమును దాల్చియున్నవి. దుర్గమములగు వేదాంతవిషయ ముల నిట్టిగీతములఁ దెలుపఁబూనుటం దఱకును సాధ్యముకాదు. అంద

ఱకును దేటతెల్లమగునట్లు వేమనయోగీంద్రునిపద్ధతిని గవి యనుసరించి నట్లు తోఁచును.

గీ. జ్ఞానియైనవాఁడు సంసారమందున్నఁ
గొఱఁత లేదు చూడఁ గొంచెమైన
ననుభవింపకున్నఁ బ్రారబ్ధలయమెట్లు? స॥

గీ. భోగ్యవస్తురాశి భోక్తయు లేకున్న
శోకరూపభోగశూన్యమగును
చమురులేని దివ్వె చందంబు గాదొకో. స॥

---

## 10. విమర్శవ్యాసములు.

బందరు నోబిలుకళాశాలలో నాంధ్రాధ్యాపకులగు శిష్టా రామకృష్ణశాస్త్రి ఎం. ఏ. గారిచే రచింపఁబడినవి. ఈగ్రంథమున ప్రథమవ్యాసము వాఙ్మయతత్త్వమును గూర్చినది. అందలి సిద్ధాంతముల కనుగుణముగ నన్నయయుగము, సభాపర్వము, పోతన యను మూఁడు వ్యాసములు కలవు గ్రంథకర్తలు పాశ్చాత్య విద్యాప్రవీణు లగుటచే ప్రాచ్యపాశ్చాత్యవిమర్శనముల సమన్వయింప యత్నించి యున్నారు. కానిమార్గములు దృక్పథమును వేఱుగ నుండుటచే భిన్నాభిప్రాయము లకుఁ దావుగలదు. ప్రాచీన సంస్కృతాంధ్రసాహిత్యమున భాషకును, దానివలన మనకు వ్యక్తమగు నర్థమునకును అవినాభావసంబంధము నిర్ణయింపఁబడుటయేగాక గ్రంథములు, దోషరహితములు, గుణయుతములు, సాలంకారములగు శబ్దార్థములకలయికగా నిర్వచింపఁబడినవి. దానిననుసరించియే విమర్శనగ్రంథములు రచింపబడినవి. కావ్యాత్మ యెద్ది యను విషయమున రీతి, ధ్వని, వక్రోక్తి, రసము మొదలగువాని కొక్కొకయాలంకారికుఁడును ప్రాధాన్యమొసంగియున్నారు. కావ్యప్రయోజనము, కవులయాదర్శములనుగూర్చియు మనపూర్వులమార్గము పాశ్చాత్యవిమర్శనమునకు భిన్నముగనడచినది. ఉత్తమకావ్యమునకు నీతి

కిని సంబంధమేర్పడినది. 'రామాదివదాచరితవ్యం నతు రావణాదివత్'
అని నియమమేర్పడినది. మఱియు కావ్యదోషములను 'శ్రుతిక్లేశ నేప
దుర్భగ'మ్మని వారు నిరసించిరి. శబ్దస్వరూపమునుగూర్చి 'ఏకః శబ్దః సుప్ర
యుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతి'యని వారు ప్రశంసించిరి. కావ్యము
లు శ్రోతలకానందమును గలుగఁజేయుచు నీతిబోధకములగనుండి సర్వకాల
ములయందును ప్రశంసింపఁదగు నితివృత్తముతో రచింపఁబడినవి. అందు
ననే శాకుంతలాది నాటకములు పెక్కుసంవత్సరములు గతించినను నేఁటికిని
సహృదయానందకరములై యున్నవి. నేఁడు పాశ్చాత్యవాఙ్మయమును
గమ్యముగ నేర్పఱచుకొని మనకవులు తాత్కాలికవిషయముల వర్ణించుచు
నవలలు, నాటకములు, కథలు రచించుచున్నారు. శ్రీ శాస్త్రిగారు
పాశ్చాత్యవిమర్శనపద్ధతినిగైకొని ప్రథమవ్యాసమును రచించిరి మత
సాంఘిక రాజకీయ విషయములకును వాఙ్మయమునకును గల సంబంధ
మునుగూడ సంగ్రహముగ వీరు చర్చించియున్నారు. ఆదృక్పథముతోడనే
మిగిలిన వ్యాసములు రచింపఁబడినవి. భారతరచనకుఁగల కారణము
శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి పద్ధతిని నన్నయకుఁగల వైదికప్రవృత్తి
యని నిర్వచింపఁబడినవి. ఆంధ్రవాఙ్మయోత్పత్తికిని భారతరచనమునకును
పెక్కుకారణములు గలవు. నన్నయరచనము వైదికరచనమనియు తిక్క
నాదులు లౌకికకావ్యదృష్టులతోఁ దమగ్రంథముల రచించిరనియు ఊ
హించుట సమంజసముకాదు. రాజనరేంద్రుఁడు రసభావభాసుర నవార్థ
వచనరచనావిశారదులైన మహాకవులనేకులున్నను పురోహితుఁడగు నన్న
యభట్టువైపునకుఁ దనదృష్టిని మరల్చెననుట యతిసాహసముగుటయేగాక
నన్నయకవిత్వమునకు న్యూనతనాపాదించుచున్నది. కేవలమాంధ్రమేగాక
(తమిళముదప్ప) మిగిలిన దేశభాషలన్నియు సుమారు పదియవశతాబ్దము
నాఁటికిఁ దలలెత్తసాగినవి. సంస్కృతప్రాకృతాదిభాషలు క్రమక్రమముగ
క్షీణించుటవలనను జైనబౌద్ధమతసంపర్కమువలనను, దేశభాషలకు గౌర
వము హెచ్చి యాయాభాషల గ్రంథరచనము ప్రబలినది. అందును

పెక్కుభాషలయందు రామాయణ భారతాంధ్రీకరణములు ప్రాచీనగ్రంథములైనవి. వైదికమతోద్ధరణము, సనాతనమతసంరక్షణమును నన్నయ భారతరచనమున నతనియాదర్శములనుట పొరపాటు.

"నన్నయ శైలి పురాణశైలి." "కవితాలక్షణము లన్నియుఁ బరిమితముగా వ్యక్తీకరించుటచే నతఁ డుత్కృష్ట కవితాశిల్పమునందు మాత్రము సిద్ధహస్తుఁడు గా లేకపోయినాఁడు." 'నన్నయ కిట్టిలోకవ్యవహారదృష్టియు సహృదయత్వమును లేకపోలేదు, గాని తక్కువ. ప్రత్యక్షస్వానుభవమును కొంతయే. పూర్వమీమాంసమతావలంబియై నిత్యము త్రికాలములం దగ్నిహోత్రాదికర్మలఁ జేయు ప్రవరాఖ్యుని వంటి నైష్ఠికుఁడైన కర్మఠుఁడగుటచే నితనికి యజ్ఞయాగాదికర్మలయందు న్నంత యభిలాష యితరవ్యవహారములందు లేదు.' ఇట్టి విమర్శనా వాక్యములను సహృదయు లంగీకరింపఁజాలరు. నన్నయ తిక్కనలకుఁ గల తారతమ్యమును జూపి నన్నయ వైదికపద్ధతిని, తిక్కన శిల్పకళా నైపుణ్యమును గనఁబఱచుటకు నారణ్యోద్యోగపర్వములఁ గల ద్రౌపది తన పరాభవమును కృష్ణున కెఱింగించుట యను నితివృత్తమును గైకొని తీవ్రవిమర్శన మొనర్చి నన్నయ వర్ణన మసభ్యముగను, పచ్చిగ నున్న దనికూడ వీరు నిర్ణయించియున్నారు. ఏదోయొక్క విషయము మనమున నిడుకొని తదనుగుణముగ విమర్శనమొనర్చినచో నిట్లే యుండును.

సభాపర్వమనువ్యాసమున నాపర్వము భారతమునఁ బూర్వోత్తర కథలకైక్యముఁ గొల్పుచున్నదనియు, నందువలన భారతమంతయు సభాపర్వకథపైననే యాధారపడియున్నదనియు వివరింపఁబడినది. మూఁడవ వ్యాసమున పోతన భక్తిమయైకదృష్టితో భాగవతము రచించుట విస్తరింపఁబడినది.

---

## 11. సూర్యసాముద్రికము.

కాకినాడవాస్తవ్యులగు సాముద్రికశిరోమణి, జోతుల సూర్యనారాయణమూర్తిగారిచే రచింపఁబడినది.　　వెల రు 3-0-0

సాముద్రికశాస్త్రము భారతదేశమునకుఁ జిరపరిచితమైనను, నాంధ్రదేశమున నాశాస్త్రగ్రంథములు లేకపోవుటఁజేసి గ్రంథకర్తలు విపులమగు గ్రంథమును రచించి ప్రకటించిరి. వీ రాంగ్లభాషాపాండిత్యము గలవారగుటచే సెయింట్ జర్మెయిన్, ఆలెక్ లియో, కీరో బెన్హాము మొదలగువారి యాంగ్లగ్రంథముల నాధారముగఁ గొని వాని యందలి ముఖ్యసూత్రముల కనుగుణముగ నిరువదియేడధ్యాయముల గ్రంథమును రచించిరి. పాశ్చాత్యశాస్త్రమున కనుకూలమగుతావుల సంస్కృతగ్రంథములనుండి శ్లోకము లుదాహరింపఁబడినవి. ఈశాస్త్ర విషయముననుగూడఁ బ్రాచ్యపాశ్చాత్యులమతము భిన్నమార్గములను నడచినది. హస్తరేఖలు వానిఫలితములును భిన్నములే. సుప్రసిద్ధ పాశ్చాత్యగ్రంథసాహాయ్యమున గ్రంథకర్త లీగ్రంథమును రచించియుండుటచే నది పాఠకులకు మిక్కిలి యుపయోగముగ నుండునని మన మూహింపనగును. ఇట్టి శాస్త్రగ్రంథములందలి విషయములు గ్రంథకర్తలు దెలిపినరీతిని వేగిరపాటు నొందక యోచనతో విమర్శ కొనర్చి గ్రహింపవలయును. పాఠకుల సౌకర్యమునకై పెక్కుచిత్రము లీయఁబడినవి.

---

## 12. కమ్మవారిచరిత్రము, ద్వితీయభాగము.

శ్రీ. కొత్త భావయ్యచౌదరిగారిచే రచింపబడినది.　　వెల రు 1-4-0

ఇందలి ప్రథమభాగము పరిషత్పత్త్రిక సం॥ 28 పుట 374 యందు విమర్శింపఁబడినది. కమ్మవారు ప్రాచీనాంధ్రక్షత్రియు లనియు చోడ, దుర్జయ, చాళుక్య, హైహయ రాజవంశములనుండి కమ్మవంశ

మేర్పడినదనియు గ్రంథకర్తలు నిరూపించుటకై శ్రమవహించి యీ గ్రంథమును రచించియున్నారు. ప్రాచీనక్షత్రియవంశములు కమ్మ, వెలమ, రాచవారలుగాఁ జీలిరనియు, రెడ్డి, కాపు సంఘములనుండి కమ్మవా రేర్పడియుండలేదనియు, కమ్మవారు తరువాత చౌదరులై రనియుఁ బ్రథమభాగమునఁ జర్చింపఁబడినది. కొంతవఱకు క్రీ. శ 10 వ శతాబ్దము పూర్వపుకమ్మవారి చరిత్రయును గలదు.

రెండవభాగమున నాయావంశములఁగలసుప్రసిద్ధపురుషులచరిత్ర సంగ్రహముగ నొసంగఁబడినది. ప్రాచీనక్షత్రియవంశపురాజులు తమకుఁ బూర్వులని విశ్వసించియుండుటచే గ్రంథకర్త లీ రెండవభాగమున నాయాక్షత్రియవంశవీరులచరిత్రమును వర్ణించియున్నారు. కమ్మవారిగృహనామములు గోత్రములు రెండుభాగములందు నీయఁబడినవి. మూఁడవ భాగమునుగూడ నచిరకాలముననే ప్రకటింతుమని గ్రంథకర్తలు పీఠికయందు వ్రాసియున్నారు. జిజ్ఞాసువులు సహృదయులై గ్రంథమును దిలకింతురుగాక.

---

**13. జైనసిద్ధాంతభాస్కర.** సంపు. 8. కిరణ. 1.

14. The Jaina Antiquary - Vol. VII - No. 1.

ఈరెండు పత్త్రికలు నొకటి హిందీభాషలోను రెండవది యాంగ్లభాషను జైనపురాతత్త్వేతిహాస విషయములనుగూర్చి బీహారుదేశమున ఆరా పట్టణమున నెలకొల్పఁబడిన జైనసిద్ధాంతభవనమువారిచేఁ బ్రకటింపఁబడుచున్న షాణ్మాసిక పత్త్రికలై యున్నవి. ఇందు జైనపురాణములు, శాసనములు, తీర్థంకరులనుగూర్చియు, వాఙ్మయమునుగూర్చియు మిక్కిలి యమూల్యములగు వ్యాసములు గలవు.

సంవత్సరచందా రు 3-0.0.

The Jaina Antiquary in English & the Jaina Siddhanta Bhaskar in Hindi are issued once in six months by the Jaina Siddhanta Bhavana, Arrah, Bihar. The journals contain valuable articles regarding Jainism in its Literary, Historical & Philosophical aspects, and extremely useful to scholars. We wish the journals a long life of research in the unexplored regions of Jaina thought, literature and History. Yearly subscription for both is Rs. 3 only.

## 15 & 16 దక్షిణాఫ్రికా సత్యాగ్రహము.

మహాత్మాగాంధి విరచితము. అనువాదకులు శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు. రెండు భాగములు. వెల ప్రతిభాగము 0-8-0. కొవ్వూరు ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము వారిచే సూర్యనారాయణీయ గ్రంథమాలలో 12, 13 వ కుసుమములుగాఁ బ్రకటితములు

మహాత్మా గాంధిగారు దక్షిణాఫ్రికా సత్యాగ్రహమునుగూర్చి గుజరాతీభాషలో వ్రాసినగ్రంథ మాంగ్లమున భాషాంతరీకరణ మొనర్పఁబడినది. ఇది దానికి నాంధ్రానువాదమై సులభమగు భాషలోఁ బండిత పామరులకు బోధపడునట్లు రచింపఁబడినది. ఆంధ్రగీర్వాణ విద్యాపీఠమును శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారు కొవ్వూరున నెలకొలిపి దానికిఁ దమ సర్వస్వమును ద్యాగము చేసియున్నారు. ఆవిద్యాపీఠము వారిచే నింతవఱకును బెక్కు గ్రంథములు ప్రకటింపఁబడినవి. శ్రీసూర్యనారాయణరావుగారి యనంతర మేర్పఱుపఁబడిన సంఘము వారిచే నింకను బ్రకటింపఁబడుచున్నవి. మూలగ్రంథమునుగూర్చి విశేషముగ వ్రాయ నక్కఱ లేదు. సత్యాగ్రహవిధానము ధర్మయుద్ధమనియు, నసూయాల్యమును నిరుపమానముననగు నాయుధమనియు మహాత్ముని దృఢవిశ్వాసమైయున్నది భారత రాజకీయరంగమున దానియుపయోగమును గొంతమంది శంకించుటయుఁ గలదు. అట్టివారీగ్రంథమును జదివినచో దమయభిప్రాయములను దత్క్షణము మార్చుకొందురని మాయభిప్రాయము. దక్షిణాఫ్రికా సత్యాగ్రహమైనతరువాత మనదేశములో గాంధిమహాత్ముఁడు నడపిన సత్యాగ్రహోద్యమములు వానిపీఠికయందుఁ దెలుపఁబడినవి. శ్రీ సీతారామశాస్త్రిగారి యనువాదము సులభమై సరళమై యున్నది. సత్యాగ్రహ సమరవిధానముల నెఱుంగఁగోరువారు దీనిని బాగుగఁ జదివి తెలిసికొందురుగాక.

---

# కాశీఖండము—పాఠభేదములు.

వ్యాకరణవిద్యాప్రవీణ—విద్వాన్ చిలుకూరి పాపయ్యశాస్త్రి.

శబ్దబ్రహ్మంబు కారణబింద్వాత్మకంబై బిందునిష్యందత్వంబునకుం బురుషేచ్ఛాప్రయత్నంబున మూలాధారావస్థిత పవనసంధుక్షణంబునం జేసి యభివ్యక్తంబై పరావాక్కనంబడు. ఆబ్రహ్మంబే నాభిపర్యంతం బావాయువుచే నభివ్యజ్యమానంబై మనంబుతోడంగూడి, సామాన్యస్పంద ప్రకాశరూపిణియుఁ గార్యబిందు తత్త్వాత్మికయు నీశ్వరాధిదేవతయు నై పశ్యంతీవాక్కనంబడు. ఆ బ్రహ్మంబా వాయువుచేత హృదయపర్యంతంబై విశేషస్యందరూపయు నాదబిందుమయయు హిరణ్యగర్భాధిదేవతయునై మధ్యమవాక్కనంబడు. కాశీ 3 ఆ. 49 వచనము.

ఇయ్యది ముద్రితప్రతులందలి పాఠము. అగస్త్యుఁడు లక్ష్మీదేవిని, పరాశక్తిగ భావించి స్తుతింపనవసరమున నామె పరతత్త్వమును బై రీతిగ కవి వర్ణించినాఁడు. ఈవిషయము సంస్కృతము కాశీఖండమున నీతావున లేనిదియే ఇదియు మంత్రశాస్త్రసంప్రదాయానుగతము.

శ్లో. మూలాధారాత్ప్రథమ ముదితో యశ్చ భావః పరాఖ్యః
పశ్చాత్పశ్యన్త్యథ హృదయగో బుద్ధియుఙ్మధ్యమాఖ్యః
వ్యక్తే వైఖర్యథ రురుదిషో రస్య జన్తో స్సుషుమ్నా
బద్ధ స్తస్మా ద్భవతి పవనప్రేరితా వర్ణసంజ్ఞా.

అను నీయాచార్యసూక్తి కీవచనరచన చాలవఱకు సరిపడియున్నది. కాని వ్రాతప్రతులు పెక్కింటియందు బై రేఖాంకితస్థలములందుఁ గ్రమముగ స్పందప్రకాశరూపిణియు, కార్యబిందుతత్త్వాత్మికయు, విశేషస్పందరూపయు, ననుపాఠములే గానవచ్చుచున్నవి. ముద్రితప్రతులందలిపాఠము లెట్లును సరిపడవు. స్యందస్వరూపిణి గాదామె. స్పందస్వరూపిణియే.

శ్లో. యదయ మనుత్తరమూర్తిః నిజేచ్ఛయా జగత్స్రష్టుం
ప్రస్పందే సస్పందః ప్రథమః శివతత్త్వ ముచ్యతే తజ్ఞైః

అను తత్త్వసందోహవాక్యంబుచే, ప్రాణ్యాదృష్టవశమునఁ పరాశక్తికి జగత్సిసృక్షుగల్గినపు డేర్పడు కదలికయే స్పందమనఁబడును. అట్టి స్పందస్వరూపిణియని తెలుపుటకే 'స్పందప్రకాశరూపిణి, యనినాఁడు.'

"అస్మాచ్చకారణబిందోః, సాక్షాత్క్రమేణ కార్యబిందుః, తతో నాదః తతోబీజమితి త్రయ ముత్పన్నం, తదిదం పరసూక్ష్మస్థూలపదైరప్యుచ్యతే" అను భాస్కరాచార్యుని వచనరీతిని కార్యబిందు స్వరూపిణిగాని, కావ్యబిందు స్వరూపిణి గాదు. కావున నీతావులందుఁ దాటియాకు ప్రతులందలి పాఠములే సమంజసములు.

క. కర్ణికాంతము సేరి యేకతమ శివుఁడు
మునుపు మోక్షచింతామణి జనునకిచ్చుఁ
గాన మణికర్ణికాసమాఖ్యత వహించె
నమ్మహాతీర్థ మమర గంగాతటమున.

కాశీ. 3 ఆ. 96 ప.

ఈయది ముద్రితప్రతులందలిపాఠము. "శివుఁడు కర్ణసమీపముఁ జేరి, ఏకాంతముగఁ బూర్వము మోక్షచింతామణియగు తారకమంత్రమునుపదేశించునుగాన నీ మహాతీర్థం బాగంగాతటమున మణికర్ణిక యను పేరును వహించెను" అని ముద్రితపాఠమునకర్థము.

ఇఁక నీపద్యమునకు మూలమయిన సంస్కృతకాశీఖండమునందలి శ్లోకమును, తదర్థమును బరికింతము.

శ్లో. సంసారచింతామణి రత్రయస్మాత్
తత్తారకం సజ్జనకర్ణికాయామ్
శివోఽభిధత్తే సహ సాంతకాలే
తద్గీయతేఽసౌ మణికర్ణి కేతి.

ఈ తీర్థమున సజ్జనులకర్ణమునందుఁ జరమకాలమున సంసారచింతామణియగు శివుఁడు తారకమంత్రము నుపదేశించునుగాన నిది మణికర్ణిక యని కీర్తింపఁబడుచున్నదని పైశ్లోకమునకర్థము. పై ముద్రితపాఠమును బట్టి మరణకాలమునకుఁ బూర్వము శివుఁడు మోక్షచింతామణియగు తారకమును జనునకిచ్చునను నర్థము లభ్యమగుచున్నది. అయ్యది మూలమునకు సర్వథావిరుద్ధము.

వ్రాఁతప్రతులందెచ్చటను నిట్టిపాఠము గానరాదు. ఆయా ప్రతులందు 'మునుకు మోక్షచింతామణి జనునకిందు' అనుపాఠమే గానవచ్చుచున్నది. మునుకుట అనఁగా నుపదేశించుట, లేక మెల్లఁగాఁ జెప్పుట. అనఁగా శివుఁడు ఈ క్షేత్రమున మరణించువారి కానమయమున మోక్షచింతామణియగు తారకము నేకాంతముగ నుపదేశించునని యర్థము. ఈయర్థమున మూలమగు సంస్కృతశ్లోకముతో విరోధమును లేదు.

కావుననే చిన్నయసూరిగారు, మునుకుట ఉపదేశించుట-మెల్లఁగాఁ జెప్పుట యను నర్థమును వ్రాసికొని 'మునుకు మోక్షచింతామణి జనునకిందు' అను పాఠమునే తమ నిఘంటుపదసూచికయందు సేకరించి యున్నారు. ఈ యర్థముననే శ్రీనాథుఁడీ ప్రయోగమును బ్రయోగించి యున్నాఁడు.

మ. శ్రుతపూర్వంబగు విశ్వమోహన కళాశోభా విశేషంబు సం
స్మృతి నూహింపఁగఁ జాయవాఱుటయుఁ బ్రేమంబాత్మలోఁ గీలుకో
నితఁడే నైషధుఁ డంచు నొండొరులతో నేకాంత మెయ్యెయ్యా నా
శతమన్యుప్రముఖామరుల్ మునుకుచుం జర్చించి రుత్కంఠతోన్.

నైష. 3 ఆ. 42 ప.

మఱియుఁ బై పద్యమున గంగాతటమున అనుచోట 'గంగాంతరమన' అనియే వ్రాఁతప్రతులన్నింటియందలి పాఠము. తీర్థమునుగూర్చి తెలుపుటగాన నిదియే సరియయినది.

# విజయవాదము.

విద్వాన్. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు.

---

మధురభావచమత్కృతి మద్వచస్సు
భరితసర్వాంధ్ర సుస్వచ్ఛతరయశస్సు
మహితశాశ్వతకోశవాఙ్మయతపస్సు
నూనిన బుధేంద్ర ! కొను మిదే నా మనస్సు.

౨

ఆర్యా, సుబ్బయశాస్త్రిపండితవరేణ్యా ! గ్రాంథికాంధ్రప్రభా
మర్యాద న్నిలఁబెట్టె రామయమహామాన్యుండు; నీవున్ శిరో
ధార్యంబైన తదీయవాద మనుసంధానించి దీక్షామతిన్
సూర్యారాయనిఘంటుపూర్తి సుయశస్స్ఫూర్తిం బొనర్పింపుమా !

3

అవ్యయీభావ దీక్షారంభమునుం జెంది
శబ్దాధికారప్రసక్తిఁ బడసి
పండిత ప్రత్యయభావము కలిగించి
తద్ధితమతిఁ గృతార్థతను గాంచి
అసకృత్తుగా సభాధ్యక్షతాపద మంది
మృదుపరిభాషల మెప్పు వడసి
ఆంధ్రభోజుని త్రిలిఙ్గానుశాసకుని యా
స్థానిలోఁ బండితస్థాన మెనసి
నవమనోరమ శబ్దరత్నములఁ బ్రథితిఁ
జెంది, నీయశఃకౌముది చింతితార్థ
సిద్ధి సేకూర్చి, పండితశేఖరులకు
సవదరించిన భూషణసార మగుత !

౪

శ్రీ రుచిరంబు, సారగుణచిహ్నితమైన త్రిలిఙ్గకోశకే
దారము పంటకై బహువిధంబులఁ బెట్టుబడిన్ వ్యయించె నా
భూరమణుండు మున్నె; కడుపుల్ తనివొందఁగ నింక నీసుధా
సారవచస్సువృష్టిఁ బెలుచన్ ఫలియింపఁగఁ జేయు మాకృపన్.

౫

ఇద్దఱు సూర్యులు ప్రణయ ర
సోద్దండమతులయి నిన్నహోరాత్రంబుల్
నిద్దంపుభక్తిఁ గాంచఁగ
నద్దిర ! నీభాగ్య మేమనందు బుధేంద్రా !

౬

భావితబుద్ధులై తగిన పండితులన్ మృదురీతి నీవు నా
జ్ఞావధిలో మెలంగునటు లాన యొనర్చి, నవంనవోన్మిష
ద్యావఁశక్తి నూని, సకలాంధ్రము నివ్వెఱవో, నిఘంటుము
క్తావళి తెల్గువాణి కుపహారము సేయుము చేతిమీఁదుగాన్.

౭

సత్యవచస్కులైన సువిశారదులన్ దరిఁజేర్చి, యాంధ్రభా
రత్యభిసేవఁ జేసెడి తలంపున, లంపులమారులౌ, పర
ప్రత్యయనేయబుద్ధుల యవాకులు లోన గణింపనట్టి సా
హిత్యవిశారదా ! కొను మిదే ! యభినందనపత్త్రహారమున్.

---

[వైపద్యములు బ్రహ్మశ్రీ సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయశాస్త్రి గారి నీశ్వర పుస్తకభాండాగారమువారు సన్మానించిన సందర్భమునఁ జదువబడినవి.]

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

## కాకినాడ.

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము ౩౦. { వృష. జ్యేష్ఠ—భాద్రపదములు. } సంచిక ౨-౩.



కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

1941 జూన్-సెప్టెంబరు.

# విషయసూచిక.



శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౦. { వృష. జ్యేష్ఠ—భాద్రపదములు. } సంచిక౨-౩.

## పత్త్రికాప్రశంస.

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు.



చ. జగతిని నీవొనర్చెడు ప్రచారముఁజూచి ప్రమోదమంది నీ
యగణితసేవ కావిధులయందలి నేర్పిది యంచుఁ జెప్పఁగాఁ
దగునని వ్రాసినాఁడను యదార్థపుఁ దత్త్వము నంతెగాని నిన్
బొగడఁదలంచి నాదుకలమున్ నడిపింపఁగలేదు పత్త్రికా !

ఉ. ముప్పదియేండ్లు వచ్చినవి పొందగు యౌవన మాక్రమించె నీ
గొప్పతనంబు నాంధ్రజనకోటియు నెల్ల గ్రహించుకీర్తి నే
ర్వొప్పఁగఁజేసి శుద్ధమగు సూక్తులఁ జాటితి వింతదాఁక నేఁ
జెప్పెడి దేమి నీకుఁ జిరజీవిగ వర్ధిలుమమ్మ పత్త్రికా !

ఉ. కాలముమారె ఘోరకలికాలమువచ్చెఁ బ్రశాంతమన్న నే
మూలనునైనఁ గన్పడదు పొక్కుచునుండెను దెన్గుతల్లి యే
వేళను భాష కేగతిని విప్లవముల్ గననౌనొ యంచు, నీ
శీలము గొప్పదౌట దరిఁ జేరఁగఁజాలవు నింద్యపద్ధతుల్.

ఉ. నన్నయనాఁటిభాష, కవినాథులు చూపిన యట్టిత్రోవ, పె
ద్దన్న రసప్రయోగములయందలి యందము చందమెల్లఁ ది
క్కన్న తెలుంగుసొంపు వినఁగాఁ గనఁగాఁ బఠియింపఁగా
మహాభ్యున్నతిత్రోవ లభ్యమగుచుండును నీయెడ నేఁటికైననున్.

ఉ. భాషను మార్చకుండఁ బరివర్తనమందొక మార్పులేక, యే
వేషముతోఁ బనేలయని విజ్ఞతఁగాంచి వివాద మాడ కే
దోషముగాంచఁబోక పదిరూకలకై యెపుడాశలేక సం
తోషముతోఁ బ్రచారమును దోరపుభక్తి నొనర్తు వెప్పుడున్.

ఉ. నీవయ నాకు ముఖ్యమగు నెచ్చెలి వెయ్యడనైనఁగాని శ్రీ
దేవివి నీవయంచు వెనుదీయక నిన్నదఁగొల్తు భాషయం
దేవిధమైనలోప మొకయింతయుఁ గానఁగరాదు నీతికిన్
దావలమౌను నీ చరిత; తప్పవు పెద్దలమార్గ మెన్నఁడున్.

మ. అదియే నీకొనగూర్చెఁ గీర్తిఘన మత్యంతంబుగా ధాత్రిలో
ముదమారన్ గడియించినావు కవితన్ బోషించు సామర్థ్యమున్
విదితంబయ్యెను దేశదేశములకున్ నీశక్తి యేనాఁటికిన్
వదలన్ బోకుమ పెద్దలేఁగు సరణిన్ వర్ధిల్లు సౌభాగ్యముల్.

గీ. వృద్ధు లేఁగినమార్గంబు వీడఁబోక
సత్కవిత్వప్రచారంబు సాఁగనిమ్మ
కాలగతుల కేనాఁడు జంకవలదమ్మ
కీర్తి వచ్చెను లోకైకమూర్తి వనుచు.

ఉ. మెచ్చెడువారు స్వల్పమని మెచ్చనివారలసంఖ్య యెప్పుడున్
హెచ్చుగనుండునంచుఁ బఠియించెడువారలు తక్కువంచు లో
నచ్చుపడంగ భీతి పడకమ్మ ప్రశాంతిగనుండుమమ్మ వి
ద్వచ్చయముండె లోకమున భాస్వరకీర్తియు నీకుఁ గల్గెడిన్.

క. కాదని నిన్నెదిరించిన
వాదములాడని భవిత్రభావముఁ జెప్పన్
రాదుగ; భాషా సేవా
రాధన తత్పరుల కెల్లఁ బ్రమదంబగుతన్.

# సూరి.

## మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

గీ. చక్రవర్తి న్యుపాహృత సాదరత్న
ఖచిత సౌవర్ణ కంకణ క్వణ దనర్ఘ
కావ్య కృన్నిజ కరకంజ ! నవ్యకవిని
నాసఁకుచున్నాఁడ నీకిఁగా ? నాయకునకు నొసఁగుమా।

* * *

సీ. వచనవాఙ్మయకవిబ్రహ్మ నే నని చాటి
తెలుపఁగ నీతిచంద్రికను గూర్చి
విద్వత్కవిత్వసంపద్విష్ణుఁడ నని
ప్రకటింపఁ గొన్ని కబ్బములు వ్రాసి
ప్రథమాంధ్రకోశప్రవక్త నే నని చెప్ప
వితతనిఘంటునిర్మితికిఁ గడఁగి
యాంగ్లసారస్వతవ్యాసంగి నని తెల్ప
* న్యాయశాస్త్రము తెల్గునన్ రచించి
సర్వతోముఖ భవదీయశాస్త్రసార
వేత్తృతాస్ఫూర్తి నందికొనిన మాంధ్ర
సుకవిచాకోరమునకును జూజ లిచ్చి
శాశ్వతుఁడ వైతి నిదె సంస్తవ మొనర్తు.

౨

శా. అన్నా, చిన్నయసూరి ! నన్నయబుధాధ్యక్షుండు నాఁ డెన్నఁడో
చెన్నుం బాసిన యీతెలుంగునకు వాసిం గూర్చి, యాంధ్రీయభా
షౌన్నత్యం బిఁక దేశదేశములఁ ఖ్యాతిప్రాప్త మ్మగాఁ జేసె, న
చ్ఛిన్నాత్మప్రతిభాప్రభాసితకృతిన్ జింతామణివ్యాకృతిన్.

---

* ఇంగ్లీషు లా శాస్త్రము.

౩

గీ. పాణినీయశాస్త్రఫక్కి నయ్యాది కేవ
లాంధ్రవిజ్ఞు లెఱుఁగ నైతి గాక
పరఁగుచుండ నీవు బాలబోధార్థము
తెలుఁగునంద కూర్చితివి మహాత్మ !

౪

శా. నీరక్తమ్మును దారవోసికొని యెన్నేలక్ష్మలక్ష్యంబు లిం
పారం జేరిచి, విద్వదాశ్రయముగా నవ్యాప్త్యతివ్యాప్తిసం
చారం బెచ్చోట లేక కూర్చితివి భాషావ్యాకృతిన్, దానిపై
హోరాహోరిగఁ జల్పుచుండి రట వాగ్యుద్ధంబులన్ బండితుల్.

౫

క. హారికారికలకు నీవ్యా
కరణ మ్మనువాద మనియుఁ గా దనియు నెవో
పరివాదమ్ములు గల వవి
తిర మగుకీర్తికిఁ గొఱఁత దెచ్చునె సూరీ !

౬

గీ. శిష్టకవికి నీకు శ్రీకాళహస్తిలోఁ
నేదొ వాక్యవాద మొనసి నప్పు
డాతఁ డోడె ననుచు ననుకొనుచున్నార
లార్య ! దీనఁ గల యథార్థ మెంత ?

౭

గీ. "సూరికి నే వ్రాసిన హరి
కారిక లాధార"మని జగంబునఁ జాటం
గోరి యొకరేయిఁ దత్కృతిఁ
గూరిచె నతఁ డనియుఁ జెప్పికొందురు నిజమే ?

౮

గీ. ఇంతకు నతండు "కారికావృత్తి గాని
మూలము రచింపలేదు నే మొఱ్ఱొ"యనుచు
వ్రాసికొనినట్లు విస్పష్టపడు మనండె
శ్రద్ధ నరయఁగఁ దాటాకుఁబ్రతులలోన.

౯

క. సమధిగతసర్వశాస్త్రా
గముఁడు, విచిత్రాత్మకావ్య కవితాలహరీ
క్రమపరితోషితనృపజనుఁ
డమలాత్ముఁడు కృష్ణకవి బుధారాధ్యుఁ డగుఁన్.

౧౦

చ. ఎఱుఁగవయేమొ ? కల్లురిబుధేంద్రుఁడు నీవు రచించినట్టి వ్యా
కరణము* గుప్తభావముఁ బ్రకాశ మొనర్చుచు నద్భుతార్థ వి
స్ఫురితము నొక్కవ్యాఖ్యఁ బరిపూర్ణముగాఁ బ్రకటించి, నీయశ
స్స్ఫురుచిరలక్ష్మి కొక్కనవశోభ ఘటించె నుదంచితంబుగన్.

౧౧

ఉ. కాని, యతండు శిష్టుకవికారికలందు విశిష్టగౌరవం
బూని నిరంతరంబుగ నెటో తనవాదము నిల్పుపొంటె నె
న్నేని లిఖించెఁ గాని యొకఁ డేనియు విశ్వసనీయ మైనటుల్
తానఁగరాదు నాకుఁ; దలఁకం బని యేమి యథార్థ మెన్నఁగన్.

౧౨

గీ. అచ్చు టచ్చుట నీనిగూఢాశయములఁ
గొన్నిటిని దిన్నగాఁ గూర్చు కున్న నేమి
†టీక వ్రాసె "సారస్యపేటిక" యనంగఁ
గీర్తిశేషుఁడు శ్రీరామమూర్తిశాస్త్రి.

---

*గుప్తార్థప్రకాశిక:—కీ॥ శే॥ కల్లూరి వేంకటరామశాస్త్రిగారిది.

†బాలవ్యాకరణ సారస్యసర్వస్వపేటిక:—కీ॥ శే॥ విద్వాన్ దూసి రామమూర్తిగారిది.

౧౩

గీ. తెలుఁగువ్యాకరణమున కాస్తిక్య మొసఁగి
యనునిమేషముఁ దద్గతైకాస్థఁ బలిమి
నమితకృషి సల్పుమా వజ్ఝలాన్వవాయ
రత్నమును నీవు మఱవంగ రాదు సూరి !

౧౪

చ. మఱచితి నొక్కమాట రసమంజులవాక్యపరీత రీతి వి
స్ఫురణము గల్గునట్లు సుకవుల్మది నెన్నఁగ నీతిచంద్రికన్
విరచనచేసినాఁడ; వటుపిమ్మట నిమ్మగ నుత్తరార్ధ మె
వ్వరు రచియించిరో యెఱుఁగవా? యది తెల్పెద నాలకింపుమీ.

౧౫

గీ. కందుకూరి వీరేశలింగకవి దాని
మధురరచనావిశేషసంపద యొసంగఁ
బూరణ మొనర్చె రసపుష్టి పొదల; నైనఁ
"జిన్నయసుఁ జాలఁ" డనుచుఁ గేచిన్మతంబు.

౧౬

గీ వ్యాకరణఫక్కికకును వేదాంతపారి
భాషికపదంబులకు నేదొ బాంధవంబు
సన్నిహితముగఁ గల దని చాటుపొంకు
జతన మొనరించితివఁట నిశ్చయమె? సుకృతి !

౧౭

గీ. వారణాసినుండి వచ్చినమీమాం[illegible]
కులను శాస్త్రవాదగోష్ఠిఁ ద[illegible]పి
నిరుపమాన "సూరి" బిరుదమ్ముఁ గొనినాఁడ
వాంధ్రకీర్తి మిన్ను నంటు న[illegible].

౧౮

సీ. శబ్దరత్నాకరోచ్చైర్నిఘంటున కేది
తల్లి యాచుఁ బురోహితమ్మగుచు
సూర్యరాయనిఘంటువర్య మెద్దాని పా
ఠములను స్వప్రమాణముగఁ గొనియె
వివిధాంధ్రకృతిపాఠ భేదమ్ములం దేది
సందేహవిచ్ఛేద మందఁ జేయు
జలుఁగుచేవ్రాఁత ముద్దులు మూటఁగట్టుచు
నెద్దానిప్రతి కంటి కింపునింపు
నట్టి నీవిశ్వకోశోద్ధ మస్మదాంధ్ర
భోజ పీఠాపురీప్రభు పోష్యమాణ
నూతననిఘంటు సంస్థామనోజ్ఞభవన
సీమఁ గైసేసియుండెనో చిన్నయసుధి!

౧౯

సీ. ఆంధ్రభారతికి దేశాంతరాభివ్యాప్తి
నొసఁగిన "బ్రౌను" చేయూఁత నీయు
బాసపైఁ గడిమోని వల పూని చనినట్టి
[1]. నరసింహసెట్టి మన్ననలు సేయ
స్వార్థాభిధుండు హయగ్రీవశాస్త్రి నీ
సహపాఠి యగుచు నెచ్చరిక నొసఁగ
[2]. దేవరాజాదిసుధీమణిగణములు
ఛాత్రులై నిన్ను నిచ్చలు భజింప

---

1. హానరబిల్ శ్రీ గాజుల లక్ష్మీనరసింహులుసెట్టిగారు.
2. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య, బహుజనపల్లి సీతారామాచార్యులు (శబ్దరత్నాకరకారులు) మొదలగువారు.

[1]. పచ్చయప్పకళాలయి పండితత్వ
గౌరవమ్మున విజ్ఞసంఘములు వొగడఁ
జెన్నపురమున సుగముగా జీవయాత్ర
నొనరిచినవాఁడ వీవు ధన్యుఁడవు గావె?

౨౦

క. జాతులతోఁ బనియేమి? స
మాతతపాండిత్య శక్తిమంతుఁడవుగదా?
సాతానువాఁడ వైనను
జోతల నర్పింపఁదగదె సూరీ! నీకున్.

౨౧

క. అకలుషగతి నెసఁగిన తా
వకచరితము సకలమును శుభం బగు భంగిన్
[2]. వకుళాభరణ మ్మనునొక
సుకవి తెలుంగున వెలార్చె సూరీ! వింటే?

౨౨

గీ. [3]. ప్రభవలోఁ బుట్టి దుందుభివత్సరమునఁ
దనువు వీడితె?—కట్టిఁడిదైవ మకట!
సరిగ నేఁబదియాఱేండ్లు తిరుగనీక
దాఁచఁబెట్టెను నీకయి రాచపుండు.

---

1. పచ్చయ్యప్పకళాశాలలో సూరి 1845-46-47-48 సం॥రలలో పండితపదవి నిర్వహించినట్లు కాలేజీరిపోర్టు (1847—48) సూచించుచున్నది. ప్రెసిడెన్సీ కాలేజీలోఁగూడఁ గొంతకాలము పనిచేసెను.

2. శ్రీనారాయణవనము వకుళాభరణము అను నతఁడు సూరి జీవితచరిత్రము రచించి ప్రకటించెను.

3. సూరి జననము 1806-మరణము-1862.
ఇతఁ డవసానదశలో రాచపుండుతో బాధపడియుండెను.

# రసార్ణవసుధాకరము—చమత్కారచంద్రిక.

వ్యాకరణవిద్యాప్రవీణ-విద్వాన్, చిలుకూరి పాపయ్యశాస్త్రి.



సంస్కృతమున 'రసార్ణవసుధాకర'మను మూఁడు విలాసములు గల యీ యలంకారగ్రంథమును రచియించిన కవివరేణ్యుఁడు- ఆంధ్రమండలాధీశ్వరుఁడు, సర్వజ్ఞచూడామణియు నగు సింగభూపాలుఁడు. ఎనిమిది విలాసములతో విలసిల్లి, సరససాహిత్యచాతుర్యధురీణత నెల్లెడల వెదచల్లు 'చమత్కారచంద్రిక' యను నీ యలంకారగ్రంథమును రచియించినయాతఁడు - రసమీమాంసారచయితయగు కాశీశ్వరమిశ్రుని శిష్యుఁడును, సర్వజ్ఞసింగభూపాలుని యాస్థానకవీశ్వరుఁడును నగు విశ్వేశ్వరకవిచంద్రుఁడు.[1] విశ్వేశ్వరకవి తనకృతిని సింగభూపాలకీర్తిసుధాసారశీతలనుగా నొనరించి,[2] గ్రంథమం దెల్లెడలను నాతని సాహితీధురీణతను, రాచకొండ రాజధానిగాఁ జేసికొని యా ప్రభువర్యుఁడు ప్రదర్శించిన శౌర్యాదార్యాదికమును వెల్లడించి యున్నాఁడు.

---

1. తదిష్టమఖిలప్రమాణసంసిద్ధే రససుధానిష్యందే సుమనోభి రనుభూయమానే యోగ్యానుపలబ్ధి లక్షణ మభావప్రమాణం రసావమానస్యైవ దురాగ్రహిణాం విపరీతసాక్షరాణాం మనసివైవర్ధ్యాభావ మేకో విభాసయతి. తథాచోక్త మస్మదాచార్యైః కాశీశ్వరమిశ్రైః రసమీమాంసాయామ్.

   చమత్కారచంద్రిక-పంచమవిలాసము.

2. కృతి రభిమతకృతిచతురా చతురోదాత్తనాయకగుణోదారా
   ఇతి లక్షణకృతిరత్నం రచయే శ్రీసింగనృపగుణోదాహరణమ్.

..........................................

ఇతి సరససాహిత్యచాతుర్యధురీణ విశ్వేశ్వరకవిచంద్రప్రణీతాయాం
శ్రీసింగభూపాలకీర్తిసుధాసారశీతలాయాం చమత్కారచంద్రికాయాం
వర్ణపదవివేకో నామ ప్రథమోవిలాసః.

చమత్కారచంద్రిక-ప్రథమవిలాసము.

## ఈ గ్రంథములందలి ప్రమేయము.

రసార్ణవసుధాకరము—ప్రథమవిలాసమున, నాయికానాయకలక్షణములు తద్భేదములు, శృంగారరసవిభావములు, రీతులు, గుణములు వృత్తులు, సాత్త్వికభావములును లక్షణోదాహరణములతోఁ జూపఁబడినవి.

ద్వితీయవిలాసమున—సంచారిభావములు, రసాశ్రయవివేకము, సంభోగ విప్రలంభశృంగారరసభేదములు, కరుణాదిరసవిచారమును నిరూపింపఁబడినవి.

తృతీయమున—నాట్యస్వరూపము, లాస్యాంగములు, దశవిధరూపకములు, తదంగములు మున్నగు విషయములు, వివిధదృశ్యకావ్యములందలి యుదాహృతులతోఁ జర్చింపఁబడినవి.

చమత్కారచంద్రిక—ప్రథమవిలాసమున, వర్ణపదగుణదోషవిచారము,[3] ద్వితీయమున దోషస్వరూపనిరూపణము, తృతీయమున గుణదోషస్వరూపోదాహరణములు, చతుర్థమున వృత్తిరీతి పాకములు, క్షుద్రకావ్యస్వరూపమును, పంచమమున రసభావాదులు, షష్ఠమున శబ్దాలంకారములు, సప్తమమున అర్థాలంకారములు, అష్టమమున ఉభయాలంకారములును జర్చింపఁబడినవి. విద్యానాథవిరచితమగు ప్రతాపరుద్రీయమునందువలె లక్షణములకు లక్ష్యములుగ నొసఁగఁబడిన శ్లోకములన్నియుఁ జాలవఱకు సింగభూపాలనామగ్రథితములై యున్నవి.

---

౩. ఈవర్ణవిచారమున నీకవి గూర్చిన శ్లోకములు ఆంధ్రలాక్షణికులచేఁ దమ ఛందోగ్రంథములం దాయాప్రసంగముల నుదాహరింపఁబడినవి. మఱియు ఆలూరి కందాళాఖ్యునిచే రచింపఁబడిన 'అలంకారశిరోభూషణము' అను సంస్కృతాలంకారగ్రంథమునందును, గౌరనరచియించిన లక్షణదీపిక (సంస్కృతము) యందును నీప్రథమోల్లాసమునందలి శ్లోకములు ప్రమాణముగాఁ గైకొనఁబడినవి.

చూడుఁడు:—పరిషత్పుస్తకభాండాగారమునందలి 3441 సంఖ్యగల అలంకారశిరోభూషణము. ప్రథమోల్లాసము.

చూ. గౌరనవిరచితమయిన లక్షణదీపిక ప్రథమవిలాసము. సంఖ్య-2585.

## ఈ రెండిటికిఁ గల పోలికలు-విరోధములు.

1. లక్షణనిర్మాణమున సరసత రెండిటను గలదు.

2. లక్షణసమన్వయమునకు దెలుపుట రెండిటను గలదు.

3. ఇతరాలంకారికుల మతములను ఖండించుట స్వమతమును వ్యక్తము సేయుట రెండిటను గలదు.

4 కవులిద్దఱును స్వయముగఁ గూర్చిన శ్లోకములు రెండిటను మధురములే.

5. సుధాకరమున, కవి స్వయముగ రచియించి కూర్చిన శ్లోకము లల్పముగను, ఇతరకవుల కావ్యములనుండి శ్లోకము లధికముగను లక్ష్యములుగఁ గూర్పఁబడినవి. చంద్రికయందు కవి స్వయముగ రచియించిన శ్లోకము లధికముగను, ఇతర కావ్యములనుండి శ్లోకము లల్పముగను గైకొనఁబడినవి.

6. సుధాకరమున, సరస్వతీకంఠాభరణమున భోజుఁడు దెలిపిన మతము చాలవఱకు ఖండింపఁబడుచు వచ్చినది. చంద్రికయందుఁ జాలవఱకు భోజునిమత మనుసరింపఁబడుచు వచ్చినది.[4]

7. సుధాకరమున నాయికానాయక స్వరూపోదాహరణములు రసభావాదులు దశవిధరూపక స్వరూపములు విపులముగఁ జర్చింపఁబడినవి. చంద్రికలో నీయంశములు కొన్ని పూర్తిగ విడువఁబడినవి. కొన్ని మాత్రము సూక్ష్మముగఁ జర్చింపఁబడినవి.

8. సుధాకరమున లక్షణములనామములు చాలవఱకుఁ బ్రాచీనాలంకారికులచే వాడఁబడినవియే సేకరింపఁబడినవి. చంద్రికలో నట్లుగాక లక్షణనామములు చాలవఱకు కవి స్వయముగ నిర్మించినవియే.

---

4. See Miscellanea-Literary notes (continued) by Dr. V. Raghavan B. A. (Hons) VI. The Chamatkara Chandrika of Visveswara. Annals of the Bhandarkar Oriental research Institute Poona, Vol. XVI page 131 to 140

9. సుధాకరమునందలి ప్రమేయము ప్రాచీనాలంకారికులు చర్చించినదియే. చంద్రికలో నట్లగాక సంస్కృతాలంకారికు లెవ్వరును దమ గ్రంథములందుఁ జర్చింపని ఛందోవిషయము చర్చింపఁబడినది.

## చరిత్రకుపయోగించు నంశములు.

సుధాకరోపక్రమమున, కృతికర్త వంశావళి కూర్పఁబడినది. అందును, దాచనృపతి మొదలుగ కృతికర్తయగు సింగభూభర్త పుత్త్రులవఱకుఁ గల వంశవృక్షము స్పష్టముగఁ దెలుపఁబడినది.

చంద్రికలో రసార్ణవసుధాకరకర్తయు, విశ్వేశ్వరకవికృతికి భర్తయు నగు సింగభూపతి రాచకొండ రాజధానిగాఁ జేసికొని వింధ్య శ్రీశైలముల నడుమ నున్న యంధ్రక్ష్మామండలమును బాలించినట్లు తెలుపఁబడినది.[5] ఈ సింగభూపతిని కల్యాణభూపతియని పేర్కొనినాఁడు.[6] శ్లేషభంగిచే నొకశ్లోక మీ సింగభూపతి కల్యాణదుర్గమును జయించి, యచట జయస్తంభమును స్థాపించి, సామ్రాజ్యసింహాసనము నధిష్ఠించినట్లు తెలియఁజేయుచున్నది.[7] ఈ కల్యాణదుర్గము కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు,తమ వ్యాసావళియందుఁ దెలిపిన నైజాము ప్రాంతమునం

---

5. రాజా స రాజాచల నామధేయా
మధ్యాస్య వంశక్రమ రాజధానీమ్
సతాం చరక్షా మసతాంచ శిక్షాం
న్యాయానురోధా దనుసందధార.

6. మండలీకృత కోదండో రణే కల్యాణభూపతిః
కరకంపితకల్హారో మీనాంక ఇవ రాజతే.

చ. చంద్రిక-తృతీయవిలాసము.

7. కల్యాణేక్షణ వేష్టయా ప్రకటిత స్తంభప్రతిష్ఠాక్రమే
వం (మం?) దాక్షిణ్యసుందరే లలితదృక్కోణక్రియాతోరణే
భావోల్లాసవిలాసకే వరతనో రస్యా మనోమంటపే
శ్రీ సింగక్షితిపాలమూర్తి రయతే సామ్రాజ్యసింహాసనమ్.

దలి కళ్యాణిపట్టణము కావచ్చునేమో?[8] విమర్శకులు నిర్ణయించెదరు గాక.

సింగభూపతి కళింగదేశాధిపతిపైఁ గోపింప నాతఁడు తనకన్నియ నీతని కర్పించి యనుగ్రహపాత్రుఁడయ్యెనని మఱియొకచోఁ జంద్రికలోఁ దెలిపియున్నాఁడు.[9] ముద్రితములయిన వెలుగోటివారి వంశావళులలోఁ జూపఁబడిన వంశవృక్షములచొప్పున రసార్ణవసుధాకరకర్తయగు నీ సింగభూపతి యేడవతరమువాఁడు. ఈతని తాతయు సింగభూపతియే. తాతగారు జీవించియుండఁగ నీ మనుమనికిఁగూడఁ బ్రసిద్ధి చేకూరుటచే నీతనికి కుమారసింగభూపతి యను నామమేర్పడి, తరువాతి వంశక్రమమున నీ 'కుమార' యను శబ్దము బిరుదవాచకమై పరంపరాగతమగుచున్నట్లు గానవచ్చెడిని. కావుననే నేఁటికిని రేచర్లవంశీయులగు ప్రభువర్యులనామములు 'కుమార' శబ్దోపపదకములుగ నున్నవి. చంద్రికలో నీసింగభూపాలుని కుమారసింగభూపాలుఁడని పేర్కొనినాఁడు.[10]

ఈసింగభూపతి యాస్థానకవియు, 'అమరపదపారిజాత' మను అమరకోశవ్యాఖ్యానమును రచియించిన బొమ్మకంటి అప్పయాచార్యుఁ

---

8. ఈకల్యాణము మహారాష్ట్రదేశమునందలి రైల్ స్టేషన్ అయిన కళ్యాన్ కాదు. కన్నడదేశమందలి కళ్యాణిపట్టణము. ఇది నైజామురాజ్యమునందు గుల్బర్గా జిల్లాలో నున్నది.
చూ. లక్ష్మణరాయవ్యాసావళి-చాళుక్యులు దాక్షిణాత్యులే. పుట ౧౬౧.

9. సింగక్షోణిభుజః కళింగవసుభుజే శ్రద్ధస్య తస్మిన్ క్షణే
దత్తాం తత్తనయా ముపాయనతయా లోకోత్తమాం పశ్యతః
వ్యావృత్తా ధనుషః కటాక్షసరణి స్తద్భ్రూలతాలోకినీ
దృక్కోణం పరివృత్య రాగమహిమా చిత్తే పరం చేష్టతే.
చ. చంద్రిక-పంచమవిలాసము.

10. కుమారశ్రీసింగే జలధిరశనాం శాసతి మహీ
మమర్యాదా ధ్వస్తా పతనపరిణామప్రతిభువః
అధర్మా నిర్మూలా నరకపరిపాకప్రణిధయో
వినష్టా దుశ్చేష్టా కలికలుషపేశీపరిధయః    చ. చంద్రిక-సప్తమవిలాసము.

డును నీతని 'కుమారసింగభూపతి' యని పలుమాఱు లుగ్గడించియు న్నాఁడు. ఆప్రసంగముననే సింగభూపాలుని పాండితీవైభవమును సుస్పష్టముగఁ జాటియున్నాఁడు.[11]

విశ్వేశ్వరుఁడు తన కృతిభర్తయగు సింగభూపతి రసార్ణవసుధాకరమును రచియించినట్లు వాచ్యముగను, సంగీతసుధాకరమును రచియించినట్లు వ్యంగ్యముగను చంద్రికలోఁ దెలిపియున్నాఁడు. ఆశ్లోకముల నిట నుదాహరించెదను.

> రూపకం దశధా ప్రోక్తం నాటకాదివిభేదతః
> మహాప్రబంధసామ్రాజ్య మధికర్తు మిదం క్షమం
> సింగభూపాలరచితే రసార్ణవసుధాకరే
> అస్య ప్రపంచో విజ్ఞేయః కేతథా వక్తు మీశతే.
>
> చ-చంద్రిక, తృతీయవిలాసము.

> అనుక్తానా మిహాన్యేషాం లక్ష్యలక్షణవిస్తరః
> సింగభూపాలరచితే రసార్ణవసుధాకరే
> ఆదిద్వితీయయో స్సాధు శీలనీయా విలాసయోః
>
> చ-చంద్రిక, పంచమవిలాసము.

---

11. శ్లో. రేచర్లకులశేఖరభూతేరాస్థానాన్యాం సింగభూపతేః
బొమ్మకంట్యప్పయాచార్యమూర్త్యా జాగర్తి శారదా ౧.
కుమారసింగభూపేన లక్ష్యలక్షణవేదినా
శోధితశ్చేదయం గ్రంథః కిం శోధ్య శ్శోధకాంతరైః ౨.
కుమారసింగభూపేన యః కదాపి న శోధితః
సగ్రంథ శ్శోధితోఽప్యన్యైః కిం బుధై ర్వ్యవహ్రియతే 3.
కావ్యాలంకారనానార్థతత్త్వభావితమానసః
కుమారసింగభూపాల ఏక ఏవాస్తి నాపరః ౪.
కుమారసింగభూపాలకృతయ స్తస్య నిత్యశః
ఏధయన్తి ముదం దృష్టా దృష్టాన్తాః కృతినః పరమ్. ౫.
అమరపదపారిజాతము-తుదిశ్లోకములు.

సంగీతక్రమచంక్రమప్రియసఖీ శృంగారసంజీవనీ
సౌజన్యక్షమపారణీ చతురతాసామ్రాజ్యసింహాసనం
శ్రీ సింగక్షితిపాలశేఖరమణే ర్వైదూష్యముంగాకష
శ్చాటువ్యాహృతివైఖరీ విజయతే సాహిత్యశిల్పావధిః
చ-చం. చతుర్థవిలాసము.

'రసార్ణవసుధాకర' 'సంగీతసుధాకర'ముల తుదిగద్యలపోలికను బట్టిచూడ నీరెంటిని రచియించిన సింగభూపతియొక్కఁడేయని తెలియు చున్నేయున్నది. నామసామ్యమునను ఏకకర్తృకత్వము స్థిరపడుచున్నది [12]

శ్లో. అథ శ్రీసింగభూపాలో దీర్ఘాయు ర్వసుధామిమామ్
నిజాంసపీఠే నిర్వ్యాజం కురుతే సుప్రతిష్ఠితామ్.
రసా-సుధా, ౧ విలాసము. శ్లో. 27

అనఁగా, సింగభూపాలుఁడు దీర్ఘాయుర్దాయముగలవాఁడై చిరకాలము తన యంసపీఠమం దీభూవలయమును స్థిరముగ నున్నదానిఁగా నొనర్చెనని భావము. వెలుగోటివారి వంశవృక్షక్రమమున నేడవతరము వాఁడగు నీసింగభూపతి రాజ్యప్రారంభకాలమును గాని, తుదిసమయమునుగాని యిదమిత్థమని నిర్ణయించుటకుఁ దగినశాసనాద్యాధారములు నేఁటిదనుకఁ గానరాకున్నవి. కాని పైశ్లోక మాతఁడు చిరకాలము జీవించినట్లును, చిరకాలము రాజ్యమును బాలించినట్లును ప్రబలమయిన సాక్ష్యము నిచ్చుచున్నది.

---

12. శ్రీమదంధ్రమండలాధీశ్వర ప్రతిగండభైరవ శ్రీయన్నపోతనరేంద్ర నందన భుజబలభీమ శ్రీసింగభూపాలవిరచితే రసార్ణవసుధాకరనామ్ని నాట్యాలంకారే భావోల్లాసో నామ ప్రథమో విలాసః. రసా. సుధా-తుదివచనము.
శ్రీమదంధ్రమండలాధీశ్వర ప్రతిగండభైరవ శ్రీఅనవోత............నభుజబలభీమ శ్రీసింగభూపాల విరచితాయాం సంగీత సుధాకరాఖ్యాయాం సంగీత రత్నాకరవ్యాఖ్యాయాం ప్రబంధాధ్యాయశ్చతుర్థ స్సమాప్తః
See-Descriptive Catalogue of manuscripts (Alankara) Bhandarkar Oriental Research Institute Poona. Page 407.

మఱియు నీసింగభూపతి, వంశమును బెంపొందించు సుతులతోఁ గూడ వింధ్యశ్రీశైలముల మధ్యనున్న యాంధ్రమండలమును బాలించుచు వివిధమయిన భోగముల ననుభవించెనని యీక్రింది శ్లోకము చాటుచున్నది.

శ్లో. వింధ్యశ్రీశైలమధ్యక్ష్మామండలం పాలయన్ సుతైః
వంశప్రవర్తకై రర్థాన్ భుఙ్క్తే భోగపురందరః

రసా. సుధా. ౧ విలాసము. శ్లో. 42

పైరెండుశ్లోకములనుబట్టిచూడ నీసింగభూపతి పుత్త్రులతోడను పౌత్త్రులతోడనుగూడి చిరకాలము రాజ్యము పాలించినట్లు తెలియుచున్నది గదా! కావున శ్రీనాథుని సమయమునకును నీతఁడు జీవించియే యుండవచ్చును. శ్రీనాథుఁడు సరస్వతీస్తుతిపూర్వకముగ దర్శించి మన్ననవడసినట్టియు, సర్వజ్ఞబిరుదాంకితుఁడు, కృతికర్త, కృతిభర్తయు నగు సింగభూపతి రసార్ణవసుధాకరకర్త యయిన సింగభూపతియే కావచ్చును.[13]

**రసార్ణవసుధాకరకర్తకు సర్వజ్ఞబిరుదము గలదా?**

రసార్ణవసుధాకరకర్తయయిన సింగభూపతికి సర్వజ్ఞబిరుదము లేదనియే చాలమందికి విమర్శకుల యూహ. రసార్ణవసుధాకరమునఁ గానరాదు. సంగీతసుధాకరమునఁ గలదేమో తెలియరాదు. కాని, చమత్కారచంద్రికయందును, అమరపదపారిజాతము (బొమ్మకంటి అప్పయాచార్య విరచితము) నందును లేదనుట యెంతవఱకుఁ బొసఁగునో విమర్శింపవలసియున్నది. చంద్రికను రచియించిన విశ్వేశ్వరకవియు, అమరకోశవ్యాఖ్య రచియించిన అప్పయాచార్యుఁడును సింగభూపాలుని సాహితీవైభవమును దమ శక్తికొలఁది కొఱఁతలేకుండ వ్యక్తము చేసియు, నాతనిఁ బరమప్రామాణికాలంకారికునిగా నంగీకరించినట్లు పెక్కుశ్లోకములఁ దమగ్రంథములందుఁ దెలిపియున్నారు. మఱియు వీరిద్దఱు వాచ్య

---

13. ఈకవుల కాలనిర్ణయమునుగూర్చి వేఱొక వ్యాసమునఁ దెలుపువాఁడ.

ముగను శ్లేషమూలమునను నాతని సర్వజ్ఞబిరుదము నుగ్గడించి యున్నారు. ఆశ్లోకముల నిచటఁ బొందుపఱుచుచున్నాఁడను.

శ్లో. విద్యాద్వైవత తాతతావకగురో సర్వజ్ఞ చూడామణే
స్తోతవ్యోఽసి మనీషిణాం త్వమథవా మద్వ్యాజవాక్యైరలం
ఇత్థం సింగమహీపతిం గురుజనోఽప్యాభాషతే దో-వాన్
తత్తత్పద్ధతిధర్మమర్మణి పరిచ్ఛేదావిసంవాదికమ్.[14]

ఇందలి 'సర్వజ్ఞచూడామణే' యను పదము సంబోధనప్రథమా విభక్త్యంతమేగాన బిరుదవాచకమగుటకు సంశయమక్కఱలేదని నా యూహ.

[illegible] తాను రచియించిన

## సవరణ.

'రసార్ణవసుధాకరము చమత్కారచంద్రిక' అను నీ వ్యాసమున ౬౩, ౬౪, ౬౭ పుటలలో 'అమరపదపారిజాతము' అనుచోట 'అమరకోశవ్యా (ఖ్య) ఖ్యానము' అని చదువుకొనునది.

“సర్వజ్ఞః మూర్ధమణిః యస్య తం అను వ్యుత్పత్తిచే సర్వజ్ఞబిరుదాంకితుఁడైన సింగభూపతి ప్రామాణికశిరోమణి గాఁగలవాఁడు” అను నర్థము సర్వజ్ఞమూర్ధమణిం అనుపదమునకు సిద్ధించుచు. కావున వివిధలక్షణ లక్ష్యవేత్తయు, కావ్యాలంకారతత్త్వవేత్తయు, కృతికర్తయునగు తన యేలికకు సహజసిద్ధమయిన 'సర్వజ్ఞ' బిరుదము నీయప్పయార్యుఁడును

14. ఈశ్లోకమందలి 'సర్వజ్ఞచూడామణే' అను నీపదము పరిషత్పుస్తకభాండాగారమునందలి వ్రాఁతప్రతియందును, మదరాసు దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందలి D 2-9-60 R 2579 సంఖ్యగలవ్రాఁతప్రతియందును స్పష్టముగఁ గన్పట్టుచునే యున్నది.

స్మరియించెననుటలో నీ ప్రతిపత్తి యుండనక్కఱలేదని నా యూహ. కావున నీకవివర్యులచే ననుగ్రహింపఁబడి, ఆనాఁటి పండితవ్యవహారములో నెలకొనియున్న యీసర్వజ్ఞబిరుదమే తఱువాతివారి కందఱకు వచ్చిన ట్లూహించుట సమంజసము; కాని, రసార్ణవసుధాకరకర్తకు సర్వజ్ఞబిరుదము లేదని త్రోసివేయుటమాత్ర మెట్లును బొసఁగదు.

## గ్రంథకర్తృత్వనిర్ణయము.

వెనుక నేఁ దెలిపినరీతిని విశ్వేశ్వరకవి అప్పయార్యుఁడును సీతనిఁ గృతికర్తగాఁ దమగ్రంథములఁదెలిపియున్నారు. కాని, కొందఱు రసార్ణవసుధాకరమును సింగభూపతిరచియింపలేదేమో? విశ్వేశ్వరకవియే దీనిని రచియించి సింగభూపాలునిపై నారోపించినాఁడేమో? అనునొక సంశయముచు బొందుచున్నారు.

వారు, రసార్ణవసుధాకరకర్త సింగభూపాలుఁడు కాదనుటకుఁ దెలుపు హేతువులు—1. గ్రంథకర్త సుధాకరమునఁ దన్నుఁగూర్చి తాఁ జెప్పుకొనుట 2. 'మమైవ కందర్పసంభవే' అని సుధాకరముననుచంద్రికయందును శ్లోకముల నిద్దఱు నుదాహరించుట. 3 సుధాకరమునందలి శ్లోకములే కొన్ని చమత్కారచంద్రికయందును గానవచ్చుట-యును నివి. ఈ హేతువులెంతవఱకు స్థిరపడునో పరికించిచూతము.

కవి తన్నుఁగూర్చి తాఁ జెప్పుకొనినపద్యము లన్నియుఁ దానే రచియించెననుటకుఁ బ్రమాణము మృగ్యము. అట్లాతఁడే రచియించెనన్నను, దన్నుఁగూర్చి తాఁ జెప్పుకొనినమాత్రమున గ్రంథకర్తృత్వమునకు భంగము వాటిల్ల నేరదు. అట్లేయయినచో భోజవిరచితమయిన సరస్వతీకంఠాభరణమునందును భోజునిఁగూర్చి చెప్పినశ్లోకము గానవచ్చునుగాన నదియు భోజకర్తృకము కాదనవలసివచ్చును. [15] ఎవ్వరేని భోజునిఁగూర్చి

---

15 జయ జయ జయ శ్రీమన్ భోజ ప్రభాతి విభావరీ
వద వద వద శ్రవ్యం విద్వాన్ ఇదం వ్యావిధీయతే
శృణు శృణు శృణు త్వద్వ తూస్యో౽నురజ్యతి మండలం
నహి నహి నహి ష్మామార్తాండః క్షణేన విరచ్యతే.

చూ. సరస్వతీ కంఠాభరణము. 2 వ పరిచ్ఛేదము-139 శ్లో.

చెప్పిన పద్యమందుఁ బ్రవేశించెనందురా యిచ్చటను నట్లే యూహింప వగును.

మఱియు సర్వసమర్థుఁడయిన కవి తన్నుఁగూర్చి తనగ్రంథమునఁ దాఁజెప్పుకొనుట యాతనికిఁగల గ్రంథగ్రథనపాటవమును దెల్పునుగాని, యంతమాత్రమున గ్రంథకర్తృత్వమునకు భంగమును గల్గింపనేరదు. కాదందురా? రసగంగాధరకర్తయగు జగన్నాథపండితరాయలకు నిట్టి యవస్థయే తటస్థించును. పండితరాయలు తన్నుఁగూర్చి చెప్పుకొనిన శ్లోకము:—

శ్లో. ఆమూలా ద్రత్నసానోర్మలయవలయితా దాచకూలాత్పయోధే
ర్యావన్త స్సన్తి కావ్యప్రణయనపటవ స్తే విశంకం వదన్తు
మృద్వీకామధ్యనిర్యన్మసృణరసఝరీమాధురీభాగ్యభాజాం
వాచా మాచార్యతాయాః పద మనుభవితుం కోఽస్తి ధన్యో మదన్యః.
చూ. రసగంగాధరము, ప్రథమాననము, గర్వోదాహరణము.

ఆంధ్రభాషయం దుత్తమ ప్రబంధముల రచియించిన కవీశ్వరులు పెక్కురు తముఁగూర్చి తారుప్రౌఢముగఁ జెప్పుకొనియేయున్నారు. కావున నిట్లు చెప్పుకొనుట గ్రంథకర్తృత్వమునకు భంగము సేయఁజాలదు. ఇఁక రసార్ణవసుధాకరమున నొకశ్లోకము-

"యథాకందర్పసంభవే మన్యైవ
శ్లో. ఉభే తదానీ ముభయోస్తు చిత్తే
కదుష్ణనిశ్వాసవరిష్ణుకేన
ఏకీకరిష్య న్ననురాగశిల్పీ
రాగోష్మణైవ ద్రవతా మనైషీత్."

అను నీరీతిగ నుదాహరింపఁబడినది.[16] నాగరిలిపిముద్రణము నందే యీశ్లోకము గానవచ్చుచున్నది. మైసూరునందు ముద్రితమయిన

16. చూ. రసార్ణవ సుధాకరము. అనన్తశయన గ్రంథావళి ౨౧.
రెండవ విలాసము. 112 శ్లో. (నాగరిలిపి ముద్రణము)

తెలుఁగులిపి రసార్ణవసుధాకరమున నీతావున నీశ్లోక ముదాహరింపఁబడ లేదు. ఈశ్లోకము లేకుండుటయేగాదు. ఈ శ్లోకమునకుఁ బూర్వమందున్న మూఁడు శ్లోకములందు నిందును వేర్వేఱుగఁ గన్పట్టుచున్నవి. రెండుప్రతు లందును నిట్టిమార్పులు పెక్కులు గానవచ్చుచునే యున్నవి.

చమత్కారచంద్రిక-చతుర్థవిలాసమునందు-

శ్లో. "ముఖప్రదానైరవిలంబపూర్వైః కంఠగ్రహైఃక్లిష్టవిపీడితాంగైః
కరప్రచారైశ్శిథిలోపరోధైః లబ్ధైః ప్రియాయా ముముదే ముకుందః

ఇతి కందర్పసంభవే"

అను నీరీతిగ నీశ్లోకము రెండు తావులందును,

"తథాచ మమైవం

చిక్షేపలక్ష్మీ ర్నిటలేనభాగైః ప్రస్వేదవారాతప మాక్షిపన్తీ
జుగోప దేవోఽపి నరోమహర్షం జవాబ్ధివాతాహతికైతవేన

ఇతికందర్పసంభవే"

అను నీరీతిగ నీ శ్లోక మొకతావునందును కందర్పసంభవమునుండి యుదాహరింపఁబడినవి. కాని "తథాచ మమైవ, ఇతికందర్పసంభవే" అని-శ్లోకము చమత్కారచంద్రికయం దుదాహరింపఁబడియుండలేదు. మదరాసు దొరతనమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందున్న వ్రాఁతప్రతియందుఁగాని, పరిషత్పుస్తకభాండాగారమునందలి వ్రాఁత ప్రతియందుఁగాని 'మమైవ' అని కానరాదు. "తథాచమమైవం" అనియే రెండిటను గలదు. మఱియు నీ "చిక్షేపలక్ష్మీ" రిత్యాదిశ్లోకము రసార్ణవ సుధాకరమునను దాహరింపఁబడినది [17] కానియిట,'మమైవకందర్పసంభవే' అనిగాని, 'ఇతికందర్పసంభవే' అనిగాని వేర్కొనినట్లుగానరాదు. విశ్వే శ్వరకవి కందర్పసంభవమును దానే రచియించెనని చెప్పుకొనఁదలఁచి

17. చూ. రసార్ణవసుధాకరము. ద్వితీయవిలాసము పుట ౨౨ తెలుఁగులిపి ముద్రణము
,, ,, పుట 125 నాగరిలిపి ముద్రణము.

నచో 'మమైవ' అని యుండవలెనుగాని, 'మమైవం' అనుట శాస్త్రపరి పాటికాఁజాలదు. కావున కర్తృత్వవిషయమున సంశయగ్రస్తములయిన యీ శ్లోకములనాధారముగాఁ జేసికొని సింగభూపతి రసార్ణవసుధాకరమును రచియింపలేదనుట యెట్లును బొసఁగఁజాలదు.

మఱియొకమాట. సింగభూపాలునకు గ్రంథకర్తృత్వసామర్థ్యము లేదందుమా? అట్లయినచో విశ్వేశ్వరకవి తనచంద్రికలో నాతనిప్రతాపాదివైభవముకంటె సాహిత్యవైభవమును నధికముగఁ జాటుట తటస్థించునా? కవులు తమకృతిభర్తలను స్తుతించునవసరములందు బుధరంజనుఁడని, కవికల్పతరువని, సాహిత్యగోష్ఠీప్రియుఁడని వర్ణించుట సహజముగాని, సాహిత్యశిల్పావధియని, సాహిత్యసామ్రాజ్య ధురంధరుఁడని, ప్రామాణికలాక్షణికుఁడని వర్ణించుపట్ల నాప్రభువునం దంతటి ప్రతిభావిశేషము లేకుండ విచ్చలవిడిగఁ బొగడుట తటస్థించునా? ఈతఁడేగాక యీప్రభువర్యుని యాస్థానకవియగు బొమ్మకంటి అప్పయార్యుఁడును నీతని లక్ష్యలక్షణవేత్తయని, కావ్యాలంకారతత్త్వవేత్తయని, గ్రంథసంశోధకులలో నుత్తముఁడని, కృతికర్తయనియుఁ దెలిపినాఁడు. ఈతఁడును గేవలమతిశయోక్తిగనే వర్ణించెనందుమా?

ఈ సింగభూపాలునకు సమకాలికుఁడో లేక కొంచెమిటీవలివాఁడోయగు మల్లినాథుఁడు రసార్ణవసుధాకరమునందలి శ్లోకములను సింగభూపాలీయములోనివని, తాను రచియించిన కావ్యవ్యాఖ్యలయం దుదాహరించియున్నాఁడు. అయిదాఱు శతాబ్దములు గడచినపిమ్మట నేఁడు సంశయమునకుఁ దావలమయినను, నాతనికాలమునకు సన్నిహితుఁడు, మూలము లేకుండ నొక్కయక్కరమయినను వ్రాయని పరమ ప్రామాణికుఁడునగు మల్లినాథసూరి విశ్వేశ్వరకర్తృకమయిన రసార్ణవసుధాకరమును, సింగభూపాలీయమని పేర్కొనుట పొసఁగునా?[18]

---

18. తాం ప్రత్యభివ్యక్తమనోరథానాం.........శృంగారచేష్టా వివిధా బభూవుః అను శ్లోకవ్యాఖ్యానమున "అత్ర శృంగారలక్షణం రససుధాకరే" ఇత్యాదిగాను

సింగభూపాలుఁడు రసార్ణవసుధాకరము నేగాక సంగీతసుధాకరమునుగూడ రచియించెనని వెనుకఁ దెలిపియుంటిని. సంగీతసుధాకరమును విశ్వేశ్వరకవివిరచితమై సింగభూపాలునిపేర వెలసెనందుమా? మఱియు నీ రెండు గ్రంథముల (రసార్ణవసుధాకరచంద్రికలను) నొకకవియే రచియించినచో సుధాకరమున భోజునిమతమును ఖండించినయాతఁడు చంద్రికలో భోజునిమతము ననుసరించునా?[19] రెండిటి నొక్కరే రచియించెనను

దాహరించిన శ్లోకములు రసార్ణవసుధాకరమున 48, 49, 145 పుటలలోఁ గానవచ్చుచున్నవి. చూ. రఘువంశము-6 వ సర్గ మల్లినాథవ్యాఖ్య (నాగరిలిపిముద్రణము)

మఱియు "తదుక్తం భూపాలేన" అని యుదాహరించిన శ్లోకము లీ సింగభూపాలీయమునఁ గాన వచ్చుచున్నవి.

ముక్తాఫలేషు ఛాయాయా స్తరళత్వ మివాంతరా
ప్రతిభాతి యదంగేషు తల్లావణ్య మిహోచ్యతే॥

ఈశ్లోకము నుదహరించుచు మల్లినాథుఁడు వ్యాఖ్యలయం దుదాహరించినాఁడు. ఇయ్యది రసా-సుధ ప్రథమవిలాసము 41 వ పుట 181 వ శ్లోకముగఁ గానవచ్చుచున్నది.

* కుమారసంభవము సప్తమసర్గ 91 వ శ్లోకవ్యాఖ్యానమునందలి "కైశిక్యారభటీచైవ" ఇత్యాది శ్లోకములు ప్రథమ విలాసము 87 వ పుటలోఁ గానవచ్చుచున్నవి.
చూ. (నాగరిలిపి ముద్రణము) పుట: 87.

19. "భోజే నోక్తాః స్థాయినోఽన్యే గర్వః స్నేహో ధృతిర్మతిః
స్థాస్నురేవోద్ధతప్రాయః శాంతోదాత్తరసేష్వపి
తత్ర స్నేహో రతే ర్భేదః స్త్రీపుంసేచ్ఛాత్మకత్వతః"

ఇత్యాది శ్లోకవ్యాఖ్యానావసరమున భోజుని మతము ననువదించి, విపులముగఁ జర్చించి ఖండించియున్నాఁడు.

చూ. రసార్ణవసుధాకరము-అనన్తశయన గ్రంథావళి నెం. పుట 168-175.

చమత్కారచంద్రికయందు సరస్వతీకంఠాభరణమునందును జాలవఱకు సమానమయిన శబ్దములుగల శ్లోకములను బఠింపుఁడు.

శ్లో. అలమర్థానలంకర్తుం యద్వ్యుత్పత్త్యాది వర్త్మనా
జ్ఞేయా జాత్యాదయః ప్రాజ్ఞైస్తేఽర్థాలంకార సంజ్ఞయా
జాతిర్విభావనా హేతు రహేతుస్సూక్ష్మ ముత్తరం
విరోధ స్సంభవోఽన్యోన్యం పరివృత్తిర్నిదర్శనా

భేదస్సమాహితం భ్రాన్తి ర్వితర్కో మీలితం స్మృతిః
భావః ప్రత్యక్షపూర్వాణి ప్రమాణాని చ జైమినేః
నానావస్థాసు జాయన్తే యాని రూపాణి వస్తునః
స్వేభ్యస్స్వేభ్యో నిసర్గేభ్యస్తాని జాతిం ప్రచక్షతే.

చూ. సరస్వతీకంఠాభరణము 3వ పరిచ్ఛేదము. నిర్ణయసాగరముద్రణము-పుట 311-312.

శ్లో. అలఙ్కారానలంకర్తుః యేతదాశ్రయశోభిభిః
యేతు జాత్యాదయః ప్రోక్తాస్తేఽలంకారసంజ్ఞయా
జాతిర్విభావనా హేతు రహేతుస్సూక్ష్మముత్తరం
విరోధస్సంభవోఽన్యోన్యం పరివృత్తిర్నిదర్శనం.
భేదస్సమాహితంభ్రాంతిః వితర్కోమీలితం స్మృతి.
భావోఽనుమానార్థాపత్తి రితి తే వింశతిః స్మృతాః

చూ. చమత్కారచంద్రిక. సప్తమవిలాసము ప్రారంభము.

శ్లో. శబ్దేభ్యో యః పదార్థేభ్య ఉపమాదిః ప్రతీయతే
విశిష్టోఽర్థః కవీనాంతా ఉభయాలంక్రియా మతాః
ఉపమా రూపకం సామ్యం సంశయోక్తి రపహ్నుతిః
సమాధ్యుక్తి స్సమాసోక్తి రుత్ప్రేక్షా ప్రస్తుతస్తుతిః
సతుల్యయోగితోల్లేఖః ససహోక్తిస్సముచ్చయః
సాక్షేపోఽర్థాంతరన్యాసః సవిశేషా పరిష్కృతిః
దీపకక్రమపర్యాయాతిశయశ్లేషభావికాః
సంసృష్టి రితి నిర్దిష్టా స్తాశ్చతుర్వింశతిర్బుధైః

చూ. సరస్వతీకంఠాభరణము 4వ పరిచ్ఛేదము. నిర్ణయసాగర ముద్రణము-పుట 398-399

శ్లో. శబ్దేభ్యో య ఇవాదిభ్య ఉపమాదిః ప్రతీయతే
విశిష్టార్థః కవీనాంతా ఉభయాలంకృతయో మతాః
ఉపమారూపకం సామ్యం సంశయోక్తి రపహ్నుతిః
సమాధ్యుక్తి స్సమాసోక్తి రుత్ప్రేక్షా ప్రస్తుతస్తుతిః
సతుల్యయోగితోపేతః (ల్లేఖః?) సమాసోక్తిస్స ముచ్చయః
ఆక్షేపార్థాంతరన్యాసౌ సవిశేషాపరిష్కృతిః
దీపనక్రమపర్యాయాతిశయశ్లేషభావనాః
సంసృష్టిరితి నిర్దిష్టా స్తా శ్చతుర్వింశతి ర్బుధైః

చూ. చమత్కారచంద్రిక-అష్టమవిలాసము ఆరంభము.

టకు సర్వథావిరోధియయిన విషయమొక్కటి గమనింపుఁడు. ఒకకవియే రెండు గ్రంథములను రచియించినపుడు, ఒకయంశమునందే మతభేదము నుదెల్పుట సంభవించునా ? చూడుఁడు:—సుధాకరకర్తమతమున రీతులు మూఁడు. చంద్రికాకర్తమతమున రీతులు నాలుగు. రెండిటను నామము లందునైతము భేదమే గానవచ్చుచున్నది.[20]

రసార్ణవసుధాకరమునందలి శ్లోకములను చంద్రికలో నుదాహరించుట విశ్వేశ్వరకవికి సింగభూపాలునియెడలఁ గలిగిన ప్రామాణికత్వమును హెచ్చించి, ఆ ప్రభువర్యున కుండెడి పాండిత్యవైభవమును వ్యక్తముచేయునుగాని, యది గ్రంథకర్తృత్వమును సంశయగ్రస్తమునుగ నొనరింపఁజాలదు.

కావునఁ బై యంశముల ననుసరించి, రసార్ణవసుధాకరమును రచియించిన కవివరేణ్యుఁడు సింగభూపాలుఁడే; చమత్కారచంద్రికను రచియించిన కవిచంద్రుఁడు విశ్వేశ్వరుఁడే; యనుట నిర్వివాదమని నా యూహ.

ఏనాఁటికయిన సరససాహిత్యచాతురీధురీణుఁడగు నీ విశ్వేశ్వరకవి రచియించిన 'చమత్కారచంద్రిక' అను నీ యలంకారగ్రంథము విద్యాభిమానముగల ధనికుల యాదరమునకుఁ బాత్రమై ముద్రణభాగ్యము నందఁగల్గినచో ఆంధ్రమండలాధీశ్వరుఁడగు సింగభూపాలుని యశఃప్రశస్తులు లోకమం దెల్లెడలను జిరస్థాయులై విలసిల్లఁగలవని సవినయముగ నివేదించుచున్నాఁడను.

---

20. రీతిస్స్యాత్పదవిన్యాస భఙ్గీ సాతు త్రిధామతా
కోమలా కఠినా మిశ్రాచేతి స్యాత్-ఇత్యాది
రసా-సుధా-ప్రథమవిలాసము పుట 64 నాగరిలిపి ముద్రణము.

రీతిః పదానాం ఘటనా ప్రోక్తా రీతివిశారదైః
రీఙ్గతా విత్యతో ధాతో రియం రీతి రితీర్యతే
అసమాసా సమాసేన మధ్యమేన సమన్వితా
అతిదీర్ఘసమాసాచ మిశ్రాచేతి చతుర్విధా.

చమత్కారచంద్రిక-చతుర్థవిలాసము

# శ్రీనాథుని కవిత్వతత్త్వము—ఆదికావ్యోక్తులు.

కుందూరి ఈశ్వరదత్తు బి. ఎ.



శ్రీనాథుని కవిత ప్రౌఢవయఃపరిపాకమునఁ బొల్పెసలారెడు వారవనిత. వలచి వలపించుకొనుచు విలాసవిభ్రమముల నెలార్చు వెల్లాటకత్తె. అట్టి భాషాకావ్యయోషను మరగిన రసికశిఖావతంసుఁ డెవ్వఁడును దాని సాంగత్యము ననుభవించువేళ నది ధరించిన రత్నతాటంకములు, హేమకంకణములు, ముత్యాలసరులు మొదలగు కైసేఁతల నెచ్చటనుండి సంపాదించుకొనెనో యోజింపఁడుగదా. కేళీవిహారానంతర ముబుసుపోకకుఁ జిత్తమునట్టి ప్రసంగములపైఁ బ్రసరింపఁజేయువచ్చును. ఆపరిశీలనము ను బరిహాసమునిమిత్తమే! శ్రీనాథుని కావ్యపఠన మట్టిదే! ఆ కావ్యపాఠవేళ నా కావ్య మాంధ్రీకరణమా?; దానిలో నన్యకవుల యనుకరణమా?; యను పరిశోధనమును గావించుటకు లేశమైనను నవకాశము గలుగదు. కవిసార్వభౌముఁడు గడుసరి. తన పూర్వులగు సంస్కృతాంధ్రకవీశ్వరుల వాక్యరత్నముల నెన్నిటినో సంగ్రహించి తన కావ్యకన్య కలంకారములు గావించినాఁడు. బహుగ్రంథపఠనమువల్ల నట్టి యాదికావ్యోక్తులు వచ్చిపడుట యాశ్చర్యముగాదు. వినోదము కొఱకుఁ గొన్నియుదాహరణము లాంధ్రకావ్యములనుండి యొసఁగెదను.

## నన్నయ-శ్రీనాథుఁడు.

కాశీఖండ కావ్యపీఠికలో నన్నయభట్టును శ్రీనాథుఁ డీ దిగువ విధమునఁ బ్రశంసించెను.

"భాషింతు నన్నయభట్టుమార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు"

నన్నయ రెండువంతులు సంస్కృతపదము లొకవంతు తెనుఁగు పదములు కలిపి కవిత్వమును జెప్పెను. శ్రీనాథుఁడు నట్లే, ఆవిధమునఁ

గవిత్వమును జెప్పుటయేగాక, యాతని పోకడల నెన్నో యనుసరించెను. కారణము స్పష్టము. నన్నయభట్టు, శ్రీనాథభట్టసుకవి గోదావరీతీరమున రాజమహేంద్రవరనగరమునందుఁ గవిత్వమును జెప్పుట తటస్థించెను. ఒకఁడు రాజరాజప్రాజ్యసామ్రాజ్యసౌఖ్యము ననుభవించెను. మఱియొకఁడు వీరభద్రారెడ్డి విభవ మనుభవించెను. రాజరాజ వీరభద్రారెడ్లు వేంగీవిషయాధీశ్వరులు. భీమేశ్వరకృపాలబ్ధరాజ్యధౌరేయులు. రాజమహేంద్రవరమే రాజధాని. ఏమీ యీ సామ్యము? శ్రీనాథుఁడును నన్నయభట్టును విషయానంతరవాసులయిన, నావేఁగీవిషయపాలురకడ-నాస్థానకవులైరి. నన్నయభారతమును రాజరాజున కంకితమిచ్చెను. శ్రీనాథుఁడు కాశీఖండమును వీరభద్రారెడ్డి కంకితమిచ్చెను. కాశీఖండములో నన్నయ కవిత్వానుకరణములఁ గొన్నిటిని జూపెదను.

నన్నయ.

ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు దానును ధరాసురవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁ డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్.

శ్రీనాథుఁడు.

ఉ. పాయక నిర్నిరోధనిరపాయసమగ్రకృపానుకైకపా
రాయణతావిలాసము తిరంబుగ నంబుజహూతి వీరనా
రాయణు దానవైభవధురంధరు సంగరసవ్యసాచి ధీ
స్థాయురు వేతుఁ జేయుత నృపాగ్రణి నల్లయ వీరభద్రునిన్.

నన్నయ.

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజిత భూరిభుజాకృపాణధా
రాజలశాంతశాత్రవపరాగుఁడు రాజమహేం[illegible]

శ్రీనాథుఁడు.

ఉ. రాజశశాంకశేఖరుఁడు రాజకిరీటవతంస మన్మని
ర్వ్రాజమనోభయంకరుఁడు రాజులదేవర రాజరాజు శ్రీ
రాజమహేంద్ర భూభవనరాజ్య కుమారవమాఁమనోహరుం
డాజి కిరీటి విశ్వగుణ యల్లమ వీరకవేంద్రు దన్నుతిన్.

నన్నయ.

కం. శ్రీ వస్తావల్లభ వేఁ
గీవిషయాధీశ కావ్యగీతప్రియ నా
నావనినాథకిరీటత
టీవిలసద్రత్నసంఘటితపదకమలా!

శ్రీనాథుఁడు.

కం. వేంగీవిషయాధీశ్వర!
సంగరగంగాతనూజ! సాహిత్యకళా
సంగీతలక్ష్యలక్షణ
భంగీసర్వజ్ఞ! విమలపాండిత్యనిధీ!

నన్నయ.

ఉ. ఆశ్రితపోషణంబున వసంతవిలాసమునన్ మహీషి వి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్త వ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహినొప్పు సర్వలో
కాశ్రయుఁ డావి రాజవిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్.

శ్రీనాథుఁడు.

కం. ఆశ్రితకటాక్షవీక్షణ
విశ్రాణన! విబుధవినోదవిద్యాధర! వ
ర్ణాశ్రమరక్షాతత్పర!
యాశ్రితమందార! రెడ్డి యల్లమవీరా!

నన్నయ.

కం. శ్రీ రాజరాజ, వీర
శ్రీరమణీరమ్య, గంధసింధురహయశ్రీ
ప్రౌఢారూఢదత్త, దక్షుము
ఖాదిదయాలబ్ధసుస్థిరైశ్వర్యప్రదా !

కం. హేమాద్రిధీర ! దాశా
రామ శ్రీ భీమశంకరకృపాలక్ష్మీ
సామగ్రీపరివర్ధిత
భూమీసామ్రాజ్యవిభవ ! పుణ్యశ్లోకా !

అట్లె ఆంధ్రభారత హరవిలాసములందలి యీక్రింది కందపద్యముల పోలికను గనుఁడు.

నన్నయ.

కం. శ్రీరమ్యధర్మనిత్య
ప్రారంభవిభాసి, రాజపరమేశ్వర, ఘో
రారి మదకుంభికుంభవి
దారణదారుణకృపాణ దక్షిణహస్తా !

మ. భా. అర. ప. ద్వి. ఆ. ప.

శ్రీనాథుఁడు.

క. వైరి మదకుంభికుంభవి
దారణదారుణకృపాణధారలు పరఘో
రారములు కందమునాలో
ధారములకుఁ బోలుపడెఁ గదా నీ కరముల్

హర. వి. స. ఆ. ప. 18

శ్రీనాథునకు జక్కన, అనంతామాత్యుల కవిత్వము లొక్కొక్కపట్టున నొరవడిగానుండె నట్లు తోఁచెడిని. కొన్ని యుదాహరణము లిత్తును.

జక్కన.

"దానంబునకు నిదానంబును, ధర్మంబునకు మర్మంబును, విభవంబునకుఁ బ్రభవంబును, విక్రమంబునకు ననుక్రమంబును, సౌఖ్యంబునకు ముఖ్యంబునై, యొప్పు నప్పురంబునకు నధీశ్వరుండు."

విక్ర. చ. ప్రథ. ఆ. 101

శ్రీనాథుఁడు.

"విభవంబునకుఁ బ్రభవంబును, విలాసంబునకు నివాసంబును, నపవర్గంబునకు సర్గంబును, ధర్మంబునకు మర్మంబును, దానంబునకు నిదానంబును, నానందమునకు మూలకందమును, విద్యకు నిషద్యయు, విశ్రామంబునకు ధామంబునునై యప్పట్టంబున కధీశ్వరుండు... ......"

భీమఖండము, ఆ. ప్రథ. ప. ౧౧౦

జక్కన.

కం. కుకురు కురు చేర కేరళ
శక మరు కర్ణాట లాట సౌరాష్ట్రమహీ
పకుమంత్రిజనమనీషా
నికషోపలనయకలాప, నిగమాలాపా !

విక్ర. చ. షష్ఠా. ఆ. ప. 146

శ్రీనాథుఁడు.

కం. కుకురు కురు చోళ కేరళ
శక మరు కర్ణాట లాట సౌవీర నృప
ప్రకరసభాభరణ మహా
సుకవిజనానీకవినుత శుభచరితునకున్.

శృంగారనైషధము ఆ ౧ ప. 41

జక్కన.

"మాగురంగూర్చిన ముండదైవమునకున్ మ్రొక్కంచుజేజేయనున్"

విక్ర చ అష్ట ఆ ప. 80

౫౦

"తనకీర్తి నర్తకి దశదిశామండలీరంగమధ్యమున నర్తనము సేయ"

విక్ర. ప్ర. ఆ ప. 102

శ్రీనాథుఁడు.

"ముగురంగూర్చిన ముండదైవమునకున్ మోమోట లేదో సుమీ"

భీమఖండము. తృ ఆ ప. 6

"తనకీర్తి నర్తకి ఘనతరబ్రహ్మాండభవనభూముల గొండ్లిఁ బఁధవిల్ల"

శృం. నై. ఆ. ౧ ప. 9

విక్రమార్కచరిత్ర, శివరాత్రిమాహాత్మ్యములలోని యీక్రింది విప్రకుమారవర్ణనముల సారూప్యమును జదువరులు దిలకింతురుగాక.

సీ. వెన్నెలఁ జఱియిడ్డ వెండితీఁగెలబోలు
యజ్ఞోపవీతంబు లఱుత నమరఁ
గన్నె చెంగల్వపూవన్నె మించిన నీరు
కాఁవిదోవతికట్టు కటిఁ దలిర్ప
వెలిదమ్మి పఃమీఁది మొలదేఁటి గతి గంగ
మట్టిపై వేలిమిబొట్టు దనర
నీలకందుకముపైఁ గీలించు ముత్యాల
విధమున సిగఁ గమ్మవిరులు మెఱయ

గీ. లలితనవయౌవనారంభకలితమైన
మేని మెఱుఁగులు మెఱుఁగులమెఱుఁగుఁ దెగడఁ
జంద్రధరుకృప బ్రహ్మవర్చసము గన్న
మాణుఁ డన నొప్పు విప్రకుమారుఁ గాంచె. విక్ర. చ. స. ఆ. ప 143

శ్రీనాథుఁడు.

సీ. సరిగొన్న వెలిపట్టు జన్నిదంబులతోడ
రత్నాలతారహారము ధరించి
వలిపనీర్కావిదోవతిపైఁ బదార్వన్నె
కళదొన పసిఁడిమేఖల ఘటించి

గంగమట్టియమీఁదఁ గస్తూరిరసముచేఁ
బుండ్రకమ్ము లలాటమున నమర్చి
కమలకర్ణికకుండలముల పార్శ్వములందు
లలితంబులగు నొంటులలవరించి
గీ. యాత్మవంశపరంపరాయాత్తమైన
వైదికాచారమార్గంబు వక్కణించి
యారజము రాచఱికమును నలవరించి
నగరివీథులఁ జరియించుఁ బ్రెగడసుతుఁడు.

శివ. మా. ద్వి. ఆ. ప. 90

భోజరాజీయములోని యీక్రింది సూర్యోదయవర్ణనము శ్రీనాథుని భీమఖండములోని సూర్యోదయవర్ణనమున కాధారమైనది. అట్టి మఱికొన్ని యుదాహరణములు.

అనంతామాత్యుఁడు.

సీ. ప్రాగ్దిశాసతి పాణిపల్లవమునుండి
తొలఁగు మాణిక్యకందుక మనంగ
కైసేయువేళ నాఖండలాంగనముందల
రాజిల్లు రత్నదర్పణ మనంగ
నిర్జరనాగంబు నిటలస్థలంబునఁ
దీర్చిన సిందూరతిలకమనఁగ
చక్రవాకములకు శాంతిగా వెలిచి
ప్రజ్వలించిన వహ్నిపటల మనఁగ
తే. నుదయరాగసంపద బింబమొప్ప మిగుల
నిఖిలదిక్కులఁ దనతేజ మతిశయిల్ల
నెల్లవిప్రులు నర్ఘ్యంబులెత్తి మ్రొక్క
భానుఁ డుదయించెఁ దైలోక్యబంధుఁడగుచు.

భోజరాజీయము. ద్వి. ఆ. ప. 117.

శ్రీనాథుఁడు.

సీ. ప్రథమసంధ్యాంగనాఫాలభాగంబునఁ
జెలువారు సిందూరతిలక మనఁగఁ
గై సేసి పురుహూతుగారాపు టిల్లాలు
పట్టిన రత్న దర్పణ మనంగ
నుదయాచలేంద్రంబు తుదఁ బల్లవించిన
మంజుకంకేళినికుంజ మనఁగ
శతమన్యుశుద్ధాంత సౌధకూటము మీఁదఁ
గనుపట్టు కాంచనకలశ మనఁగఁ
తే. గాలమనియెడు సిద్ధుండు గమిచి మ్రింగి
కుతుకమొప్పఁగ నుమిసిన ఘుటిక యనఁగ
గగనమందిర దీపికా కళిక యనఁగ
భానుఁ డుదయించె దేదీప్యమానుఁడగుచు
భీమఖండము. ద్వి. ఆ. ప 49.

"భానుఁడదయించె దేదీప్యమానుఁడగుచు."
విక్ర. చ. షష్ఠ. ఆ. ప 74

అనంతామాత్యుఁడు.

తే. ఎంతచెప్పిన నావగింజంత భూతి
పూయువానికి గుమ్మడికాయయంత
వెఱ్ఱిగలదను నార్యోక్తి వినమె తొల్లి
యితనియవివేకమది వేఱ యెన్న నేల! భోజరాజీయము. పుట. 210.

శ్రీనాథుఁడు.

తే. ఆవగింజంత భూతి మైనలఁదికొనిన
వెలఁది గుమ్మడికాయంత వెఱ్ఱిపుట్టుఁ
గటకటా ! యొల్లు తనబుద్ధి కాటఁగలియ
నిసువుఁ జంపగఁదలఁచెనో నీమగండు. హరవిలాసము. ద్వి.ఆ.ప.99.

పై విధముననే రామాయణభాగవతగ్రంథములలోని పద్యగతులు శ్రీనాథుని కావ్యములందును గనఁబడుచున్నవి. కొన్నిటిని వివరించెదను.

ప్రహ్లాదచరిత్రములోని యీక్రిందిపద్యము ఖండములోని పద్యమునకుఁ బ్రతిబింబము. ఒకటి విష్ణుస్తుతి. రెండవది యీశ్వరస్తుతి. పోతనశ్రీనాథులు సమకాలికులను చరిత్రవిషయమునకిట్టి యనుకరణము సాయపడవచ్చును. శబ్దాలంకారభూయిష్ఠమగు పోతనకవిత్వము శ్రీనాథుఁ డనుకరింపక, రూఢివైచిత్రికై యిట్టియనుకరణమును గావించి యుండును. శ్రీనాథుఁడు పోతనగ్రంథమును జూచియుండునని నా యభిప్రాయము.

పోతన.

సీ. కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలఁగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

గీ. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁజేరు మనియెడి తండ్రి తండ్రి.

శ్రీనాథుఁడు.

సీ. శ్రీభీమనాయక శివనామధేయంబుఁ
జింతింపనేర్చిన జిహ్వ జిహ్వ

దక్షవాటీపురాధ్యక్షు మోహనమూర్తిఁ
జూడంగ నేర్చిన చూపు చూపు
దక్షిణాంబుధితటస్థాయి పావనకీర్తి
చే నింపనేర్చిన చెవులు చెవులు
తారక బ్రహ్మవిద్యాదాత యాదల
విరులు పూన్పఁగనేర్చు కరము కరము
తే. ధవళకరశేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁ దిరుగంగనేర్చిన యడుగు లడుగు
లంబికానాయకధ్యాన హర్ష జలధి
మధ్యమునఁ దేలియాడెడు మనసు మనసు.

భీమఖండము. తృ. ఆ. ప. 198.

పైని నుదాహరించిన యీశ్వరస్తుతిమాతృక సంస్కృత భీమేశ్వరపురాణములో లేదు. శ్రీనాథకల్పితము. పోతనపద్యమున కనుకృతికి మఱియొక చిన్న యుదాహరణము.

“తనరారునవరత్నతాటంకరోచులు
చెక్కుటద్దములతోఁ జెలిమి చేయు.

భాగవతము. చ. ప. 58.

“తరళ హాటకరత్నతాటంకదీప్తులు
చెక్కుటద్దములై జీరువాఱ” హరవిలాసము. పం. ఆ. ప. 29.

విక్రమార్కచరిత్రము, భాస్కరరామాయణములలోని యీ క్రింది యాశ్వాసాంతపద్యములకును, శృంగారనైషధములోని యాశ్వాసాంతపద్యములకును గల పోలికను గమనింపుఁడు.

శా. లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీకేతికళాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీమంజరి గౌడవామనయనావక్షోజహారాళియై
పాటింపంబడు నీదుకీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ!

భాస్కరరామాయణము.

శా. నారీచిత్తసరోమరాళనవనానాగంధసౌగంధ్య వి
స్తారోదారభుజాంతరాళ ప్రతిభాసర్వజ్ఞ సోమాన్వయ
స్మేరాకార శరస్సుధాకరకరాశ్లేషప్రియంభావుక
స్ఫారక్షీరధరాధిపుంబకథా జంఘాలకీర్తీశ్వరా.

విక్రమార్కచరిత్రము. 4-229.

శా. నారీచిత్త సరోమరాళ నయచాణక్యా విరించాన్వయ
క్షీరాంభోధి సుధామయూఖ కవితాసిద్ధాంతసర్వజ్ఞ జం
భారాతిద్విపహస్తకాండనిభ బాహాఖడ్గధారాపరా
ధారాళాంతకవిరోధిభూధవమహోదగ్రప్రతాపానలా.

శృంగారనైషధము. 6-144.

శా. లాటీచిత్త సరోమరాళ కుకురీలావణ్య లోలాత్మక
ర్ణాటీనృత్యకళావిలోకన సమారంభప్రియంభావుకా
భోటీనేత్ర చకోరచంద్ర మగధీపుష్పాస్త్ర చోళీకుచా
ఘాటస్థాపితమన్మథాంక కుహళీగాఢాంకపాళిప్రియా!

శృం. నై. 4-141.

నాచనసోముఁడు-శ్రీనాథుఁడు.

సర్వజ్ఞుని కవిత్వము కవిసార్వభౌమునికవిత్వ మొక్కొకపట్టున మేలుబంతి. సోముని కవనమునకుఁ గవిత్రయమువారి కవిత్వమైనను సాటి రాదు. సీసపద్యరచనములో సోముఁడసమానుఁడు. ఉపచారక్రియల మేళవించి సహృదయ హృదయరంజకముగా సీసపద్యపాదముల నాటించుటలో నతని కతఁడెసాటి. శ్రీనాథుఁడు సర్వజ్ఞుని కవిత్వపటుత్వసంపద నలవరించుకొని యాతనివలెనె చారుత్వ ముట్టిపడునట్లు వివిధపోకడలతో సీసపద్యముల నెన్నో యల్లినాఁడు. సోమునితో సరివచ్చునని యనిపించు కొనుటయెగాక, యాతని మించినాఁడేమోయనిశోధింపవినాఁడు. సామ్య

ముకొఆకు వాఁడ్డజునుపయోగించిన క్రియలపట్టిక నిచ్చుచున్నాఁడను. క్రియావిచ్ఛిత్తికి వీఁద్దజును బెట్టినది పేరు.

| | | | |
|---|---|---|---|
| సంతరింప | ఉత్తరహరివంశము. | ప్రథ. ఆ. ప. | 119 |
| సవదరింప | ,, | ... | — |
| పరిఢవింప | ,, | ... | — |
| ఉపచరింప | ,, | ... | — |
| పేరణముసూప | ,, | చతు. ఆ. ప. | 216 |
| కోలాటమాడ | ,, | ... | — |
| గొండిలి పరిఢవింప | ,, | ... | — |
| ప్రేంఖణమొనర్ప | ,, | ... | — |
| చేరఁబిలువ | ,, | ... | 223 |
| నేర్పుదెగడ | ,, | ... | — |
| మాటలాడ | ,, | ... | — |
| పరుసఁజూడ | ,, | ... | — |
| పఱదపాలయ్యె | ,, | ... | 300 |
| నీటఁగలసె | ,, | ... | — |
| వెల్లిఁబోయె | ,, | ... | — |
| ఏఱుగొనియె | ,, | ... | — |
| సౌందర్యమొసఁగు | ,, | ... | 316 |
| విరసమాడు | ,, | ... | — |
| వన్నెమిగులు | ,, | ... | — |
| విజ్జ రాల్చి | ,, | పంచ. ఆ. ప. | 50 |
| గాలి దిచూంచి | ,, | ... | — |
| అలుకఁదీర్చి | ,, | ... | — |
| బుజ్జగించి | ,, | ... | — |
| శాదరింప | ,, | షష్ఠ. ఆ. ప. | 60 |

| | | | |
|---|---|---|---|
| వక్కళింప | ,, | ... | — |
| పూజసేయ | ,, | ... | — |
| పంతము పుగ | ,, | ... | — |
| చవులు జూపి | ,, | ... | 118 |
| చీకాకుపఱచి | ,, | ... | — |
| తప్పులఁ జేసి | ,, | ... | — |
| సవదరింప | ఉత్తరహరివంశము. | షష్ఠ. ఆ ప. | 252 |
| ముక్కళింప | ,, | ... | — |
| చెలిమిసేయ | ,, | ... | — |
| ఆదరింప | ,, | ... | — |
| సాముసేయ | ,, | ... | 313 |
| సొబగుమీఱ | ,, | ... | — |
| వియ్యమంద | ,, | ... | — |
| కేలిసేయ | ,, | ... | — |

## జక్కన క్రియాప్రయోగములు.

జక్కనకవి సోమునివలెనే సీసపద్యముల మనోహరముగా నల్లి, ఉపచారక్రియలను పెక్కిటిని గూర్చినాఁడు. సీసపద్యరచనలో సోముని తర్వాత జక్కనకవియే మేటి కెక్కినవాఁడు. శ్రీనాథుఁడును సోమన జక్కనల పద్ధతినే యనుసరించి, గజరాజగమనము ననుసరించు సీసపద్యములఁ జెప్పినాఁడు. జక్కన వాడిన క్రియలఁ గొన్నిటిని వివరించుచున్నాఁడను.

| | | | |
|---|---|---|---|
| మేళవింప | విక్రమార్కచరిత్రము. | ప్రథ. ఆ. ప | 166 |
| విస్తరిల్ల | ,, | ... | — |
| జామకొనఁగ | ,, | ... | — |
| వాటుకొనఁగ | ,, | ... | — |
| సవదరించి | ,, | ద్వితీ. | 27 |
| అలవరించి | ,, | ... | — |

| | | | |
|---|---|---|---|
| గారవించి | ,, | ... | — |
| కీలుకొల్పి | ,, | ... | — |
| అతిశయిల్ల | ,, | ... | 52 |
| పల్లవింప | ,, | ... | — |
| అంగీకరించి | ,, | ద్వితీ. ఆ. ప. | 91 |
| అభినయించి | ,, | ... | — |
| మేళవించి | ,, | ... | — |
| సంగ్రహించి | ,, | ... | — |
| ఓలలాడ | ,, | తృతీ. ఆ. ప. | 105 |
| సొంపుమిగుల | ,, | ... | — |
| కేలిసలుప | ,, | ... | — |
| పరిఢవింప | ,, | చతు. ఆ. ప. | 138 |
| చెంగలింప | ,, | ... | — |
| మచ్చరింప | ,, | ... | — |
| గారవింప | ,, | ... | — |
| కౌఁగిలింప | ,, | ... | 182 |
| కీలుకొనఁగ | ,, | ... | — |
| కొలుద్రవ్వ | ,, | ... | — |
| మెఱుఁగుపెట్ట | ,, | ... | 219 |
| చెలువుకొనఁగ | ,, | ... | — |
| నిగ్గుఁజెనక | ,, | ... | — |
| గారవింప | ,, | ... | — |
| అతిశయిల్ల | ,, | ... | — |
| నటింప | ,, | సప్త. ఆ. ప. | 14 |
| చౌకళింప | ,, | ... | — |
| చెన్నుమీఱ | ,, | ... | — |

| | | | |
|---|---|---|---|
| బుజ్జగింప | ,, | ... | 33 |
| కుస్తరింప | ,, | ... | — |
| పరిచరింప | ,, | ... | — |
| గమ్మరింప | ,, | ... | — |
| కొమకుమిగుల | ,, | ... | 36 |
| చెలిమిసేయు | ,, | ... | — |
| తరఁబడఁగ | విక్రమార్కచరిత్రము. | సప్త. ఆ. ప. | 116 |
| మోహరింప | ,, | ... | — |
| ప్రోదిసేయు | ,, | ... | — |
| మేలమాడ | ,, | ... | — |
| చెంగలింప | ,, | ... | 172 |
| తుఱుంగలింప | ,, | ... | — |
| మాఱుమలయు | ,, | ... | — |
| నటింప | ,, | అష్ట. ఆ. ప. | 111 |

శ్రీనాథుని గ్రంథములనుండి యుదాహరణములు.

| | | | |
|---|---|---|---|
| మచ్చరించి | భీమఖండము. | ప్రథ. ఆ. ప. | 92 |
| పరిభవించి | ,, | ... | — |
| సంప్రతించి | ,, | ... | — |
| వక్కలించి | ,, | ... | — |
| గుద్దలించి | ,, | ... | — |
| పుక్కిలించి | ,, | ... | 98 |
| వాయఁదట్టి | ,, | ... | — |
| అంగీకరించి | ,, | ... | — |
| అవఘళింప | ,, | ... | 105 |
| పొరలియాడ | ,, | ... | — |
| మురువుసూప | ,, | ... | — |

| | | | |
|---|---|---|---|
| పుక్కిలించియుమియ | ,, | ... | — |
| తడఁబడంగ | ,, | ... | 41 |
| సంతరించి | ,, | ద్వితీ. ఆ. ప. | 92 |
| వీడుకొలిపి | ,, | ... | — |
| భుక్తి వెట్టి | ,, | ... | — |
| నర్తనము గఱపి | ,, | ... | — |
| అత్తమిల్ల | కాశీఖండము. | ప్రథ. ఆ ప. | 2 |
| జలదరింప | ,, | ... | — |
| కౌఁగిలింప | ,, | ... | — |
| పరిఢవించు | ,, | ... | 48 |
| జేరువాఱ | ,, | ... | — |
| అవఘళింప | ,, | ... | — |
| వియ్యమంద | ,, | ... | — |
| మచ్చరించి | ,, | ... | 130 |
| మేలుకనిపి | ,, | ... | — |
| చిఱుతవోవ | ,, | ... | 139 |
| చొక్కమడగ | ,, | ... | — |
| పరిఢవించి | ,, | తృతీ. ఆ. ప. | 12 |
| పంతరించి | ,, | ... | 116 |
| అలవరించి | ,, | ... | — |
| పాలువెట్టి | ,, | ... | — |
| బాదరింప | ,, | ... | 241 |
| చెలిమిసేయు | ,, | ... | — |
| గొండ్లిగఱప | ,, | పంచ. ఆ. ప. | 52 |
| కాటఁగలియ | హరవిలాసము. | ద్వితీ. ఆ. ప. | 99 |

సశేషము.

# శివరాత్రిమాహాత్మ్యము—ఈశానసంహిత



శ్రీ పరమేశ్వరానుగ్రహమున ఆంధ్రసాహిత్యపరిషత్తువారి యమోఘపరిశ్రమమువలనఁ జిరకాలమునకుముందు శ్రీనాథకవిసార్వభౌముఁడు రచించిన శివరాత్రిమాహాత్మ్యము ఆంధ్రమహాశయుల హస్తము లలంకరించినది. చెన్నపురి దొరతనమువారి ప్రాచ్యవిద్యాపుస్తకభాండాగారమువారి యమూల్యపరిశ్రమమున స్కాందపురాణాంతర్గతమగు ఈశాన సంహితలభించినది. శ్రీనాథుఁడు రచించిన శివరాత్రిమాహాత్మ్యమునకు ఈశానసంహిత మూలమని శివరాత్రిమాహాత్మ్యమునందే కలదు. పుస్తకముల సేకరించి ప్రాచ్యపుస్తకభాండాగారమున నిలువఁజేయుటే దొరతనమువారి పనిగాని ముద్రించి ప్రకటించుట వారి కవసరము గాదు. శివరాత్రిమాహాత్మ్యము చదివినవారికి ఈశానసంహితావిషయపరిజ్ఞానముగూడ నత్యావశ్యకమే. కావున దానివిషయమై కొంచెము వ్రాయవలసివచ్చినది. సుమారు పదిపండ్రెండేండ్లకుఁబూర్వము ఓరియంటల్ లైబ్రరీ పండితులు సుగృహీతనామధేయులు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈశానసంహిత లభించినదనియు, నూఱుశ్లోకముల గ్రంథము నాలుగాశ్వాసములుగాఁ బెంచి యనువదించినాఁడనియు, నింక నొక్కయాశ్వాస ముండవలయుననియు, నాకు జాబుమూలమునఁ దెలిపియుండిరి. ఆ విషయము నేనొక వ్యాసములోఁ బ్రకటించియు నుంటిని. ఆ గ్రంథముప్రతి శ్రీ శాస్త్రిగారాంధ్రసాహిత్యపరిషత్తున కొసంగిరి. దానిపై నొక విమర్శనవ్యాసము నాచే వ్రాయింపుఁడనికూడ వారు పరిషత్తునకు వ్రాసిరఁట. పరిషత్తువారు ఆ ప్రకారమే నన్ను నియోగించుట జరిగినది. తొలుదొల్త శివరాత్రిమాహాత్మ్యమునకుఁ బ్రతి వ్రాసి పత్రికలోఁ బ్రకటించి, అది పుస్తకరూపమునఁ బ్రకటింపఁబడినపుడు దానికిఁ బీఠిక వ్రాసి, తరువాత ననేకవివాదములకు గుఱియైన నాకిప్పు

డీ విమర్శనము వ్రాయుట తటస్థపడుట విచిత్రముగానే యున్నది. ఇతరు లెవ్వరైన నీ సంహితను విమర్శించి ప్రకటించినయెడల వివాదమునందు న్యాయముఁ దెల్పినవారయి యుండెడివారు. నేనన్ననో వాదిప్రతివాదులలో నొక్కఁడనై యున్నాను. కాలక్రమముననైన న్యాయము ప్రకటముకాక తీఱదుగదా ? పరిషత్తువారు నాకు సంహితపంపిన కొలఁది దినములలోనే "ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునకు లభించిన సంహిత తాటాకుప్రతియా ? కాగితపుఁబ్రతియా ? ఏకాలమున వ్రాయఁబడినది. ఏ ప్రాంతమున లభించినది ? "అత్ర గ్రంథపాతః" అను వాక్యము మూలమందున్నదా ? ప్రతి లేఖకులు వ్రాసినదా ? వ్రాఁతకత్తె ఏదేశపుది ?" అని ప్రశ్నించుచు వ్రాసియుంటిని కాని రెండు నెలలైనను సమాధానము రామిచే నిరాశుఁడనై ప్రకృతవ్యాస మారంభించుచున్నాఁడను.

### గ్రంథస్వరూపము.

ప్రాచ్యలిఖితపుస్తకాలయమందున్న ప్రతిసంఖ్య Restored copy' No. R. 5583 T. 6. 38 Original No. 5-4-28. దీనికి ప్రతివ్రాసి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు పరిషత్తునకుఁ బంపిరి. దానిని జూచి పరిషత్తు మేనేజరు బ్ర. శ్రీ. చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు వ్రాసిన ప్రతి నాకుఁ బంపినారు.

ఆ ప్రతి నాలుగధ్యాయములు గలదిగా నుండవలసిన ట్లగపడు చున్నను రెండధ్యాయములనఱ మాత్రమే కలదు. ఫుల్‌స్కేపు సైజు ¼ పుటలు ముప్పదినాలుగు గలవు. పుటకు సగటున 22 పంక్తులచొప్పునఁ గలవు. మొత్తము శ్లోకములు 339. అన్నియును అనుష్టుప్ శ్లోకములు. ఈ భాగము కేవలము శివరాత్రిమాహాత్మ్యము నుద్దేశించియే యెత్తి వ్రాయఁబడిన ట్లగపడుచున్నది. అసలు సంహితయంతయు నింతియేయేమోయను సంశయముగూడఁ గలుగుచున్నది. దీని హేతువులు ముందుఁ దెలుపుకొందును. ఈ ప్రతి 70 అధ్యాయముతో నారంభమై 73 అధ్యాయాంతముతో ముగియుచున్నది. 70 అధ్యాయాంతమున

"ఓమిత్యాది పురాణే శ్రీ స్కాందే ఈశానసంహితాయాం శివరాత్రిప్రాదుర్భావతద్వ్రతపూజావిధానం నామ సప్తత్రింశోఽధ్యాయః" అనికలదు. దీనిచేవిందలి కథయు విదితమే. తరువాత 71½ శ్లోకములు కలవు అందు 10 శ్లోకములలో వ్రతముయొక్క ఫలస్తుతి మొదలగునవి యున్నవి. తరువాతి 61 శ్లోకములందును సుకుమారునిచరిత్రము చెప్పఁబడినది. అక్కడ 'అత్రగ్రంథపాతః" అని కలదు. 72 అధ్యాయప్రశంసయే లేదు. కాని చివరి అధ్యాయము 129 శ్లోకములందు శంకరయమసంవాదము వర్ణింపఁబడినది. చివర "ఓమిత్యాదిమహాపురాణే శ్రీస్కాందే ఈశానసంహితాయాం శంకరయమసంవాదో నామ త్రిసప్తతితమోఽధ్యాయః" అని కలదు. ఈ సంహితలోని కథకును శివరాత్రిమాహాత్మ్యములోని కథకును కొన్నిమాత్రమే భేదము లగపడుచున్నవి. కాని అనేకాంశములు రెంటను సమానముగానే యున్నవి ఉన్న స్వల్పభేదములు పాఠకుల సౌలభ్యమునకై యీ క్రింది నుదాహరించుచున్నాఁడను.

## పోలికలు—భేదములు.

మాహాత్మ్యమున శివుఁడు అష్టాదశవిద్యలను దొలుత బ్రహ్మకుపదేశించెను. అనంతరము శంకరాజ్ఞాప్రచోదితుండై కృష్ణద్వైపాయనుఁ డావిర్భవించి సర్గప్రతిసర్గాదిపంచలక్షణలక్షితంబులగు నష్టాదశపురాణంబులు నాల్గులక్షలపరిమితిగలవి రచించెను. అందుస్కాందము లక్షపరిమాణముగలది. అందు శివరాత్రిమాహాత్మ్యముగలదు. ఆశివరాత్రివ్రతమెవ్వ రాచరించి రేఫలంబులు దానం గలుగునో చెప్పుమని మునులభ్యర్థింప సూతుఁడు మొదట ప్రళయవర్ణనమును, దరువాత నారాయణుఁడు క్రోడాకారమున మహార్ణవమగ్నయగు భూమి నుద్ధరించి తన్నిమిత్తాహంకారమునఁ దానే జగత్కర్తనని గర్వించి క్షీరసాగరమునఁ బాపసెజ్జపైఁ బవ్వళించియుండెను అనంతరము స్వయంభువగు బ్రహ్మ నిద్రమేల్కాంచి సృష్టిసేయం దలంచి క్రమముదెలియక చీకాకుపడి చివరికి శివధ్యానమున లబ్ధప్రజ్ఞుండై చరాచరాత్మకప్రపంచమెల్ల సృజించి

తత్కారణమునఁ దానే జగత్కర్తనని గర్వించి స్వవిరచితమగు సృష్టి నాలోకింప హంసము నధిరోహించి యెల్లలోకములు విలోకించుచు వచ్చి క్షీరసాగరమునఁ బవ్వళించియున్న హరిం గాంచి యెవ్వఁడ వీవు జగత్కర్తనగు నన్నాలోకించి యేల లేచి మర్యాద చేయవని ప్రశ్నించెను. నారాయణుఁడు తానే జగత్కర్తనని బ్రహ్మను దిరస్కరించెను. అంత వారిరువురు యుద్ధమొనరించి పరస్పరవిజిగీషచేఁ బాశుపతాస్త్రంబు లొండొరులపైఁ బ్రయోగించుకొనిరి. తదస్త్రజ్వాలాదహ్యమానమగు లోకములఁ గావను, హర్యజులగర్వంబు మాన్పను, నస్త్రంబుల నడుమ ననుష్ణాశీతమగు నగ్నికంబంబు ప్రాదుర్భవించెను. అదియే శివలింగము. అది ప్రాదుర్భవించిన మాఘకృష్ణచతుర్దశీనిశికే శివరాత్రియని పేరు; అని తెలుపఁబడినది.

సంహితయందు "మహాపాతకోపపాతకము లొనరించిన యే సంకరులైనను ఏఘూపాయమున శివలోక మొందు నుపాయమేదైనఁ గలదా? యని మునులు ప్రశ్నింప సూతుఁడు పూర్వము పార్వతిచే నీయర్థమునే ప్రశ్నింపఁబడి యామెకు శివుఁడు శివరాత్రివ్రతవిధాన ముపదేశించెను. ఆమె దానిని షడాననునకుం జెప్పెను. నేను కృష్ణద్వైపాయనునివలన నాకథ వింటిని. దాని నాకర్ణింపుఁడు. నాల్గువేలయుగములు బ్రహ్మ కొక పగలు; అంతకాలమే రాత్రియు నగును. విష్ణువు వరాహరూపమున భూమి నుద్ధరించి విశ్రాంతికై పాలకడలిం బరుండెను. బ్రహ్మ సృష్టిని యథాక్రమముగఁ గావించి లోకము లాలోకించుచువచ్చి నారాయణుని గాంచి యధిక్షేపించి యాతనితో సమరం బొనరించెను. అందు వారిరువురు నన్యోన్యవధకాంక్షులై పాశుపతాస్త్రములం బ్రయోగించిరి. అస్త్రసంపాతము మాన్పను, హర్యజులఁ గావను, శాంభవంబగు స్తంభ మానడుమ నావిర్భవించెను. దానిఁ గాంచి కోప ముడిగి హర్యజులు కూడఁబలుకుకొని స్తంభాద్యగ్రములం బొడగాంచుటకు వరాహరూపమునను హంసవాహనంబునను నేఁగి కనలేక తిరిగివచ్చిరి. అంత

శివుఁడు వారికిఁ బ్రత్యక్షమయ్యెను. వారు వ్యస్తముగను సమస్తముగను శివుని స్తుతించిరి. శివుఁడు ప్రసన్నుఁడై మీరస్త్రములు ప్రయోగించుటచే దాని తేజంబున మీ తేజంబులు దగ్ధములైనవి. కావున మీరలు మీమీపదముల కనర్హులరు. మీరు శివరాత్రివ్రత మొనరించితిరేని మీమీపదములు మరల మీకొసంగెదను. అని చెప్పి వారిప్రార్థనముపైని శివరాత్రికాలనిర్ణయము వ్రతవిధానమును వారి కానతిచ్చెను. అని వర్ణింపఁబడినది.

మాహాత్మ్యమునం దీచెప్పఁబడినకథకు ఉరులింగోద్భవమను సంజ్ఞ నిర్దేశింపఁబడినది. సంహితయందు "శివరాత్రి ప్రాదుర్భావతద్వ్రత విధానములు" అని నిర్దేశింపఁబడినది.

మాహాత్మ్యమునందు తొలుతనే మునులప్రశ్నమున శివరాత్రి వ్రతంబుచెప్పంబడియుండు. దాని నెవ్వ రాచరించిరే ఫలంబుకొసంగు, మాకుఁ దేటపడ నవ్వాంపు మనుటయు, ఫలమున కుదాహరణముగా సుకుమారచరిత్రము చెప్పఁబడినది. సంహితయందు వ్రతవిధానశ్రవణానంతరము మునులు ఆవ్రత మేఫల మొసంగునని ప్రశ్నింప ఫలము వర్ణించి యుదాహరణముగా సుకుమారచరితము చెప్పఁబడినది.

సంహితయందు 61 అనుష్టుప్ శ్లోకములలో వర్ణింపఁబడిన సుకుమారచరిత్రము మాహాత్మ్యమున మూఁడాశ్వాసములలో మూఁడువందలపది గద్యపద్యములలో వర్ణింపఁబడినది.

సంహితయందు సుకుమారునిజన్మభూమి—వింధ్యోత్తరదిగ్భాగమున ఇరావతీశతద్రూవిపాట్సింధువితస్తానదులు ప్రవహించు రమణీయమైన దేశము గలదు. అందు సింధునదీతీరమున కుబ్జకాభిధాననగరంబు గలదు. అందు గొప్పరాజు గలఁడు. అతఁడు వ్యవహారార్థము నయకోవిదుండగు బ్రాహ్మణుని స్థాపించెను. అతనికి సుకుమారుఁడనిపేరు. అని రాజామాత్యతద్భార్య లనామకులుగా వర్ణింపఁబడిరి. మాహాత్మ్యమున వింధ్యపర్యంతభూమిపీఠంబున నుమ రత్నపురమను రాజధాని కలదు

దానిని హేమాంగదుఁడను శబరరాజు పాలించుచుండెను. అతనికి యజ్ఞ
దత్తుఁడను మంత్రి కలఁడు. మంత్రిభార్య సుశీలాభిధాన. ఆదంపతులకుఁ
బెక్కువ్రతము లాచరింప సుకుమారుఁ డుదయించెను, ఆపట్టణము చు
ట్టును ఇరావతీశతద్రువిపాట్సింధునదీమాతృకంబులగు జనపదంబులు
గలవు. ఆపట్టణపరిసరమున నర్మదాతీరకాంతారభూమిని మట్టియనుపేరి
కల్పద్రుమంబునీడ నోంకారనాథుఁడు శంభుఁడు పాయకయుండును. అని
పేర్కొనఁబడినది.

సుకుమారుని విద్యాభ్యాసము రెంటను సమానము. యౌవన
మదోద్ధతుఁడై కులస్త్రీలఁ జెఱుచుటయు రాజనిష్కాసితుఁడై దేశాంతర
మేఁగుటయు రెంటను సమమే. తొలుత కీకటదేశంబునకును దరువాత
హూణమండలమునకుం జనినట్లు మాహాత్మ్యమునను, తొలుత నేదో
యొక దేశంబునకును దరువాత హూణమండలమునకును జనినట్లు సంహి
తయందును గలదు. హూణమండలమునఁ జండాలీసమాగమము సంహి
తయందును కీకటదేశము విడిచి హూణభూమి కేఁగుత్రోవలో చండా
లీసమావేశనము మాహాత్మ్యమునందును వర్ణింపఁబడినది.

చండాలీసమాగమమాదిగ నాతఁడామాలెతంగూడి నానావిధ
మాంసము లాహరించుచు బాటసారులగు విప్రుల సంహరించి, వారిధ
నంబు లపహరించి నానావిధదుష్కార్యము లాచరించినట్లు సంహితను,
ప్రథమ సమావేశనానంతరము జనంగమ ప్రమదా నిర్దిష్టమగు భద్ర
కాళీనికేతనమున కరిగి యట బ్రాహ్మణులతో వసించుచు నానావిధ
విద్యలచే వారిని మెప్పించుచు వంచన బయల్పడనీకుండ మాలెత మాల
బాలకునిచేఁ బంపిన విందు లారగించుచు దినదినము రేపైన మాపైనఁ
దనవారి నెట్లో కనుబ్రామివచ్చిన మాలెతతో నిధువనంబు సాగించుచు
బ్రాహ్మణుల కెఱుకపడనీయక యే పక్కణశబరులంగూడి మృగయావినో
దంబు సాగించుచు నొంటిపాటున వచ్చు విప్రుల మొత్తి వారిద్రవ్యం

బపహరించుచుఁ గొంతకాలము తనదుష్కార్యము బయల్పడకుండనే యున్నట్లు మాహాత్మ్యమునను గలదు.

హూణమండలమందే యాతఁ డాచండాలియందుఁ బంచపాతక సన్నిభులగు సుతులను సుతాద్వయంబునుం బడసి యామాలెత కాలగతి నొందిన పిదపఁ దన చిన్నికూఁతుల నేరమెంచుచు నిరువురు కొమరులం గని, యొకనాఁడు రాజుచే బహుధన మంది వచ్చు విప్రుల నాతఁడ్వరఁ బరి మార్చి వారిధన మపహరించి తద్వార్తాశ్రవణమునఁ గుపితుఁడైన రాజుచేఁ దన్నుఁ జంపుటకు దూతలు పంపఁబడిరని తెలిసి కూఁతునొక్క తెను దోడుకొని కిరాతదేశమునకుఁ బలాయనమై యొక్క శివరాత్రినాఁడు శివపూజాదు లాలోకించి విగతపాపుఁడైనట్లు సంహితయందుఁ గలదు

హూణమండలమున నతనిదుర్వ్యాపారంబులు ప్రకటంబగుటయు నట వసింప నోడి, యాతఁడుచండాలితోఁ గూడి హూణమండలము విడచిపోయి తదనంతరము సుతులను నిరువురు సుతలను గనినట్లును చండాలీ మరణానంతరము తనయ లిరువుర రమించుచు నిరువురుకొడుకులం బడసినట్లును మాహాత్మ్యమునఁ గలదు.

మహాపాతకియగు వీనిసంసర్గదోషమునకు హూణమండలవిప్రులుత్తప్తకృచ్ఛ్రచాంద్రాయణవ్రతాదిప్రాయశ్చిత్తములాచరించినట్లు మాహాత్మ్యమునఁ గలదు. సంహితయం దీవృత్తాంతమే లేదు.

హూణమండలము విడచి సుకుమారుఁడు కిరాతదేశమున కేఁగినట్లును, అట వణిక్పదమున కనతిదూరమున నాగేశాహ్వయుఁడగు శివుని యాలయంబున శివరాత్రివ్రతాదుల నాలోకించినట్లును సంహితయందుఁ గలదు. మాహాత్మ్యమున దుర్గమాటవీవిషమంబు హూణమండలంబు గడచి యెడనెడ (కొంతగ్రంథపాతము) వణిక్పదమునకు గవ్యూతిమాత్ర దూరమున ఆదిమధ్యంబు (ధ్యాంత) నాగేశ్వరాహ్వయంబగు పుణ్యక్షేత్రంబున శేషప్రతిష్ఠితుండై యనేకకల్పంబులనుండి వెలసియున్న

నాగేశ్వరునియాలయంబున శివరాత్రినాఁడు శివపూజాదు లాలోకించి విధూతకల్మషుండై నట్లు గలదు.

సుకుమారుని మరణానంతరము యమునానతిని యమకింకరు లేతెంచి వానిలింగశరీరము బంధించి కొని పోవుచుండ శివదూతలు శివాజ్ఞాచోదితులై వచ్చి వారి నాఁగి యుద్ధమున జయించినట్లు చెప్పఁబడిన పిదప 'అత్ర గ్రంథ పాతః' అని సంహితయందుఁగలదు. మాహాత్మ్యము నందు శివదూతలు యమకింకరులు సంకులసమరము గావించుతఱి నొక యమభటుఁడు యమునికడ కేఁగి యుద్ధవృత్తాంతము విన్నవింప నాతఁడు లుంబరుఁడను సేనానిని పెక్కుసైన్యములను నూఱుమృత్యువులను శివ గణములపైకిఁ బంపినట్లును వారెల్లరును ప్రమథులచే భంగపడినట్లును వర్ణింపఁబడి "భటులు ప్రమథులచే నట్లు భంగపడినఁ జిన్నబోయి యముం డేమిచేసె చెపుమ" అను మునుల ప్రశ్నముతో నాశ్వాసముముగియు చున్నది. అంతతోనే గ్రంథముకూడ సమాప్తమైపోయినది. తద్గ్రంథద్వయమునకును భేదములు సంహితయందు 73 అధ్యాయమున శివదూతలచేఁ దనభటులు పరాజయమొందుటయు పాపిష్ఠుఁడగు సుకుమారుఁడు శివసాయుజ్య మొందుటయుఁ జూచి, విస్మయావిష్టుఁడును భీతచిత్తుఁడునై శివలోకంబునకరిగి శివునిదర్శించి తనకుఁ గలిగినపరాభవము విన్నవించుటయు శివుఁడు శివరాత్రివ్రతప్రభావంబున సుకుమారుఁడు గతకల్మషుండయ్యెనని చెప్పి యమునకు శివరాత్రివ్రతవిధానము సవిస్తరముగ వర్ణించిచెప్పెను. అంతసంతుష్టహృదయుఁడై యముఁడు తనపురంబునకు తిరిగిపోయెను. అను గ్రంథము అధికముగాఁ గలదు. అంతతో 73 అధ్యాయమును (బహుశః) సంహితయుఁ గూడ ముగిసినవి.

## విశేషములు.

మాకింతవఱకు నుపలబ్ధములగు నేకైక శిథిలాతిశిథిలములగు నీ ప్రతులు రెంటివలననే శివరాత్రిమాహాత్మ్యసమగ్రతాసమగ్రతలు నిర్ణయించుకొనవలసి యున్నది. పీఠికలో శ్రీనాథుఁడు నాలాశ్వాస

ములు మాత్రమే రచించెననుటకుఁ గొన్ని హేతువులు చూపఁబడినవి. సంహితవలనఁగూడ నావిషయమే దృఢమగుచున్నది. పీఠికలో యమదూతలు పరాజితులైన పిదప యముఁడు స్వయముగావచ్చి శివునిచే నిర్జింపఁబడిన అపరమార్కండేయచరిత్ర ముండి యుండునేమో యను సంశయము చూపఁబడినది ఇప్పుడట్టి సంశయమునక్కఱలేదు. స్వభటపరాజయమున ఖిన్నుఁడై యముఁడు శివలోకమునకేఁగి శివునకై కారలాంఛనముగ దండముద్రను శివునకిచ్చివేసి సహాయురాకరణ ముపలంబించినట్లును శివుఁడు శివరాత్రిప్రభావము బోధించి యాతనిని సమ్మకపఱచినట్లును సంహితయందుఁ గలదుగదా? కేవల కాదంబరీరసాస్వాదలోలుపుఁడును లోకజ్ఞపరివృఢుండునగు శ్రీనాథకవిసార్వభౌముఁడు పేలవములగు నాచేలఘుట్టములఁ దడవలేదనియే మనము నిశ్చయించుకొనవచ్చును. అందు ముప్పదియొనిమిది శ్లోకములలో శివలోకవర్ణనమును, పిదప నైదుశ్లోకములలో శివవర్ణనమును పిమ్మట నిరువదినాలుగు శ్లోకములు శివుని నుతించుటయు, తరువాత పదునాల్గుశ్లోకములలో సుకుమారుని దుష్కార్యములు నివేదించి దండముద్రనర్పించి నానోక్తపరేషను చూపుటయుఁ గలదు. అనంతరము శివుఁడు శివరాత్రిప్రభావము వర్ణించుట నాలుగు శ్లోకములనున్నది. యమప్రశ్నమున కుత్తరముగా వ్రతవిధానము నుపదేశించి సుకుమారునికాఫలము లభించినప్రకారము వివరించి నాభక్తులు నీకు సదాపూజ్యులని నిర్దేశించి భక్తలక్షణమును నాజ్ఞాపించుట యముఁడు పరితోషమంది తనపురమునకేఁగుటయు మిగిలిన శ్లోకములందు వర్ణింపఁబడినది. ఈ గ్రంథమంతయు మిక్కిలి ఛాందసమై ఖరెసి ప్రకటించుచున్నది. పరమమాహేశ్వరుఁడగు కవిసార్వభౌముఁడు శివనుతులఁగాని భక్తస్తోత్రములఁగాని మిగుల నాదరించువాఁడేయైనను కేవల నమకచమక పారాయణముఁగావించు వేదాభ్యాసజడుఁడు మాత్రముగాఁడు. ఆయాపట్టులందు శివవర్ణనములు భక్తబృంద స్తోత్రములు దేవాలయాది మహిమలును మిక్కిలి రసోత్తరములుగాఁగూర్చియే యున్నాఁడు. వాస్తవము

విమర్శించి చూచిన నాతని మనీష కాదరణీయాంశ మొక్కటియు నీయ
ధ్యాయమున లేనేలేదు. కావున నాతఁ డీకథాభాగ మాంధ్రీకరింపలేదని
యే సిద్ధాంతముగా శివరాత్రిమాహాత్మ్యమునకు వేఱొకప్రతి లభించు
వఱకు మనమంగీకరించుటే సమంజసము శ్రీనాథుఁ డీ యీశానసంహి
తనే యాంధ్రీకరించె నను నిశ్చయము జనించుచో సారవంతములైనను
నిస్సారములయినను గ్రంథభాగములన్నియు నాంధ్రీకరించెననుట కొంత
యుక్తముగా నుండును కాని యాతఁడీ సంహితను జూడనేలేదేమో యను
నూహకు నవకాశము గలుగుచున్నపుడు డా వాదమంగీకరించుట కెట్లు
వీలగును. ఈక్రిందివిషయములు పాఠకులు బాగుగా గమనింతురుగాక.

పరిషత్తువారికి లభింపక పూర్వము శివరాత్రిమాహాత్మ్య మెట్లు నా
మమాత్రశేషమో సంహితయు నెట్లు మొన్న దొరతనమువారికి లభిం
చువఱకు నామమాత్రశేషము. మాహాత్మ్యమునకుఁ బ్రత్యంతర మింత
వఱకుఁ గనబడదు. సంహితకున్నట్లే. మాహాత్మ్యము శిథిలాతిశిథిలము; ఘుణా
క్షరబహుళము గ్రంథపాతభూయిష్ఠమును. సంహితాప్రతి శిథిలమగునో
కాదో యెఱుఁగ రాలేదు గాని గ్రంథపాతములు భూయిష్ఠములుగానే
యున్నవి. విశేషించి యందు "అత్ర గ్రంథపాతః" అను వాక్యము మిక్కి
లిసంశయమున కాస్పదమైయున్నది. మాహాత్మ్యమున నే సందర్భమున
గ్రంథపాతమని యూహింపఁబడుచున్నదో ఆసందర్భముననే సంహితయం
దు "అత్ర గ్రంథపాతః" అను వాక్యము కంఠోక్తిగా నుండుటకుఁ బ్రబల
కారణముండవలదా? ఈశానసంహితయను పేర నీనాఁటికి లభించిన
యీ యసమగ్రగ్రంథమొక్కటితక్క మఱియొక్కడనేదియుఁ గానరాలేదు.
ఖండములుగలదియొకటియు సంహితలుగలదియొకటియు రెండు స్కాంద
ములుగలవు. అందొకటిమహాపురాణము, నింకొకటి యుపపురాణమునని
వ్యవహరింపఁబడుచున్నవి. అవియిపుడు ముద్రితములయ్యు నముద్రితము
లయ్యు ననేకప్రతు లగపడుచున్నవి. వానిలోని సంహితలును ఖండము

లును విడివిడిగఁగూడముద్రితాముద్రితము లగపడుచున్నవి. కాని యెందు నీయీశాన సంహితపేరైనఁ గనవినరాలేదు. పోనిండు. కొన్ని కథలైన నీసంహితలోని వనుపేర నగపడుచున్నవన నట్లునులేదు నాలుగధ్యాయ ములు మనకులభించిన దీనికిముందు నలువది తొమ్మిదధ్యాయములు నేమైనవి. వీనికిఁ దరువాతనింకను గొన్నియధ్యాయము లున్నవా? లేక వీనితోనే సంహితముఁగిసినదా? యనుసంశయములు వీడుకొట్లో యెఱుక పడకున్నది.

శివరాత్రిమాహాత్మ్యమున ఈశానసంహితానామ మొక్కతావు ననే యొక్కమాటే పేర్కొనఁబడినది. "స్కాందంబునం దీశానసంహితం జెప్పబడ్డయురులింగోద్భవంబును శివరాత్రిమాహాత్మ్యంబును" ఆ౧. ప ౩౪.

"స్కాందపౌరాణికంబైన కథలలోన, ఘనత శివరాత్రిచరితంబు వెనుఁగుఁగాఁగ" ఆ ౧. ప 37.

"నూఱువేల్గ్రంథములతోడ నుతివహించి, శ్రీమహాస్కాంద సంహిత శివ్రునిజెప్ప" ఆ ౧. ప ౪౭.

"శంకరసంహితా కథాదీపిత భవ్యమార్గమున" ఆ ౧. ప ౪౭.

అని నాల్గుతావులందుమాత్రమే శ్రీనాథుని గ్రంథమునకు మూ లము పేరుచెప్పఁబడినది. నాల్గుతావులందు నాల్గువిధములుగా నున్నది; కాని యీశానసంహితయేయని చెప్పుటకుఁ గారణము గానరాలేదు. ఈ గ్రంథవిషయమై గొప్ప పరిశోధనముగావించి నాతోడి వివాదమునఁ బెక్కు వ్యాసములురచించిన శ్రీ బండారు తమ్మయ్యగారుగాని యింకను గల పెక్కురు శైవపండితులుగాని యీశానసంహితయొకటి కలదనియో లేదా శివరాత్రిమాహాత్మ్యమునకు మూల మీ సంహిత యుండెట్లు కల దనియో తెలుపకుండుటచూడ శ్రీనాథుఁ డీ గ్రంథము నాంధ్రీకరింపలే దనుటకు గొప్ప ప్రమాణముకాకపోదు.

ఈయీశానసంహితను జూచియే శ్రీనాథుఁడు శివరాత్రిమాహాత్మ్యము రచించెనని యంగీకరించుచో నాకవి యిప్పుడు మన కుపలబ్ధమైన యీ ప్రతిని జూచియే యాంధ్రీకరించెనని తేలును. కావున సంహితయం దెటనెట పాతములుగలవో యవి యట్లే మాహాత్మ్యమున నెట్లుండఁగలవు? మఱియు నాలవయాశ్వాసము చివరనున్న "చిన్నబోయి యముం డేమిచేసెఁ జెపుమ" యను మునుల ప్రశ్నమునకుఁ జేటభారతమంత సమాధానముండగా దానినేల విడచును? మహాకవియగు నాతఁడు పెక్కుస్థలములందు సంహితలోని చప్పిడికల్పనములు, వర్ణనములు, కథలు మొదలగువానిని స్వప్రతిభచే సానఁబట్టినరత్నములవలె వెలయించినవాఁడు కొన్ని గ్రంథపాతములఁ బూరించుకొనలేకపోయెనా? లోపముల సవరింప శక్తిలేనివాఁడా? యని సహృదయులు విమర్శించుకొనఁదగును. కావున నీ ప్రతిని శ్రీనాథుడు చూడలేదనియు నీశానసంహితనాంధ్రీకరింపలేదనియు నమ్మవచ్చును.

## ఈశానసంహితాకాలము.

పైవిషయములవలన నీశానసంహిత శ్రీనాథునికిఁ బూర్వము లేదని తేలినట్లే. అట్లయిన నిది యెప్పుడెవ్వరిచే రచింపఁబడియుండును; అని యాలోచింపఁగా నీక్రిందివిషయములు దోఁచుచున్నవి.

శ్రీనాథుఁడు కృతినొందినపిదప అవతారికా భాగమునవతరింపఁజేసి కృతిని స్వయంగ్రహణము గావించిన మాహాత్మ్యకృతిపతియను మతినో లేక స్వయముగనో యప్రౌఢశైవపండితకవి దీనిని రచించియుండును. ఆతఁడీకథయందలి భక్తిచేతనైననేమి భక్తులఁబ్రోత్సాహ పఱుప నీగ్రంథ ముత్తమోత్తమ సాధనమని నమ్మికచేనేమి దీనిని సంస్కృతభాషలోని కనువదించినాఁడు. ఆతనికి సంస్కృతభాషాజ్ఞానము బాగుగలేదనియు, కవితాశక్తికూడఁదగినంత లేదనియు నీగ్రంథము వేనోళ్ళఁ జాటుచున్నది. మహాత్మ్యమాః అధ్యా 70 శ్లో. 27 మొదలగు నపప్రయో

గములీ గ్రంథమునఁగలవు. వర్ణనములు పదములును కేవలపేలవములు గానున్నవి. “సతు కామకళాశాస్త్రం సర్వ మభ్యస్య రాగవాన్ ” అధ్యా. 71. శ్లో. 17. కామకళాశాస్త్రమను పదమెట్టి ప్రాచీనమో తెలిసికొన్న నీ కవి ప్రాచీనతయు దెలియఁగలను. ఈ భక్తకవి యీగ్రంథము రచించునాఁటికే శివరాత్రి మాహాత్మ్యము శిథిలమైయుండును. అందలి పాఠములు లోపములు నాతనికి సవరించుకొన నలవికానివి. ఆకారణమున వానినెల్ల నట్లే విడచినాఁడు. పైపెచ్చుగ అత్ర=ఈస్థలమున అనఁగా శివరాత్రిమాహాత్మ్యగ్రంథమున నని యభిప్రాయము గ్రంథపాతః=గ్రంథము లోపించినది; అని కంఠోక్తిగఁ జెప్పివైచినాఁడు. ఆకారణమున నీయీశానసంహిత మిక్కిలి అర్వాచీనమనియే తలంపవచ్చును. ఆంధ్రభాషలోని గ్రంథములు సంస్కృతీకరింపఁబడుట యొక వింతకాదు. వసుచరిత్ర మొకానొకపండితునిచే సంస్కృతీకరింపఁబడినదని విన్నాము. భాస్కరపంతులను నప్రౌఢాంధ్రకవిచే తెలుఁగునఁ దొలుత రచింపఁబడినకన్యకాపురాణముసంస్కృతీకరింపఁబడి ముద్రింపఁబడియున్నది. శ్రీశైలశైవ మఠాధిపులలోఁజేరిన శ్రీశ్రీ కటి బసవశాస్త్రిగారను మహాపండితులు పాల్కురికిసోమనాథ రచితమగు బసవపురాణము మొదలగు గ్రంథములను సంస్కృతీకరించి ప్రకటించుచున్నారు. కావున నీసంహితయు నట్టివానిలోఁజేరిన యొకటియగును.

తాను విశేషప్రతిభావంతుఁడు కాకున్నను గ్రంథము పాతభూయిష్ఠమైయున్నను దానిని దాను సంస్కృతీకరింపఁబూనుటకుఁ గారణమేమా? యనుప్రశ్నము రాకపోదు. శ్రీనాథుఁడు శివరాత్రిమాహాత్మ్యము రచించుటలో నేయభిప్రాయము మనమున నుంచికొనియెనో దానినే సంహితాకారుఁడుగూడ మది నెంచియుండును. పెక్కుతావులందు శివపూజామాహాత్మ్యములనువర్ణించిన శ్రీనాథునకునాయాగ్రంథములందు శివరాత్రిమాహాత్మ్యముఁదెలుపుటకుఁదగినమహాపాతకము లుదాహరణ

ములుగా నగపడలేదు. తొలుత బ్రాహ్మణజన్మము. అంతను రాజసత్కారము. సకలశాస్త్రపారంగతత్వము. వీని నెల్లఁ బాఱద్రోలి వావి వరుస లుజ్జగించి కంటికగపడిన స్త్రీ నెల్ల రమించుట. దొరకిన కల్లు నెల్ల ద్రాగుట. పచ్చిమాంసము భుజించుట. దేవాలయములఁ బాడుచేయుట. చండాలి నాలిగాఁ జేకొనుట. దానిఁగాచి గోవిప్రహత్య లాచరించుట తనకూఁతులనే దాను రమించుట ఇట్టి మహాపాతకములు వంచనములును, తిర్యక్కులకును జెల్లవు అట్టి మహాపాతకము లాచరించిన మహాపాపిష్ఠుఁడు, ఒడలు తెలియక కామవశంవదుఁడై తనమిండతకుఁ గల్లు మాంసము గొనిపోవుచు మార్గమధ్యమున ననిచ్ఛాపూర్వకముగ శివరాత్రి వ్రతపూజాదుల నాలోకించినంతమాత్రమున విగతాఘుఁడై కైలాసమున కేఁగుట, ప్రమథత్వ మొందుట, శివున కత్యంతప్రీతిపాత్రమగుట యును శివరాత్రిమాహాత్మ్యమునకుఁ జాలిన యుదాహరణము లని యా కవిసార్వభౌముఁ డెంచెను. ప్రతినాయకుని యుత్కర్ష మెంతయున్న వానిని జయించిన నాయకుని యుత్కర్ష మంత కధికమగును గాదా ? ఆతలంపుననే శ్రీనాథుఁ డీకథను స్వకపోలమున సాధించి యటనట రసోత్తరములగు కాదంబరీవచనములఁ జొప్పించి మహోత్తమప్రబంధము రచించినాఁడు. ఇంతియేకాని తా నే సంహితను నాంధ్రీకరింపను లేదు. ఆంధ్రీకరింపఁ దలంపను లేదు.

గ్రంథరచనమున వీరువురదృక్పథములు వేఱువేఱుగా నగపడుచున్నవి. శ్రీనాథుఁడు రసోత్తరములగు వర్ణనములు కల్పనములుగూర్చి కథను లోకోత్తరముగాఁ బెంచి తద్ద్వారమున సహృదయుల మనములందు గాఢతమభక్తిప్రరోహముల నాట నెంచినాఁడు. సంహితాకారునకిట్టిసుకుమారాలోచనము లేదు. అతఁడు మహాభక్తుఁడే కాని కేవలము జనులను మూఢభక్తులుగాఁ జేసి వారిచే వ్రతములాచరింపఁ జేయు మతప్రచారకుఁడో లేక పురోహితుఁడో కాఁదగును. కావుననే శ్రీనాథుఁడు శివరాత్రియను

మహాపర్వము ప్రవర్తించుటకుఁ గారణమగు "ఉరులింగోద్భవకథను" ఆపర్వమహత్త్వమును, దెలుపుటకు సుకుమారచరిత్రమును బ్రధానాంశములుగా గ్రహించినాఁడు సంహితాకారుఁడు అట్లుకాక శివరాత్రివ్రత విధానము తత్ఫలస్తుతిరూపమగు శంకరయమసంవాదమును గథావస్తువులుగా గ్రహించినాఁడు. మఱియు సంహితయం దఱువదిశ్లోకములు దక్కఁ దక్కినభాగమంతయు పూజావిధానములు నామములు స్తోత్రములతోడ నేకదా నిండియున్నది. అతఁడు కేవలము పౌరోహిత్యమే యాలంబించినవాఁడు కాకున్న ప్రథమాధ్యాయాంతమున "శివరాత్రిప్రాదుర్భావతద్వ్రతపూజావిధానం నామ" అను నక్షరములు వెలసియుండఁగలవా? అవియైనను సంహితాకారుని యప్రతిభత్వమును ఛాందసత్వము నవీనత్వమును రుజువుచేయఁజాలవా ?

## సారాంశము.

పై విషయములన్నియు నాలోచింపఁగా నీయీశానసంహిత మిక్కిలి అర్వాచీనమే కాని ప్రాచీనము గాదనియు శ్రీనాథుని గ్రంథమునకిది మాతృక కాదు సరేకదా పుత్రిక యనియు, నిది యొక యప్రౌఢపురోహిత పండితునిచే రచింపఁబడినదనియు పిండితాభిప్రాయము ప్రకటితమగుచున్నది. వింతలలోవింత. శ్రీనాథరచితమగు శివరాత్రిమాహాత్మ్య మిట్లు సంస్కృతీకరింపఁబడుటచే నామాహాత్మ్యమునవతారికాపద్యములుకూడ నతఁడురచించినవికావనియు సంహితాకారునిబోలు మహానుభావుఁడెవరో దానిని బూరించెననియు వ్రాయఁబడిన పీఠికావాక్యముల కుపోద్బలము గలుగుచున్నది.

## ముగింపు.

గ్రంథద్వయము ననేకపర్యాయములు మిక్కిలి శ్రద్ధతోఁ జదివిన మీఁదట నాకుఁ దోఁచిన విషయములు నేను వ్రాసితిని. నాను సత్య

ములని తోఁచినవానినే నేను బ్రకటించితిఁగాని యితరుల నిందింపను వంచింపను వాదోపవాదము లాచరింపను వ్రాసినవాఁడను గాను పరిషత్తువారు చిన్నగ్రంథముగు దీనిని ప్రత్యేకపుస్తకముగాఁ బ్రకటించినచో శివరాత్రివ్రతపరాయణులు కామోపనముకు శివరాత్రిమాహాత్మ్యగ్రంథవిమర్శనాభిలాషులకు సంశయవిచ్ఛేదమును గలుగును త్వరలో నట్లు చేయుదురు గాక.

లోకాస్సమస్తాస్సుఖినో భవంతు.

శ్రీ శ్రీ శ్రీ

కట్టి సాంబమూర్తిశాస్త్రి.

# సాహిత్యవిమర్శనము.

సాహిత్యశిరోమణి- చిలుకూరి వీరభద్రశాస్త్రి.



సాహిత్యక్షేత్రమందలి గ్రంథములను బఠించి, వానియందలి గుణదోషములను వ్యక్తముసేయుచుఁ దమయభిప్రాయమును బ్రకటించుట విమర్శనమనఁబడును. ఇట్టి విమర్శనము కావ్యములు, నవలలు, నాటకములు, మున్నగువానియెడల జరుపఁబడును. ఒకప్పుడు విమర్శన గ్రంథములపైనను విమర్శనము జరుపఁబడును. సాహిత్యమున జీవితవ్యాఖ్యానమనినపుడు తద్విమర్శనము వ్యాఖ్యానమునకు వ్యాఖ్యానము సేయుటయగును.

ఏది యేనొక గ్రంథమును విమర్శించునపుడు మనమా గ్రంథము యొక్కయు, గ్రంథకర్తయొక్కయు వాస్తవాభిప్రాయమును దెలియఁ గోరుదుము. మఱియు నావిషయమున మనయభిప్రాయమునుగూడ స్థిరీకరింపఁగోరుదుము. ఇతరు లెవ్వరేని యొకగ్రంథమును విమర్శించియున్నచో నావిమర్శనము మనకులాభకారియగును. కాని స్వయముగ విమర్శించుటవలనఁ గలిగెడు నుపయోగము మాత్రము గలుగనేరదు. ఇతరుల విమర్శనమునుజూచి తృప్తిచెందినచో నావిమర్శకుని యభిప్రాయములు మనహృదయమున నాటుకొనుటచే స్వకీయాభిప్రాయమును స్థిరీకరింపఁజాలము. స్వయముగ విమర్శింపఁగడఁగినపు డితరుల విమర్శనమువలనఁ గొంతలాభము నవశ్యముఁ బొందఁగలము.

సాధారణముగ నొకవిమర్శకుఁడు సామాన్యపాఠకులకంటె నధికజ్ఞానసంపన్నుఁడగును. ఆతని గ్రంథపఠనమును గంభీరము భావపూర్ణము నగును. అతఁడొక కృతిని జదివి యనేక నూతనాంశములను మనకుఁ దెలియఁజేయుచు నూతనమార్గములఁ బ్రదర్శించును. గ్రంథములు జదువునపుడెట్టి జాగ్రత వహింపవలయునో దృష్టినెట్లు సారింపవలయునో

యాతఁడు మనకెఱుఁగఁజెప్పును. ఆతని యభిప్రాయముతోడను నిర్ణ
యముతోడను మన మేకీభవింపకపోయినను, ఆతని విమర్శనమువలన
మనకు లాభము కలిగితీరును.

విమర్శనమువలన రెండు పనులు జరుగును. 1. కవియొక్క
కృతికి విస్తృతవ్యాఖ్యాన మొనరించుట 2. ఆకృతివిషయమునఁ దన యభి
ప్రాయమును స్థిరీకరించుటయును. పెక్కురు విమర్శకు లీరెంటిని మేళ
వింపఁజేయుచున్నారు. కాని నేఁడు కొందఱు పాశ్చాత్యవిమర్శకులు
వ్రాయుచున్న దేమన కృతికి వ్యాఖ్యాన మొనరించుటయే విమర్శకునిపని
గాని, తనయభిప్రాయమును స్థిరీకరింపఁగూడదు. అట్టి స్థిరీకరణముచే
నితరవిమర్శకులకు బాధ కలుగును-అని. కాని, ప్రత్యేకవ్యక్తియు నొక
గ్రంథముపైఁ దనయభిప్రాయము నేదియో యొకరీతిని వ్యక్తముసేయక
యుండఁజాలఁడు.

విమర్శకునకుఁ దనమతమును స్థిరీకరింపనధికారము లేదని యొప్పు
కొన్నను, వ్యాఖ్యాతయైన యాతనికి తన మతమును న దేముండును.
వ్యాఖ్యానము సల్పుటయైనను సాధారణమైన కార్యముగాదు. ఒక
గ్రంథమందలి గుణదోషవివేచనము సలుపునపు డాగ్రంథము నాతఁడు
బాగుగఁ జదువవలెను. గ్రంథమందలి బాహ్యగుణదోషములను వదలి
యాంతరంగికభావములలోఁతును గుర్తింపవలెను. క్షణికమైన సాధా
రణవిషయములను, స్థాయిగనుండెడి విశేషవిషయములను బాగుగ గమ
నింపవలెను. మఱియు నా గ్రంథము కళాపోషణమున, నీత్యుపదేశమున
నెట్టి స్థానము గలిగియున్నదో గమనింపవలెను. అప్పు డాతఁ డాగ్రంథ
మున నణఁగియున్నగుణములను వ్యక్తముసేయఁగలఁడు. అందలి తత్త్వ
ముల నటనటఁ జెదరినవానిని నొకచోఁజేర్చి విమర్శింపఁగలఁడు. ఈ రీతి
గ నాతఁడు విషయము, భావము, కళా మున్నగు దృష్టులచే గ్రంథ మెట్టి
మహత్త్వముగలదో బాగుగ వ్యక్తముసేయును. ఇట్టితఱి గ్రంథము.

కాని విమర్శకుఁడు తన పద్ధతిచొప్పున విమర్శించును. విమర్శింపఁదగిన గ్రంథమును ఐతిహాసికదృష్టితోడను, నైతికదృష్టితోడను, సామాజిక దృష్టితోడను, సాహిత్యదృష్టితోడను నాతఁడు విమర్శింపఁగడఁగును. కాని యేదృష్టితో విమర్శించినను నాతని యుద్దేశ్యములలో ముఖ్య మయినది, ఆగ్రంథమును గ్రంథకర్తను నాతఁడు బాగుగ నెఱుఁగుట, తా నెఱుఁగు రీతిని నితరుల కెఱుఁగఁజేయుటయును. అట్లు విమర్శించు నపుడు తన యిచ్ఛానుసారముగ నిర్ణయమును జేయకుండుట తటస్థింప వచ్చును.

చదువువారి మనములందుమాత్రము ఈవిమర్శకుఁడు దెలిపిన విషయములు సత్యములా? సత్యదూరములా ? కళాదృష్టిచే నీగ్రంథము త్కృష్టమగునా ? గాదా ? యను ప్రశ్న లుద్బుద్ధమగుట స్వాభావికము. ఇట్టిప్రశ్న లుదయించునపు డుపేక్షసేయుట తటస్థింపదు. గ్రంథమును బఠించునపుడు జాగ్రతులమగుట కిట్టిప్రశ్నలకు సమాధానము నెఱుఁ గుటయు నత్యావశ్యకము. కళ నీతి మున్నగు దృష్టులచే విమర్శించుట వైజ్ఞానికవిషయములఁగూర్చి చేయుట శక్యముగాదు. సాహిత్యమునకు మనుజుని జీవితవిమర్శనముతో సంబంధముండును గాన నీతి, సమాజము, మున్నగువిషయముల గుణదోష వివేచనమును నావశ్యకమగును.

'భిన్నరుచిర్హిలోకః' అను సూక్తిచొప్పున చదువువారెల్లను నొక్కొక్కగ్రంథమును మంచిదిగనో, చెడ్డదిగనో చెప్పుదురు. ఒక కథ యొకని కత్యంతప్రీతిపాత్రమగుచో నాకథయే వేఱొకనికి వెగటును గల్గించును. ఒక నాటకము మనదృష్టికి నికృష్టముగాఁ దోఁచిన మఱికొంద ఱద్దానినే వేనోళ్లఁ బ్రశంసింతురు. మనమిత్రుఁ డెవరైన నొక పుస్తకము ను మనకుఁ జదువనిచ్చినచో బాగుగనున్నదా? యని మన మడుగుదుము. పిమ్మట నద్దానిని జదివి మన యభిప్రాయమును స్థిరపఱుచుకొందుము. ఒక పుస్తకము నొకసారి చదివి యొకయభిప్రాయమును స్థిరీకరించిన, రెండవమాఱు మూఁడవమాఱు నద్దానినే చదివినచో మొదటి యభి

ప్రాయములో మార్పు లేర్పడుటయుఁ దటస్థించును. అట్లు పెక్కుమారులే గ్రంథము నేని చదువుచు వచ్చినచో నప్పుడా గ్రంథముపై నిదమిత్థమని యభిప్రాయమును స్థిరపఱుచుటలో నసామర్థ్యమును, కాఠిన్యమును నేర్పడును. అట్టి కాఠిన్యమును దూరము సేయుటకే సిద్ధహస్తులయిన విమర్శకులసహాయ మపేక్షితము. మనము సారమయిన గ్రంథములనే చదివి, అసారమయిన గ్రంథములఁ జదువకయుండవలయునన్నచో మంచి విమర్శకుల యభిప్రాయములు మనకు మిక్కిలి యుపయోగకారులగును.

ఒక గ్రంథము చదువునపుడు తత్కర్తపయి మనకొకరీతి శ్రద్ధయు సానుభూతియు నుండవలయును. లేకున్న నా గ్రంథమునఁ గవిహృదయమును దెలిసికొనఁజాలము. శ్రద్ధాసానుభూతులను వదలి రాగద్వేషపూరితముగ విమర్శనము సాఁగించినచో విజ్ఞులయిన పండితు లట్టివిమర్శనముల నాదరింపరు. బాగుగ నాలోచించినచో రాగద్వేషపూరితమయిన విమర్శనము విమర్శనము కాదనియే చెప్పవచ్చును.

విమర్శకుఁడు, విపులవిషయములఁ దెలిసినవాఁడును బుద్ధిమంతుఁడును, గుణముల గ్రహించువాఁడును, పక్షపాతము లేనివాఁడును గావలయును. అట్టి గుణములు లేనప్పుడు గ్రంథముల విమర్శింపకుండుటయే యుత్తమము.

విమర్శకునకుఁ దాను విమర్శించు గ్రంథమును యథార్థస్వరూపమునఁ జూచుట ముఖ్యమయిన పని. చెడుభావనతోను, పక్షపాతదృష్టితోను సలుపు విమర్శనము నిందయో స్తుతియో యగును గాని విమర్శనము కాఁజాలదు. విమర్శకుఁడు విద్వాంసుఁడు కాకున్నచో గ్రంథమందలి గుణములఁ దెలియఁజాలఁడు. బుద్ధిమంతుఁడు గాకున్నచో నీరక్షీరవివేకము సేయఁజాలఁడు. పక్షపాతము లేనివాఁడు కాకున్నచో నాతని విమర్శనము వ్యర్థము గ్రహింపఁదగనిదియును నగును. పక్షపాత పూరితమయిన విమర్శనములు వెలువడినచో వానిని జూచి పాఠకులుత్తమ గ్రంథములు విడుచుటయు, నికృష్టగ్రంథములఁ జదువుటయుఁ దటస్థిం

మను. కావున విమర్శకుఁడు, పండితుఁడు బుద్ధిమంతుఁడు నగుటకంటె మిక్కిలి పక్షపాతరహితుఁడగుట యత్యావశ్యకము. ఇట్టివాని విమర్శన ముచే సాహిత్యమున కున్నతియుఁ బాఠకులకు లాభమును గలుగును.

విమర్శించుటకు సూక్ష్మవిషయముల గుర్తింపఁగలిగెడిబుద్ధివికాస ముండవలెను పెద్దపెద్ద విద్వాంసులు నొకప్పుడు విమర్శనమునసామాన్య జ్ఞానముగలవారు ప్రదర్శించునంతటి కౌశలము నైనఁ బ్రదర్శింపఁజాలరు. కాని పెక్కుగ్రంథములఁజదివి విమర్శింపఁగడఁగిన పండితులు విమర్శనా పద్ధతులకు బద్ధులై యుందురుగాన వారు నిష్పక్షపాతముగ విమర్శించి నచో నట్టిది పాఠకులకుమిక్కిలి జ్ఞానవర్ధకము కాఁగలదు. విమర్శన మంద ఱును జేయఁగల్గుదురు. కాని గ్రంథవిమర్శనము నొకకళయే. ఆకళ పట్టు వడుటకు నొకరీతి యోగ్యత, సహృదయత, శిక్షయును నావశ్యకములు. మఱియు విమర్శకునకుఁ దనయభిప్రాయముల నిస్సంకోచముగఁ బ్రక టించుటకు దనమనముపై నధికార మావశ్యకము. అట్టియధికారము లేకున్నచో విమర్శన మసమగ్రము నిరుపయోగమునగును.

ఒకపుస్తకమును విమర్శించునప్పుడు, అట్టివిషయములతోడ నేగూడిన యొకటి రెండు లేక యనేకములైన పుస్తకములను బరిశీలించి, వానితోఁ బ్రకృతగ్రంథమును బోల్చి చూచి విమర్శించుట యత్యుత్తమపద్ధతి. ఆపద్ధతిని నొక్కొక్క విషయమున వేర్వేఱురచయితలెట్లు తమతమ యభి ప్రాయముల వెల్లడించిరో యెఱుకపడును. ఎవని యభిరుచి యెట్టిదో, ఎవని శైలియెట్టిదో, ఎందేవిశేషములున్నవో, ఎందే దోసఁగులున్నవో మున్నగు సంశయములు విదితమగును. ఈరీతి విమర్శనములు విస్తృతముగ వెలువడుచుండినచో నప్పుడు మనసాహిత్యము కేవలము మనోరంజకము మాత్రమేగాక విజ్ఞానవర్ధకమగును. ఇట్టి విమర్శనములు మనకు భావము లందును రచనయందును నూతనమార్గములఁ బ్రదర్శించుచుఁ జేలవము లయిన విషయముల సాహిత్యమునఁ జొరనీయకుండఁ జేయఁగలవు,

ఈరీతిగ విమర్శనాత్మకమయిన గ్రంథము లధికముగ వెలువడి నచో వానిని జనువుల యత్యంతోపకారియగును. ఇట్టి సాహిత్యమేర్ప డినచో అనుచితవిమర్శన మార్గములు కట్టువడును. రాఁబోవు నైతిహా సికు లిట్టిగ్రంథముల కొక యితిహాసము నేర్పఱిచి సాహిత్యక్షేత్రమున వీనినొక శాఖలోఁ బరిగణించి యుపయోగము నందుదురు. సాహిత్యము పెంపొందవలయునన్నచో సిద్ధహస్తులయిన విమర్శకులు నిష్పక్షపాత మయిన దృష్టితో సత్యోత్తమరీతిని విమర్శించి గ్రంథములఁ బ్రకటించె దరుగాక.

# చోడవంశము.

## II

### ఏఱువ తొండయరాజు.

వడ్డాది శ్రీరామచంద్రమూర్తి, ఎమ్ ఏ

క్రీస్తుశకము పదుమూఁడు, పదునాల్గు పదునేనవ శతాబ్దములలో, ఆంధ్రదేశపు మాండలికవంశములలో సూర్యవంశపుఁ జోడులమనియు, కరికాలాన్వయులమనియుఁ జెప్పుకొనినట్టి చోడవంశ మొకటియనియు, ఆవంశములోని ఏఱువ తొండయరాజు శాసనముల ననుసరించి, అన్నదేవ చోడ, భక్తిరాజుల శాసనములలో నీయఁబడిన వంశావతార క్రమ మొక పురుషాంతరము ముందునకు జరిగినదనియు నా 'చోడవంశ'మను వ్యాస మున నిదివఱకు నిరూపించితిని[1].

పై చోడవంశమునకు మూల పురుషుఁడని యూహింపఁదగిన ఏఱువ తొండయరాజు భార్య మైలమదేవి యొక్క ద్రాక్షారామశాస నము[2] ననుసరించి ఏఱువ తొండయరాజు పశ్చిమచాళుక్యచక్రవర్తి ఆఱవ విక్రమాదిత్యుని సామంతుఁడని తెలియుచున్నది. ఆఱవవిక్రమాదిత్యుఁడు

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక. సంపుటము ౨౯ పుట ౭౯.

2. S. I. Inscriptions Vol. IV No. 1216.

త్రిభువనమల్లదేవబిరుదాంకితుఁడు. ఇతనిసామంతుఁడగు ఏఱువ తొండాయ, సమధిగతపంచమహాశబ్దమహామణ్డలేశ్వర, వీరమాహేశ్వర కోడూరు పురవరేశ్వర సూర్యవంశోద్భవకులతిలక కాస్యపకరికాలాన్వయనామాది సమస్తప్రశస్త్యసహిత శ్రీమన్మహామండలేశ్వర బిరుదాంచితుఁడు. మైలమదేవి శాసనము శక 1043 వ సంవత్సరమున (శ్రీమచ్చాలుక్య విక్రమసంవత్సరంబులు 46) చైత్రబహుళ అమావాస్య బుధవారము నాఁడు ద్రాక్షారామ భీమేశ్వరునికిఁబెట్టిన అఖండదీపము కొఱకీయఁ బడినది.

ఏఱువ తొండాయ మహామణ్డలేశ్వరుఁడని యుండుటచే శ్రీమ త్రిభువన మల్లదేవరకు ముఖ్యసేనానాయకులలో నొకఁడుగాఁ గన్పించుచున్నాఁడు. వేంగీసామ్రాజ్యమును వశపఱచుకొనదృఢసంకల్పముతో నున్న విక్రమాదిత్యునకు ఏఱువ తొండాయయొక్కయు, ఏఱువ భీముని యొక్కయు సహాయ మవసరమైయుండియుండును. మైలమదేవి శాసన మును ననుసరించి శకవర్షంబులు 1043 లో ఏఱువ తొండాయ ద్రాక్షారామలో నున్నట్లు స్పష్టపడుచున్నది. ఆసమయమునకే కోడూరులో చాళుక్యతైలపదేవుఁ డున్నట్లు శాసనాధార ముండుటచేతను* ఏఱువ తొండాయ కుమారుఁడుగా నిరూపింపఁబడిన ఏఱువ భీముని పరాక్రమ ముద్ఘాటింపఁబడిన చాటుపద్యములో ఏఱువ భీముఁడు

ఉ. పన్ని తురంగమంబునకుఁ బక్కెరవెట్టినవార్త చారుచే
విన్న భయంబునం గలఁగి వేసట నాఁటనె చక్రకోట్టముల్
మన్నియ పట్టణంబులును మక్కెన వేంగి కళింగలాదిగా
నిన్నియు నొక్క పెట్టగసి నేఱువ భీమనృపాలుధాటికిన్.

అని యుండుటచేతను, ఏఱువ తొండాయ నాఱవ విక్రమాదిత్యునికి వేంగిరాజ్యమును జయించుటకు ఏఱువ భీమునితోకూడ పోయి శక

* Telingana Inscriptions.
చాళుక్యశాసనములు 33

1043 నాఁటికి ద్రాక్షారామమునకు పోయెనని యూహింపవలనుపడు చున్నది.

వేఱొక విషయమువలనఁగూడ ఏఱువతోండ్రాయ తన ప్రభుసేవలో నిమగ్నుఁడై, విక్రమాదిత్యునిపై నెదురుతిరిగి స్వతంత్రింపఁ బూనిన సామంతులను శిక్షించుచుఁ దన ప్రాణము పోఁగొట్టుకొనినట్లు మనమూ హింపవచ్చును. వర్ధమానపురాధీశ్వరుఁడైన గోన గన్నయరడ్డిగారి రాజ్యరక్షకులైన విఠ్ఠలనాథభూనాథుఁడు, ఆదవని, తుంబుళము, మానువ మొదలగు దుర్గములు సాధించి శక 1217లో రాయచూరుదుర్గ నిర్మాణము చేయుసందర్భమున నిచ్చిన శాసనములో గోన గన్నయరడ్డియొక్క బిరుదావళులలో "ఏఱువతోండ్ర గోధూమఘట్టన ఘరట్ట" అనిగలదు. రాయచూరు శాసనము ననుసరించి శక 1217 నాఁటికింకను గోన గన్నయ జీవించియున్నట్లుగపడుచున్నది. అందాతఁడు కాకతీయకటకసన్నాహుఁ డనియు, చోళజగజాళ వీరకాంతికాఱుఁడనియు, కోసగిమైలి తలగొండు గండఁడనియు, ఉప్పలసోముని తలగొండుగండఁడనియు, పందిభూపాలుని తలగొండుగండఁడనియు, అక్కినాయకుని తలగొండుగండనియు, కందూరి కేశినాయనితలగొండుగండఁడనియు, ఆపాకభీమనిర్ధూమధాముండనియు, "ఏఱువతోండగోధూమఘట్టన ఘరట్టుఁడనియు, కోటపెర్మాడిరాయకంఠాభరణచూఱకాఱుండనియు, చోడోదయ పట్టసూత్రతురంగాపహారుండనియు, రుద్రదేవ దక్షిణభుజదండుఁడనియు, మొదలుగాఁగల యనేక బిరుదావళులతో నభివర్ణింపఁబడెను.

ఈ గోన గన్నారెడ్డి రంగనాథరామాయణమును రచించిన గోన బుద్ధారెడ్డి తండ్రియగునేమో కొంచెము విచారింపవలసి యున్నది. ఉత్తరరామాయణమును ద్విపదగా రచియించిన కాచవిభుఁడును, విన విఠ్ఠలభూపతియును తమగ్రంథములలోఁదమతాత గోన కోట గన్నక్షితిం

4 ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక సంపుట VI పుట 6.

ప్రముఁడనియు, తండ్రిబుద్ధరాజనియు వ్రాసియున్నారు. రాయచూరుశాసన మందలి విఠ్ఠలనాథుఁడును, ఉత్తరరామాయణగ్రంథకర్తయు నొకఁడే యని యూహించుకొనినచో గోన గన్నయరడ్డియు, గోన కోటగన్నక్షితీంద్రుఁడును నొకరేయని భావింపవచ్చును.

గోన గన్నారెడ్డి బిరుదావళులలో 'కాకతీయ కటకసన్నాహుఁ' డనియు, 'రుద్రదేవ దక్షిణభుజదండుఁ' డనియు నుండుటచేత నతఁడు కాకతీయుల దండనాథులలో నొకఁడనియు, రుద్రునకో, రుద్రమకో, ప్రతాపరుద్రునకో ముఖ్యసేనానాయకుఁడనియు, తేటపడుచున్నది. రాయచూరుశాసనము క్రీ॥ శ॥ 1295 నాఁటిదగుటచేతను, ఆనాఁటికింకను గన్నయరడ్డి బ్రతికియున్నట్లాశాసనమువలననే తెలియుచుండుటచేతను, క్రీ॥ శ॥ 1195 లో మరణించిన కాకతిరుద్రునకు 'దక్షిణభుజదండుఁ'డై యుండఁజాలఁడు. కాన నీతఁడు రుద్రమదేవికో, ప్రతాపరుద్రునకో దండనాయకుఁడై యుండియుండును.

ఇతని బిరుదావళులలో నొకటియగు 'ఏఱువతొండ గోధూమఘట్టన ఘరట్ట' అనుదాని ననుసరించి మన కీతఁడు చోళవంశీయుఁడగు ఏఱువతొండ్రయను జయించినట్లు తెలియుచున్నది. కాని యీబిరుదము నీతని పూర్వులదికాని యీతనిది కాదు. ఏలయన క్రీ॥ శ॥ 1121 లో నున్న ఏఱువతొండ్రయను 174 సంవత్సరముల వెనుక 1295 లో నున్న గోన గన్నయ్య జయించుట సంభవముకాదు. కాకతిరుద్రుని కాలముననో రెండవప్రోలుని కాలముననో సామంతుఁడుగానుండియుండిన గన్నయ్య తండ్రితాతలలో నొకరు పశ్చిమచాళుక్య చక్రవర్తియధికారమును వేంగిలో స్థాపింపఁబూనిన ఏఱువతొండ్రయను జయించియుండురు. లేనిచో, గోనగన్నయ బిరుదావళులలో ఏఱువతొండ గోధూమఘట్టన ఘరట్టయని యుండియుండుట, సంభవింపదు. ఏఱువతొండని మరణము, ఆఱవ విక్రమాదిత్యుని మరణానంతర మాంధ్రదేశములోజరిగిన సామంతమాండలికుల స్వతంత్రరాజ్యస్థాపనా ప్రయత్నఫలితమై యుండవలెను.

# దేసూరి రెడ్లు.

నేలటూరు వెంకటరమణయ్య - మద్రాసు యూనివర్సిటి.



ఈక్రింది పేసమూలిక మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని మెకంజీగ్రంథావళియందలి 15-4-3 వ నంబరుగల గ్రంథమునుండి సంగ్రహింపఁబడినది. ఇది దేసూరిరెడ్ల పరాక్రమమును దెల్పుచున్నది. శ్రీవిష్ణుదేవుని పాదమునందుఁబుట్టి గంగకు సైదోడని పేరొందిన పంటవంశమునఁ బేఁట యెల్లన్న యను నాతఁడు జనించెను. అతనికి అయ్యన్న, కృష్ణప్ప, వీరప్ప, నాగన్న, గంగన్న, రంగప్పలను నార్గురు పుత్రులు గల్గిరి. వీరిని వీరిమేనమామయగు దేవారెడ్డి చెన్నారెడ్డి పెంచెను. ఈ సహోదరులలో నాగన్న బహుశూరుఁడు. అతఁడు చెంజిపురిబయల్ల జరిగినయుద్ధమున శత్రువులతోఁబోరి వీరస్వర్గమును చూఱగొనెను. గంగన్న పైవచ్చు విద్వేషులకు మాఱొడ్డి పోడిచి జయముఁగొనెను. కద సహోదరులనఁదగు గంగన్న రంగప్పలు దనకు భక్తితో సేవఁజేయుచుండఁగాఁ జెంజికి హృదయశల్యమునుబోలి దేసూరికోటయందు, కృష్ణప్ప రాజ్యము సేయుచుండెను.

అంతట ఖాన్‌ఖానుఁ డాగ్రహపరవశుఁడై నవాబుపై దండెత్తిపోయి గండికోటను ముట్టడించెను. అతనికోప మంతట శాంతి నొందదాయెను. 'అక్కడిఘడికోటలా లాక్రమింపుము' అని చెంజిదుర్గాధిపతియగు సంబారుఖానునిపేర తాకీదంపెను. ఆతాకీదును జనువుకొని యంబారుఖానుఁడు దనక్రిందుసర్దారులగు ముర్తాజల్లి, బాలోజీమహిపతిరావు, బాజఖాను, మహమ్మదుఖాను, కైరాతఖాను మున్నగువారినిఁ బిలిచి గడిసీమ లన్నిటినిఁ గట్టుఁడు' అని సెలవు పెట్టెను.

వారును వెంటనే సేనాసమన్వితులయి బయలువెడలి మొదట మటముకోట నాక్రమించి యచట క్రూరుఁడును నిర్భయుఁడును నగు దుర్గోజిపండితుని తాఁకె ముంచిరి. అచటినుండి బయలుదేరి యలకోట తెల్నాటికోటలను ముట్టడించి స్వైవసముఁజేసికొని యందు దాదార రానను (?) తాఁకి ముంచి కంచి కరుగుడిపాళెము మొదలయిన స్థలముల నాక్రమింప నుపక్రమించి యచట తమసేనావాహినిఁ ద్రిప్పిరి. ముకాశ్లియును, బాలోజయకోతజిరాయఁడును అయ్యవారిపురము పేఁటలు గాల్చివేసి యచటినుండి కంచిపై నెత్తి జగడమిచ్చి ప్రజలను బాఱఁదోలిరి. రాత్రివచ్చి కంచిని ముట్టడివేసిరి.

అప్పుడు కృష్ణప్పరెడ్డి తన్నేలిన దామెర వెంకటప్పనాయని విభవము నుద్ధరించుటకు నడుముకట్టి, దామెర అంకప్పనాయని యనుమతిఁగొని శత్రువుల నిర్మూలింపఁదొడఁగెను. మొదటఁ దనయునికిపట్టయిన దేసూరికోటను గాపాడుటకై తన పినతండ్రియైన పెదకృష్ణారెడ్డిని, అల్లుఁడగు దేవారెడ్డి, పెద్దన మొదలగు శూరుల నందునిల్పెను. సైన్యముతో బయలువెడలి మధురాంతకముపై కూచిచేసి జయముఁగొనెను. తరువాత మటముకోటపై దండయాత్రసాగించి మహాఘోరయుద్ధమున శత్రుసంహారముగావించి, దుర్గోజిని వధించెను. అతని వాలుడమాలను గుఱ్ఱములు మొదలగు వస్తువ్రాతమంతయుఁ జూఱఁగొని చెంజిపైనడచి యామార్గమును ముట్టడించెను. త్రీస్నపురము మొదలైన పేఁటలఁగాల్చెను. చెంజి లగ్గలెక్కి సిఖులఁజొచ్చి యచ్చటి గుఱ్ఱములను విడిపించెను. అంబారుఖానుఁడు దీనుఁడై చేయునదిలేక యూరకయుండెను. తక్కిన సర్దారులు పాఱిపోయిరి.

దామెర వెంకటప్ప కృష్ణారెడ్డి పరాక్రమమును మెచ్చుకొని యాతని తమ్ముఁడగు రంగప్పను వెంటఁబెట్టుకొని నబాబుకడ కేఁగి యాతనికిఁ గృష్ణారెడ్డియొక్క విజయముల నెఱింగించెను. నవాబు సంతసించి పెక్కు బహుమానములను రంగప్పచే నిచ్చి పంపెను.

ఇది యీ సీసమాలికయందలి యితివృత్తము. ఇందు వర్ణింపఁబడిన యుద్ధ మెచ్చట నేకాలమున నడిచెనో, ఇందు పేర్కొనఁబడిన స్థలము లెచ్చటివో, పురుషులెవ్వరో, వారేకారణమునఁ బోట్లాడిరో కనుఁగొన వలసి యున్నది.

## యుద్ధకారణము.

క్రీ. శ ౧౫౬౫ సంవత్సరముతో విజయనగర సామ్రాజ్య మంతరించినది. రాయరాజ్యమును తురకలు పంచుకొనిరి. తూర్పుభాగమును గోల్కొండసుల్తాను స్వాధీనపఱచుకొనెను. పశ్చిమభాగమును బిజాపుర సుల్తాను స్వైవసముఁ గావించుకొనెను. ఈ రెండు తురక రాజ్యములకును నడిమియెల్ల దక్షిణమున చదరంగపట్టణమునుండి యుత్తరమున గుంటూరువఱకును వ్యాపించియుండెను. ఇప్పటి గుంటూరు కడప నెల్లూరు చిత్తూరు చెంగల్పట్టు జిల్లాలును, కర్నూలుజిల్లాలోని నంది యాలపట్టణమునకుఁ బూర్వభాగమునందలి తాలూకాలును అనంతపురము జిల్లా పూర్వభాగమును ఉత్తర ఆర్కాడు జిల్లాలోని విశేష భాగమును గోల్కొండ సుల్తానుకుఁ జెల్లుచుండెను. దీనికిఁ బశ్చిమదక్షిణములనున్న రాజ్యమంతయును బిజాపురపు రాజ్యములోనికి నణఁకువ వైయుండెను. ఇట్లీ తురకరాజులు రాయరాజ్యమును బంచుకొన్నను పొందుకుదరక నొండొరులతో వారు సర్వదా పోట్లాడుచుండిరి. తత్కారణమున కర్ణాటకమున బిజాపుర గోల్కొండ పాదుశాహుల ప్రతినిధులెల్లప్పుడును గయ్యమునకుఁ గాలుద్రవ్వుచుండిరి. ఈసీసమాలిక యందు వర్ణింపఁబడిన యుద్ధము పై కారణమువల్లఁ బొడమినదే.

ఇందు పేర్కొనఁబడిన నబాబు ఖాన్‌ఖానులు గోల్కొండ బిజాపుర పాచ్చాపుల ప్రతినిధులు. నవాబని చెప్పఁబడినాతఁడు సుప్రసిద్ధుఁడైన మీర్‌జుమ్లా. అతఁడు గోల్కొండసుల్తానుగారి ప్రతినిధి. అతని సంపూర్ణనామము నబాబు సయ్యదు హాసన్ మహమ్మదు మీర్‌జుమ్లా.

ఖాన్‌ఖానుఁడు విజాపురమువారి ప్రతినిధి ఖాన్‌ఖాన నునది యాతని బిరుదు. ఖాఁమహమ్మ దాతని నామధేయము. ఇరువురును బ్రచండ సేనానులు. కర్ణాటకమును యావత్తును దన స్వాధీనమునందుంచుకొన వలయునను నాశ యిరువురకును గలదు. గోల్కొండ విజాపురసుల్తాను లొండొరులతోఁ గావించుకొన్న యొడంబడికప్రకారము గండికోట దుర్గమునకుఁబశ్చిమమునను్న రాజ్యము విజాపురమునకుఁ జేరవలసియున్నను, ఆసంధి షరతులను సరకుఁగొనక మీర్‌జుమ్లా గుత్తిదుర్గము నాక్రమించుకొనెను. ఖాఁఖానుఁడా జోరావరిని సహింపక గండికోటపై నెత్తిపోయి ముట్టడివేసెను. అంతేకాదు గోలకొండపాదుశాహాగారికి దక్షిణదేశమందుఁ జెల్లుచుండిన దేశమును దుర్గములను నాక్రమింపవలసినదని చెంజిదుర్గాధ్యక్షుఁడగు నంబారుఖానునకు ఉత్తరువంపెను. అంబారుఖానుఁడు ఖాఁఖానునాజ్ఞ మేరకుఁ దనక్రింది సర్దారులను గూర్చుకొని గోలకొండవారి దుర్గములపై నెత్తిచని మటముకోట మొదలగువానిని స్వాధీనపఱచుకొనెను.

గోలకొండ రాజ్యమప్పుడు చెంజిదుర్గప్రాంతమువఱకు వ్యాపించియుండెను. ఇచ్చట ననేకులు హిందూనాయకులును పాళెగాండ్రును సుల్తానునకు లొంగి కప్పముకట్టుచుఁ బెక్కుసీమలను దుర్గములను నేలుచుండిరి. వెంకటగిరి ముఖాసాదారులగు వెలుగోటివారును కాళహస్తి జాగీరుదారులగు దామెరలవారును చెంజి పరిసరప్రదేశములపైఁ బ్రభుత్వము నల్పుచుండిరి. మధురాంతకము, కరుగుడిపాళెములు వెలుగోటి యాచమనాయునికిని కంచి, పూనమల్లి, దేసూరు, మటము మొదలయిన కోటలు దామెరల వెంకటప్పనాయునికిని జెందియుండెను. అతని యనుచరుఁడగు పేట కృష్ణారెడ్డి దేసూరి కోట నేలుచుండెను.

ఖాఁ ఖానుని యాజ్ఞ మేరకు నంబారుఖానుఁడును నతని సర్దారులును మొదట మటముకోట నాక్రమించిరి. ఇది చెంజిదుర్గసమీపమున

నిప్పటి యుత్తరఆర్కాటుజిల్లాలోనికి నఱకువరైన వందవాసితాలూకా యందున్నది. తత్సమీపమున నున్న కొన్ని కోటలను వశపఱచుకొని చెంగల్పట్టుజిల్లాయం దంతర్గతమైన కరుంగుడిపాళెము, కంచి మొదలగు స్థలములను గొనుటకై తూర్పుముఖముగ నడచిరి. మార్గమున నయ్యావారిపురమును గాల్చిరి. ఇది యిప్పటి కాంచీపురము తాలూకాలోని యయ్యంపేట యగునేమో? అచ్చటి ప్రజలు తాళజాలక దేశత్యాగము చేసిరి. కడపట కంచిపైఁ బడిరి. ఇంతవఱకును వారి కపజయము లేదు. కాని యకస్మాత్తుగ వెనుకనుండి వారికిఁ బిడుగువంటిదెబ్బతగిలెను. అంతట వారచటినుండి మరలవలసివచ్చెను.

చెంజిప్రాంతమున పైఁ బేర్కొనఁబడిన మటముకోట కనతిదూరమున దేసూరుదుర్గము గలదు. ఇది బహుబలిష్ఠమైనది. దీనికి 'చెంజిహృదయభీకర' మను బిరుదు గలదు. దేసూరిప్రభువగు పేట కృష్ణారెడ్డి, దామెరల వెంకటప్పనాయని కాప్తానుచరుఁడు. తనదేశముపైఁబడి యంబారుఖానునిదండు నాశనము సేయుటఁగని కోపించి వెంకటప్పనాయని సోదరుఁడగు నంకప్పనాయకుఁడు (ఇతఁడే ఉషాపరిణయకావ్యకర్త)కృష్ణారెడ్డిని బురికొల్పి బిజాపురివారి భూములను గోటలను బాడుసేయుమని యాజ్ఞనిచ్చెను. అతఁడు మొదట మటముకోటను గొని యచటి కాఁపున్న బిజాపురపుసర్దారుఁడగు దుర్గోజిని సంహరించి యటువెనుక మధురాంతకముపై నడచెను. కడపట చెంజిని ముట్టడించి పేటలను గాల్చి కోటలగ్గలకెక్కి చూఱఁగొనెను.

ఈ సీసమాలికయందు వర్ణింపఁబడిన విషయము మఱియే గ్రంథమునందును గానరాదు. కృష్ణారెడ్డిని సంబోధించు నీ సీసమాలిక యాతనికాలముననె రచియింపఁబడెననుట నిశ్చయము. కావున నిది సమకాలికగ్రంథము. చరిత్రరచయితలకు నిది యత్యంతోపయుక్తమగుచున్నది.

## సీసమాలిక.

సీ. శ్రీకృష్ణదేవుని శ్రీపాదమునఁబుట్టి
  గంగకు సైదోడసంగఁ బ్రబలు
పంట వంశాగ్రణి పరమపావనుఁడైన
  పేటయల్లన్నకుఁ బ్రియతనూజు
లయ్యన్న వీరుకు నలఘుఁడౌ పేరప
  నాగన గంగభూనాయకుండు
రంగభూపాలుండు రణవీరగాండివి
  సౌందర్యవంతులు సరసనిధులు
కలిగితి రయ్యారె! ఘనబలాఢ్యులు మీరు
  వసుధ నాగ్గపు చక్రవర్తు లనఁగ
మిముఁ బెంచె హస్తాన మీమేనమామ దే
  వారెడ్డి చెన్నభూవరుఁడు వాసి
పన్నగా మిము రాయ మన్నీలు దొరలును
  రాజులు గొనియాడ తేజముగను
సీసోదరులలోన నెఱమోఘ నాగన్న
  రణవిక్రమార్క వీరప్రతాప
శాలి నిశ్చలవృత్తి శాత్రవబలములు
  దలఁక పైకొని కౌతుతండములను *
గవయు తద్వైరి సంఘము నందఱిని దన
  కరఖడ్గధారచే నఱకి నఱకి  ౧౦
చెంజపురిబయళ్ల సింహాలంఘనవృత్తి
  దేవతల్ దెచ్చిన దివ్యరథము
రహి నెక్కి చేరె వీరస్వర్గ మచ్చోట
  తదనంతరంబున హమలు మొఱసి
తక్కినరిపుల నీతమ్ముఁడు గంగన్న
  నిలిచి ఖడ్గాఖడ్గి నీటణంగ

---

* బలములు లయశత్రు కౌతుతంధదములను 15-4-3 P 113 l 19.

క్రమించెను రణఘాత లంచితంబుగఁ దన
మేనికి భూషణ మిశ్ర మమర
నీ కెంతయును ముద్దు నీటుగాఁ జూపుచు
పౌరుషఖ్యాతిచే వరిఢవిల్లు
గంగన్న రంగప్ప కదనహంవీరులు
భక్తితో నినుఁగొల్వఁ బ్రౌఢి మెఱసి *
శ్రీమంతుఁడై నట్టి హేమాద్రిదాన చిం
తామణి భోగసుత్రాముఁ డబ్ధి
గాంభీర్యగుణశాలి కనకకర్పూరవ
సంతరాయఁడు సత్యసంధుఁ డుచితుఁ
డంగనాజనమోహనాకారరూపపాం
చాలుఁడు రాజవేశ్యాభుజంగు
జగనొబ్బ గండనిశ్చలవీరనారాయ
ణాంకసద్బిరుదాంకుఁ డమితకీర్తి ౨౦
రేఖాప్రతాపధురీణుండు పంటవం
శాగ్రణి నిశ్శంకుఁ డర్జునాంశఁ
జెలువుగా విలసిల్లెఁ జెంజికుర్గానకు
హృదయభీకర మహాబిరుదమైన
దేసూరికోటలో వాసివన్నె ఘటిల్ల
బంధువుల్ దొరలును బరిజనంబు
తోనుండె నన వహనవేంద్రులు మెచ్చి
రయ్యారె! సకల దిగంతరముల
అంతలో ఖాన్ ఖానుఁ డాగ్రహించి నబాబు
మీఁద దండెత్తి హామికను గండి
కోట ముట్టడివేసికొని రోషచిత్తుఁడై
యక్కడి ఘడికోట లాక్రమించు

---

* నెంతనీటు మెరయ ప్రౌఢి మెరసి.

మని కాగితం బంప నంబారుఖానుండు
　　అది చదువుక [తాను] హానులు మెఱసి
బల్లిదుండగు మురార్జల్లిని బాలోజి
　　యహిపతిరాయ శూరాగ్రగణ్యు
బాజఖానుని [బల] వంతు మహమ్మద
　　రఖ్ఖాను మత్తు కైరాతఖానుఁ *
బేరు పేరులఁ బిల్చి.........
　　గడిసీమ లన్నియుఁ గట్టి డనుచు　30
సెలవుపెట్టినవారు బలువిడి నేతెంచి
　　యతివేగ మటముకో టాక్రమించి
క్రూరుఁడై నట్టి దుర్గోజి పండితులకు
　　నిర్భయు నచట శాసెంబు వెట్టి
అలకోట తెల్నాటికో? టాదిగాఁగల
　　కోటలన్నియుఁ గట్టుకొని.........
ముట్టడిసేయను మొనగాండ్లఁ గైచేసి
　　దాదారరానను ధాణె ముంచి
కంచి చెంగల్పట్టు కరుగుడిపాలె
　　............మాక్రమిఁంపఁదలఁచి
అలమురార్జల్లియు నత్యుగ్రుఁ† బాలోజి
　　యహిపతిరాయఁడు నయ్యహారి
పురము పేటలు గాల్చి పొలుపుగాఁ గంచిపై
　　జగడమిచ్చిరి ప్రజల్ పగిలిపాఱ
అంతట కంచి రే నెంతయు ముట్టడి
　　దా కినచో నీవు డాక మెఱసి
నిను సంతరించిన నృపమణి దామెర
　　వెంకటేంద్రుని రాజ్యవిభవమెల్ల

---

* బాజఖానుని వంతుడైన మహమ్మదరఖాను దుర్మత్తుడైన కైరాతఖాను.　† ఉగ్రోగ్రు.

నుద్ధరింపఁదలంచి యుద్ధసన్నాహమై
దామెర యంకభూధవునియాన[1] ౪౦
పినతండ్రియైనట్టి పెదకృష్ణవిభుని నీ
యఁల్లు... ... ... ... ...
శూరుఁడైనట్టి దేవారెడ్డి పెద్దన
(ధీరులౌ) దొరల దేసూర నునిచి[2]
మధురాంతకపుఁగోత్ర మన్నెసింహంబుపైఁ
(గూడి సేయించి) గగ్గోలుగాను
అళ్ళుబెళ్ళును లేక యత్యంతఘోరమై
బహువాద్యఘోషముల్ పరిఢవిల్ల
బట్లు నీబిరుదు లేర్పాటుగాఁ బొగడంగ
కటికవారలు చేరి కలటు (?) సేయ
నెఱయోధులగు రెడ్డిదొరల రాజుల మంచి
కైజీతపొంటరికాండ్ల వీర
భటుల హెచ్చైన తుపాకుల చేరువ[3]
కాండ్లఁ గూర్చుక భయంకరనిరూఢిఁ
గదిసి పురంబుల గాల్చునాఁ డుగ్రుని
ధాకతో మటము కోటకును జేరి
కదిసి లగ్గల కెక్కి కరఖడ్గధార చే
బిరుసు రాహుత్తుల పించ మార్చి
గబ్బిగరీబుల కంఠనాళంబులఁ
గటికటుక్కునఁ దెగ నటికి నటికి ౫౦

1. అపుడు దామర యక్క భూవిభు వసుమతిగైకొని
2. అత్యంతరణశూరుడైన దేవారెడ్డి
పెద్దనదొరల దేసూరనునిచి
3. భటుల హెచ్చైనట్టిగుఱి తుపాకులచెరువ

నిండుసిలేదార్ల బొండుగ దెగటార్చి
　　నీచమైన రిపుశతాణీలఁ గొట్టి[1]
కపటగకేబులగర్వంబు లణఁగించి
　　వీఁక మరాటీల పేరణాచి
యబిసికనీజుల[2] యంగము లెగటార్చి
　　దళకర్త సుగ్గొఱగళము ద్రుంచి
నెత్తురు మాంసంబు మెత్తని క్రొవ్వును
　　రణభూతభేతాళరాజి కపుడు
విందు గావించ దేసూరి! వీరలక్ష్మిని జెంది
　　దయవచ్చి ధర్మదారయును వేగఁ
బట్టించి యంతటఁ బటువిజృంభణకేళిఁ
　　దనరుచుఁ గీర్తిప్రతాప మెలయ[3]
నతని డాలుడమాము లతని తేజీలను
　　నతని వస్త్రవ్రాత మంత (వట్టుఁ)
గైకొని చెంజిలోఁగల పేఁట లన్నియు
　　లక్ష్మిపురము మొదలయిన వన్ని
గాల్పించి చెంజి లగ్గల కెక్కవలెనని
　　పొడవైన నిచ్చెనల్ పొంకపఱచి
బలుఫిరంగీబండ్లు బాణాలమోపులు
　　మందుతిత్తులు చాల నందగించి　　౬౦
అల చెంజిలోపలఁగల మల్కిమొల్కల
　　రకమైన ప్రజల హేరాళముగను
ముక్కులు గోయింప నుక్కుచిప్పలు చాల
　　చేయించి నీపరిసేవకులను
విడిచి చెంజీపురి వీథివీథుల ... ...
　　రాతివాకిట[4] మేల్గురాల హెచ్చు
విడిపించె నాతతహృద్వ్యధి ... ...
　　దీనుఁడై యంబారుఖానుఁ డుండె

---

1. రాతులనుగొట్టి　2. కణోజేల.　3. ప్రతాపంబు వెలయ.　4. వాకిట.

అంతట బాలోజియహిపతిరాయఁడు
యలముర్జాలి మొదలయిన దొడ్డ
సరదారులందఱు ... ... ... ...
... ... ... ... ... ... ... ... ...
అదె వచ్చె పేఁట కృష్ణార్జునుం డంచును
వెఱచువారును పూరిఁ గఱచువారు
నై విరిగి (గ్రి ?) పోయిరి యలసరదారులు
నీయుద్ధ మిలను వర్ణింపఁ దరమె
యీవార్త విని నిను నేలు దామెర వెంక
టోర్వీవరుఁడు ... ...
... ... ... ... ... ... ... ...
... ... ... నీకను జన్మఁడెన ౨౦
... ... ... ... ... ... ... ...
... ... రంగప్పఁదోడ్కొని రాజసమున
(ప్రొడగని పించినీపడసిన గెల్పునా
యనివాడ దెల్పఁగా విని నబాబు
శాబాసహో ! (నీవు) శౌర్యం బనుచు మెచ్చి
పంపె (నునీకు) వైభవముగాను
జోకతో నిచ్చె నేలొక్కకసుతాలీలు
చౌకట్లు చాల్నగ ల్సమ్మదమున) ౨౪
సీ. ... ... ...దారడ్డి మన్నిలలోన
కదనహంవీర పేఁరెల్ల ఘనుకుమార
కృష్ణభూపాలచంద్ర ! సత్కీర్తిసాంద్ర !
ధరణి వర్ధిల్లు మాచంద్రతారకముగ. ౨౫

కుండలీకరణము చేయఁబడిన పంక్తులు సంస్కరింపఁబడినవి. అవి మాతృకయందిట్లు గాన్పించుచున్నవి.

"బాబుపొడగనిపించి నీవుగెల్చిన గెల్పులు నాయని వాడుదెల్పగావిని నబాబు జోకతోనిచ్చె మేలొక్క తెలమి శాబాసహో శౌర్యంబయ్యారె యనుచు మెచ్చిసంపె వైభవముగాను సుతాలీలు చౌకటులు చాల్నగలు చనామ్కనముగను"

# శ్రీ
# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**


సంపుటము ౩౦. { వృష. ఆశ్వయుజ—ఫాల్గునములు. } సంచిక ౪—౫—౬.





కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

1942 అక్టోబరు-మార్చి.

# విషయసూచిక.



ఇట సత్కావ్యగుణవివరణ ముచితము. నాటకరచన యాద్యంతము స్వభావసిద్ధముగ నుండనగును. అయ్యది ప్రకృతి ననుసరించియే యుండవలయు. అపుడే ప్రకృతికిఁ బ్రతిబింబమై ప్రకాశించును. ఈవిషయమునే Shakespeare మహాకవి మిక్కిలి చక్కఁగ వక్కాణించె. “నాటక మనఁగఁ బ్రకృతికి నద్దము పట్టినటు లుండఁదగు” అని. దీనికిఁ బ్రబలమైన భావనాశక్తి మెండుగ నుండవలయు, ఈయత్యద్భుతమైన భావనాశక్తి ప్రభావమువలన నాటక కళాకౌశలము భాసిల్లఁగలదు. భావప్రకటనము విస్పష్టముగ నుండనొప్పు. పాత్రౌచిత్యము బాగుగఁ బాటింపఁబడఁదగు. ఒకపాత్రము చెప్పునదియుఁ జేయునదియు మొదటినుండి తుదివఱకు నాస్వభావమునకుఁ దగినట్లుగనే యెచ్చటను దప్పకుండ నుండనగు. జగమున జనుల జీవితములలో నిజముగ నెటుల జరుగుచుండునో యటులనే యిసుమంతయు వ్యత్యాసము లేక సత్కవులు చిత్రింతురు. ఒకవ్యక్తి వేఱువేఱుసందర్భములఁ బ్రవర్తించురీతియు నింకొకవ్యక్తి యాసందర్భములయందే వేఱొకవిధముగఁ బ్రవర్తించు తీరును విదిత మగును. ఇట్టి చిత్రవిచిత్రములు జాగరూకతతో మనోరంజకముగ రచింపఁబడు. దీనిని బాగుగ గ్రహించినచో రాఁగలకీడును నివారించుకొనునపుడును, సంభవించినదానిని బోఁగొట్టుకొనునపుడును మనము మెలఁకువతో మెలఁగఁ గలము. ఇటులనే మనకు శ్రేయోదాయకము లగువానిని బొందుటకును, ఉన్నవానిని నిలుపుకొనుటకును ననువగు.

నాటకములు నీతిదాయకములై విలసిల్లవలె. ప్రపంచమునందు సన్మార్గులు దుర్మార్గులు నున్నటులనే, నాటకములలో సత్పాత్రములు దుష్పాత్రములు చిత్రింపక తప్పదు. లేనిచో స్వభావవిరుద్ధమగునుగదా? ఇది యిటు లుండవలసినను, మొత్తముమీఁదమాత్రము కవి తన యామోదము నీతివైపునఁ జూపి దానినే బోధింపఁ దగును.

నీతిబాహ్యములు లగుకావ్యములు గర్హ్యములు. నీతిప్రతిపాదకము లగుగ్రంథములే శ్రేయోదాయకములు. ఏతాదృశదృశ్యప్రబంధములు, రమణీయములై, మనోరంజకములై, మహోపకారకములై రాజిల్లు. వీనినే గుణగ్రహణపారీణులైన విమర్శకోత్తములు మెత్తురు. ఇట్టిమహాగ్రంథములు మనమాతృభాషయైన యాంధ్రమునందుఁ గలవని చెప్పఁగలిగినందులకు మిగుల సంతసించుచున్నాను. ఇవి మన సంస్కృత మహాకవులైన కాళిదాసు, శూద్రకుఁడు, భవభూతి, భాసుఁడు మొదలగువారిగ్రంథముల కెంతమాత్రము వెనుదీయునవి కావు. కొన్నివిధముల వీనికన్న మిన్నలుగ నెన్నఁదగును. ఈమనతెలుఁగునాటకములు గాని, సంస్కృతనాటకములుగాని పాశ్చాత్యదేశపు మహాకవులైన Shakespeare, Molliere, Aristophanes, Aeschylus మొదలగువారినాటకముల కెంతమాత్రము తీసిపోవని చెప్పసాహసించుచున్నాను.

రసవత్తరములగు నిట్టియుత్తమోత్తమకావ్యములు స్వకపోలకల్పితములుగ నుండుట మంచిది. ఇంతియేకాదు, పైనివచింపఁబడినగీర్వాణకవివరేణ్యులయొక్కయుఁ బాశ్చాత్యకవివతంసులయొక్కయు గ్రంథముల నాంధ్రీకరించి ప్రదర్శింపనగు. అది యెందులకన ? దీనివలనఁగూడ మనకు మేలు గలుగును. అనేకదేశములయం దనాదిగ నాటకరచనలు ప్రదర్శనములు మొదటినుండియు నెందఱెందఱో దర్శించి యానందము నొందుచున్నారు. ముఖ్యాంశములలో మానవస్వభావ మించుమించుగ నొకటే యగుటంజేసి దేశకాలభేదము లంతగ నుండవు. అల్పవిషయముల నొకించుక యుండవచ్చును. ఏకాలమందైన, నేదేశమందైన నున్న జను లంద ఱొకేజగజ్జనకునిసంతతివా రగుటంజేసి ప్రపంచమంతటను మానవస్వభావ మొకటిగనే యుండుటయం దాశ్చర్యమేమి ? కావున వారికావ్యములు తెనుఁగున మనకుఁ గావలసినవే.

నాటకములు దృశ్యప్రబంధములు; కనుక, బహుసులభశైలిలో శోభిల్లవలయు. చూచుచు వినుచున్నంతనే మన కవగాహనము కావలయు. కావున, దేటతెల్ల మగు తేలికపదములతో విలసిల్లఁ దగు. వ్యాకరణయుక్తముగ నుండుట యుక్తము. ఇటుల వ్రాయుట కష్టము కాదు. దీనికిఁ దార్ఖాణములు శ్రీకందుకూరి వీరేశలింగకవివర్యులు, రామకృష్ణవిద్వత్కవివతంసులు, పానుగంటి నృసింహారాయ కవిశేఖరులు మొదలగు ప్రసిద్ధకవుల గ్రంథములు.

ఇటుల, నాటకములు లాక్షణికభాషలో నుండిననే యేకాలమున నైన నేదేశమందైన, నుండు నాంధ్రుల కందఱకు బాగుగ గ్రహింప వీలగును. కావున, గ్రాంథికభాషనే సులభశైలిని రచించుట సముచితము. ఇంతియే కాని, గ్రామ్యము ప్రయోగింపఁ దగదు. ఇది గ్రహింప బహు కష్టమై దుష్టమును దూష్యము నగును. తెలుఁగునాటకములలో నీచ పాత్రములు మాటాడునపుడు తేలికగ నుండు తెలుఁగుపదములు గాని, యచ్చతెలుఁగుపలుకులు గాని యుండఁదగు. అనుకరణ మత్యంత మావశ్యకమైనచోట మాత్ర మిట్టిపదములు కొందఱు కొలఁదిగ వాడిరి. సంస్కృతనాటకముల నీచపాత్రములకుఁ బ్రాకృతమును బ్రయోగింతురు. ప్రాకృతము గూడ నియమబద్ధ మన్నసంగతి మఱవరాదు.

పదప్రయోగముకూడ రసానుగుణముగ నుండఁదగు. పాట లవసరమైనచోట్ల నుండవచ్చును. పద్యములు పాటలు రచించునపుడు, వృత్తములు, రాగములు రసోచితములై రంజిల్లవలెను. భాషణము బాగుగ సందర్భశుద్ధిఁ గలిగి భాసిల్లనగు. కథకవసరములేని పాత్రములు గాని భాగములు గాని యుండఁగూడదు. ఈతీరున నున్ననే చూపఱులఁ జదువరుల నమందానందకందళితహృదయారవిందులఁ జేయును. ఇటుల లేనిచో, రసాభాస మగును.

నటకులు పాటలుగాని, పద్యములుగాని, గద్యములుగాని చదువునపు డీవిషయములను విశేషమైన జాగరూకతతో గమనింపఁదగు

మనము కన్నులు మూసికొనియున్నను వాద్యములుగాని, పాటలుగాని వినినంతనే యేరసము పోషింపఁబడుచున్నదియు విశదము కావలయు. రాగ మతిదీర్ఘముగా పాడఁగూడదు. పాడినచో నౌచిత్యమునకు భంగము కలుగును.

నాటకములవలనఁ బ్రకృతికి సహజములైన చిత్రవిచిత్రచర్యలు ప్రేక్షకులకుఁ బ్రత్యక్షములగును. దృశ్యకావ్యములలో నెక్కుడు ముఖ్యములైన యంశములు ముఖవైఖరియు నభినయమును. ఇవి స్వభావసిద్ధముగ నుండవలయుఁ గావున, మానవస్వభావము బాగుగ గుర్తెఱింగినవారే నాటకకళాకుశలు లగుదురు. వారలే మనోగతభావములను బాగుగ మొగమునఁ గనఁబఱుపఁగలరు. మోమున రసమొలుకుచుండ నభినయము భావానుగతమై భాసిల్లును. జగత్తునందు మానవజీవితములకు సహజములగు భావములను, ముఖవైఖరి, నభినయాదులను నైసర్గికరీతిఁ జూపుదురు.

స్త్రీలుగాని పురుషులుగాని వేషములు వేసికొనునపుడు గ్రంథములలో వ్రాసినదానికి సరిగ నుండుట యుక్తము. అనఁగా; పురుషవేషములు పురుషులు, స్త్రీ పాత్రములు స్త్రీలు, బాలబాలికలవేషములు బాలబాలికలు, వీలగునంతవఱకు ధరింపవలయును. ఒకానొకప్పుడు వేషధారులు సమర్థులైన వేఱుగ నుండవచ్చును. నటకులుగాని, నాటకసంఘములవారుగాని మానవతీమణులయెడ మిగుల గౌరవముతో మెలంగనగు. అసభ్యములగు నాలింగనచుంబనాదికృత్యములు నిజముగా జరుపఁదగదు. అట్టుల నటించినఁ జాలు.

దుస్తులు తెరలు మొదలగునవి యుక్తరీతి నుండనగు. రంగము రంగము మధ్య ననవసరముగ కాలయాపనము చేయరాదు. చెప్పిన చొప్పున సకాలమున నాటకమారంభించుట మంచిది. నాటకశాలలు గూడఁ దగురీతి సౌకర్యములతో నలరారవలయు.

పాత్రధారులు గ్రంథమునందలి పాత్రలభావముతో నేకీభావము నొందవలయు. ఈభావైక్యము బహుదుర్లభము. అయినను నత్యంతావశ్యకము. అట్టి పట్టుల ద్రష్టలుగూడ నది నాటకమనుమాట మఱచి యథార్థమైన ప్రపంచవృత్తాంతముగ నెంచుదురు అపుడు చూపఱులు పరవశులగుదురు. వారిదుఃఖమే వీరిదుఃఖము. వారిసుఖమే వీరిసుఖము. ఇన్నియు సన్నివేశమై యున్నచో నాటకము ప్రేక్షకులకు సంపూర్ణమైన సంతృప్తినొసఁగుచు, మహదామోదదాయకమై విలసిల్లును. మన తెలుఁగునాట నాటకకళలో నగణ్యనైపుణ్యముగల రమణీమణులును, పురుషవరులును బలువురు గలరనుసంగతి విశేషసంతోషకరమైన విషయము.

రసవత్తరములగు నాటకరాజములు రసికజనమనోరంజకములై రాజిల్లుచు, నాంధ్రదేశమున నధికశ్రేయోదాయకములై శోభిల్లును. ఈరీతి యుత్తమోత్తమకృతికర్త లత్యంతస్తుతిపాత్రులు. పాత్రధారులు ప్రశంసార్హులు. కళాపోషకులు సంస్తవనీయులు. కళాభివృద్ధికై పాటుపడుచున్న యీపరిషత్ప్రయత్నములు సఫలమగుఁగాత! ఈ పరిషత్సభ జయప్రదముగ జరగునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక!

---

## పదియాఱవ భారతమహిళాసభా సమావేశమున శ్రీ పిఠాపురము మహారాజావారొసఁగిన ఆంగ్ల ప్రశంసోక్తి కాంధ్రీకరణము.

నన్నీ సభ కాహ్వానించి మాటలాడుమని కోరి నాకొసఁగిన గౌరవమునకు మిమ్ముల మొదట నభినందింపవలెను. ఈ యున్నత సభ యం దుపన్యసించుట యొకమంచి సంతోషవిషయము. మఱియు సోదరీమణుల యభ్యుదయ మనిన నాకు మిగుల నిష్టమగుటచే నాయానందము ద్విగుణీకృతమాయినది. పురుషులతోపాటు స్త్రీలు సహితము ముందుకు వచ్చినఁగాని నిజమైనట్టియు స్థిరమైనట్టియు నభ్యుదయము చేకూరనేరదు. అంతియగాక భావి హిందూదేశ ప్రజలగు మీ బిడ్డల సంరక్షించు పవిత్ర బాధ్యత మీదేయైయున్నది.

మీ సంతానమును మంచి త్రోవలోఁ బెట్టి శీలవంతములఁ జేసి యున్నతమగు హిందూదేశపుత్రులఁ గావించుకృత్యము మీపై నున్నది. అది యితరులపై నుండఁదగినదికాదు. పురుషులనుభవించు సౌకర్యములు, హక్కులు మీకేల యుండఁగూడదు. ఇంచుమించుగ నే ముఖ్యవిషయములందైనను మీరు పురుషులకు వెనుకపడరు. అత్యుత్తమములగు బుద్ధి, హృదయము మీయందును సమృద్ధిగాఁ గలవు. సున్నితములగు హృద్వికాసములకు మీరు మాకంటె నిస్సందేహముగ నధికురాండ్రు.

మీదయ, వాత్సల్యము, త్యాగము, సాధుత్వము సహనశక్తి శాంతస్వభావము నెల్ల రెఱిఁగినవియే. మీ మాతృప్రేమ దివ్యము, అసదృశము; వర్ణనాతీతము. అది మీసొత్తే. అవసరములగు కొన్ని సమయములందు మాతృప్రేమ పైకుబికి తేజోవంతముగాఁ గన్పట్టుచుండును. రోగులగు బిడ్డలకుఁగాని పెద్దలకుఁగాని దాదులవలెఁ దగురీతిని సంరక్షించుట మీకే చెల్లును మీరు తప్ప నితరులా సేవ చేయలేరు అట్టిపని పురుషుఁ డెంతబాగుగ నెఱవేర్చినను మీరు చేసిన యుపచారముతో సరిరాదు. వారిచేతలలో నేదియో కొఱఁతయున్నది. తప్పక మీరు ముమ్మాటికిని ధన్యలు. నైతికముగా పురుషులను మించియున్నారు.

పాతివ్రత్యము మీకుఁ బెట్టినది పేరు. నిజమగు సదాచార సంపద మీదే. నాయాత్మానుభవముతోఁ జూడ సూక్ష్మబుద్ధిలోఁ బురుషులకన్న మీరే మిన్నగా నున్నారు. ఎటులఁ జూచినను మీరు తప్పక మాకు సమానలు.

భాగ్యవంతమగు ప్రాచీనకాలమున మీ రెటులుంటిరో యోజింతము. విశేషవిద్యల నేర్చితిరి. అందులకుఁ దగిన చక్కని ఫలితములఁ బొందితిరి. మానవప్రపంచమునకు జ్ఞానదములగు ప్రాచీనవైదికగీతములలో ముఖ్యమైన ఋగ్వేదమునఁ గొన్ని భాగములు సమకూర్చినవారు మీరలే. మఱియు నాధ్యాత్మికచింతనముతో నిండిన యుపనిషత్తులలోఁగూడ విశేషపాండిత్యమును సంపాదించి గొప్పగొప్ప మతచర్చలలో పురుషులతో సమముగఁ బాల్గొనినవారును మీరలే. అందులో ముఖ్యముగ గౌరవనీయులగు "గార్గి" "మైత్రేయీ" నామము లీనాఁటి వఱకు సుప్రసిద్ధములుగ వెలయుచున్నవి.

ఒకానొకప్పు డొక స్త్రీ గృహకార్యనిర్వహణమునకై పోవుచుండఁ గొన్ని సూత్రార్థములను శిష్యులకొక యుపాధ్యాయుఁడు చెప్పుచుండెనఁట. ఆ స్త్రీ వానిని విని తప్పుగ్రహించి ప్రశ్నించెనఁట. అపుడాతఁడు తనతప్పు నొప్పుకొనెనఁట. స్త్రీ లెంతటి వైదుష్యము గలవారలో యీకథవలన విదితమగుచున్నది. ఉన్నతజీవితములగడపి గొప్ప యాశయముల ననుసరించిన కార్యదీక్షాపరులు మీలో నుండెడివారు ప్రభువులకుఁదగు సలహాల నిచ్చి తమ దేశమునకు మేలొడఁగూర్చిన తల్లులు, భార్యలు, మీలోఁగలరు. వారు సర్వాధికారములుఁ గల రాణులైనను, అత్యంత శ్లాఘాపాత్రముగఁ దమప్రజలఁ బాలించినవారును కలరు. సత్ప్రవర్తనమున వారికి వారే సాటి. సుగుణములకెల్ల శిరోమణి యనఁదగు పాతివ్రత్యములో వారిని జయింపఁగలవా రెవ్వరు లేరు. యుద్ధభూమిని శౌర్యముఁజూపి కత్తిని జేఁబట్టి వీరులవలెఁ బోరి కీర్తిగణించిరి.

ఇంతకంటె ముఖ్యమేమన వీరులగు తమ ముద్దుబిడ్డల యుద్ధభూమికేఁగి విజయమునొంది రండని యాశీర్వదించి పోరునకు నంపిరి.

దయాదాక్షిణ్యములు వారి కుసుమపాలతోడి తోడవులు. నిజము నకును వారు తమ జీవితములోని వివిధశాఖలందును జూపియున్నారు. ఇటుల వారు పురుషుల గౌరవములఁ జూరగొనియున్నారు. ఇదంతయు గతకాలమునాఁటి ముచ్చట

దురదృష్టవశమునఁ గాలక్రమమున పతనకాలము సంప్రాప్తమాయెను. సంఘము దినదినము క్షీణింపఁ జొచ్చెను. స్వార్థపరులయిన పురుషులు స్త్రీలకుఁ దగు సదుపాయములు లేకుండఁ జేసియు వారి యభివృద్ధి కను వగు నవకాశములు సమకూర్పకయు వారి నణఁగఁద్రొక్కిరి.

ప్రస్తుతములో నవఁగా నిపుడు మనే యదృష్టవశమునఁ గొన్ని యభి వృద్ధిచిహ్నములు పొడసూపుచున్నవి. విద్యావతుల సంఖ్య ప్రస్తుతము కొలఁదిగా నున్నను మునుపటికంటె నెక్కువగా స్త్రీలు విద్య నభ్యసించుచున్నారు. వీరు ప్రఖ్యాతిని, బిరుదములను బొందుచున్నారు. విశ్వవిద్యాలయ పరీక్షలయందు గణనీయముగను త్తీర్ణలగుచున్నారు వీరిలోఁ జాలమంది మొదటి తరగతిలోనే కృతార్థలగుచున్నారు. మఱికొందఱు విశ్వవిద్యాలయమునకంతకు మొదటి తరగతిలో మొదటి వారుగఁ బరిగణింపఁబడుచున్నారు. విజ్ఞానశాస్త్రమునందు సహితము వీరు ప్రకాశింపఁగలరు. ఈ మధ్యనే వైద్యశాస్త్రపరీక్షయందు విశ్వవిద్యాలయమునకంతకు నొక బాలిక ప్రథమగణ్యగా నుత్తీర్ణురాలైనది. ఆమె యిరువది బహుమానములఁ బడసెనట.

ఈ నడుమ గణనీయుఁడగు విజ్ఞానశాస్త్రకోవిదుఁడు సర్. సి. వి. రామన్‌గారిటులు చెప్పిరి. "పురుషులు విఫలమనోరథులయిన కొన్ని కార్యములు స్త్రీలు నెరవేర్పఁగలరని నా యుద్దేశము. స్త్రీలకొక ప్రత్యేకగుణమున్నది. అది కార్యదీక్ష. ఇదియే విజ్ఞానమునం దుత్తీర్ణత నందుటకుఁ దగు ప్రధానసాధనము" ఇటుల ననేకవిషయముల వీరు పురు

షులకంటె మేలు. లెక్కించి చూచిన పరీక్షా ఫలితములలో విద్యనేర్చి
పురుషులకంటె విద్యనేర్చిన స్త్రీలసంఖ్య తక్కువగాఁ గాన్పించినను ఫలిత
ముల సంఖ్యను బరిశీలించినచో మీబుద్ధి విశేషము స్ఫుటముగాఁ గాన్పిం
చును. మీకెంతయు గౌరవము జరుగుఁగాక.

హిందూదేశమందు శ్రేష్ఠులగు కవుల పట్టికలో స్త్రీలు లేకపో
లేరు. నాస్నేహితురాలైన శ్రీమతి సరోజినిదేవియే యందులకుఁ
దార్కాణము. ఈమె వక్త్రిగాఁ గూడ మిగుల ఘనత కెక్కినది. స్త్రీలకు
ధైర్యము లేకపోలేదు. ఇంగ్లాండులో యుద్ధపుఁబనులలో స్త్రీలుగూడఁ
బాల్గొనుచున్నారని, చదువుచున్నాము. రష్యాలో పురుషులతోపాటు
స్త్రీలు జర్మన్ యోధులతో ముఖాముఖిని పోరుచున్నారని వినుచున్నా
రము. "అనేకస్థలములలో పురుషులకంటె స్త్రీలు తుపాకివేఁతలకు
ఓర్మిత్తురని తెలుపుట కనేక తార్కాణములుగలవ"ని లేడీ ఆష్టరు
కామన్సుసభలోఁ దెలిపినది.

సంఘములో మీరు చేయుపని యత్యద్భుతము. బాగుగఁ బైకిఁ
గాన్పించు సంగతులమాత్రము చెప్పెదను. ప్రభుత్వశాసనసభలో
నున్నప్పుడు, మీ సమస్యలకొఱకు మిగులఁ బాటుబడు శ్రీమతి. డా.
ముత్తులక్ష్మిరెడ్డిగారియొక్క విశేషప్రయత్నముల ఫలితమే "వ్యభిచార
నిర్మూలనచట్టము". దేవదాసీ విధానమును రూపుమాపవలెనని దీక్ష
వహించి యామె చేసినకృషి మిక్కిలి శ్లాఘనీయము. ఇంకను వివిధ
రీతుల ననేకోపయుక్తకార్యముల నీమె సాధించుచున్నది. మనమంద
ఱము తప్పక యీమెయెడఁ గృతజ్ఞత జూపవలెను. నాముఖ్యస్నేహితు
రాలైన శ్రీమతి రాధాభాయి సుబ్బరాయన్‌గారు కేంద్రప్రభుత్వసభలో
ననేకములగు గొప్పపనులఁ గావించుచున్నారు. వారు చేయుపనులు
ఫలవంతములగుఁగాక !

మీలోఁ గొందఱు ద్వివిధ శాసన సభలలోను సభ్యురాండ్రుగా
నుండి యమూల్యములగు కార్యముల నెరవేర్పఁ బాటుపడుచున్నారు.

రౌండు టేబిల్ సభలో బేగంషా నవాజ్‌గారు చేసిన మంచి పని మన మెఱుఁగుదుము. ఇప్పుడు వారటులనే దేశసంరక్షణవర్గములో సభ్యురాలుగాఁ బనిచేయుచున్నారు. ఈనాఁడు గౌరవనీయులగు మన యుక్తప్రదేశ రాష్ట్రమైన శ్రీమతి విజయలక్ష్మీపండిత్‌గారు రాష్ట్రీయ మంత్రి వర్గములో మంత్రిగాఁ బనిచేసిన మొదటిస్త్రీ. కార్యవర్గములో సహకారులగు నామిత్రులు చేసినపనికంటె నీమె గావించినపనియే గొప్పదని నొక్కి వక్కాణింపఁగలను. ఇఁకముందు రాజధానీమంత్రివర్గములలో రాజధాని కొక్కొక్క స్త్రీకి మంత్రిపదవి లభింపఁగలదని యాశించుచున్నాను. కొలఁది కాలముననే రాజప్రతినిధి కార్యవర్గములో సహితము స్త్రీ సభ్యురాలిని జూచెదము గాక. ఇవ్విధముగా మీరందఱు వివిధరీతుల వివిధ శాఖలయందు ముఖ్యములగు విలువగల పనులఁ జేయుచుంటిరని తెలియుచున్నది. రాజకీయోద్యోగములలోఁ బ్రస్తుతముకంటె స్త్రీలసంఖ్య యెక్కువ కాఁగలదని యాశించుచున్నాను.

గృహమును శుభ్రపఱచి జాగ్రతగ నుంచుటలోఁ బురుషులకంటె స్త్రీలే తగినవారు. మిక్కిలి భక్తుఁడైనట్టియు బ్రహ్మమతావలంబియై ప్రఖ్యాతిఁగాంచినట్టియు బ్రహ్మానంద కేశవ్ చంద్రసేనగారి కుమార్తెలయిన 1. కీ. శే. కూచి బీహార్ రాజమాత మహారాణి సునీతిదేవి. 2. ఇపుడున్న మయూర్భంజ్ మహారాణి సుచారుదేవి. వీరిద్దఱు మత విషయములలోఁ బ్రాముఖ్యత చెందిన స్త్రీరత్నములు. వీరొనరించిన ఘన కార్యములు మిక్కిలి పరిగణనీయములు. ఇట్టి స్త్రీలింకను నుందురని యాశించుచున్నాను.

అన్ని విషయములలోను మీరు మాకంటె దిట్టలు. గృహనిర్వహణము మొదలు పెద్ద ఘనకార్యములందు నిపుణులు. గృహమున మానవుని జాగ్రతగఁ జూచుటకుఁ దల్లిగాని, భార్యగాని, పుత్రికగాని లేనినాఁడా పురుషుని జీవితము మిగుల దుఃఖభాజనమగును. ఎట్టి యాడంబరము లేని మీ స్వార్థత్యాగము మిగులఁ గొనియాడఁ దగినది. భార్య

పురుషుని యర్ధాంగియని తెలుపఁబడుచున్నది. అది యథార్థము ప్రశంస నీయము.

మీరు చేయఁబోవు ఘనకార్యములలోఁ గొన్నియాశయములఁ జెప్ప ననుమతి నొసంగుఁడు. హింస కలుగకుండ మీబిడ్డలఁగాపాడుట ముఖ్య విషయము. అద్దానిని నేను దప్పక యామోదించెదను. దానిని నాతోపా టితరులు సహిత మామోదించెదరని నమ్ముచున్నాను.

వివాహ విషయములలో మీరు చేయు ప్రయత్నములు ప్రశంస నీయములు. కట్నములనిచ్చు విధానమును బూర్తిగ మాపుచేయవలెను. స్త్రీ పురుషుల కన్యోన్యప్రేమ యుదయించినపుడు వారిపావనపరిణయ మున కీపాడుకట్న మే విధముగను నడ్డురాకూడదు. అందుకు వినిర్మల ప్రేమయే ముఖ్యము. డబ్బునకై యొత్తిడిచేయుట మిగుల నింద్యము. అడుగనని వాగ్దానమిచ్చి తిరుగ నడుగుట దానినిమించిన మహాదోషము వివాహము నిశ్చయమైన పిమ్మట సొమ్ముల రాఁబట్టఁజూచుట నీచాతి నీచము. వివాహము సుకరమై నిరాడంబరమై ధనవ్యయము లేనిదై జాతి మత వివక్షత లేక జరుగ వలయును.

విడాకులసమస్య విశేషకష్టముతోఁ గూడినది. దానిని నా హృదయ మెంతమాత్ర మామోదింపదు. భార్యాభర్తల నడుమఁ గొంత యసఖ్యత జనించిన సాధ్యమగునంతవఱకుఁ దిరుగ వారలకు సఖ్యత సమకూర్పఁ బ్రయత్నింపవలెను. ఏదో యొకవిధమున భయంకరమగు నీవిడాకుల పీడనుండి తప్పింపవలయును. అదేవిధమునను నివారింప సాధ్యము గానిచో విడిపోవచ్చును. ఈయది శారీరకముగ, మానసిక ముగ, నైతికముగ, నాధ్యాత్మికముగ నుభయపక్షములకు శ్రేయోదా యకము.

మీ శాస్త్రీయపు హక్కుల విషయ మాలోచింప నుచితము లగు సౌకర్యములు మీకుఁ గలుగఁజేయుట, న్యాయము. పురుషులవలె మీరును మానవులే. సుఖము కోరుట మీ హక్కయి యున్నది. స్త్రీ

పుంభేదమన్నదే తక్కువ కారణము కాకూడదు. మీరు చేయఁబోవు ప్రయత్నములు ఫలదములగుఁ గాక. మీ యభ్యుదయమునకు మీరు చేయఁబోవు కార్యములలో మేము సహాయముఁ జేయఁ దావొసంగవలయు. మన యాంధ్ర సభోద్యమంతటిలోను మీ సంస్థల కొఱకు విశేషముగా సమయోచితముగాఁ గృషిచేసి ప్రకాశించిన పురుషరత్నములు, 1. కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు. 2. రఘుపతి వెంకటరత్నం నాయుఁడుగారు. వీరు బాలికల విద్యకొఱకు, నింద్యవృత్తులవారి క్షేమము కొఱకు, హరిజనాభ్యుదయము కొఱకు, సంఘ సంస్కారములకొఱకు విశేషముగాఁ బాటుపడిరి. అంతేఁ గాక వారికృషి మము నాదుకొనిన ఫలముగాం చుట కీ మహాసభయు అనేకకష్టములకు గురియైనది. వారు ధైర్యముతో నోర్మి సహించి తుదకు విజయము నొందిరి.

తల్లిప్రేమ యపారమైనది. దీనిని వ్యక్తపఱచు నొక చిన్న కథ కలదు. ఇరువురు మిత్రులు లోకవార్తలఁ గలసికొనిరి. ఒకవాఁడు రెండవవానిని నీ వెక్కడకుఁ బోవుచున్నావని యడుగ "నేను దేవాలయమునకుఁ బోవుచుంటిని" తెలిపె; "నంత మొదటివాఁడు" "నీ కింటివద్ద మాతృదేవత లేదా?" యనెను. తల్లియే దైవములలోకెల్ల గొప్ప దైవమని యాతని యుద్దేశము. కన్నతల్లికంటె వేఱుదైవతము లేదని సంస్కృతములో నొక చక్కని వాక్యము కలదు.

"నమాతుః పరదైవతం" అని.

ఇది సత్యము కాదా, మాతృప్రేమకంటె ఘనమగు వస్తువు వేఱొకటి కలదా ? లేదు, లేదు. ఇది ముమ్మాటికి నిజము. తేజోవంతమగు నీ యీ విశ్వసృష్టిలో నింకొక తేజోవంతమగుచు వెలయునది సతీమణియే.

సోదరీమణులారా ! అత్యుత్తమ గుణరత్నములకు నిలయులై వెలయు మీకు వందనము లర్పించుచున్నాను. ఉదారములును శ్లాఘ్యములునగు మీ కార్యములకు భగవంతుఁడు దయతో విజయము సమకూర్చుఁగావుత!

---

ఓమ్.

# స్వాగతసుమమంజరి.

సాహిత్యవిశారద—కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి.

స్వాగతం తే మహారాజ! పావనప్రేమసాగర!
నిధేహి సదనేఽస్మాకం శుభదం భవతః పదమ్. ౧.

ధన్యోఽస్మి పరితుష్టోఽస్మి స్వాగమాత్తే మహాప్రభో!
వ్యక్తీకర్తుం న శక్నోమి హృద్గతానందసంపదమ్. ౨.

ఆంధ్రీగ్రాంథీ సుమసమపదా రాజతే తే ప్రసాదా
ద్విద్యాశాలా బహువిధకలా దీప్యతే తేచ ధర్మాత్
స్త్రీణాం విద్యా వ్యయవిరహితా ప్రాప్యతే తే కటాక్షాత్
దీనో లోకో ముదితహృదయో దృశ్యతే తేహి రాజ్యే. 3.

నిర్బంధూనాంత్వమసిశరణం సద్మసంస్థాప్య రమ్యం
పంగ్వంధాద్యా వికలకరణా భుంజతే మోదిరే తే
కోశం రమ్యం త్రినగవచసాం కాశతే తే ధనాఢ్యైః
పూర్వాగ్రంథా ఘనరసయుతా ముద్రితాస్సంపదా తే. ౪.

ప్రదిశతు తవ లక్ష్మీం సర్వదా దానవారిః
వితరతు తవ నిత్యం భాస్కరో దేహసౌఖ్యమ్
అవతు తవ కుటుంబం శంకర శ్చంద్రమౌళిః
ప్రసరతు తవ కీర్తిర్భూతలే చంద్రికాభా. ౫.

గీ. స్వాగతము గ్రాంథికాంధ్రభాషా నిధాన!
స్వాగతము మోహనాంధ్ర భోజాభిధాన!
స్వాగతము శాస్త్రవిద్విబుధాభిమాన!
స్వాగతము సూర్యరాయ! భూపప్రధాన! ౬.

మ. ప్రతిభాసంపద సంస్కృతాంధ్రముల భవ్యంబైన పాండిత్యసం
గతి నార్జించి, తెనుంగునం గవిత వక్కాణించు సామర్థ్యము

స్ఫూర్తిలన్ గాంచితి, వాఙ్మ్రేవాత్మసుగతి ప్రస్ఫీతసేవానమా
గతకీర్తిధ్వజ మెత్తికొంటివి నృపాగ్ర్యా! స్వాగతం బియ్యదే?  ౭.

క. దినదినపరివర్ధితనూ,
తనదీక్షాధీనమతి నితాంతప్రీతిన్
ఘనసారస్వతపోషణ,
మొనరింపుము చిరతరముగ నోమహారాజా!  ౮.

శ్లో. సమర్పితా మయేమాం రాజన్ భక్తివిశ్వాసపూరితాం
ప్రతిగృహ్ణీష్వ సామోదం నవపుష్పమయీం స్రజమ్.  ౯.

---

# ఈశ్వరి!

## విద్వాన్—కల్లూరి వెంకటసుబ్రహ్మణ్యదీక్షితులు.

ఉ. శ్రీకనకాంబ! నీచరణసేవఁ దలింపక చిత్తవృత్తి న
స్తోకలు వెట్టు సంసృతిభయమ్మునకుం బుయిలోడ కేనమో
వాకము గూర్చి భాగవత భక్తిసుధారసజీవనాప్తి మై
కాకలు దీర్చికొంమనని గట్టిగ నమ్మితినమ్మ! ఈశ్వరీ!  1

ఉ. నీమృదుపాదపద్మముల నేత్రములద్దిన మోక్షసాధన
స్తోమము కండ్లఁగట్టినట తోఁచును పైతమ మెల్లఁబాయు నా
కామవిలాసపుందుడుకు గట్టును నేత్రచికిత్స కౌషధం
బేమి వలెన్ గృపాలహరి! యింతకుమించి జగత్కుటుంబినీ!  2

శా. గర్గోలై జనముల్ దురంతభవసంకల్పాతిపాతంబు నై
నెగ్గుల్ సేయుచుఁ బొట్టకూటి కెరయై యేవేళ్లొ కాలాగ్నిలో
గ్రమ్మగ్గ బోదురు దీని కంతు కలదమ్మా! నీకృపావృష్టు లా
యగ్గిం బుగ్గి యొనర్పఁగావలయుఁ గాకానందచిద్రూపిణీ!  3

ఉ ఎందరొ యెన్ని వేలొ రచియించిరి పద్దెము లాత్మతృప్తి కా
నందము జీలువార మననంబు నొనర్చెడి వాని నొక్కనే

గంటమొ? కాలకర్మములు కారణమై పలికింపఁ బల్కినా
సందఱమాటలేమి? జగదంబ వినన్ వలె నంను నీశ్వరీ! 4

ఉ. వందలువేలుఁగొంటి నభివందనపత్రపు టద్దముల్ గృహాం
బం దొక గోడఁ గొట్టి 'యహహా'యని పొంగెద జీర్ణపర్ణపున్
సంచులనుండి యొడపొడచాయలు వానివయింబడంగ లో
భ్రమించెద శాంతిపోఁ; దురభిమానకవిత్వము లేదె నేటికిన్. 5

ఉ. పొట్టను జేతఁబట్టుకొని పొందికఁ బండితు నట్లు మాటలన్
గుట్టెడలంగనీ కఠినిగూఢనిగూఢత రాగమార్గ సం
ఘట్టనఁ గాలు ద్రవ్వెద; జగమ్ముల నూఁపెదఁ నింత యేడ్చి లో
గుట్టు నెఱుంగలేక తుదకుం జము నాసతి కూఁగిపోయెదన్. 6

ఉ. ఎప్పుడు గూడ నిన్గొలుచు నిచ్ఛజనింపకు కొంప లంటుకొ
న్నప్పుడె యగ్నిహూత్రపత నాకృతి యొక్కువయూరు; ఛీ మనం
బెప్పటి కప్పుడాత్మ విలయుంబు గనుంగొని యేమ్చుగాని యే
ముప్పుడు లేని దారి ముమ్ముదుముఁ దలంప దిదేమొ! ఈశ్వరీ! 7

మ. కవితాగానములందు మోక్షకములా కల్యాణ గాథాంకముల్
చవులీరన్ వినుతింపఁ దత్ప్రథితవాచా ప్రౌఢి మేల్మేలు బా
గవులే యంచును బట్టుకైతలిడ నంతా పెద్దలే కాని త
త్కవితాసార రసానుభూతియది యే ధన్యాత్ము నైశ్వర్యమో. 8

పండితత్రయ ప్రశంస.

శా. శ్రీపాదాన్వయు దెందునూరు గురునిన్ శ్రీసుబ్బరాయాఖ్య వి
ద్యాపారీణులఁ దత్వదృష్టిఁ గొలుతున్ దత్తత్ప్రశస్త ని
క్షేపమ్ముల్ వివశప్రదాన నమును శ్రీసూక్తి ముక్తామణుల్
ప్రాపింపం గదవమ్మ! భారతి! బుధప్రాంచద్యశోభారతీ! 1

మ. నరసింహాకృతి నొందు రెండు జగన్నాథాత్మసిద్ధాంతము
ష్కరకర్మగ్రహ కర్కశమ్మయిన తర్కంబూని ప్రఖ్యాతులన్

కరుణాపాంగతరంగసంఘటితవిస్ఫారంగదానంద సు
స్థిర మద్వైతసుఖమ్ముఁ దార్చు మిము నర్థిన్ గొల్తు నైకార్థినై. 2
శా. బ్రహ్మాణ్యుల్ వినుతింతు రెయ్యదది శబ్దబ్రహ్మమై నేఁడు సు
బ్రహ్మణ్యాకృతి నీశ్వరాంశము నటింపన్ బోలు భాష్యక్రియా
జిహ్మాంబాచు 'గురుప్రసాద'గరిమన్ జేగీయమానంబు త
ద్బ్రహ్మాదత్త గురుప్రసాద మెద సంభావింతు భావింతు లోఁ. 3
శా. విద్వచ్చక్రము నెల్ల నేలుకొని యుర్వీనాథచూడాగ్ర ర
త్నోద్వేలప్రభలన్ బ్రభావగరిమన్ దోఁపించు మీపాదప
ద్మ ద్వంద్వంబు భజించుహంసనయి ద్వంద్వాతీతనైష్కర్మ్యసం
పద్వైదగ్ధ్యంబు రసమ్ములోఁగొని జగద్భ్రాంతిన్ దరింతున్ దటిన్. 4
శా. పాండిత్యమ్ములకేమి ? గ్రంథములకున్ భాండారముల్లేవె ? కో
దండ జ్యాగుణటంకృతిన్ సుభటసంతానమ్మునున్ బోలె రా
రండంచున్ బరవాదిదిగ్గజము లార్వన్ శాంతిమైగెల్చు ను
ద్దండుల్ మీ శ్రుతిమూర్తులాత్మ ననుసంధానింతు మానింతులోన్. 5
చ. చదువులుముందొ వెన్కనొ విచారమదేల ? సమన్వయించుఁ ద
త్పదవికి వేగిరింపను; భవత్పదపంకజ భక్తి మాధురీ
విదిత చిరంతన ద్వయిత విస్తృత పుణ్యపదీ నిదాన మి
య్యది శుభలగ్న మీశ్వరసమర్చన కంచెద శాంతి నించెదన్. 6
శా. ఉన్నారెందఱొ పెద్దలై పలుకువారుద్రిక్తులై రిక్తులై
మన్నన్నిన్నొకనాళ్ళ రజస్తమములామ్నాయార్థమున్ గప్పమే
మన్నా పండితులంచు నిక్కుచు; కలివ్యాళానల జ్వాల నా
పన్నమ్మైన జగమ్ము మీమహిమలన్ బాటించునే మించునే. 7
ఉ. కాలముగాదు సజ్జనని కాయము కాయము నిల్పుకొంట కు
ద్వేలతమ శ్రమంపడెను; వేనరుగొంచు నవైదికోగ్ర కం

* ౧. బ్రా॥ శ్రీ శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రులవారు ౨. బ్రా॥ శ్రీ దెందుకూరి నరసింహశాస్త్రులవారు 3. బ్రా॥ శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రులవారు.

కాళము లార్యమండలి నకాండము తాండవ మాడుచున్నవా
భీలము తాచుఁ; దద్భయద వృత్తి మణంపుఁడు తత్త్వదర్శనుల్. 8

## జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ.

గీ. బ్రహ్మవిదులైన యా భరద్వాజముఖులు
భరతధాత్రిని మంత్రముల్ పాడి పాడి
పంటకుఁ దెచ్చినట్టి తపఃప్రభావ
కామధేనువ ! ఇదె నమస్కారమమ్మ ! 1

గీ. త్రిస్వరస్థాయి వేద తంత్రీ పవిత్ర
గాన మకరంద ధారావగాహనమున
కన్ను దెఱపించు నయ్యుషః కమల గంధ
బాంధవం బగు తేజంబు ప్రస్తుతింతు. 2

గీ. భరతభూమిని జన్మంబు వడసినాఁడ
జన్మజన్మాంతరానంత సాధుసేవ
మఱగి యిఁక మఱలి పోలేను మాంసలుబ్ధ
కాక గృధ్రకులాకులఖండములకు. 3

గీ. తాత యభినవసృష్టి సంధాత; తండ్రి
సర్వ సర్వంసహా భార ధూర్వహుండు
కణ్వపోషిత మేనక కాన్పుపంట
జననిగాగణ్యకూనమా చక్రవర్తి. 4

గీ. కత్తిపై కాళిపై చంపు కటికివాని
పైన నొకచూపు గలిగిన భరతుగన్న
తల్లి నను గన్నతల్లి మాతల్లి యొడిన
వఱలుచో నాకు విశ్వరూపంబె తోఁచు. 5

గీ. రాజ్యరమ కన్నుగీటినఁ రామచంద్ర
చరణ పంకేరుహచ్ఛాయ చాటు వెట్టు

కొనుచు భరతుండు జట లల్లుకొనిన మఱ్ఱి
యూడలున్నవి నేఁటి మా వాడలందు. 6

గీ. కెరలి తాళదళాంతర క్రిమికులంబు
లకట ! తినివైచె మంత్రమంత్రార్థభావ
పరిచయాక్షర పఙ్క్తిఁ దపఃప్రసన్న
దృష్టికింగాని యది యింక తేటవడదు. 7

గీ. వట్టి యూర్పులఁ జిలువలు పలువ లగుచు
వంపు దిరిగెను బుద్ధులీ వంపుదీర్తు
రట్టి యవ్యవసాయు; లీ మట్టిబొమ్మ
లాట నేనెట్లు దోబూచు లాడువాఁడ ? 8

గీ. పాముచేఁ గరువఁబడి మంత్ర పటిమ చూపి
రొంది వెనువెంటనే పది మందిగూడి
మంత్ర మాంత్రికులం దిట్లు మాయమూక
కాకరంబయ్యె నా భారతాంబ నేఁడు ? 9

# సంస్కృతాంధ్రభారత కర్ణజనన విమర్శనము.

కర్త్రా అచ్యుతరామశర్మ.

సీ. ఏనాఁడు రాజరాజేంద్రుఁడు పురిగొల్ప
భారత మాంధ్రాన వ్రాసినాఁడొ
ఏనాఁడు శాస్త్రవిజ్ఞానంబు పొల్పొందఁ
జేయెత్తి వాదంబుఁ జేసినాఁడొ
ఏనాఁడు పరిషజ్జనానుమోదుఁడు నై
విశ్రాంతకీర్తిమై వెలసినాఁడొ
ఏనాఁడు ఠీవిగా నెనలేని నవరత్న
సింహాసనం బధిష్ఠించినాఁడొ
గీ. నాఁటి కీనాఁడు భవ్యవాగ్ధాటి మెఱయ
తారకామండలిన్ శశిత్వము వహించి
చంద్రికల వెల్లివిరిసెను సాంద్రరుచుల
నన్నయార్యుండు సకలవిద్వన్నుతుండు.

సుకవిజనశ్రేణికి లక్షణకౌశలమును, ఆలంకారికులకు సమధికాలంకారప్రజ్ఞయు, రసికులకు రసౌచిత్యమును, ముముక్షువులకు ఋజుమార్గమును బ్రసాదించునది మహాభారతము. అది లేఖ్యంబైన యామ్నాయమనియుఁ బంచమవేదమనియుఁ బ్రసిద్ధివహించి భారతదేశమునందేకాక ఖండాంతరములందుఁగూడ గగనమధ్యమున భాస్కరునిపగిదిఁ బ్రకాశించుచున్నది. వేదవ్యాసుఁడు తనయమృతమయలేఖినితోఁ జిత్రించిన పలుగురు మహావీరుల పవిత్రజీవితసంపుటీకరణమే మహాభారతము.

అందు ప్రత్యేకముగఁ బలువురు మహావీరుల జననములు మనకు సుస్పష్టములును దృగ్గోచరములు నగుచున్నవి. వారిలోఁ గర్ణుఁడు ప్రధానపూరుషుఁడై భారతదేహమునకుఁ బ్రాణమై వెలుఁగుచున్నాఁడు. ప్రసంగవశమున సామాన్యమానవుఁడుకూడ "కర్ణుఁడు లేని భారతమా ?"

"కర్ణునితల భారతము" ఇత్యాది సూక్తులను వెలువఱుచు చుండుట మనము వినుచున్నారము. కర్ణుఁడు మిక్కిలి పవిత్రమూర్తి. భారతమునఁ గల పాత్రలలోఁ గర్ణునిఁబోలిన స్వార్థత్యాగియు, స్వామికార్యధురంధరుఁడును మహాదానశీలుఁడును, విక్రమైకరసవంతుఁడును మఱియొకఁడు కన్పడఁడు. భారతయోధులలో వీర్యబలప్రాభవములందుఁ గర్ణునిఁజెప్పి పేఱొకనిఁ జెప్పవలెను. దానకర్ణుఁడను ప్రతీతి యాచంద్రార్కము స్థాయియై నిలువవలసినదే! ఇట్టిమహాపురుషుని జననము సంస్కృతాంధ్రభారతములలో భిన్నాభిప్రాయములతో రచింపఁబడియున్నది.

సంస్కృతభారతము-ఆదిపర్వము.

శ్లో॥ దుర్వాసా వత్సరస్యాంతే దదౌ మంత్ర మనుత్తమం
యశస్విన్యై పృథాయై త దాపద్ధర్మాన్వవేక్షయా॥

శ్లో॥ అభిచారాభిసంయుక్త మబ్రవీచ్చైవ తాం మునిః
యం యం దేవం త మేతేన మంత్రేణావాహయిష్యసి
తస్య తస్య ప్రభావేణ తవ పుత్రో భవిష్యతి॥ సంస్కృతభారతము.

తే. ...దుర్వాసుఁడన్ సిద్ధమునియు
వచ్చె నతిథియై భోజనవాంఛఁ జేసి.

వ. కుంతియు నమ్మునివరు కోరినయాహారంబు పెట్టిన సంతుష్టుండై యమ్మునివరుం డిట్లనియె. నీమంత్రంబున నీవెవ్వని నొక్క వేల్పు నారాధించి తద్వేల్పు నీకోరినయట్టి పుత్రకుల నిచ్చునని యాపద్ధర్మంబుగా నొక్క దివ్యమంత్రంబుఁ బ్రసాదించి చనిన. (ఆం. భా)

శ్లో॥ తథోక్తా సాతు విప్రేణ కుంతీ కౌతూహలాన్వితా॥ (సం. భా.)

వ. అమ్మంత్రశక్తి యెఱుంగ వేఁడి. (ఆం. భా.)

శ్లో॥ కన్యాసతీ దేవ మర్క మాజుహావ యశస్వినీ॥ (సం. భా.)

వ. కుంతి యొక్కనాఁ డేకాంతంబ గంగకుం జని యనికలదు.

సంస్కృతభారతమున నెచ్చట సూర్యుని రప్పించి సంగమించెనో లిఖింపఁబడలేదు.

ఇట్లు మంత్రప్రభావముచే సూర్యుఁడు రా నామె దిగులును, మంత్రసత్యమును తన యజ్ఞానమును గొంతవడిఁ జింతించి తాను స్త్రీ చాపల్యముచే నపరాధముచేసియుంటిని. అదియుఁగాక స్త్రీలు సాప రాధలు కావున క్షమింపవలెనని ప్రార్థింపఁగా.

వ. సూర్యుండును నీకు దూర్వాసుం డిచ్చిన వరంబును మంత్రంబుశక్తియు నెఱుంగుదు. మదీయదర్శనంబు వృథగాదు నీయభిమతంబు సేయుదు ననినఁ గొంతి యిట్లనియె.

ఆ. ఏను మంత్రశక్తి యెఱుఁగక కోరితిఁ
గన్య కిదియు గుణము కాదునాక
నాకు గర్భమైన నాతలిదండ్రులుఁ
జుట్టములును నన్నుఁ జూచి నగరె.        (ఆం. భా.)

అని వ్రాయఁబడినది కాని సూర్యుఁడు తన్నుఁ బిలిచి వృథగాఁ బొమ్మనుటకుఁ గోపించినట్లు లిఖింపఁబడలేదు.

(సూర్యోవాచ.)

శ్లో॥ మంత్రదానేన యస్మాత్త్వం అవలోపేన దర్పితా
కులం చ తేఽద్య ధక్ష్యామి క్రోధదీప్తేన చక్షుషా॥ (సం. భా.)

నీవు మంత్రగర్వముచే నను రావించి యవమానించినందులకు క్రోధదీప్తమైనదృష్టిచే నీవంశమును నశింపఁజేయుదునని కఠినాక్షరకలితుఁడై పల్కిన ట్లిందు కలదు.

"ఇట్లు ప్రసన్నుఁడైన సూర్యభగవానునిఁ జూచి లజ్జావిస్మృతచిత్తయై యెట్టకేలకు కుత్తుకరాపడు నెలుఁగుతోఁ దనభయకారణమాతనితో విన్నవింప వాఁడు కరుణించి 'సద్యోగర్భంబునఁ బుత్త్రుఁడుద్భవిల్లు"నని తెలిపినట్లాంధ్రమునఁగలదు. సంస్కృతభారతమున నీశ్లోకమునఁగల"అద్య""తత్ర"యనుపదములనుబట్టిసద్యోగర్భమని తేలుచున్నది.

శ్లో॥ వ్యపయాతు భయం తేఽద్య కుమారం ప్రసమీక్షసే
మయా త్వం చాప్యనుజ్ఞాతా పునః కన్యా భవిష్యసి॥

శ్లో॥ ప్రకాశకర్తా తపనః కన్యాగర్భం దధౌ పునః
తత్ర వీర స్సమభవత్ సర్వశస్త్రభృతాం వరః॥
అజాయత సుతః కర్ణః సర్వలోకేషు విశ్రుతః॥

శ్లో॥ ప్రదాచ్చ తస్యై కన్యాత్వం పునః స పరమద్యుతిః
దత్వాచ తపసాం శ్రేష్ఠో దివ మాచక్రమే తతః॥

శ్లో॥ త్వమేవ పరిహార్యం స్యాత్కన్యాభావస్య దూషణం॥

ఇట్లు సూర్యుఁడు పలుక నామెయు సంతసించి తత్సమాగమంబున కొడంబడెను.

శ్లో॥ ఏవ ముక్త్వా తతః కుంతీ సంప్రహృష్టతనూరుహా
సంగతాఽభూత్తదా సుభ్రూ రాదిత్యేన మహాత్మనా॥

సూర్యసమాగమానంతరమున నామెకుఁ బుత్రుఁడు పుట్ట నొక పేటికయందు రత్నముల నునిచి, బాలుఁ డుండుట కనువుగా నిర్మించి, యందు కుమారు నునిచి జలమందు విడిచెను. అని సంస్కృతభారతమునఁ గలదు.

శ్లో॥ మంజూషాం రత్నసంపూర్ణాం కృత్వా బాలసమాశ్రితాం
ఉత్ససర్జ కుమారం తం జలే కుంతీ మహాబలం॥ (సం. భా.)

సద్యోగర్భసంజాతుఁడైన పుత్రునిఁ జూచి కుంతి వగచుచుండ.

వ. "దాని పుణ్యస్వరూపంబనా నాదిత్యప్రేరితంబై యనర్ఘరత్నవసుభరితంబైన యొక్క మంజస నదీప్రవాహవేగంబునం దనయొద్దకువచ్చి నదానిలోఁ జెచ్చెరఁ దనకొడుకుం బెట్టి కుంతి నిజగృహంబునకువచ్చె.

కుంతిచేయు సపర్యకు దుర్వాసమౌని సంతసించి నీకోరిన వర మిత్తునని నామె మీరు తృప్తులగుటయు, మదీయజనకుఁడు సంతసించుటయు నను నీరెంటినే నేను గోరితిని; గాన వేరొండు కోరిక నాకు లేదని మౌనివర్యునితోఁ జెప్ప నాతఁడు శాసనపూర్వకముగ నొకమంత్ర మిచ్చి నట్లు సంస్కృతభారతమునఁ గలదు.

బ్రాహ్మణోవాచ.

శ్లో॥ యది నేచ్ఛసి మత్త స్త్వం వరం భద్రే శుచిస్మితే
ఇమం మంత్రం గృహాణ త్వం ఆహ్వానాయ దివౌకసాం॥
శ్లో। యం యం దేవం త మేతేన మంత్రే ణావాహయిష్యసి
తేన తేన వశీ భద్రే స్థాతవ్యం తే భవిష్యతి।
శ్లో॥ అకామో వా సకామో వా స సమేష్యతి తే వశే
విబుధో మంత్రసంభ్రాంతో వాక్యే ర్భృత్య ఇవానతః॥

ఆమె కిష్టములేకపోయినను బలవంతముగ మంత్ర మొసంగెద నని నిర్బంధింప నామెయు విధిలేక క్రోసివేయుటకు భయపడి స్వీకరించెను.

శ్లో॥ న శశాక ద్వితీయం సా ప్రత్యాఖ్యాతు మనిందితా
తం వై ద్విజాతిప్రవరం తదా శాపభయా న్నృప
శ్లో॥ మంత్రగ్రామబలం తస్య జ్ఞాస్యే నాతిచిరాదితి
ఏవం సంచింతయంతీ సా దద ర్శర్తుం యదృచ్ఛయా
శ్లో॥ వ్రీడితా సా భవ ద్బాలా కన్యాభావే రజస్వలా
తతో హర్మ్యతలస్థా సా మహార్హశయనోచితా
శ్లో॥ ప్రాచ్యాం దిశి సముద్యంతం దద ర్శాదిత్యమండలం
తత్ర బద్ధమనోదృష్టి రభవ త్సా సుమధ్యమా. సం॥ భా॥

మ. మదిఁ గారుణ్యముసేసి విప్రవరుఁ డీమంత్రంబు నాకిచ్చె నే
నిది యేచందమొ చూతు నంచు నొకనాఁ డిచ్చన్ ఋతుస్నాతయై
సుదతీరత్నము పూర్వశైలతటిపై శోభిల్లు తిగ్మాంశుఁ జూ
చిదళత్పద్మముమ్మాక్షి నుల్లసితయై చిత్తంబు రాగిల్లగన్॥

వ. "సహజకుండల కవచాభిరామంబైన తదీయమూర్తి విభవంబున కోటువడి"

ఇట్లు సూర్యునియందు బద్ధానురాగయై మంత్రోచ్చారణచే నాతనిఁ బిలువ నాతఁడును మంత్రబలాహూతుఁడై యరుదెంచి నీకోరిక నీడేర్చెదనని పల్కఁగా

కుంత్యువాచ.

శ్లో॥ గమ్యతాం భగవం స్తత్ర యతఏవాగతో హ్యసి
కౌతూహలా త్వమాహూతః ప్రసీద భగవన్నితి సం॥ భా॥

తే. కార్య మొక్కటియును లేదు కౌతుకమున
నేను మంత్రంబు నొడివితి నింతమాత్రఁ
జేసి నీకు నిచ్చుటికి విచ్చేయనేల
దివికి నరుగుము క్రమ్మఱి దేవ నీవు. ఆం॥ భా॥

సూర్యోవాచ.

శ్లో॥ యది త్వం వచనం నాద్య కరిష్యసి మమ ప్రియం
శప్స్యే కన్యేఽన్యథా క్రుద్ధో బ్రాహ్మణం పితరంచ తే.

శ్లో॥ త్వత్కృతే తాన్ప్రధక్ష్యామి సర్వానపి నసంశయః
పితరం చైవ తే మూఢం యో నవేత్తి తవాఽనయం.

శ్లో॥ తస్యచ బ్రాహ్మణ స్యాద్య యోఽసౌ మంత్ర మదా త్తవ
శీలవృత్త మవిజ్ఞాయ దాస్యామి వినయం పరం. (సం. భా.)

వ. "కావున నిప్పుడు మదీయసమాగమంబున కొండంబడుము. నీకోరిన యట్టి తనయుండు జనియించు; నిట్లు సేయనినాఁడు నిన్నును భవజ్జన నీజనకులను భస్మంబు సేయుదు. మఱియు నీదైన శీలవృత్తంబు లెఱుంగక మంత్రంబు గర్వంబునం జేసి నీ కుపదేశించిన తాపసు నీక్షణంబ నిర్దహింతు" (ఆం. భా)

అని సూర్యుఁడు పలుకఁగా నామెయు ననేకవిధముల బ్రతిమాలి యాతనివలన సుముఖతగానక యాతని సమాగమంబున కొడంబడెను.
(ఆం. భా.)

శ్లో॥ తతః కాలేన సా గర్భం సుషువే వరవర్ణినీ
కన్యైవ తస్య దేవస్య ప్రసాదా దమరప్రభం.

శ్లో॥ జాతమాత్రంచ తం గర్భం కారయామాస భామినీ
ఉత్స్రష్టుకామా తం గర్భం కారయామాస భారత. (సం. భా)

ఆ. కొడుకుఁ గనియెను సహజకుండల కవచాభి
రాము విమలకమలకోమలాక్షు
దీర్ఘబాహుఁ జారుదృఢదేహుఁ దరుణార్క
తేజుఁ గుంతిభోజరాజపుత్త్రి.

వ. "ఇట్లు జనియించిన యర్భకుం జూచి లోకాపవాదభయంబునకుం
దలరి వెఱచి యాక్షణంబ" (ఆం. భా)

శ్లో॥ మంజూషాం శిల్పిభి స్తూర్ణం సునద్ధాం సుప్రతిష్ఠితాం
ప్లవై ర్బహుభి ర్దై ర్బద్ధాం ప్లవనార్థం జలే నృప. (సం. భా

వ. ఆక్షణంబ యొక్క మంజూషలో నబ్బాలకుఁ బదిలం
బుగా నిడి దాని నతిదృఢంబుగాఁ దెప్పం బంధించి" (ఆం. భా)

శ్లో॥ అజినై ర్మృదుభి శ్ఛన్నాం సంస్తీర్ణశయనాం తథా
మంజూషాయాం సమాధాయ స్వాస్తీర్ణాయాం సమంతతః
మధూచ్ఛిష్టస్థితాయాం తం సుఖాయాం రుదతీం తథా
శ్లక్ష్ణాయాం సుపిధానాయా మశ్వనద్యా మవాసృజత్
సముత్సృజంతీ మంజూషా మశ్వనద్యాం తదా జలే.

శ్లో॥ ఏవం బహువిధం రాజ న్విలప్య కరుణం పృథా
అవాసృజత మంజూషా మశ్వనద్యాం తదా జలే.

శ్లో॥ మంజూషా త్వశ్వనద్యా స్సా యయౌ చర్మణ్వతీం నదీం
చర్మణ్వత్యాశ్చ యమునాం తతో గంగాం జగామహ. (సం. భా)

వ. సఖియును దానును గొని చని పురసమీపగతంబైన యశ్వనదీ
ప్రవాహంబున విడిచి కుంతి మోతయు సంతాపంబున విలపించె

వ. అని యేడ్చుచుం గుంతి యచ్చటుం దడయ వెఱచి గూఢప్రకారం
బునఁ గన్యాంతఃపురంబునకు వచ్చి యెప్పటియట్ల వర్తిల్లుచుండె; నట
మంజూషయు నశ్వనదీప్రవాహవేగంబునఁ జర్మణ్వతికిం జని యం
దుండి యమునాగతంబై యటఁజని భాగీరథింబడి సూతవిషయంబునం
బంపానగరంబు చేరువ నరుగుచుండె.

కుంతీదేవి యాశ్రమమున వసియించియున్న గాంధారీ ధృతరాష్ట్రులకుఁ బరిచర్య చేయుచుండ శతపుత్రహతుఁడగు ధృతరాష్ట్రుని దుఃఖమును శమింపఁజేయుటకై వేదవ్యాసుఁడు రా నాతనిఁ జూచి కుంతి తాను గూఢముగ గర్ణసుపుత్త్రుప్రు నడంచి తద్వ్యథకుఁ గారణమగుటచే మనంబున నొందరాని దుఃఖంబును పాపభీతియు వీనిచేఁ గలుగును పాపశమనమును దుఃఖశాంతియు నొసఁగుమని యాతని వేఁడుసందర్భమునఁ దాఁ జేసినపనిని (ఆం. భా.)

శ్లో॥ భగవన్ శ్వశురో మేఽసి దైవతస్యాపి దైవతం
సమే దేవాతిదేవ స్త్వం శ్రుణు సత్యాం గిరం మమ.

అని తనయొద్దకు సూర్యుని రప్పించుటయు, మున్నగు విషయము నంతయుఁ జెప్పుచున్నయది

శ్లో॥ సప్రీతో వరదో మేఽభూ త్కృతకృత్యో మహామునిః
అవశ్యం తే గ్రహీతవ్య మితి మాం సోఽబ్రవీ ద్వచః. (సం. భా.)

ఆ. ...నిత్తు వరము వేఁడు మెయ్యది కోరిక
యనియె నలేఁడు... ... ... ... (ఆం. భా.)

శ్లో॥ ధర్మస్య జననీ భద్రే భవిత్రీ త్వం శుభాననే
వశే స్థాస్యంతి తే దేవా యాం స్త్వ మావాహయిష్యసి.

శ్లో॥ అథ హార్మ్యతలస్థాహం రవి ముద్యంత మీక్షతీ
సంస్మృత్య త ద్వృషే ర్వాక్యం స్పృహయంతీ దివాకరం. (సం. భా.)

ఆ. అద్భుతమునఁ బొంది యమ్మంత్రమహిమ ము
ల్లమున నెప్పుడును దలంతు నొక్క
నాఁడు మేడమీఁదఁ బోడిమి నేనుండి
కంటిఁ బొడుచుచున్న కమలమిత్త్రు. (ఆం. భా.)

శ్లో॥ స్థితాఽహం బాలభావేన తత్ర దోష మబుధ్యతీ
అథ దేవ స్సహస్రాంశు ర్మత్సమీపగతో ఽభవత్.

(సం. భా.)

క. కని యిది కన్యక దోషం
   బని తలఁపక బాల్యసంభృతాజ్ఞానము వే
   డ్కఁ నొనర్ప నావహించితి
   ముని మంత్రబలమున సూర్య మునినాథవరా.

శ్లో॥ స మా మువాచ వేపంతీం వరం మత్తో వృణీష్వహా
   గమ్యతా మితి తంచాఽహం ప్రణమ్య శిరసాఽవదం.

శ్లో॥ సమా మువాచ తిగ్మాంశు ర్వృథా ఽహ్వానం న మేఽక్షమం
   ధక్ష్యామి త్వాంచ విప్రంచ యేన దత్తో వర స్తవ.

శ్లో॥ త మహం రక్షతీ విప్రం శాపా దనపకారిణం
   పుత్రో మే త్వత్సమో దేవ భవేదితి తతో ఽబ్రవం.

సీ. అడుగు మిచ్చెద వరం బనిన వడంకుచుఁ
   గేలు మొగిడ్చి పొండేల యిచట
   ననిన వృథాహ్వాన మాచరించుట తప్పు
   నిన్నును నెవ్వఁడు నీకు మంత్ర
   మిచ్చె నాతని శపియింతుఁ జుమ్మాయని
   పలికె నయ్యర్కుఁడే నలికి గురుని
   నిరపరాధుని శాపనిహతుఁగాఁ జేయుట
   కోర్వక పుత్రకు నొసఁగు దేవ

తే. కృప భవత్సము ననిన నయ్యపరిమేయ
   తేజుఁ డాత్మ తేజమున నాదృఙ్ముఖేంద్రి
   యములు మనసును సమ్మోహితములు సేసి
   యపుడు తనయుండు పుట్టెడు మనిమొఁ బిదప.

శ్లో॥ తతోఽహ మంతర్భవనే పితు శ్చిత్తానురక్షిణీ
   గూఢోత్పన్నం సుతం బాలం జలే కర్ణ మవాసృజమ్.

శ్లో॥ నూనం తస్యైవ దేవస్య ప్రసాదా త్పునరేవతు
   కన్యాఽహ మభవం విప్ర యథా ప్రాహ స మా మృషిః.

తే. నీకుఁ గన్యాత్వవికలత గాకయుండ
వరము నిచ్చితి ననుచు దివమున కరిగె
జనకముఖబంధుచిత్తవంచనము నడపి
గూఢమందిరాంతరమునఁ గొడుకుఁ గంటి.

## 4

సంస్కృతభారతాదిపర్వమున దుర్వాసుఁడు కుంతి చేసిన సపర్యకు మెచ్చి, యాపద్ధర్మముగ సంతానోత్పాదనమంత్రోపదేశముఁ గావించెను. కుంతి యొకనాఁ డామంత్రప్రభావము నారయుటకై తాఁ గన్యకయయ్యు మంత్రోచ్చారణ గావించెను.

(ఉదా.)

శ్లో॥ తథోక్తా సాతు విప్రేణ కుంతీ కౌతూహలాన్వితా
కన్యాసతీ దేవమర్క మాజుహావ యశస్వినీ

యని వ్రాయఁబడెను. అంతియే కాని నదీప్రదేశముననో సౌధోపరిభాగముననో లేక గూఢమందిరముననో సూర్యు నాహ్వానించెనని వ్రాయఁబడలేదు.

ఆంధ్రభారతమున "అమ్మంత్రశక్తి యెఱుంగ వేఁడి కుంతి యొక్కనాఁ డేకాంతంబ గంగకుం జని గంగనీళ్లఁ గాళ్లు మొగంబుఁ గడిగికొని" యని కలదు. సంస్కృతభారతమున నీప్రసక్తియే లేదు.

కుంతి తనమంత్రబలిమిచే సూర్యు నాహ్వానింప నాతఁడు రాఁ, దాఁ గన్యకయగుటచే లోకాపవాదయు, కన్యాత్వహానియుఁ గలుఁగునని వెఱచి యాతని స్వస్థానమునకుఁ బొమ్మనెను. అంత నాయంశుమంతుఁడు కోపించి

శ్లో॥ మంత్రదానేన యస్మా త్త్వం అవలేపేన దర్పితా
కులంచ తేఽద్య ధక్ష్యామి క్రోధదీప్తేన చక్షుషా.

యని యామెను భయపెట్టినట్లు సంస్కృతభారతమునఁ గలదు.

ఆ. ఎఱుకలేమిఁ జేసి యింతు లెప్పుడు నప
రాధయుతలు సాపరాధలయిన
వారిఁ గరుణ నెల్లవారును రక్షింతు
రనుచు సూర్యునకు లతాంగి మ్రొక్కె. (ఆం. భా.)

వ. "సూర్యుండును నీకు దుర్వాసుం డిచ్చినవరంబును మంత్రంబుశక్తియు నెఱుంగుదు. మదీయదర్శనంబు వ్యర్థగాదు. నీయభిమతంబు సేయుదుననెను. కాని యామెను లోపి వంశమును నశింపఁజేయుదునని యనినట్లు లేదు. సూర్యసమాగమానంతరము సద్యోగర్భమునఁ గర్ణుఁడు జనియించినాఁడు. ఆబాలునిఁ జూచి యామె కొంతవడి చింతించి యొక పేటికను రత్నపూర్ణముఁ గావించి యందా బాలు నునిచి జలమందు విడిచిపెట్టె నని సంస్కృతభారతమునఁ గలదు.

శ్లో॥ మంజూషాం రత్నసంపూర్ణాం కృత్వా బాలసమాశ్రితాం
ఉత్ససర్జ కుమారం తం జలే కుంతీ మహాబలం. (సం. భా.)

వ. వందురి వగచుచున్నదాని పుణ్యస్వభావంబనా నాపితృప్రేరితంబై యనర్ఘరత్నవసుభరితంబైన యొక్క మంజస నదీప్రవాహవేగంబునం దనయొద్దకు వచ్చిన దానిలోఁ జెచ్చెరఁ దనకొమరుం బెట్టి కుంతి నిజగృహంబునకు వచ్చె.

సంస్కృతభారతమున సూర్యునితోఁ గుంతి యెప్పుడు సంగమించెనో తెలుపఁబడలేదు. సూర్యానుగ్రహమువలనఁ బేటిక వచ్చినట్లును లేదు. ఆంధ్రమున సూర్యానుగ్రహమువలనఁ బేటిక వచ్చినట్లు లిఖింపఁ బడినది *

సంస్కృతభారతమున సూర్యానుగ్రహమువలన పేటిక వచ్చినదని లేకపోవుట కొంత హాస్యాస్పదముగ నుండును. కుంతి తనకు సూర్యునితో సంగమమగునని యు, సద్యోగర్భమునఁ బుత్రజన్మ మగునని యు

* నేఁజూచిన ప్రతియందుఁ గనఁబడిన శ్లోకార్థమునుబట్టి యిట్లు వ్రాయవలసివచ్చినది. ఈసందర్భమున వేరొకప్రతియందు మాత్రము మరియొక శ్లోకముండునేమోయని సందేహము.

శిల్పులను రావించుట, వారిచే పేటికను తయారుచేయించుట మున్నగు చర్యనంతయు నేరైనఁ జూతురనియు రహస్యము దాఁగదనియు కాఁబోలు నెఱ్ఱనగా రీవిధానమునంతయుఁ బ్రోసిరాజు చేసినారు. ఆది పర్వమున నీప్రసక్తియే లేదు. గంగానదియందుఁ బేటికను విడిచిన ట్లాదిపర్వమునఁ గలదు. సంస్కృతమున "జలే కర్ణ మవాసృజత్" అని జలమందు విడిచె నని చెప్పఁబడెను. కాని నదియం దని వ్రాయఁబడలేదు.

ఆరణ్యపర్వమునఁ గుంతి సూర్యుని రావించి తత్సంయోగమున నవమాసములు మోసి పుత్రునిఁ గనినట్లు వ్రాయఁబడెను. కాని మేడపై సూర్యుని రావించినట్లు లేదు.

ఆదిపర్వమున నదీతీరమున సద్యోగర్భమునఁ బుత్రునిఁ గనినట్లు వ్రాయఁబడినది.

ఆశ్రమవాసపర్వమునఁ గుంతి సౌధముపైనుండి యుదయించుచున్న బాలభాస్కరునిఁ జూచి మంత్రబలిమిచే నాతని రావించినట్లును, తత్సంయోగమున గూఢముగఁ బుత్రునిఁ గనినట్లు కలదు. శేషించిన భాగమంతయు నారణ్యపర్వగాథ కించుమించు సరిపడియుండనోపు.

ఆదిపర్వమునఁగల కర్ణజననవర్ణనముకంటె నారణ్యపర్వమునఁ గల తజ్జన్మవర్ణనము విపులముగనున్నది. ఈ రెంటికంటె నాశ్రమవాసపర్వమున మిక్కిలి సంక్షిప్తముఁ జేయఁబడినది.

## 6

వ్యాసప్రోక్తమనఁదగు సంస్కృతభారతమున నీకర్ణజననము భిన్నాభిప్రాయములతో వ్రాయఁబడుటకుఁ గలకారణమేమైయుండును? సంస్కృతభారతకర్త వ్యాసుఁడొక్కఁడే యైనచో నేతద్వృత్తాంత మాదియారణ్యాశ్రమవాసపర్వములలో భిన్నముగా నేలరచియించియుండును?

ధర్మాధర్మవిచక్షణశీలుండును, సకలాగమవేదియు, తపస్సంపాదితదివ్యజ్ఞానసర్వజంతూత్పత్తిస్థితిలయవిదుండునగు నీవ్యాస భట్టారకుఁడు, దుర్ఘటములు దురూహ్యములు నగుఋగాదిచతుర్వేదములనుండి కర్మ,

జ్ఞానపరమగు పట్టులను సేకరించుటయేగాక వేదపఠనమననాభ్యాసముచేఁగాని మానవుఁడు ముక్తినొందఁజాలని వేదచోదితకర్మలను, మంత్రములను తదర్థములను ధర్మసూక్ష్మములను సర్వమానవహృదయగోచరమగు నట్లిందు చిత్రించుటయేగాక, ఖండఖండాంతరపండితుల చేతను జ్ఞానయోగుల చేతను నిరంతరము శ్లాఘింపఁబడుచున్న సర్వోపనిషత్సారమైన భగవద్గీతనుగూడ నిందు లిఖించుటచే నిద్దానిమహత్త్వ మింతింతని చెప్పఁజాలము. కావుననే చతుర్వేదములకంటె గుణాధిక్యముచే భారతమమయి యుండుటవలననే భారతమని పిలువఁబడుచున్నది.

శ్లో॥ ఏకత శ్చతురో వేదాన్ భారతం చైకదేశతః।
పురా కిల సురై స్సర్వై స్సమేత్య తులయా ధృతం ॥

శ్లో॥ తదా చతుర్భ్య స్సహాస్స్యేభ్యో వేదేభ్యో హ్యధికంయదా ।
తదా ప్రభృతి లోకేఽస్మిౕ మహాభారత ముచ్యతే ॥

శ్లో॥ మహత్త్వేచ గురుత్వేచ ధ్రియమాణం యతోఽధికం ।
మహత్త్వా ద్భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే ॥

ఇందు వివరింపఁబడని ధర్మములును నియమింపఁబడని కర్మలును శాసింపఁబడని నీతులును చెప్పఁబడని యితిహాసములు నెద్దానియందును లేకుండుటచే "భారతః పంచమో వేదః"యను నానుడి యిద్దానికిఁగల్గినది. కావునఁ జతుర్వేదములకంటె నీమహాభారతము సారతరమైనదని చెప్పవచ్చును.

ఇట్టి మహత్తరమగు పంచమవేద మనఁదగు మహాభారతమును రచించి, భారతవృక్షమున కురుస్కంధమనఁదగు కర్ణజననము నిట్లు రచించియుండు టాతని ప్రతిభాహానియు, పౌర్వాపర్యవిచక్షణజ్ఞానహీనతయు, ఆగతానాగతవేదిత్వము మున్నగువానికి లోపము సంభవించునుగదా?

కావున వ్యాసుఁడొక్కఁడే మహాభారతమును రచింపలేదని చెప్పవలసియుండును. కాన వ్యాసరచితమగు నీభారతమంతయుఁ బ్రక్షిప్తములతో నిండియుండఁదగు.

వైదికధర్మకర్మసర్వస్వమనఁదగు మహాభారతము సర్వతోముఖ
ముగ నన్నిమతగ్రంథములను ద్రొక్కి, శిరోభూషణమై యున్నతస్థానము
నలంకరించియుండుటఁ జూచి, యోర్వఁజాలక, నాఁడు జైన బౌద్ధ
శైవ చార్వాకాది మతప్రచారకులుఁ దమ మతప్రచారప్రహారములచే
నీయద్వైతము నణఁగఁద్రొక్కి మసుఁగుఁ దొడఁగి మూలనుంపఁదలఁచి
యిం దపృచ్ఛములు నసంగతము లనఁదగు కల్పనలఁ జొనిపి యేతన్మతా
వలంబకుల కీ యద్వైతమున విముఖతఁ గలుఁగఁజేయనెంచి తా మట్లు
కల్పించియుందురు. కావున నీకర్ణజననము భిన్నభిన్నముగ రచింపఁబడి
యుండనోపు.

## 7

ప్రాచీనకాలమున ముద్రణయంత్రసౌకర్యము లేమింజేసి కవులు,
పండితులు మున్నగువారు తాటియాకులపైఁ గాని, భూర్జపత్రములపైఁ
గాని వ్రాయుచుండెడివారు. అట్టిసమయమున నొకరిపుస్తకమును వే
ఱొకరు చూచి వ్రాసికొనుటచేతను, తాము పండితులై యుంటచేతను
తమకిష్టములేని పట్టులను విడుచుటయు లేనివానినిఁ జొనుపుటయుఁ
గలదు. మఱికొందఱు తాము వ్రాయలేక వ్రాయసకాండ్ర నేర్పఱచి
వ్రాయించునపుడు వారు తప్పొప్పులను సంగతాసంగతములను గుర్తిం
పఁ జాలక ప్రమాదవశమునఁ గొన్నిపట్టులను పద్యములను పాదము
లను పదములను పుటలను గూడ విడుచుటయుఁ గలదు. కావున దేశ
మునఁ గల్గుప్రతులన్నియు నొక్కవిధముగ నుండకున్నవి.

కొందఱు తమతమయాశయములకు నాధారముగ నుండవలెనని
విషయమును తాఱుమాఱుచేయుచుండుటయుఁ గలదు.

నేఁడు కొందఱేది వ్రాసినను, ముద్రింపించినను, మేము చూ
చినతాళపత్త్రప్రతియందు ననియు, "మాపితామహ మాతామహప్రపి
తామహులు సంపాదించి యుంచిన తాళపత్త్రప్రతులను శోధించియు,

మామిత్రులు దయచేసిన ప్రతులను శోధించియు" నని తాము వ్రాసిన వ్యాసమునఁ గాని గ్రంథమునఁ గాని నొక్కి వ్రాయుచుందురు. అవసరార్థ మేరైనఁ జూపుమన్నచో నాప్రతులు మొన్నమొన్ననే పోయినవనియు, లేక నెరో తస్కరించి రనియు నేవో సాకులు కల్పించి కనఁబడలేదని త్రోసిరాజు చేయుచుందురు.

మఱికొందఱు తాటియాకులను దెచ్చి శుభ్రపఱచి కట్టఁగట్టి వంటింటిలో నెలగాని, రెండునెలలు గాని యుంచి, అవి పొగఁబట్టి రంగు మాఱఁగా వానిలో నొక పత్రమును గాని, రెంటిని గాని, పూర్తిగాఁ గాని స్వీకరించి దానిపై తమకనుకూలముగ వ్రాయుటగాని వ్రాయించుట గాని జరిపించి పూర్వప్రతియందుఁ గలపత్రముల నూడదీసి యందు వీనిని జొనిపి తమవాదమును నిలఁబెట్టుకొనుట కిట్టి పుల్లాకులను పడు మహానుభావులు నేఁడుకూడఁ గొందఱు కలరు.

మఱికొందఱు ప్రాఁతకాగితపుపుస్తకములనుగూడ మార్చుటకై కొన్ని తెల్లకాగితములపై వ్రాసి వానిని తవుడులో నెల గాని రెండునెలలు గాని యుంచి తదుపరి తమయాశయములను బ్రకటింతురు.

కాన దేశమునఁగల సంస్కృతాంధ్రభారతప్రతులు భిన్నభిన్నములుగ నున్నవనుటలో నాశ్చర్యము లేదు.

నూతనముగఁ బ్రాచీనగ్రంథముల నేరైన సంపాదించి ప్రచురించుట భాషాద్రోహమేకాని, భాషాప్రాభవము కాఁజాలదని కొందఱి యాశయము. అం దున్న దున్నట్లు ప్రచురింపక, కవికాలమునకుఁగాని కవనమునకుఁగాని తమయాశయమును ముడివెట్టఁదలఁచి సహజపాఠమును బాఠాంతరముగాను స్వబుద్ధికల్పితపాఠమును గ్రంథస్థపాఠమును గాను ముద్రింపించి, అరసున్న, శకటరేఫ సంధులను నిండుసున్నలుగాఁ గావించి యాకవి నతిప్రాచీనునిగానో లేక యతినవీనునిగానో గావించి తుదకు విరూపినిఁజేసి మొత్తికుదవేయుచున్నారు.

ఇట్టి విచిత్రసంఘటనలను నేఁడు మనము కన్నారఁజూచుటయుఁ జెవులార వినుటయుఁ గలదుగదా! నవీనకాలమున నిట్టి విచిత్రము లీర్ష్యవలనను పట్టుదలవలనను జరుగుచుండ ముద్రణయంత్రములు లేని నాఁటికాలమున నెంతగా మాఱియుండునో మన మూహింపఁదగి యున్నది.

కావున సంస్కృతభారతమున నత్యధికమగు కల్పనజరిగియుండు టయు నందువలన దేశమునఁ గలప్రతులన్నియు నొకదానితో నొకటి పొందికగల్గి యుండకుండుటయు సుస్పష్టము. భారతాంధ్రీకరణకర్త లేభా రతమును జూచి తా మాంధ్రీకరించిరో మన మూహింపఁజాలము. కొంద రూహించితిమని చెప్పుట గొప్ప పొరపా టనకతీరదు. భారతాం ధ్రీకరణము మూలానుసరణమో? భావానుసరణమో? నిర్ణయించుట కూడఁ గష్టసాధ్య మనకతీరదు.

ఆంధ్రభారతమునుగూర్చి వెలువడిన విమర్శనవ్యాసములు, (పత్రికలు) గ్రంథములను దగ్గఱనుంచి నొండొంటితోఁ బోల్చిచూచి నచో నొక్కొక్క వ్యాసమునను, గ్రంథమునను, మూఁడుపాళ్లుచౌర్యము అరపాలు వ్యర్థపదములు కలిగి మిగిలినపాలు సత్యదూరముతో నిండి యున్నవి. ఇట్టివి బయలుదేరుట కసూయ, ప్రతిభాలాలసతలే కారణ మనకతీరదు. వీనియం దూహాతీతములును యుక్తిదూరములునగు కల్ప నలు మెండు. క్రోధపూర్ణమగు పదగమనిక, అంతస్సారశూన్యమగు పదకదంబకము, నిస్సారము నిరుపయోగము నగు భావసిద్ధియుఁ గలిగి, కుంకటివేరునకు చీడపురుగువలె పట్టి పీల్చి పిప్పిచేసి కవితావల్లరిని నామ రూపరహితముగఁ జేయుచున్నవి. కావున నేవిమర్శనమునైన నాధార ముగఁ గొనుటకు వీలుచిక్కదు.

భండార్కారుపరిశోధకులు దేశమునఁగల సంస్కృతప్రతులను జాలవఱకు సేకరించి శోధించి ప్రక్షిప్తములను పుటచివరనుంచి, వానిని ప్రక్షిప్తములని విమర్శించి, మూలపాఠమును నిరూపించియున్నారు.

ఆభారతముతో మనయాంధ్రభారతమును సరిపోల్చి చూచిన నింతింతన
రాని వ్యత్యాసము గోచరించును. పై నుదహరించిన విమర్శనలనుగాని,
భారతప్రతులనుగాని చూచి మనము సత్యసూత్రమును గ్రహింపఁ
జాలము.

సంస్కృతభారతకర్త వ్యాసుఁ డొక్కఁడేయైనను రానురాను కాల
ప్రభావముచే నం దూహింపలేని ప్రక్షిప్తములు చేరియున్నవి. మూల
మే ప్రక్షిప్తభూయిష్ఠమైనప్పుడు తత్ప్రతికృతియగు నాంధ్రభారతము
భిన్నముగ నున్నదను టతిశయోక్తి కాఁజాలదు. కావున వ్యాసహస్త
లిఖితభారత మియ్యది? నన్నయతిక్కన ఎఱ్ఱనల హస్తలిఖితభారత
మియ్యది యని మనము నిర్ధారణఁజేయలేము. అట్లు నిర్ధారణచేయలేన
ప్పుడు మూలానుసరణమో! భావానుసరణమో? స్వబుద్ధిభావప్రకాశ
నమో మన మూహింపలేము.

## 8

నేను 1934 వ సంవత్సరమున నాంధ్రభారతమును బఠించుచుండ
నాకుఁ గొన్ని సందేహములు పొడమినవి. అందలి కర్ణజననమునుగూర్చి
తిరుగ నేను భారతమును బఠించితిని. కాని నాసందేహము పోకుండు
టచే 1935 వ సం॥రం ఫిబ్రవరి నెలలో చిన్న వ్యాసమును రచించి త్రిలిం
గపత్రిక కంపితిని. అయ్యది యానెల పదునెనిమిదవ తేదీని ముద్రింపఁ
బడినది. అద్దానిని నామిత్రులగు బ్రహ్మశ్రీ బాలకవి బాలకళానిధి
భాషాప్రవీణ యామిజాల పద్మనాభస్వామిగారు చదివి మూలముతో
సరిఁ బోల్చి వ్రాయుమని నన్నుఁ బ్రోత్సహించిరి. కాని నే నపుడు
కార్యాంతరాసక్తుఁడనగుటచే వ్రాయలేకపోతిని.

కావున, పండితప్రకాండులును కవిపుంగవులును విమర్శకతల్లజు
లును నే వ్రాసిన వ్యాసమునందలి యవగుణంబులను త్యజించి సుగు
ణంబులను గ్రహించి మన్నింతురుగాక.

ఓం తత్సత్.

# శ్రీ రా మో పా స్తి.

విద్వాన్, పాలెపు వేంకటరత్నము.

శా. శ్రీకిం గాఁపురమై యశేషమునిహృత్సింహాసనాసీనమై
పాకారి ప్రముఖాఖిలామర మనఃపంకేజరోలంబమై
రాకాశీతమయూఖ శుభ్రకిరణభ్రాజిష్ణువై యీప్సిత
ప్రాకామ్యప్రదమైన రాఘవపరబ్రహ్మంబుఁ జింతించెదన్.

సీ. శారద యామినీసమయామలజ్యోత్స్న
కాహాసరుచులు వక్త్రమునఁ జెలఁగ
శతపత్రపత్ర విశాలసుందరలోచ
నాంతదీప్తులు మనోహ్లాద మొసఁగ
విశ్వసమ్మోహకృద్విపులవక్షస్థ ము
క్తాహారతతి ధగద్ధగల నీన
శివధనుఃపాటనాంచితభుజార్గళ విల
సచ్చాప మత్యంతశక్తి నొప్ప
ధరణిజయు లక్ష్మణుఁడు నిరుదండ నిలువఁ
బాదసేవాపరాయణ వాయుపుత్ర
మస్తకన్యస్తహస్తపద్మము రహింప
ఠీవి నొప్పారు రఘురాము సేవఁ దలఁతు.

ఉ. వేలుపురాచవాని కనువిందయి కోడిగమాడి పూతమౌ
శీలము నగ్గియం దిడిన చేడె యఘంబును గూడ ధూతమౌ
లీల లసత్పరాగపటలిన్ ఘటియించు మహత్త్వముండు నే
కాలికొ దానిఁ గొల్తు భవకల్మషము ల్పరిమార్చుకొంటకై.

శా. ఆఁకొన్నాఁడవ రామచంద్ర! తినవయ్యా తీయనౌపండ్లు నీ
కై కోయించితి సుంతయైన దయరాదా దాసురాలన్నదో
యీ కానం బడరానిపాట్లుపడుచుంటే యంచుఁ బ్రార్థింపఁగా
సాకల్యంబగు మోక్షమున్ శబరి కిచ్చాశక్తి నీవే ప్రభూ!

క. మనసిజ సౌందర్యయుతం, బును నీరదనీలరమ్యమును కౌసల్యా
జనయిత్రీ పుణ్యఫలం, బును నా శ్రీరామచంద్రమూర్తి భజింతున్

## తాటియాకుల తడవులాటలు.

చిలుకూరి పాపయ్యశాస్త్రి, మేనేజరు-పరిషత్తు.

ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున నించుమించుగ నయిదువేల తాటియాకు పుస్తకముల సంచయము కలదు. సాధారణముగ ఆంధ్రసాహిత్యపరిషత్తనినతోడనే యాంధ్రగ్రంథములే గాని సంస్కృతగ్రంథము లుండవని యొక యూహ. కాని తాళపత్రములలో సంస్కృతగ్రంథములు, ఆంధ్రగ్రంథములు సమముగానే యున్నవి. మిగిలిన భాండాగారములలో నుపలభ్యములు కాని పెక్కుగ్రంథము లిందు గలవు. ఈనడుమ ఆతాటియాకుఁబ్రతులఁ దిరుగవైచునపుడు నాకు గోచరించిన కొన్ని గ్రంథములను పాఠకులకు ఎఱుకపఱుపఁగోరి యుపక్రమించుచుంటిని.

### భారతీచమత్కారము.

శ్రీశంకర భగవత్పూజ్యపాదులచే ముముక్షువులకుఁ బరాశక్తి స్వరూపముఁ దెలుపఁగోరి 'సౌందర్యలహరి' యను పేర శ్రీదేవీస్తోత్రము రచియింపఁబడి యున్నది. అయ్యది మంత్రశాస్త్ర సంప్రదాయములను కూలంకషముగ నెఱిఁగిన శ్రీదేవతోపాసకులకుఁ దక్క నితరులకు దుర్బోధము దురవగాహము నై యున్నది. వ్యాఖ్యాత లెంత శ్రమపడినను ఏకదేశమునే తెలుపఁగడఁగుచున్నారు గాని కూలంకషముగ భావవివరణ మేరికిని సాధ్యముగాకున్నది. పెక్కు వ్యాఖ్యానములున్నను ముద్రితమై ప్రసిద్ధముగ లభించునది లొల్ల లక్ష్మీధర పండితునిచే రచింపఁబడిన వ్యాఖ్యానమే ఈ భారతీ చమత్కార మనునదియు ఆ సౌందర్యలహరికే వ్యాఖ్యానము. దీని రచించిన యాతఁడు మహోపాధ్యాయ ముకుంద సుధీతనయ కామదేవ సూరి. ఈప్రతిసంఖ్య 514. దీనిలో నలువదిరెండు పత్రములు గలవు మొదటిపత్రము లేదు. నడుమను బదిపత్రములు పోయినవి. వ్రాఁతతీరు సుస్పష్టముగ లేదు. వ్రాయసగాని పేరు తెలియరాదు.

నలువది యొకటవ సంఖ్యగల పత్రమున నలువదియవ శ్లోకముతుదిని-"ఇతి మహోపాధ్యాయ ముకుంద సుధీతనయ కామదేవ సూరివిరచితే ఆనందలహరీ స్తుతివివేచనే భారతీచమత్కారనామని ప్రథమోల్లాసః.

శ్లో. ఆనందలహరీస్తోత్ర వ్యాఖ్యానే సన్మితాక్షరే ।
భారతీయ చమత్కారే ఽప్యగమత్పూర్వ విశ్రమః ॥
సుధాకలశకోశచి జ్ఞకవపేయుపేయః కరిమ్
కపీతటపరిస్ఫుట ద్వికటది క్తశే శాటికమ్ ।
సుధాకరకరాంకుర ప్రకరచారుచుంబిస్ఫుర
త్కపర్దభవ మాదరా త్కిమపి జృంభతాం మేపురః.
సర్వతంత్రానుసారేణ వ్యాకృతోంశో విశేషతః
దుర్వివేక స్తదన్యోంశో యథాశక్తి ప్రకాశ్యతే." అని కలదు. దీనిని బురస్కరించుకొనియే యీ కామదేవసూరి ముకుందసుధీతనయుఁ డని యు, సర్వతంత్రస్వతంత్రుఁడనియు గోచరించుచున్నది. ఇఁక నీతని వ్యాఖ్యానమందుఁ బ్రసంగవశమున నాయాశాస్త్రసంప్రదాయము లన్నియుఁ గూర్పఁబడినవి. మంత్రశాస్త్రమునందలి రహస్యములను హెచ్చుగ నిందుఁ దెలిపియున్నాఁడు. ఆవిషయము లన్నియు శ్రీ విద్యోపాసకులకు సమయమతానుసారులకు మిక్కిలి యుపయోగకరములు. శ్రీచక్రప్రస్తారమును గూర్చి తొలుత నీతఁడు "శివశ్శక్త్యాయుక్తః" అను శ్లోకమున విపులముగ వివరించి యున్నాఁడు. ప్రతిశ్లోకమునందును నేదియో యొక యపూర్వవిషయము నీతఁడు సూచించియే యున్నాఁడు. మచ్చునకుఁ గొన్ని పంక్తుల నిచ్చుచున్నాఁడను.

"యద్వా సమయిమతానుసారేణ అంతరారాధనే రసామ్నాయ మహసః రసస్య సుధాయాః ఆమ్నాయో గుణానా మాధిక్య మేతదాత్మకం మహః కాంతిర్యస్యసః. రసామ్నాయమహః తస్మాత్సకాశాత్ చరణయుగళాంతర్విగళితైః చరణనిర్ణేజనజలై రిత్యాది. శిరసిచంద్రమండలాకారేణ శ్రీచక్రం చకాస్తీతి సమయిసమయః. యథాభిహితం భైరవయామళే.

ఇట్టి విషయవిశేషముతోఁగూడి యపూర్వమైన యీవ్యాఖ్యానము శ్రీవిద్యోపాసకులకు నత్యంతోపకారక మగునని భావించుచున్నాఁడను.

# శ్రీనాథుని కవిత్వతత్త్వము-ఆదికావ్యోక్తులు.

కుందూరి ఈశ్వరదత్తు బి. ఏ.,

| | | | | | |
|---|---|---|---|---|---|
| చిగురొత్త | ... | తృతీ. | ఆ. | ప. | 40 |
| సంతరించి | ... | చతు. | ఆ. | ప. | 78 |
| బయలుపఱుప | ... | పంచ | ఆ. | ప. | 29 |
| నూలుకొలుప | ... | ... | – | – | ... |
| చిట్టమిడువ | ... | ... | – | – | ... |
| జీఱువార | ... | ... | – | – | ... |
| జీలువార | ... | ... | – | – | 44 |
| మురువుసూప | ... | ... | – | – | ... |
| నీడసూప | ... | ... | – | – | ... |
| విందుసేయ | హారవిలాసము | పంచ | ఆ. | ప. | 47 |
| పీడుకొలుప | ... | ... | – | – | 48 |
| పవ్వళింప | ... | సప్త. | ఆ. | ప. | 139 |
| తురఁగలింప | ... | ... | – | – | ... |
| నీడఁబడ్డ | ... | ... | – | – | 128 |
| గొండ్లిపరిఢవిల్ల | నైషధము. | ప్రథ. | ఆ. | ప. | 9 |
| ఓలలాడి | ... | ... | – | – | 7 |
| సంగ్రహించి | ... | ... | – | – | ... |
| ఇచ్ఛగించి | ... | ... | – | – | ... |
| అవఘళించి | ... | ... | – | – | 37 |
| సరసమాడి | ... | ... | – | – | ... |
| వియ్యమంది | ... | ... | – | – | ... |
| మక్కళించి | ... | షష్ట. | ఆ. | ప. | 68 |
| విందుసేయ | ... | సప్త. | ఆ. | ప. | 41 |
| నటింప | ... | ... | – | – | 46 |
| మేలవించి | ... | ... | – | – | 93 |
| పరిఢవించి | ... | ... | – | – | 149 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదరించి | ... | ... | – | – | 172 |
| జలంబుపాలుగాన్ | ... | అష్ట. | ఆ. | ప. | 70 |
| అచ్చుపఱచి | ... | ... | – | – | 112 |
| నెలవుకొలిపి | ... | ... | – | – | ... |
| వక్కాణించి | సుకుమారచరిత్రము. | ద్వి. | ఆ. | ప. | 61 |
| మేలవించి | ... | ... | – | – | ... |
| ప్రస్తరించి | ... | ... | – | – | 87 |
| పల్లవించి | ... | ... | – | – | ... |
| పిచ్చలించి | ... | ... | – | – | ... |

ప్రతి సీసపద్యపాద మొక వాక్యముగాను, బైని సూచింపఁబడిన క్రియ లాపాదమున కంతమందును గూర్చి వ్రాసినవారలలో సోమన జక్కన శ్రీనాథకవు లొకరికొకరు మించినవారు. శ్రీనాథుని సీసపద్య రచనఁ గూర్చి విపులముగ వ్రాయఁదలఁచి, యీప్రశంస నింతటితో విరమించెదను. కవితాసామ్యమే యిచ్చటి సందర్భము.

**తిక్కనసోమయాజి - ఎఱ్ఱాప్రెగడ.**

కాశీఖండపీఠికలోనె శ్రీనాథుఁడు తిక్కన శంభుదాసుల కవిత్వ ము ననుసరించితినని చెప్పినాఁడు.

వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా
భ్యుచితబంధముగ నొకొక్కమాటు
పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని శేవ
సూక్తి వైచిత్రి నొకొక్కమాటు.

శ్రీనాథుఁ డెంతచెప్పినాఁడో యంతను జేసినాఁడు. వారివారి కవితాసామ్యమును గూర్చి ప్రత్యేకముగ వ్రాయవలసియున్నది. అది యొక యుద్గ్రంథ మగును.

మహాభారతములోని యీక్రింది పద్యమును, శ్రీనాథకవి చాటు పద్యమును బరిశీలించి తారతమ్యమును గనుఁడు.

మ. ధృతి వేదంబులు నాలుగుం జదివి భూదేవుండు నానాధ్వర
వ్రతదీక్షారతుఁడైన యాతఁ డమరావాసంబునం దుండు ను
న్నత వృత్తస్తనభారమంథరమరున్నారీపరీరంభసం
భృతరోమాంచసమంచితాంగుఁడగుచున్ బెక్కేండ్లు సంప్రీతితోన్.

మహాభారతము. అరణ్యపర్వము. 4-211.

మ. శ్రుతిశాస్త్రస్మృతు లభ్యసించుకొని విప్రుం డంత నానాధ్వర
వ్రతుఁడై పోయి కనున్ బురందరపురారామద్రుమానల్పక
ల్పతరుప్రాంతలతాకుడుంగ సుఖసుప్తప్రాప్తరంభా భగ
ప్రతిరోమాంకురపాటన క్రమకళాపాండిత్యశౌండీర్యమున్.

శ్రీనాథుని చాటుపద్యము.

## శ్రీనాథుఁడు - సోమనాథుఁడు.

శ్రీనాథుఁడు పండితారాధ్యచరిత్ర పద్యకావ్యముగా నొనర్చెనని మనకుశృంగారనైషధకృతివల్లను,పిడుపర్తి సోమనాథకవి బసవపురాణము వల్లను దెలియుచున్నది.

శృంగారనైషధములో శ్రీనాథుఁ డిట్లు వ్రాసెను.

క. జగము నుతింపఁగఁ జెప్పితి
ప్రెగడయ్యకు నా యనుంగుఁ బెద్దనకుఁ గృతుల్
నిగమార్థ సారసంగ్రహ
మగు నాయారాధ్యచరిత మాదిగఁ బెక్కుల్.

బసవపురాణములో నీక్రింది సీసపద్యపాదమునం దీప్రసక్తి కలదు.

సీ. విరచించె జైమినివేదపాదస్తవం
బూకపాదమునను వేదోక్తి నిలిపి
హరభక్తి వైదికంబని శ్రుతు లిడి చెప్పెఁ
బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
పరవి శ్రీనాథుఁ డాచరిత పద్యప్రబం
ధము చేసె ద్విపదలు తఱచు నిలిపి

యాతండు పద్యకావ్యము చేసె నైషధ
మంచిత హర్ష వాక్యములఁ బెట్టి

... ... ... ... ... ...

శ్రీనాథుఁడు సోమనాథుని పండితారాధ్యచరిత్రములోని ద్విపద పాదములఁ గొన్నిటిని మక్కికి మక్కిగఁ దనపద్యకావ్యసీసపాదములలో నెక్కించుకొనెను.

పరవాది మత్తేభపంచాననంబు
పరవాది ఘోరసాగర బడబాగ్ని
పరవాది తస్కర బహుళశూలంబు
పరవాది ఘనవనస్ఫురిత దావాగ్ని
పరవాది విషభూజపటుకుఠారంబు
పరవాది దుష్టదుర్భర ధూమకేతు
పరవాది భూరిభూధరకులిశంబు
పరవాది వల్మీక చిరఖనిత్రంబు
పరవాది నరలతాప్రథితతోత్రంబు
పరవాది భేకభీకర భుజంగంబు
పరవాది పురహర ఫాలనేత్రంబు
పరవాది సారసవర నిశాకరుఁడు
పరవాది వార్ధి శుంభత్కుంభజన్ము

... ... ... ... ...

పండితారాధ్యచరిత్ర - తృతీయప్రకరణము.

పై ద్విపదచరణములఁ బోలిన సీసపద్యపాదములు సోమనాథుని చతుర్వేదసారమునందును గలవు.

సీ. పరవాది మదగజప్రబల పంచాస్యుండు
పరవాది భూధరస్ఫారయశని

పరవాది మేఘనిర్భరపవమానంబు
పరవాది భూరుహప్రథితపరశు
పరవాది తస్కరపటుతరశూలంబు
పరవాది జలనిధి బాడబాగ్ని
పరవాది లతలకు భాస్వల్లవిత్రంబు
పరవాది భేకి భీకరమహాహి
... ... ... ... ... ...

చతుర్వేదసారము. పద్యము 16.

పై ద్విపదపాదములను, సీసపద్యచరణములను శ్రీనాథుఁడు శివరాత్రిమాహాత్మ్యములో నీక్రింది సీసపద్యమునం దనుకరించెను.

సీ. పరవాది మత్తేభపంచాననాఖ్యుండు
పరవాది మండూక పన్నగుండు
పరవాది నవమేఘపవమానధీరుండు
పరవాది సాగరబాడబుండు
పరవాది కుత్కీల భాసురదంభోళి
పరవాది కేంధనపావకుండు
పరవాది చయతమః పటలోగ్రభానుండు
పరవాది భోగిసుపర్ణుఁ డనఁగ
... ... ... ... ... ... ...

శివరాత్రిమాహాత్మ్యము - ప్రథమాశ్వాసము. పద్యము 36.

శ్రీ బండారు తమ్మయ్యగారు ఆంధ్రసాహిత్యపరిషత్తువారి రజతోత్సవసంపుటములోని 'పాలకురికి సోమనాథుఁడు, అనుభవసారము' అను వ్యాసమునందు శ్రీనాథుని సీసపద్యరచనముగూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"ఏపాదమున కాపాదమునకుఁ బదములు తెగిపోయి ముందు పాదమునందలి పదములతోఁ గలియకుండ రచించుటయు నాయాపాద

ములందుఁగూడఁ జాలవఱకుఁ బూర్వోత్తరార్థములు విడివడునట్లు రచించుటయుఁ బాటింపఁదగినది. సీసపద్యరచనమునకిట్టి సంస్కారము శ్రీనాథునితోఁబ్రారంభమైనదని పలువురవిశ్వాసము. కాని యది నిజముకాదు. శ్రీనాథుని సీసరచనమునకు మన సోమనాథుని సీసములే మార్గదర్శకములు; జీవసౌషధములునని యాతని యనుభవసారము చతుర్వేదసారములను సవిమర్శముగఁ జదివినచో నంగీకరింపకతప్పదు."

శ్రీనాథుని సీసపద్యరచనమునకు సోమనాథుఁడు, సోమన, జక్కన, మార్గదర్శకులని చెప్పవచ్చును. సోమనాథుని సీసములకన్నను, సోమన, జక్కన సీసములకు, శ్రీనాథుని సీసపద్యముల కెక్కుడుపోలిక గలదు. శ్రీ తమ్మయ్యగారు వ్రాసినటులు శ్రీనాథుఁడు సోమనాథుని పద్యరచన సహితము మేలుబంతిగాఁ గొని తన సీసపద్యరచన సాఁగించెను.

చతుర్వేదసారములోని యీక్రిందిపద్యములు శ్రీనాథుని సీసపద్యములకు మార్గదర్శకములు.

సో మ నా థుఁ డు.

సీ. హరివీరశైవుఁ డన్నందుకు మఱియు గ
ర్భాధాన ఖండమే ప్రథమసాక్షి
... ... ... ... ... ... ... ...

సీ. బండేమి విష్ణున కుత్పత్తిగలుగుట
కును జయదష్టమి దినము సాక్షి
... ... ... ... ... ... ... ...

శ్రీ నా థుఁ డు.

సీ. కలహంస సంపదఁ గలకలక్రేంకార
కలకలంబైన యీ కొలను సాక్షి
... ... ... ... ... ... ... ...

శివరాత్రిమాహాత్మ్యము. 3-81.

సీ. ఆ సహస్రాక్షుని యాత్మసంశుద్ధికిఁ
బరమసంయమి యింటి పంచ సాక్షి

... ... ... ... ... ... ... ...

హరవిలాసము. 7-22.

సోమనాథుని యనుభవసారములోని యీక్రింది సీసపద్యము శ్రీనాథుని సీసపద్యములలోఁ బెక్కింటికి నొరవడి.

సీ. అఖిల వేదాతీతమగు మూలమంత్రాక్ష
రములకు నతనివాక్యములు తేట
అయ్యక్షరాత్మకుండగు లింగమూర్తి కా
తని మనోభావంబు జనితభూమి
ఆలింగమూర్తికి నాశ్రయంబైన శ
రణుని కాతని కరాగ్రంబుతల్లి
అమ్మహాశరణున కాభరణంబైన
భక్తి కాతని పదాబ్జములె యూఁత
గీ. అట్టి భక్తి యావియైన జీవన్ముక్తి
కతని ఘనదయామృతావలోక
నమ్మె పరమపదవి యమ్మహాతరకీర్తి
నొప్పు గురువుమహిమ చెప్పఁదరమె.

శ్రీనాథుని యీక్రిందిపలుకుబళ్లు పూర్వకావ్యములందును గాన్పించుచున్నవి.

| | | ఆ. | ప. |
|---|---|---|---|
| చెక్కుటద్దములు | విక్రమార్కచరిత్ర | 1 | 158 |
| చిన్నారిపొన్నారి చెక్కుటద్దములు | ... | 7 | 172 |
| పుటభేదనము | ... | 2 | 183 |
| ఇవతాళించు | ... | 4 | 158 |
| ప్రాణముప్రాణము | ... | 7 | 96 |

| | | | |
|---|---|---|---|
| ఒసపరి | ద్విపదహరిశ్చంద్ర | | పుట 125 |
| కొమ్మంచుమోవి | ... | | 137 |
| ఓలగందము | ... | | 134 |
| ఓహరిపాహరి | ఆంధ్రభారతముభీష్మపర్వము | 2 | 173 |
| కట్టెఱ్ఱ | ఉద్యోగపర్వము | 2 | 114 |
| ప్రాణముప్రాణము | విరాటపర్వము | 1 | 316 |
| మిసిమింతుఁడు | బసవపురాణము | | పుట 180 |

ఇట్టి ప్రయోగములనింకను జూపవచ్చును. గ్రంథవిస్తర భీతిచే వదలివేసితిని.

## క్రీడాభిరామము—శ్రీనాథుఁడు.

రచనాసామ్యము పరిష్కరించుకొని శ్రీనాథుఁడే క్రీడాభిరామ కృతికర్తయని ప్రబలప్రామాణ్యములనుజూపి యాంధ్రపండిత లోకమునకు నిరూపింపఁజూచినవారలలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారును, శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారును, సమకాలికులలో ముఖ్యులు. ఆ కావ్యము వల్లభరాయకృతమేయని వాదించినవారు శ్రీ విశ్వనాథశర్మగారును, శ్రీ అచ్యుతరావుపంతులుగారును. నాయభిప్రాయము క్రీడాభిరామము వల్లభరాయకృతమేయని. ఈవిషయములో శ్రీ అచ్యుతరావు పంతులుగారు, వారు రచించిన ఆంధ్రవాఙ్మయ చరిత్ర (మొదటిభాగము) లో నీకావ్యమువల్లభరాయకృతమేయని చెప్పిన కారణములు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి వాదమును ఖండించుచున్నవి. శ్రీ అచ్యుతరావు పంతులుగారి యభిప్రాయము సహేతుకమును, సమంజసమును నైయుండుటచేత వారితో నేనేకీభవించుచున్నాను.

# పండితారాధ్యచరిత్రము.

## నిడుదవోలు వేంకటరావు ఎమ్. ఏ.

---

పూర్వలాక్షణికశైవకవిసార్వభౌముఁడు పాల్కురికి సోమనాథరచితమగు నీ గ్రంథ మాంధ్రగ్రంథమాలయందుఁ బ్రకటింపఁ బడుటకుఁ బూర్వ మీ క్రిందిముద్రణములు వెలయుచుండెను.

1. వరంగలుముద్రణము. శ్రీ శివధర్మవర్ధనీ రామలింగేశ్వర ముద్రాక్షరశాలయందు సౌమ్య సం॥ ఆషాఢ శు॥ ౧౫ శనివారమునాఁటికి శ్రీ ముదిగొండ శంకరారాధ్యులవారిచేఁ బరిష్కరింపఁ బడినది. క్రీ. శ. 1908.

2. విశాఖపట్టణ ముద్రణము. శ్రీ విజయరామచంద్రముద్రాక్షరశాలయందు ఆనంద సం॥ ఆషాఢ బ॥ ౧౩ సోమవారమునాఁటికి శ్రీ గిరి శ్రీగురుదిగంబర మల్లికార్జునస్వాములవారి సేవకుఁడగు చింతకుంట వసపుల నాగయయోగిచేతను, శ్రీ నిడుదవోలు సుందరము పంతులవారిచేతను మూఁడు ప్రతులను జూచి సవరింపఁబడి ముద్రింపఁబడినది. క్రీ. శ. 1914.

పై వానిలోఁ దొలిప్రతియందు లేఖక ప్రమాదాదిదోషములు కొన్ని సవరింపఁబడియున్నవి. పాఠములఁ గొన్ని పరిష్కర్తలు సవరణ చేసిన పట్టులు కూడఁగలవు. రెండవ ప్రతియం దటులకాక లేఖక ప్రమాదాదిదోషములు కొన్నిమాత్రమే సవరింపఁబడి పాఠము లున్నవి యున్నట్టుల ప్రకటింపఁబడినవి. ప్రామాణికపాఠములు నిర్ణయించుపట్టున నొకరీతినున్న గ్రంథములే మిక్కిలి విలువగలవి యని విమర్శకులకుఁ దెలిసిన విషయమే.

ఈ గ్రంథ మిట్లు పూర్ణముగ క్రీ. శ. 1908 నాఁటికి ముద్రింపఁబడినను దొలుత దీని ముద్రణమును ప్రారంభించిన మహనీయులు శ్రీ మామిలా కందుకూరి శ్రీశైలవీరభద్రప్రసాదరావుగారు. వీరు క్రీ శ. 1897 లో "శివగ్రంథముక్తావళి" అనుపేర నొక పత్త్రికను నేలూరిని నెలకొల్పి యందు శైవగ్రంథములు ముద్రించుటకుఁ బూనుకొని పండితారాధ్యచరిత్ర వచనసంగ్రహమును బండ్రెండుపుటలు ముద్రించిరి. కాని గ్రంథముద్రణము పూర్తిగఁ గొనసాఁగలేదు. అంతలో బసవపురాణమును ముద్రింపవలసి వచ్చుటచే దీని నాఁపి యాగ్రంథమును బూర్తిగ ముద్రించిరి. ఆంధ్రగ్రంథమాలయందు బసవపురాణము ప్రకటింపఁబడక పూర్వము ముప్పదేండ్లక్రిందట నా గ్రంథమును ముద్రించి కీర్తిగాంచినది వీరే.*

పండితారాధ్యచరిత్రమున చతుర్థప్రకరణమగు మహిమప్రకరణమున 'గణసహస్రమాలిక' కలదు. ఇది శైవులకుఁ బారాయణగ్రంథము. ఈ మాలిక యత్యంతమహిమాన్వితమైనది. సోమనాథుఁడే గ్రంథాంతమునఁ బ్రత్యేకముగ నీగణసహస్రమాలికఁగూర్చి యిట్లు చెప్పియున్నాఁడు

"అరయ నీకృతి సార్థమగు చతుర్థప్ర
కరణమధ్యమున సంకలితమై వెలుఁగు
నవ్యగణసహస్రనామ స్తవంబు
భవ్యంబు పఠియించుఫలకాంక్షులకును
నైహికాముష్మికాద్యఖిలసంపత్స
మాహితాభీష్టసౌఖ్యము లొందు ననినఁ
బ్రమథరుద్రాది పురాతననూత
నమహాగణాభివర్ణనము లోకముల."

ఈ సహస్రగణమాలిక గ్రంథమునుండి వేఱుచేయఁబడి ప్రత్యేకముగ క్రీ. శ. 1894 వ సంవత్సరమున 'కోటప్పరగడ' అను గ్రంథమున

* చూ. క్రొత్తబసవపురాణపీఠిక. పుట. 128.

ఏలూరిని చామరాజు శివరామయ్యగారి శ్రీమత్త్రిపురసుందరీ ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

ఈ గ్రంథమున వాలె కోటయకవి రచితమగు యల్లమంద కోటప్ప రగడ, పాల్కురికి సోమనాథరచితమగు సోమనాథ స్తవము, సహస్రగణ మాలిక, నమశ్శివాయాష్టకము, శ్రీ దక్షిణామూర్త్యష్టకము, సోమనాథ రచితమగు సంస్కృతబసవాష్టకము, పాలకొలను బసవన్నరచిత బసవ స్తవమును గలవు.

గణసహస్రమాలికలో - చతుర్థప్రకరణమున—

"అంత నక్కడ మల్లికార్జునారాధ్యుఁ
డెంతయు రయమున నేఁగుచు నున్న"

మొదలుగా—

"పుష్పించు నంతన పురహరుకరుణ
నొప్పార నుదయించె నూర్ధ్వనేత్రములు."

అను భాగము పూర్తిగ ముద్రింపఁబడినది. పండితారాధ్యచరిత్రమునఁ దొలుత ముద్రణభాగ్యమునందిన భాగ మిదియే.

అధునాతనగ్రంథపరిష్కరణవిధానము ననుసరించి యీ గ్రంథమును సంస్కరించి ప్రకటించుటకు నిప్పటి కిరువదేండ్లక్రిందట నాంధ్రసాహిత్యపరిషత్తువారు పూనుకొని మొదటి మూఁడు ప్రకరణములకును శుద్ధప్రతి వ్రాయించిరి.* కాని యప్పుడు నిప్పటివలె మహాసంగ్రామము సంభవించుటచేతను కాకితము కఱవగుటచేతను నిది పెద్ద గ్రంథ మగుటచేతను దీనిముద్రణము కొనసాఁగలేదు. పరిషత్తువారు పై రెండు ముద్రితప్రతులనే కాక కార్యస్థానమున నున్న మఱిరెండు తాళపత్త్రగ్రంథముల నాధారముగఁ జేసికొనియే శుద్ధప్రతి వ్రాయించిరి.

* మూఁడుఁడు-ఆనందనామసంవత్సర కార్యనివేదనము.

వస్తుస్థితి యిట్లుండ నూతనముద్రణమున ప్రకాశకులు తాము ముద్రించునాఁటికి వారి కాధారభూతమైనది ముద్రితప్రతి యొకటియే యనియు, నదియు 'నడుగడుగునకు సంస్కారాపేక్షముగ నున్నదనియు, వ్రాయుట సరికాదు. వా రెట్లు వ్రాసినను పరిష్కర్తలు వారితోపాటు "అచ్చుపడిన గుజిలీప్రతినిన్ని, కొన్ని తాటియాకుల ప్రతులనున్ను, ప్రభుత్వప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని వ్రాఁతదార కొన్నిప్రతుల పాఠములనున్ను గుర్తించి పంచిన రెండు కాగితముల సంపుటములును" అని తమ గ్రంథసామగ్రినిఁ జేర్కొని ఆ 'గుజిలీ' ప్రతివివరణమునుగాని తక్కిన తాటియాకుప్రతుల వివరణముగాని తెలుపకపోవుట మఱియు నసమంజసముగ నున్నది.

ప్రాచీనాంధ్రగ్రంథముల ముద్రించునపు డుపలబ్ధమగు గ్రంథసామగ్రినంతయు సేకరించినఁగాని సమగ్రమును, సప్రమాణమును నగు పరిష్కరణవిధాన మేర్పడదు. ముద్రణాది సౌకర్యములును, సాధనసామగ్రియు నతిమాత్రముగ లభించుచున్న నేఁడును ప్రాచీనాంధ్ర గ్రంథములో నొకటియైన సక్రమముగా లేవను సంగతి నాంధ్రభాషావాఙ్మయవిద్వాంసుల కెల్లరకుఁ గ్రొత్తకాదు. మఱియు నట్టి నూత్నపరిష్కారవిధానము ననుసరించి, గ్రంథముద్రణమున కాధారములైన ప్రతులవివరణ మందు లేకుండినచో, నా గ్రంథమునుఁ గూర్చి ప్రత్యేకపరిశ్రమచేయు భావిపరిశోధకులకు విమర్శకులగు విద్వాంసులకును నిక్కలి చిక్కులు గలిగించుననియు నంద ఱెఱింగినవిషయమే.

పరిష్కర్తలు తెలుపకపోయినను గ్రంథపాఠనిర్ణయములనుబట్టి చూడఁగా వారు చూచినది వరంగలు ముద్రణమేయని యీ క్రిందివాని వలనఁ దెలియనగును.

1. నూతనముద్రణము. పుట 189.
"చిన్మయానంద వశీకృతబుద్ధి
స్ఫురియింప శివుఁ జూచి చూచి క్రాలుచును"

2 ఈ పాదముతరువాత బ్రౌనుప్రతిలో—

"ఆలీల ప్రమథగణానందవార్ధిఁ
దేలుచు మునుఁగుచు దృఢతరభక్తి
శివుని చిత్తంబులోఁ జేర్చి వెండియును
శివుకంటె నన్యంబు దవులక యుండి."

అనే పంక్తు లున్నవి. ఇవి వ్రాఁతప్రతులలోఁగాని వ్రాఁతముద్రిత ప్రతిలోఁగాని లేవు. వీనికి సంస్కృతానువాదము లేదు.

పై పాదములు విశాఖపట్టణప్రతియం దున్నవి. (పుట 72) కాని వరంగలు ప్రతియందు లేవు.

3. నూత్నముద్రణము పుట 247.

"పొడవులు నెడి పొఱపొంచులఁ బూర
కడు సంభ్రమంబున గణములుగదలి"

పై పాదములు కుండలీకరణముఁగావింపఁబడి యధోజ్ఞాపిక యం దిట్లున్నది.

"కుండలీకరణము చేసిన పంక్తులు వ్రాఁతప్రతులలో లేవు. అచ్చు ప్రతిలో ఉన్నవి."

పై పంక్తులు వరంగలుముద్రణముననె కాని విశాఖపట్టణముద్రణమున లేవు. పుట 92. పై వానినిబట్టి పరిష్కర్తలు వరంగలుప్రతినే యుపయోగించిరనుట స్పష్టము.

ఉదాహరణప్రాయముగ పై విషయములఁ జూపించితినిగాని, ఇట్టి వ్యత్యాసములు గ్రంథమునఁ జాలఁగలవు. జాగ్రత్తగఁ బరిశీలించినచో విశాఖపట్టణపుఁ బ్రతి ప్రమాణపాఠనిర్ణయమున కెంతయేని తోడ్పడును. ఇందులకు రెండుదాహరణముల నిచ్చుచున్నాఁడను.

నూత్నముద్రణము. పుట 331.

"పరు లెర్గుదురె భవపాశవిముక్త
గురుచరణాంభోజ సరళ సద్భక్త

గురుదయామృతరస శరధి నిషక్త
గురు గుణప్రకర సంస్మరణానుషక్త
గురు నిరంతరవర చరణానురక్త
గురు పరతంత్ర నిర్భరగుణోద్యుక్త
గురుకార్య చిరధురంధర కళాయుక్త
గురు మనోజ్ఞాంచిత చరిత ప్రసక్త
గురువరమహిమాను గుణగురు భక్త
యంచు భక్తానీక మచ్చెరువంది
యంచిత ప్రీతి మల్కాడఁ గీర్తింప*

విశాఖపట్టణపుఁ బ్రతియం దీభాగ మిట్లున్నది.

పరు లెర్గుదురె భవపాశవిముక్తి
గురు చరణాంభోజ సరళ సద్భక్తి
గురుదయామృత రసశరధి నిషక్తి
గురుగుణప్రకర సంస్మరణానురక్తి
గురునిరంతర చరణానురక్తి
గురువిముఖ పదార్థ విరస విరక్తి
గురుపరతంత్ర నిర్భరగుణోద్యుక్తి
గురుకార్య చిరధురంధర కళాయుక్తి
గురు మనోజ్ఞాంచిత చరితప్రసక్తి
గురువర మహిమాను గుణ గురుభక్తి
అంచు భక్తానీక మచ్చెరువంది
అంచిత ప్రీతి దొల్కాడ గీర్తింప. పుట. 119.

పై పాఠములు చాలవఱకు నూత్నముద్రణముతో సరిపోవుచున్నవి. మఱియు,

---

౧. ఒరులెఱుంగుదె యీభవపాశముక్తి ౨ సరస ౩. నిస్తరణాను ౪. ఈపాద మంతరువాత నొకపాద మన్నిప్రతులలోను లోపించినది. ౫. మతిచోద్య ౬. దొ.

"గురువిముఖపదార్థ విరస విరక్తి"

అను పాద మీముద్రణమున లోపింపలేదు. ఇట్లుండ నొక పాద మన్నిప్రతులలోను లోపించినదనుట సరికాదుకదా ?

నూత్నముద్రణము రెండవభాగము 39,43 పుటలు.

"అదిగాక శివనాగమయ్యకక్షముల - మొదలు
లీలనిచ్చిన శూలి లేఁడనీయూఁడు"

అను నాలు పంక్తులును

"వలికినట్టుల జగత్ప్రత్యయదృష్ట"
మొదలు

వచ్చునాకన్నులు వచ్చుటగాక

అను నాలు పంక్తులును

వరంగలు ముద్రణమున లేవు. విశాఖపట్టణమునందున్నవి. చూ. మహిమప్రకరణము పుటలు 11,12.

"మఱియు పుట యడుగున పరిష్కర్తలు చాల పాఠములు చూపియున్నారు. కాని యీక్రిందివ్యత్యాసములు గమనించినచో వారు పాఠములను సనిపఱచి ప్రామాణికపాఠనిర్ణయము చేయలేదని వ్యక్తమగుచున్నది. ఉదాహరణమునకై కొన్ని క్రిందఁ జూపుచున్నాఁడను.*

స్థాలీపులాకన్యాయమునఁ గొన్ని చూపితిని. పాఠభేదసంస్కరణములిట్టివి చూపినకొలఁది పెక్కులు గలవు.

విశాఖపట్టణపుఁబ్రతి మూఁడు ప్రతులతో సరిచూడఁబడిన దని ముఖపత్రమునందే వ్రాయఁబడియున్నది. అందు రెండు తాళపత్రప్రతులు ప్రకటనకర్తలగు శ్రీ చింతకుంట పసపుల నాగయయోగిగారు శ్రీశైలప్రాంతమునుండి తెచ్చినవియే మూఁడవదికాగిపుఁబ్రతి. నూఱేండ్ల నాఁటిది) కీర్తిశేషులగు మానాయనగారు సంపాదించినది. అది నేఁడు విజయనగరమునఁ గలదు. కావున పైప్రతియేకైకమాతృకాశరణ్యము కాదు. ప్రామాణ్యమునఁ దీసిపోవునదికాదు.

---

* ఇచ్చటివిషయము తరువాతిపుటలోఁ జూచునది.

| నూత్నముద్రితము. | వరంగల్లుప్రతి. | విశాఖపట్టణముద్రణము. | పరిషత్కార్యస్థానప్రతి. |
|---|---|---|---|
| . విషయప్రతాపు<br>నిర్విషయకలాపు | విషమప్రతాపు | విషమప్రతాపు | విషమప్రతాపు |
| 5. వీఁడు వోహారుఁడన<br>విశ్వధరిత్రి.<br>వేఁడికంటనుఁజూడు<br>విశ్వప్రతాపి. | విషమప్రతాపి | విషమప్రతాపి | విషమప్రతాపి |

పరిష్కర్తలు ముద్రితప్రతి నీ పాఠములున్నను వాని నుదాహరింపలేదు. వ్రాఁతలలో నెట్లున్నది తెలుపలేదు.

| | | | |
|---|---|---|---|
| 2. వలవదా కడతాలి<br>వర్తనలొప్పె. | కడరాలి వర్తనమొప్పె | కడరాలి వర్తనయొప్పె | కడరాలి వర్తనయొప్పె |

'కడరాలి' పాఠము వరంగల్లుప్రతియం దున్నను చూపలేదు. ఈ శబ్దము కడరాలుగా శ్రీ సూర్యరాయాంధ్రభాషానిఘంటు గ్రహించినది. చూ. రెండవ సంపుటము పుట. 60.

పైని వివరించిన మూఁడు ప్రాఁతప్రతులయందును, పరిష్కర్తృప్రతులందును, విశాఖపట్టణముద్రణమునందును నారాధ్యచరిత్రములోని విషయములను దెలుపు నొక సంగ్రహవచనభాగము కలదు. వరంగలు ప్రతిలో లేదు ప్రథమమునఁ బండితారాధ్యచరిత్రను ముద్రించునాఁటికి వారికి లభ్యమైన ప్రతియందిది కలదనుటకు వారు ప్రకటించిన వచనగ్రంథమే సాక్షి. ఈవచనము ముద్రించినతరువాతనే శ్రీ గురుమూర్తి నూర్జిత పుణ్యకీర్తి యిత్యాదిగా గ్రంథమునుఁ బ్రారంభించిరి. ఈవచన గ్రంథము కేవల విషయసూచికారూపమేయైనను నిందొక ముఖ్యవిషయముఁ దెలుపఁబడినది. అది గ్రంథమునఁగల ద్విపదసంఖ్యానము ఏయే ప్రకరణమున నెన్నెన్నిద్విపదలుగలవో స్పష్టముగ నందు తెలుపఁబడియున్నది. గ్రంథపరిష్కరణసమయమున నొకొక్కప్రతిలో కొన్ని పంక్తులు హెచ్చుగానుండి వేఱొక కొన్నింటిలో నవి లేనప్పుడవి ప్రామాణికముగ మన మంగీకరించు గ్రంథమునఁ జేర్పవలయునా లేదా యను విషయము విచారణముచేయుట కెంతయేననుకూలించును. పరిష్కర్తలాధారముగఁ గొన్న బ్రౌనుదొరవారి సంపుటములను నిది గలదు. ఆ కాలపుతాళపత్రప్రతులయం దిది కలదు.

పరిశోధకుల యుపయోగార్థ మందులవిషయముల నీ క్రింద పొందుపఱచుచున్నాము.

| ప్రకరణము. | | పేరు. | | ద్విపద సంఖ్య. |
|---|---|---|---|---|
| ప్రథమ ప్రకరణము | | దీక్షా ప్రకరణము | | 2000 |
| ద్వితీయ | ,, | పురాతన | ,, | 2720 |
| తృతీయ | ,, | వాద | ,, | 2021 |
| చతుర్థ | ,, | మహిమ | ,, | 2120 |
| పంచమ | ,, | పర్వత | ,, | 3050 |
| | | | | 11911 |

పరిష్కర్తలు కుండలీకరణముగావించి పుటయడుగున నాయాభాగములఁగూర్చి వ్రాసిన వ్రాఁతలు పైవిషయమునుఁగూడ నొకయా

ధారముగఁ గాని చర్చించినచో గ్రంథమింకను నెంతయేని గుణవత్తమ ముగఁ గొనసాగియుండును. గ్రంథమునఁగూర్చిన యిట్టి ముఖ్యవిషయ ము వా రెచ్చటను దడవియుండలేదు. ప్రకాశకులు విజ్ఞప్తిలోఁ బ్రాఁత ముద్రితప్రతినిఁగూర్చి చెప్పినట్లే ముద్రణమును నడుగడుగునకును సంస్కా రాపేక్షముగానే యున్నది.

ఈగ్రంథమునకు 348 పుటలుగల పెద్ద యుపోద్ఘాతము కలదు. అందుల పదునేడు విషయముల విమర్శింపఁబూనినచో యంతకంటె రెుక పెద్ద గ్రంథమగును. అయినను క్రమముగ విమర్శింతును. ఉపో ద్ఘాతమున తొలివిషయము సోమనాథుని నివాసస్థానమీమాంసకే విమర్శిం పఁబడినది.* తక్కిన విషయములుగూడ విమర్శార్హములే. పండితునిఁ గూర్చియు నారాధ్యచరిత్రమునుఁగూర్చియు వ్రాయఁదగిన యపూర్వ విషయములెన్నియేని విడువఁబడినవి. కొన్నిపట్టుల పరిష్కర్తలవ్రాఁత లెట్లు ప్రమాణముగాఁ గొనవలయునో తెలియుటలేదు. ఒకపట్టు చూపి విరమించెదను. ఉపోద్ఘాతముపుట 67.

"శివలెంకమం చణ్ణనుగురించి సోమనాథుఁడు బసవపురాణ ములో స్మరించనేలేదు.'' శివలెంకమంచణ్ణకథ బసవపురాణము సప్త మాశ్వాసమున వర్ణింపఁబడినది. చూ. పుట 197-198 (శివలెంకమం చయ్యకథ) శివలెంకమంచన్న మంచయ్య పేరు లొకవ్యక్తివియేగాని వేఱుగావు. బసవపురాణమునను, పండితారాధ్యచరిత్రమునను రెండు విధములుగను నీతనిపేరులు సోమనాథుఁడు వాడియున్నాఁడు. పండితా రాధ్యచరిత్రమున సహస్రగణమాలికలో శివలెంకమంచణ్ణను సోమనా థుఁడు చేర్చినాఁడని వ్రాసిన పరిష్కర్తలు గ్రంథమున 'శివలెంకమం చయ్య'అని యానామము నిచ్చినపుడు మంచణ్ణ మంచయ్య రెండు పేరు లొకరివియే యని వారంగీకరించినట్లేగదా ! అప్పుడు బసవపురాణ మున శివలెంకమంచన్నను స్మరింపనేలేదనువాక్య మెట్లు ప్రమాణ మగునో ?

---

* చూ. విభూతి.

# క వి రా జు

## మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

---

శ్లో. యాసాం భాసురభావజాత మజని గ్రైవేయకం భారతీ
దేవ్యా నవ్య మఖండ మప్రతినిధి స్వర్ణప్రభాబంధురం
కర్ణాటాంధ్రసుపర్వవాఙ్మయకళాకేళీధురాణాం ముదా
శ్రీనాథోజ్జ్వలసాధునిర్మలగిరాం కుర్మస్తరా మంజలిమ్.

శా. ఈక్షోణి న్నినుఁ బోలుసత్కవులు లే రీనేఁటికాలంబునన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించుం గవిసార్వభౌమ ! భవదీయప్రౌఢసాహిత్యముల్.
"శ్రీనాథుఁడు."

సీ. అభివాదములు మారయామాత్యతనుజాత !
యాంధ్రభాషానైషధాబ్జజాత !
కైమోడ్పు చంద్రశేఖరపదార్చనచణ !
యఖిలపురాణవిద్యాప్రవీణ !
వందనంబు లజిహ్మవర్ణితాత్మస్వాంత !
యధ్వర్యువేదశాఖాధిగంత !
ప్రణతు లభ్యర్హితాపస్తంబసత్సూత్ర !
బ్రహ్మవిజ్ఞానసేవాపవిత్ర !

యేటికోళులు పాకనాటింటివాఁడ !
యొరిగె ధారాళకవితాప్రయోగకుశల !
జోత లాంధ్రీసతీశిరస్సూన్యతరత్న !
నతిసహస్రము నీకు శ్రీనాథసుకవి !

శా. శిష్టాచారుని నన్నిపండితగభస్తిం గొల్చి, తద్భారతో
చ్ఛిష్టంబైన తెలుంగుసూక్తి కాకరక్తిం గూర్చి చన్నట్టి వా

క్రుష్టం దిక్కున క్రొముక్కి, యెఱ్ఱనవచస్సంతానసంతానమున్
దుష్టిం దెల్చి భవత్సరస్వతి రసాబ్ధు ల్నించె నంధ్రమ్మునన్.

సీ. అద్దంకి కొండవీ డాదిగాఁ గలధాత్రి
రెడ్డిరాజులు వెలారించునాఁడు
విద్యానగరరాజవీథులఁ గర్ణాట
విభురాజ్యరమ తాండవించునాఁడు
రేచెర్ల నృపతిభూాద్రిప్రాభవముతోడ
రాచకొండకు దీప్తి దోఁచునాఁడు
గజపతిక్ష్మాపతిగ్రామణుల్ కటకరా
జ్యశ్రీకి జోహారు సలుపునాఁడు
నవనిధులు పండు పసిఁడిపల్నాటిసీమ
వీరచరితరసం బూట లూరునాఁడు
పుట్టువుం గన్న శ్రీనాథపట్టమాళి!
ధన్యుఁడవుగావె సుకవిమూర్ధన్యులందు.

సీ. శ్రుతిపురాణైతిహ్యకృతచింతనాపచే
ళిమ మైననీవివేకమున కెరఁగి
బ్రాహ్మీకృపారసప్రసరప్రభూతమై
యలరు నీవిద్వన్మహత్తఁ బొగడి
కమనీయకావ్య సంఘటనాపటిష్ఠమై
తనరు నీరసలుబ్ధతను గణించి
డిండిమభట్టారపాండితీ ప్రతిభటో
ద్భట మైననీశాస్త్రపటుతఁ దెలచి
కాశికాఖండ నైషధగ్రంథరచన
శుభవిధాస్ఫూర్తిఁ జుబ్బన చూఱలాడి

సీ. ఆహరించితివి శ్రీహర్ష వాచాగుంఫ
గంభీరతర భావగౌరవంబు
గిలుబాడితివి రసోజ్జ్వలరీతి గర్భిత
కాదంబరీభవ్య కావ్యధనము
నాకళించితివి మురారిమయూరాది
పండితపరివృఢోద్దండశక్తి
నాస్వదించితి కిరాతార్జునీయగ్రంథ
సందర్భమహితార్థసౌష్ఠవంబు
సంగ్రహించితి కాళిదాసకవిత్రోవ
†"పూర్వకవిముఖ్య విరచితాపూర్వకావ్య
భావరససుధాచర్వణప్రౌఢతయును"
సేకరించితి వని వేఱ చెప్ప నేల ?

ఉ. శ్రావ్యతరంబులై నవరసప్రచురప్రతిభాసురంబు లౌ
కావ్యములం "*గవిప్రకరకర్ణ సుధాపరిపూరణ క్రియా
భవ్యము"గా రచించి కృతిభర్తల నక్షయకీర్తిమూర్తి సం
స్తవ్యులుగా నొనర్చిన బుధప్రవరా! నినుఁ జిత్తగించెదన్.

సీ. కబళించినాఁడవు గగనకల్లోలినీ
గతిసదృక్షకవిత్వకథనధాటి
చుళికించినాఁడవు శుంభన్మహాశాస్త్ర
దురవగాహైక పాథోనిధాను
నర్తించినాఁడవు నానామహీనాథ
మహనీయసంస్థాన మండపములఁ
దిలకించినాఁడవు దేశదేశాంతర
వ్యతికరాచార పద్ధతులగతుల

† దగ్గుపల్లిదుగ్గన "నాసికేతోపాఖ్యానము" ౧. ఆ. ౧౮. ప.
* తరిగొప్పుల మల్లన "చంద్రభానుచరిత్ర" ౧. ఆ. ౯ ప.

మహితకనకాభిషేక సమ్మానమాన్య !
ధన్యుఁడవుగావె నీజీవితప్రబంధ
చరమభాగమునం దొక్క విరసఘట్ట
మెట్టులో దైవికముగఁ గన్పట్టఁ గాని.

శా. వేరే నీసరివారు పండితులు వాగ్వాదహేరాళతా
ధౌరంధర్యము నీక తక్కినది శాస్త్రప్రౌఢిమన్* గౌడభ
ట్టారుం గెల్చిన విద్వదగ్ర్య నిను నుట్టంకించి యెల్లప్డుఁ నై
వారంపుంజెయి మోడ్చి మ్రొక్కెద నురుప్రజ్ఞావిశేషోదయా !

శా. శ్రీహర్షుండు మహాకవీంద్రుఁడు మనీషిబ్రహ్మ చింతామణీ
మాహాత్మ్యధిగతాఖిలార్థచయ సంభావ్యానుభావుండు "హే
మా హేమా"యన మించి నైషధ మసామాన్యక్రియన్ సంస్కృత
వ్యాహారంబునఁ గూర్పఁగాఁ దెలుఁగుసేయ న్నీక చెల్లెంగదే ?

శా. నీశాస్త్రప్రథమానపాండితి సమున్నిద్రంబుగా, నీకృతి
శ్రీశృంగారకళాభిపోషణము మీఱింబో, నయఃపిండమున్
'గాశీఖండము' తెల్గుబాసఁ గలకండంబట్లు జోడించి నీ
వైశారద్యము వెల్లడించితి కవిస్వామీ ! నమోవాకముల్.

శా. ఆపోశానము గొన్నవాఁడవు సమస్తాంధ్రమ్ము, తర్కాదివి
ద్యాపాణింధమపాండితీపటుతరోద్యచ్ఛక్తి నీసొమ్ము; భా
షాపుంభావకవీంద్ర ! యీగతి గరిష్ఠం బైన నీజీవిత
శ్రీపాథేయము తృప్తచిత్తుల నొనర్చె న్విద్వదధ్వన్యులన్.

చ. తెలుఁగున రెడ్డిరాజులకృతిత్వము కీర్తిమహత్త్వమున్ మహో
జ్జ్వలగతి నిల్పి కావ్యకవితావనితాగళసీమ స్వర్ణభూ
షలఁ గయిసేసి చక్కదము చాటిన నీదు పసిండిగంటముం
దలఁచి కృతార్థతం బొరసెద న్మహితప్రతిభానవత్కవీ !

---

* "ముగ్ధిమాదిష్విమనిజ్ మృగ్యః"– ముగ్ధిమా, ప్రౌఢిమా ఇత్యాదిషు ఇమనిచ్ మృగ్యః అన్వేషణీయః. అని వామనసూత్రవృత్తి. అయినను దీనికి సంస్కృతాంధ్రములలోఁ బ్రయోగములు పెక్కువ. నైషధము. పీఠిక. ౧౭. ప. చూ.

ఉ. వేమమహీంద్రుగాథ సుకవిత్వమునందు లగించి దేవభా
షామహితానుభావము నసంశయభంగి వెలార్చికొన్న శ్రీ
వామనభట్టబాణునకు వంకలు దిద్దెను నీమనుష్ఠ తా
రా ! మధుమాధురీగుణభర ప్రచుర ప్రభవిష్ణువాగ్వరా !

సీ. ‘శాలివాహనసప్తశతి’కృతి గతిమాలి
పరిశోధకుల కంటఁ బడ దొకింత
యనుపలబ్ధం బయ్యె “నారాధ్యచరితప్ర
బంధంబు” కాలగర్భమున బ్రుంగి
యేచెదారమున రూపేది పోయినదో నీ
రచియించిన ‘మరుత్తరాట్చరిత్ర’
శ్రీనాథకృత మని చెప్పుకొంటయ కాని
కనరాదు ‘నందనందనచరిత్ర’
యింక నెన్నెన్ని కావ్యము లెఱుకఁబడక
నసి దొఱంగెనో కాలరాక్షసునినోట;
నయిన విలపింపనేల నీయశము నిలుప
సముపలబ్ధము లైన కబ్బములె చాలు.

ఆ. శిథిలశిథిల మైన ‘శివరాత్రిమాహాత్మ్య’
కృతికి ముద్రణంపుగతి నొసంగి
సాఁకినట్టి యాంధ్రసాహిత్యపరిషద
మందుఁగాత ! తావకాశిషములు.

చ. నియమనిబద్ధ వాఙ్మయవనీ పికవత్ప్రియధోరణీ ! ‘ధనం
జయ విజయంబు’ పంచశరశాస్త్ర విశేషమొకండు, వల్లభో
దయకృతి’ నీకృతమ్ము లని తజ్జ్ఞులు పల్కిరి గాని; దీనఁ బ్ర
త్యయము జనింపకున్నది యథార్థము తెల్పు మసంశయమ్ముగన్.

గీ. పండితజగత్తునందు వెల్వడినవాని
నడుగఁ దలఁచితి సంశయితార్థములను
నోపిక వహించి తగిన ప్రత్యుత్తరముల
నభివచింపుము కరుణ విద్యాధికారి !

గీ. పరమమిత్రము రాయని భాస్కరార్యు[1]
పేర నేవేనికబ్బముల్ గూర్చితివె
కలిగినం దెల్పుమయ్య ! నిక్కము గణించి
సంతసింపఁగఁ జారిత్రసాంశయికులు.

క. పినవీరభద్రకవి నీ
యనుంగుశిష్యుఁ డని కొంద ఱందు; రయినను
దనకావ్యమ్ములలోఁ జే
ర్కొనఁగా లే దతఁడు దేశికునిగా నిన్నున్.

క. ఇది యొకదోషముగా నీ
హృదయమునకుఁ దట్ట దింతుకే నే మన్నన్
వదలితివిగాదె నీగురు
పదపద్మారాధన ప్రపత్తిం గృతులన్.

క. ప్రతిపదమున నీకవితా
గతిముద్రలు వేసికొన్న కమనీయరసా
ద్భుతతతి "వీథీనాటక
కృతి" త్వత్కర్తృకముగాదె శ్రీనాథసుధీ !

ఉ. డిండిము కంచుఢక్కను గడిందివివాదమునం బగిల్చి యు
ద్దండతరాత్మ పాండితివిధానము చాటితి వంచు నీయశో
డిండిమరావము ల్దెసల ఢీకొనెఁ గాని వివాద మేది వై
యుండునొ తన్నిరూపణ మయోమయ మయ్యెఁ జరిత్రమందునన్.

ఆ. వె. హరవిలాసకావ్యమందలి 'వీవాద'[2]
పదము దుష్ట మనుచుఁ బలుకునట్టి

---

1 కాశికావిశ్వేశుఁ గలిసె... భాస్కరుఁడు మున్నె దేవునిపాలికరిగె. (చాటువు)

2 విడుకోపం బిదె శాంతిగైకొనుము వాగ్వీవాద మింతేటికిన్. (హరవిలాసము.

3 ఆ. ౧౯- ప. చూ.)- ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే - అను పాణినీయసూత్రముచే 'వీవాద' మనుట తప్పుగాదు.

వారి పాణినీయపాండితి గని లోన
నవ్వుకొనకు కమలనాభపౌత్ర !

క. వినియోగించితి విట నీ
వును గీష్పతిపదము*నిచటబుధు లద్దానిం
గని నవ్వదరేమో నీ
పణినాప్తోక్తశాస్త్ర పాండిత్యంబున్.

క. నణలకుఁ బ్రాసం బది నీ
కును నిష్టాపత్తి యనియె కూర్చితిఁ బైనిన్
†'త్రిణయనుని రాణివాసం'
బనుపద్యం బిచట నా కుపష్టంభక మౌ.

గీ. "ఇన్నియుదిపల్కు లాడి నీ వీయఖండ
వళిఁ బ్రయోగించి తేల పై పద్యమందుఁ

---

*నైషధము. ౪ ఆ. ౭౮ ప. చూ. ఇది పాణినీయమునకు విరుద్ధము.

కస్కాదిత్వాత్ షః ఇతికేచిత్ — కేచిదిత్యనేన స్వామిచంద్రోక్తేఽరుచిసూచితా. గీష్పతి రిత్యసాధురితి ముకుటః. అతఏవ భాష్యే గీః పతిః, గీఃపతిః, గీర్పతిః ఇతి రూపత్రయ మేవోదాహృతమ్. ఏతేన కస్కాదిషు పాఠకల్పన మపి నిరస్తమ్.

అమరసుధ-ఫుట్‌నోటు.

† క. త్రిణయనుని రాణివాసము నణిమాద్యైశ్వర్య వితరణామరతరువున్, మణికర్ణిక ముక్తివధూ మణికర్ణికఁ దలఁచుఁదపసి మానసవీథిన్. కాశీ. ౨. ౨౩.

క. ఫణిభూషణుండు...కాశీ. ౨౩.

త్రినయనశబ్దము క్షుభ్నాదులలోని దగుట మూర్ధన్యఘటిత మసాధువని సంస్కృతనిఘంటుకారులు వ్రాసిరి. మేఘదూతము ౧. ౫౨. శ్లో. లో, మల్లినాథుని వ్యాఖ్య చూడుఁడు.

గీ. అణఁచునది...దంభముజ్జగించునది. కాశీ. ౩. ౧౧౯. ఈప్రయోగమును బట్టి చూడ నణప్రాసము శ్రీనాథున కభిమతముగాఁ గన్పట్టును. ఏవంచ పాణినీయ విరుద్ధముగా శ్రీనాథుఁడు త్రిణయనశబ్దము ప్రయోగించె ననుటకంటె నణప్రాస మొప్పుకొనెననుట మంచిదికాదా ?

జివర"నని నన్ను నీవు ప్రశ్నింపఁబోక
కనుఁగొనుము నీదుముద్రితగ్రంథములను.

క. ‡హేరాళము, కైవారము
ధారాళముగాఁగ సంస్కృతసమాసములం
గూరిచిన నీ నిరంకుశ
ధోరణికిన్ మ్రొక్కఁజనదె దోషజ్ఞమణీ!

మ. అపపాఠమ్ములఁ జేసొ గైకొని భవద్వ్యాహారసంపత్తికిన్
విపరీతప్రథ తెచ్చిపెట్టిరి మహావిద్వత్తముల్ సత్కవీ!
కృపమైఁ దెల్పఁగదే యఖండయతి యెందేనిం బ్రయోగించితే?
సుపవిత్రం బగునీకవిత్వము నుపశ్లోకింతు నశ్రాంతమున్.

క. 'పలనాటివీరచరితము', వెలయించితి దేశికవిత విలసిల్లఁగ; ను
జ్జ్వలతర తావకరచనా, విలసన మందులను గొఱఁతవెట్టితి వనెదన్.

క. "అది నారచనయ కా"దని
యెదవేమో యనుము దాని కే నేమందున్
సదయులు కారు విమర్శక
విదు లిచ్చటివార లది వివేచింపు మెదన్.

సీ. * 'బిలబిలాక్షులకుఁ' 'గోహళి'శబ్దమునకు ని
ర్ధారితార్థము చెప్పరాదె సుంత

---

‡ సంస్కృతసమేతరములైన కైవారము, హేరాళము మొదలగు పదములు సంస్కృతసమాసములలోఁ గూర్చుట యితని కలవాటు. నైష. ౭. ౪౯. భీమ. ౧. ౧౦౦.

*కవిరాజుకంఠంబు గౌఁగిలించెనుగదా...బిలబిలాక్షులుతినిపోరెఁ గిలలు పెసలు (చాటువు-చూ) 'కోహళి' మాళిఁగోహళి సంఘటించిన క్రియన్...హారవిలాసము. ౭. ౨౧౯. చూ. శ్రీప్రభాకరశాస్త్రిగారి పీఠిక నరయుఁడు. స్నానముచేసి ధౌతపరిధానముఁగట్టి...హార ౨. ౩౬. దీనినిగూర్చి ఆయాపత్త్రికలలో విమృష్టమైనది. స్నానము చేసి ధౌతవసనంబుధరించి. అని పాఠాంతరముగలదు. ఈపక్షమున బాధయేలేదు.

'పొగడదండ'యె గాక 'బొగడదండ'యె తెల్పి
కవిరాజ! పున్నెమ్ముఁ గట్టుకొనుము
'స్నాన'శబ్దముపట్ల నసిగ నీయాశయం
బెఱిఁగింపవే కవీశ్వరవతంస!
'కాల్పట్టణ'మది యేకడ నుండెనోగాని
వనిచెప్పెఁ జారిత్రపండితులకు
నక్కటా! యిఁకెన్నొ 'యధ్వానపుంబట్టుఁ'
దొట్టి యర్థ మెఱుకఁదోఁపకుండె
స్వప్నవీథి నెపుడొ సాక్షాత్కరించి మా
సంశయములఁ దీర్చి చనుము సుకవి!

ఉ. 'జారుఁ'డటంచు 'వైశిక విశారదుఁ'డంచును 'వట్టిపచ్చి శృం
గారి' యటంచుఁ జాటువులఁ గాంచి రచించిరి పండితు ల్నిరా
ధారము లైన వ్రాఁతలు కథాపరిశేష! వృథా యిటుల్ నినుం
గూరిచి దూఱు టొప్ప దనుకొందును నిక్కము నూహ సేసినన్.

సీ. గుత్తగాఁ గొనె ననుంగుంబావ దుగ్గన్న
నీసంప్రదాయంపునియతు లెల్ల
నడగోలుగొనెఁ గడుంగడు నీప్రయోగముల్
విష్ణుచిత్తీయకవి ప్రభుండు
నందిపుచ్చుకొనె నీయకలంకపదసంవి
ధానంబు కవితాపితామహుండు
పుణికిచేకొనె రసాపూర్ణవహా తావక
నవ్యధోరణిని తెనాలిసుకవి
మధురచిక్కణ భావ క్రమప్రవృద్ధ
రసనమాహిత భవదీయ రమ్యకావ్య
సృష్టిసౌష్ఠవ మెందఱో శిష్టు లిటులె
యొజ్జబంతిగఁ గైకొనియుండిరిచట.

మ. [1] 'ఫణినాపత్యము' నెట్లొ సాధువు నొనర్పం గల్గిరేకాని, యే
యనువుం జూచిన [2]'సాత్కరించు'నకు నర్థావాప్తి రాకుండె, నో
యనఘా! 'తండము' [3]సంస్కృతమ్మొ, తెనుఁగో యర్థమ్ముకా లేదు మా
యనుమానమ్ములఁ దీర్పు మెప్పుడొ మహాత్మా! నిర్విశంకమ్ముగన్

క. అకటా! "యొకరాత్రికి" నీ
వొకచో [4]"నోరాత్రి" యనుచు నుపయోగింపం
దికమకలు వడఁగ నయ్యెను
సుకవీ! యది గ్రామ్యదోషజుష్టం బగునే?

గీ. గంటమున కడ్డ మాఁకయు నంటకుండ
నిటులె వాడితి వెన్నొ [5]'యథేచ్ఛ'తోడ

---

1 నైష. ౪. ౧౯. వేదము వేంకటరాయశాస్త్రిగారు శృంగారనైషధ వ్యాఖ్యలో నీప్రయోగమును విచిత్రముగా సమర్థించిరి. మఱియు విజ్ఞులెందఱో తత్తద్విమర్శనములలో దీనిఁగూర్చి వ్రాసియే యుండిరి.

2 నైష. ౪. ౧౦౪. "సాత్కరించు" సంస్కృతప్రత్యయముపై తెలుఁగుప్రత్యయమగు నించు గాగమముచేసిన రూపమిది. దీనిని వేదమువారు "కసాత్కరించు" గాఁజేసి తమవ్యాఖ్యలోఁ జేసిన సమర్థనము చూడుఁడు. అది యంత సమంజసముగా లేదని పెద్దలయభిప్రాయము.

3 తఱివడ్డకంకాళతండములును. కాశీ. ౩. ౧౩౪. ఈరీతిగాఁ బెక్కుచోట్ల సంస్కృతసమాసములోఁగలిపి దీనిని బ్రయోగించినాఁడు. ఇది దండశబ్దములో గతార్థమని శబ్దరత్నాకరకారులు. హేరాళకైవారములవలె సంస్కృతేతర శబ్దమని సూర్యరాయాంధ్ర నిఘంటుకారులు. సంస్కృతపదమనియే మఱికొందఱు వాదింతురు.

4 ఓరాత్రిం గను లెప్పవేయక మహోద్యోగంబు వాటించి. కాశీ. ౫. ౧౪౯. ఇట 'ఒక' కుమాఱుగా 'ఓ' అని యుపయోగించెను. ఇది వ్యవహారరూపము. అహోరాత్రశబ్దభవమని కొందఱందురు.

5 హరవిలాసము చూ. యథేచ్ఛము' అనుటకు 'యథేచ్ఛ' అని ప్రయోగించెను.

వర్ణనీయము నీనిరవగ్రహాత్మ
కలిత కవితావిశేష సంగ్రథనశక్తి.

మ. తెనుఁగుందేశము సర్వముం దిరిగి నీదివ్యప్రబంధక్రియా
ఘనతన్ రాజుల భోజులం దనిపి సత్కారంబులం గాంచినన్
గనకస్నానము లాడివచ్చిన భవత్కర్ణాటదేశాటనం
బనుమోదించెదఁ బ్రౌఢరాయలమహీయస్త్వమ్ముపాసించెదన్.

శా. సర్వజ్ఞుం డగుసింగభూమిపతియాస్థానంబునన్ శారదా
నిర్విఘ్నస్తవముం బొనర్చికొని గానీ, నీకవిత్వప్రథా
ఖర్వప్రౌఢిమ చూపవైతి వది నిర్గర్వత్వమో, లేక యం
తర్వాణీ ! యది యొక్కలౌకికమొ యర్థం బాట లే దింతయున్.

శా. ఏసింగాధిపుమెచ్చుకోలునకు నీ వీశారదాస్తోత్రమున్
వ్రాసిం జేసి గడించితో, యతఁడు సర్వజ్ఞుం డలంకార శా
స్త్రాసక్తస్థిరచిత్తుఁ డౌఁగద మహాత్మా ! నేఁటి చారిత్రక
వ్యాసంగంబునఁ బుట్టుచింతలను దెల్పన్నీకు నూహించితిన్.

క. సర్వజ్ఞసింగభూపతు
లిర్వురు గలరఁట ద్వితీయుఁడే నీభాషా
సర్వజ్ఞతఁ గనుఁగొనెనఁట
శర్వునకే చెల్లు దీనిసత్యము నొడువన్.

క. పరికింపఁ బ్రథముఁడే నీ
సరికాలమువాఁడుగా సుచారిత్రకు లె
వ్వరొ నిష్కర్షించిరి యీ
పరిశోధనములకు నవ్వుఁబాటొదవునొకో ?

శా. శ్రీనాథాభిధ నొందినన్ శశికళాశీర్షైక వైశిష్ట్యసం
ఖ్యానగ్రంథములే రచించితి శివాద్వైతీ ! భవద్వైదుషీ

జ్ఞానం బన్యదురాప మద్భుతమునై సాధించె నీశానుపూ
జానైయత్యమునన్ మహాంధ్రకవితాసామ్రాజ్య భాగ్యంబులన్.

సీ. విద్వదౌషధముగా వెలయు నైషధమును
సచివ సింగన్నహస్తముల కొసఁగి
యాబాల్యసఖుఁ డైనయవచి తిప్పయ్యకు
హరవిలాస మ్ముపహార మిచ్చి
భీమనాయకుని గాథామహత్త్వము చెప్పి
బెండపూఁడన్న మెప్పించి మించి
కాశికాఖండసత్కావ్యకన్య నొసంగి
వీరభద్రారెడ్డి వియ్యమంది
కడకు నిందఱసత్సహకార మెడలి
నిగళయుగమునకుం జిక్కి, పొగడదండ
కౌఁగిలింతలఁ బడి యెంతొ వేఁగి తకట
ప్రాప్తకనకాభిషేక గౌరవ కవీంద్ర!

చ. ఒరవడివెట్టె నాంధ్రకవియోధుల కెంతయు నీదు సీసపుం
దెఱఁగులు; పాదపాదమును నేరుపుమై నడపించుతీరు నీ
పరము; త్వదన్యుఁ డెవ్వఁడునుఁ బ్రక్రమభంగము నుజ్జగించి నీ
వెరవున వ్రాయలేఁ డని కవీ! వచియింతుఁ ద్రిశుద్ధియొప్పఁగన్.

సీ. సర్వంకషస్ఫార సాహిత్యసాహిత్య
నాయకుం డగు మల్లినాథబుధుఁడు
సంచితాలంకారశాస్త్ర చమత్కార
సారుండు విశ్వేశసూరివర్యాళి
సాహిత్యచింతామణీహార మండిత
మకుటుండు పెద్దకోమటివిభుండు.

శాకుంతలాది దృశ్యప్రబంధ త్రయ
వ్యాఖ్యాత కాటయ ప్రఖ్యమంత్రి
యమరటీకా ప్రణేతయౌ యప్పలార్యుఁ
డార్య భవదీయ పాండిత్య మభినుతింపఁ
బెంపు గనినట్టి నీ మధురంపు బ్రతుకు
ధరణికింతకు నూత్న చైతన్య మొసఁగె.

శా. అత్యర్థమ్ము భజింతు నిన్నుఁ గవిరాజా ! సంస్కృతాంధ్రోక్తిపై
యాత్మప్రక్రియ నీది పంచమకవిప్రాప్యంబు; భూయస్తరా
న్నత్యోద్దీపిత తావకీనజని మాన్యం బెల్లకాలంబు; స్వా
ర్థత్యాగీ ! తమిఁ జుట్టులాడెదను జేతశ్శక్తి నీవాక్సుధన్.

క. వవిధాత్వర్థము చేకొనఁ
గదవే ? కనకాభిషేకగౌరవపదవీ
నదవిష్ఠబుధామోద
ప్రదకవితారాజ్య సార్వభౌమాభిఖ్యా !

చ. వినిచితి నేవొ కొన్నిటి నభిజ్ఞ విమ్మృష్టములైనపట్టు లి
య్యనువునఁ, జంకదుడ్డుశరణార్థినిగా నను నెంచఁబోక సం
జనిత కృపాప్తి నీపదముజాడలఁ ద్రొక్కుచువచ్చునాదు*ద
ర్శనముగ్రహింపు మంధ్రకవిరాజ విరాజిత మౌళిమండనా !

---

* ఇట దర్శనమనఁగా కానుక. ఇది తెలుఁగు సంప్రదాయము. దర్శనంబిచ్చె నెద్దానిఁగోమటిబిడ్డ... కాశీ. ౪. ౧౯. ప. చూ.

## కొత్తపల్లివారి సంతర్పణ పద్యములు.

---

ఉ. మోదకరాసు లిక్షురసపూర్ణఘటంబులు నారికేళ రం
భాదిఫలాళి భక్తులు సమర్పణసేయఁ బ్రసాదయుక్తిమై
నాదటఁ గుడ్చి వారలఁ గృతార్థులఁజేయు కృపావిధేయు లం
బోదరు నాశ్రయింతు సుఖభుక్తి కవిఘ్న మనుగ్రహింపఁగన్.

చ. సతత పయోధిగర్భగతజాల్మవిషాదుల మ్రింగి తృప్తిఁబో
కతికుపితస్వభావులు భయానకమూర్తులునై పరస్పర
ప్రతిహతకాంక్షనున్న గజవారణకచ్ఛపులన్ గ్రసించి యు
ద్ధతి నమృతంబుగొన్న వినతాత్మజు నెంతు క్షుధాప్రశాంతికిన్.

మ. చలదుత్తుంగతరంగసంగతమహాసత్త్వాకులాభీలపు
ష్కలపాథోధిజలంబులట్టె యొక గ్రుక్కన్ ద్రావి వాతాపి ని
ల్వలసంబోధితు మ్రింగి త్రేచిన చిరప్రాగల్భ్యధౌరేయు ని
స్తులకీర్తి ప్రియు నయ్యగస్త్యముని నెంతున్ జీర్ణసంసిద్ధికిన్.

చ. గొనకొని బ్రాహ్మణార్థమునకుం దెగటార్పఁగ నేఁగునాఁడు గూ
ర్చిన బహుళాన్నముల్ నిరవశేష మొనంగ నొనెన్ విషప్లుతా
శన మమృతాపిధానగతిఁ జాలఁ దనర్చెనె వానికుక్షి న
య్యనిలజుఁ డావృకోదరుఁ డుదారత మజ్జఠరాగ్నిఁ రేఁచెడున్.

చ. అరుదుగ శ్వేతకేతుఁడు మహాధ్వరదీక్షితుఁడై యజస్రమున్
గురిసిన యాజ్యధారల నకుంఠితతేజము వాసి ఖిన్నుఁడై
యొలిలు కృశానుప్రార్థన సముద్ధతి ఖాండవ మేర్పఁజేయు శ్రీ
ధరరథసూతు డీ వృత శతక్రతునందనుఁ డన్న సంపదల్.

---

# శ్రీనాథునిఁగూర్చిన ప్రసంగములు.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

---

## ఈ శా న సం హి త.

శ్రీనాథకవిసార్వభౌముని చరిత్రమును ఆతనికృతులను బాగుగ విమర్శించి, యనేకనూతనాంశముల నాంధ్రలోకమున కెఱుకపఱిచి, యా కవియెడలఁ దమకుఁగల కృతజ్ఞతను వెల్లడించుచు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'శృంగారశ్రీనాథ' మను సద్గ్రంథమును రచించినారు. శ్రీనాథునికృతులనన్నిటిని పెక్కు తాటియాకులప్రతులతో సంప్రతించి, విశుద్ధమగు పద్ధతిని సంస్కరించి పునర్ముద్రణము గావించుటయందు వారి కాదరము మెండు. అట్లు పూనుకొని క్రీడాభిరామమును హరవిలాసమును సంస్కరించి ముద్రింపించినారు. కాశీఖండమును ముద్రింపింపనై యున్నారు.

తొలుత నాంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన శివరాత్రి మాహాత్మ్యమునకు మూలమైన 'ఈశానసంహిత' లభింపమిచేఁ బాఠకులకు నాతురత గలిగినది. దాదాపు రెండు వత్సరములక్రితము శ్రీప్రభాకరశాస్త్రిగారు "మాహాత్మ్యమునకు మూలమగు ఈశానసంహిత"అని యొక వ్రాఁతప్రతిని బంపి, అద్దానిని ముద్రింపఁగోరిరి ఆ ప్రతి ముఖపత్రమున నిట్లు కలదు.

"ఈశానసంహితా"

శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యమున కిదిమూలము. దీనిఁబట్టి చూడఁగా శ్రీనాథకృతి యింకను గొంతతుదిపట్టున దొరకవలసియున్నట్టు గుర్తింపనగును. వే. ప్ర.

ఇఁకఁ దుదిపుటయం దీప్రతికి మాతృకనుగూర్చి Restored copy No. R 5583 T 6-3-8 Original no 5428 అనికలదు.‡

---

‡మద్రాసు దొరతనమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందలి గ్రంథమునకిది పుత్త్రిక గాన నీసంఖ్యాదిక మాపట్టికలోనిది.

## సర్వజ్ఞసింగభూపాలుడు.

శ్రీనాథునిచే సందర్శింపఁబడిన యీసర్వజ్ఞసింగభూపాలుని నిర్ణయమును గూర్చియు నాతనికాలనిర్ణయమును గూర్చియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథమున విపులముగఁ జర్చించి తమ యభిప్రాయమును విశదముగ వెల్లడించియున్నారు. కాని, యీ నిర్ణయప్రసంగమునఁ బూర్వోత్తరగ్రంథవిరోధము గాన్పించుచున్నది. ఆ సంవిధాన మిట్లున్నది.

“భోగినీదండకమున సీమంతినీమానసారామవాటీవసంతున్, వసంతావనీనాథసంసేవితాంచత్పదాంభోజు రావుసింగక్షమానాథుపౌత్త్రున్ సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షు...” అని కలదు. రేచర్ల వారి వంశచరిత్రలందు ఈ సర్వజ్ఞసింగభూపాలుఁడు సరిగా గుర్తింపఁబడుచున్నాఁడు. ఈతఁడే శ్రీనాథునిచే దర్శింపఁబడినవాఁడు. షష్ఠప్రకరణమం దీవిషయము విపులముగఁ జర్చింపఁబడును” అని శృంగారశ్రీనాథము ప్రథమప్రకరణము 41 వ పుటలో వ్రాసియున్నారు. ఈవాక్యముల ధోరణినిబట్టిచూడ, ప్రథమప్రకరణము రచియించునాఁటికే శ్రీనాథునిచేఁ జూడఁబడిన సర్వజ్ఞసింగభూపాలునిఁ గూర్చిన నిర్ణయము వారి మనమున స్థిరపడినట్లు తోఁచుచున్నదిగదా!

వారే తృతీయప్రకరణమున 72 వ పుటలో పెదకోమటి వేమభూపాలునిఁ గూర్చి ముచ్చటించుచు నీక్రిందివాక్యములను బొందుపఱిచినారు. “రాచకొండ రాజధానిగా రాజ్యమేలిన వెలమరాజులకును కొండవీటి రెడ్డిరాజులకును ప్రబలవిరోధమని ముందే చెప్పితిని. వారొండొరులను మీఱి కీర్తి ప్రతాపయశస్సుల నార్జింపయత్నించుచుండిరి. రాచకొండ వెలమరాజు సర్వజ్ఞబిరుదమందఁగా, కొండవీటి రెడ్డిరాజు సర్వజ్ఞచక్రవర్తి బిరుదమందెను. వారు రసార్ణవసుధాకరాదిగ్రంథకర్తలైరి. వీరు వసంతరాజీయ సాహిత్యచింతామణ్యాది గ్రంథకర్తలైరి. వారు సంగీతసాహిత్యచతురులు. వీరు సంగీతసాహిత్యచతురులు. వారు కృతిపతు

లు. వీరు కృతిపతులు. వారు బహుపండితుల నాదరించిరి. వీరు బహు పండితుల నాదరించిరి."

ఇట శాస్త్రిగారి మతమున వేమభూపాలునకు సింగభూపాలునకు సర్వవిధముల సామ్యము కుదిరినది. రసార్ణవసుధాకరకర్తకు సర్వజ్ఞబిరుద మున్నట్లు స్థిరపడినది. కోమటి వేముఁడు, తన సమయముననే వెలమ రాజులకు సర్వజ్ఞబిరుదము కలుగుటచేఁ దాను సర్వజ్ఞచక్రవర్తి బిరుదము నందినాఁడని చెప్ప నపుడాతని సమకాలికుఁడగు సింగభూపాలుఁడు సర్వజ్ఞ బిరుదాంచితుఁడని శ్రీ శాస్త్రిగారును నొప్పుకొనినట్లే యయినది. కాని షష్ఠప్రకరణమున "ఈసింగభూపతికి సర్వజ్ఞబిరుదము కానరాదు. రసార్ణవసుధాకరమున లేదు. చమత్కారచంద్రికలో లేదు. అమరవ్యాఖ్యలో లేదు. ప్రాఁతవ్రాఁతలలో నెక్కడను లేదు.....మీఁది పరిశోధనల వలనఁ దేలినసారాంశమిది. రసార్ణవసుధాకరకర్త సింగభూపతియు శ్రీనాథునిచే దర్శింపఁబడిన సింగభూపతియు భిన్నులు. మొదటివానికి సర్వజ్ఞబిరుదము లేదు. వా రిరువురును తాతామనుమలు. తాత,శక. 1320 ప్రాంతమునను, మనుమఁడు శక. 1370 ప్రాంతమున నున్నవార గుదురు" అని సిద్ధాంతమును దేల్చియున్నారు. వేమభూపాలుని సమయమునకు మనుమఁడగు సింగభూపాలుఁడు లేనట్లు వారు నిశ్చయించియే యున్నారుగదా. ఆతని సమయమునను్న సింగభూపాలుఁడు, రసార్ణవసుధాకరకర్తయగు సింగభూపాలుఁడే. ఆతనికి సర్వజ్ఞబిరుదము కలదని తృతీయప్రకరణమునను, లేదని షష్ఠప్రకరణమునను పైవ్రాఁతలలోఁ దెలిపినట్లయినది.

చమత్కార చంద్రికలో లేదనుటయు, అమరవ్యాఖ్యలో లేదనుటయు సాహసమాత్రమే. ఆరెండు గ్రంథములలో రసార్ణవసుధాకర కర్తకు సర్వజ్ఞబిరుదమున్నట్లు వెనుక నేను దెలిపియే యున్నాను.*

---

*చూ. పరిషత్పత్రిక. సం. ౩౦. సంచిక ౨. ౩.

వేమభూపాలుఁడు జీవించియున్న సమయమున రసార్ణవసుధాకర కర్త లేఁడనుటకుఁ దగిన శాసనాద్యాధారము లేదు. రసార్ణవసుధాకరము నందలి యీక్రింది శ్లోకము,

"అథశ్రీసింగభూపాలో దీర్ఘాయు ర్వసుధామిమాం
నిజాంసపీఠే నిర్వ్యాజంకురుతే సుప్రతిష్ఠితామ్."

తత్కర్త యానాఁటికి జీవించియున్నాఁడనియే తెలుపునదియై యున్నది. కావునఁ బూర్వోత్తరవిరుద్ధములయిన శ్రీశాస్త్రిగారి వ్రాఁతల ననుసరించి రసార్ణవసుధాకరకర్తకు సర్వజ్ఞబిరుదము లేదని, శ్రీనాథుని చే సందర్శింపఁబడిన యాతఁడు మనుమఁడేయని నిర్ణయింపక, రసార్ణవసుధాకరకర్తయగు సింగభూపాలునకు సర్వజ్ఞబిరుదమున్నట్లు తెలియుచున్నది గాన శాసనాదులింకను బరిశీలించి తాత సింగభూపతినే శ్రీనాథుఁడు దర్శించి యుండెనని నిర్ణయించుటకుఁ దగిన పరిశోధనలు గావించెదరుగాత మని పాఠకులకు సవినయముగ నివేదించుకొనుచున్నాఁడను.

ఏ క శి లా న గ ర ము.

ఏకశిలానగర మన 'ఓరుగల్లా' 'ఒంటిమిట్టా'యా యని చిరకాలము క్రిందట కీ. శే. వావిలకొలను సుబ్బారావుగారికిని, కీ. శే. జయంతి రామయ్యపంతులుగారికిని వాదోపవాదములు జరిగినవి. సిద్ధాంతములు స్థిరపడినవి. ప్రసిద్ధులైన విమర్శకు లందఱు తమతమ యభిప్రాయములను వెలువఱిచిరి. ఏకశిలానగర మన ఓరుగల్లే యనుసిద్ధాంతము బహుపండితసమ్మతమై స్థిరపడినది. చరిత్ర పరిశోధకులకు నాఁటికి నేఁటికి ఓరుగల్లనుటకే యాధారము లెక్కువగుఁ గానవచ్చుచున్నవి

ఇట్లుండ నీ నడుమ 'శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి'గారి సన్మాన సంపుటములో బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు 'రాయలసీమ కవులు'అను వ్యాసమును బ్రకటించియున్నారు * అందు పోతన్న నొంటిమిట్టనివాసినిగా స్థిరపఱిచినారు. కాని యీ వాదోపక్రమమునాఁటికి

* చూ. సన్మానసంపుటము. రాయలసీమకవులు. పుట ౧౫౩-౧౫౫.

వెలువడని కొన్ని గ్రంథములు తరువాత వెలువడియుండుటచే నీవిషయ
మునఁ గొంత వ్రాయఁ బ్రసక్తి గలిగి యుపక్రమించుచున్నాఁడను.

కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు పై యుభయులవాదము
లను బాగుగ విమర్శించి ఏకశిలానగర మోరుగల్లే యని సిద్ధాంతీకరిం
చుచుఁ బది ప్రమాణములను దెలిపియున్నారు.† అం దయిదవ ప్రమా
ణము క్రీడాభిరామమున ఏకశిలానగర మోరుగ ల్లని పద్యముల ముద్రి
తమైయుండుట. ఈ కావ్యము శ్రీనాథకృతమో లేక పరిష్కృతమో
యయి యుండుటచే నీ ప్రసంగమున నా పద్యముల నుదాహరించు
చున్నాఁడను.

ఉ. మంచన వింటివో వినవొ మన్మథుఁ డేకశిలాపురంబులోఁ
జంచలనేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రి పో
రించి ప్రభాతకాలము పరిస్ఫుటమైనను ధర్మదార వ
ట్టించుచు నున్నవాఁ డదె కుటీగతకుక్కుటకంఠనాళమున్.

క్రీడా. పుట. 18. (ప్రభాకరశాస్త్రిగారిచేఁ బరిష్కృతము.)

శా. ఓరుంగంటిపురంబు సౌధములపై నొప్పారెడిన్ జూచితే
యీరెండల్ మణిహేమకుంభములతో నేకాంతముల్ సేయుచున్
స్వారాజప్రమదాఘనస్తనభరస్థానంబులం బాసి కా
శ్మీరక్షోదము ప్రాణవల్లభదృఢాశ్లేషంబునం గ్రాలె నాన్.

క్రీడా. పుట. 20.

పై రెండుపద్యములు గలిసి ఏకశిలానగర మోరుగల్లే యని స్థిర
పఱుచునవియేగదా? మఱియు నీ వాదము బయలుదేఱునాఁటికి ముద్రి
తము గాక, తరువాతఁ బరిషత్తుచేఁ బ్రకటింపఁబడిన సింహాసనద్వాత్రిం
శిక (కొఱవి గోపరాజకవి ప్రణీతము) యందును నీ సిద్ధాంతము స్థిరీక

† చూ. లక్ష్మణరాయవ్యాసావళి. 'ఏకశిలానగర మోరుగల్లే' అను వ్యాసము. పుట ౨౩-౨౪.

రింపఁబడినది. ఇంతియగాక గోదావరీనదికి 'గంగ' యనుపే రానాఁటికి వాడుకలో నున్నట్లు గూడ నాకవినోటనే వెలువడినది. చూడుఁ డా పద్యములు.

ఉ. ఆ కడ నీతిశాస్త్రనిపుణుఁడై గురు వీడ్కొని యేఁగి
గాకి తమూలశక్తి గనిగా నొనరించిన పైఁడిచట్టు నా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కు ధరిత్రిలోన నే
పోకలఁ బోనియట్టి సిరిపుట్టినయింటికి నోరుఁగంటికిన్.

సిం. ద్వా. ౮. ఆ. ౧౫౬ ప

ప్రామాణికకవిశిఖామణి యగు నీ గోపరాజకవియు నించుమించు శ్రీనాథుని కాలమువాఁడు బహువిశేషజ్ఞుఁడైన యీతఁడు యేకశిలా నగర మోరుగల్లే యని విస్పష్టముగఁ దెలిపియున్నాఁడుగదా ? మఱియు

"క. ఆతఁడు త్ర్యంబకశిఖరో
ద్భూతను విఖ్యాతఁ బరమపూతఁ ద్రిలోకీ
మాత మహాపాతకసం
ఘాత విఘాతానుయాతఁ గనియెన్ గంగన్."

సిం. ద్వా. ౮. ఆ. ౧౬౦. ప.

ఇట్లీతఁడు గోదావరిని గంగ యని పేర్కొనినాఁడు. త్ర్యంబకశిఖరోద్భూతయు, ఓరుఁగంటిసమీపమున నున్న 'గంగ' గోదావరి యనుటలో సంశయింప నక్కఱలేదుగదా ?

ఇట్లు ప్రాచీనులు నర్వాచీనులు నగు కవిశేఖరులు నానాఁటిప్రసిద్ధినిఁబట్టి ఏకశిలానగర మోరుగల్లని నిర్ధారితముగఁ జాటుచుండ, శాసనాద్యాధారములు వేనోళ్ల నీసిద్ధాంతమును స్థిరీకరించుచుండ, వాదోపవాదములు ముగిసియుండ, తిరిగి 'ఒంటిమిట్ట' యనుట యెట్టులో పాఠకు సెదరుగాక యని ప్రార్థన.

---

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీశ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావుబహద్దరువారు
పిఠాపురముమహారాజావారు. పరిషద్యాపజ్ఞోపాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుఁడుగారు (కోశాధ్యక్షులు)

పెద్దాడ రామస్వామిగారు, ఎం, ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

గోకా శివనాథశాస్త్రిగారు.

నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

అళక్కి వెంకట్రామయ్యగారు.

కళవరపు కామరాజుగారు.

శ్యారిశెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

మంచితరుణము !! మంచితరుణము !!

# శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు.

## ద్వితీయసంపుటము.

ముద్రితమై విక్రయమునకు సిద్ధముగా నున్నది.

ఈ సంపుటమున 'క' మొదలు 'జ' వఱకు శబ్దము లున్నవి.

సాదాప్రతి మూల్యము 4-0-0. మేలుప్రతి (Art paper) 5-0-0.

పోస్టువ్యయము ప్రత్యేకము. వర్తకులకు కమీషను ఈయఁబడును.

---

# లక్షణసారసంగ్రహము.

చిత్రకవి పెద్దనకవిచే రచింపఁబడినది. చిరకాలమునుండి కాలగర్భమున నణఁగియున్న యీయమూల్యమైన లక్షణగ్రంథము నేఁటికి వెలువడినది. ఇది విపులమగు పీఠికలతోఁ గూడి చక్కఁగ ముద్రింపఁబడినది. డెమ్మీసైజు. పుటలు 146. మూల్యము 0-8-0 మాత్రమే.

---

# కావ్యాలంకారచూడామణి.

## పాఠభేదములు.

పరిషత్పుస్తక భాండాగారమునందలి వ్రాఁతప్రతులలోని పాఠముల నెత్తి ముద్రితపాఠములతోఁ బాటు ముద్రించినారము. ఈగ్రంథము పరీక్షార్థులకు, విమర్శకులకు విశేషముగ నుపయోగించును.

వెల 0—6—0 మాత్రమే.

Printed by N. Achutaramiah at the Cocanada printing Works Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.